# స్పార్టకస్

హొవర్డ్ ఫాస్ట్

తెలుగు : ఆకెళ్ళ కృష్ణమూర్తి

హైదరాబాద్ బుక్ ట్రస్ట్

వెల : రూ॥ 50/-
ఆంగ్ల ముద్రణ : డిసెంబర్ 1951, న్యూయార్క్, © హూవర్డ్ ఫాస్ట్
తొలి ముద్రణ : 1955 విశాలాంధ్ర
రెండవ ముద్రణ : 1981 హెచ్.బి.టీ.
పునఃముద్రణ : 2000, 2007
ముఖచిత్రం : సూర్య
పుస్తక సంపాదకుడు,
సంక్షిప్తీకరణ : కె. సురేష్
ప్రతులకు, వివరాలకు: హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీ నగర్
గుడి మల్కాపూర్, హైదరాబాద్ - 500 067
ఫోన్ : 23521849

ముద్రణ : అనుపమ ప్రింటర్స్, గ్రీన్ వ్యూ, 126 శాంతినగర్,
హైదరాబాద్ - 28 ఫోన్ : 23391364, 23304194

# అంకితం

"ఈ పుస్తకం నా కూతురు రాచెల్, కొడుకు జొనాథన్ లకు అంకితం ఇస్తున్నాను. కొన్ని వందల సంవత్సరాల క్రితం నివసించిన ధైర్యశాలులైన స్త్రీ, పురుషుల కథ ఇది. వాళ్ళ పేర్లు మనవాళ్ళు ఎప్పటికీ మరిచిపోరు. ఈ కథలోని ప్రధాన పాత్రలు స్వేచ్ఛనీ, మానవ గౌరవాన్నీ ఎంతగానో కాంక్షించాయి. ఈ పాత్రల జీవితాలు ఉదాత్తమైనవీ, ఉన్నత మైనవీ. దీనిని చదివి నా పిల్లలు, ఇతరులు మన భవిష్యత్తు కోసం అన్యాయాన్నీ, అణచివేతనూ ఎదుర్కొనే ధైర్యం పొందుతారని ఆశిస్తున్నాను. స్పార్టకస్ కన్న కలలు మన జీవిత కాలంలోనే సాఫల్యం కావాలని ఈ కథను రాశాను."

## స్పార్టకస్ కాలంలో ఇటలీ, పరిసర ప్రాంతాలు



# అమరజీవి స్పార్టకస్ గురించి...

రాక్షసి బొగ్గులే ఒకానొక పద్ధతిలో వజ్రపురాళ్ళు అవుతాయని అంటారు. మనుష్యులు విప్లవ వీరులుగా ఆ పద్ధతిలోనే అవుతారని స్పార్టకస్ చరిత్ర మనకి నిరూపిస్తుంది. పీడన శక్తి వస్తువుల్నే కాదు, మనుషుల్ని కూడా మారుస్తుంది.

అయితే, సైన్సు బోధించడానికి కాని, చరిత్ర చెప్పడానికి కాని నేను సిద్ధంగా లేను. సైన్సు నాకు రాదు. తెలియవలసినంతగా చరిత్ర నాకు తెలియదు. నిజం చెప్పాలంటే స్పార్టకస్ గురించి ఏ మాటైనా చెప్పడానికి నాకు అర్హత లేదు. కానైతే, చెప్పు చెప్పమని మిత్రులు బలవంతం చెయ్యడంవల్ల ఈ సాహసంలోకి నేను దిగవలసి వచ్చింది.

అయితే, అందరికీ కొన్ని కొన్ని సంగతులు తెలిసినట్టుగానే నాకు కూడా కొన్ని భోగట్టాలు తెలుసు.

లోకంలో మనిషికి నిత్యావసరమైన వస్తువులన్నింటినీ మనుష్యుల్లో కాయకష్టం పడేవాళ్లే ఉత్పత్తి చేస్తుంటారు. ఆ శ్రమ ఫలితం మాత్రం వాళ్లకి దక్కదు. అది స్పష్టంగా అందరికీ కనిపిస్తున్నదే. కాని, అలా దక్కకపోడానికి కారణం రాముడిమీదో రహీముడిమీదో, లేక పూర్వజన్మల మీదో, మరి దేనిమీదో తోసేస్తారు. అలా ఎవరు తోసేస్తారు? అని ప్రశ్నిస్తే, ఆ శ్రమపడేవారి కష్టఫలితాన్ని ఎవరైతే దోచుకొంటున్నారో వారే నని సమాధానం చెప్పవలసి ఉంటుంది. దోపిడీచేసే వర్గాలే దాదాపు ప్రతి దేశంలోనూ పాలకవర్గాలుగా ఉంటూ వస్తున్నాయని చరిత్ర ఏమాత్రం చదువుకున్నా మనకి తెలుస్తుంది.

మనం ఎవరి కష్టంమీదైతే బతికేస్తామో, ఎవరి కష్టం తాలూకు ఫలితాన్నయితే దోచుకుంటామో వారిని గడ్డిపోచల్లా చూస్తాం, వారిని చూసి అసహ్యించుకుంటాం. వారు మనకంటె బలహీనులనో, తెలివితక్కువ వారనో, మనకంటె నల్లగానో తెల్లగానో ఉన్నారనో, మనకంటె తక్కువ జాతివారనో మనకి మనం చెప్పుకొని, ఆ కారణంవల్లనే వారి అవస్థ అలా ఉన్నదని సమాధానాలు చెప్పుకొని, వాళ్ళ "తక్కువ" తనానికి తప్పుడు కారణాలు అంటగట్టి, మన దోపిడీని మట్టుకు నిరాటంకంగా సాగించుకొందికి మనం సర్వప్రయత్నాలూ చేస్తూ ఉంటాం.

అయితే -

దోపిడీ కాబడేవాడు ఎప్పుడో ఒకప్పుడు తప్పక తిరుగుబాటు చేస్తాడని ఈ ఇరవయ్యో శతాబ్దపు ప్రతిదేశపు దోపిడీ పాలక వర్గానికీ కూడా స్పష్టంగా తెలుసు. కాని, ఈ నిజాన్ని స్పార్టకస్ తిరగబడేవరకూ కూడా ఆనాటి రోమన్ పాలకవర్గం కనుక్కోలేక పోయింది. అందువల్ల తొల్త దెబ్బతింది. తరవాత, నిలదొక్కుకొని తిరుగుబాటుని అణచివేయ గలిగింది.

పాలకవర్గం స్పార్టకస్ నించి పాఠాలు నేర్చుకొంది. స్పార్టకస్ తరవాత ఈ రోజుకి కూడా పాశ్చాత్య దేశాల పాలకవర్గాల ఏకైక లక్ష్యం (ఇప్పుడు మన దేశంలోని పాలకవర్గపు లక్ష్యంలాగే) ఏమిటీ అంటే :

శ్రామిక వర్గాన్ని ఎన్నటికీ అధికారంలోకి రానివ్వకూడదు. వారిని ఎల్లకాలం అణచి ఉంచాలి. అందుకు ఎల్లప్పుడూ సర్వసిద్ధంగా ఉండాలి.

అదీ ఆ లక్ష్యం.

అందువల్లనే స్పార్టకస్‌కి అంత ప్రాముఖ్యత.

అతను ఓడిపోయాడు, చనిపోయాడు. క్రీస్తుకి పూర్వమే పుట్టాడు, గిట్టాడు. కాని అతని పేరు చెప్తే దోపిడీదారులందరికీ ఇప్పటికీ బెదురు. ఎందుకంత బెదురు? ఎందుకా? వారు శ్రామికవర్గాల జనాన్ని పందులకంటె హీనంగా చూస్తారు. కాని ఆ జనాలు ఉగ్రనరసింహులుగా మారి విజృంభించ గలరన్న సత్యాన్ని చరిత్రలో మొదటిసారిగా చాటి చెప్పినవాడు స్పార్టకస్. అందుకే, ఇరువర్గాలవారికీ కూడా అతను ముఖ్యుడు. ఇరు వర్గాలవారూ అతణ్ణి గుర్తించుకుంటారు - శ్రమించేవారు ఆశతో, దోపిడీ దార్లు పగతో.

ప్రధానంగా బానిసల కష్టాన్ని ఉపయోగించుకొని బాగుపడిన రోమన్ పాలకవర్గం, ఆ బానిసలని ఎంత నీచంగా హేయంగా చూసి వారియెడల ఎంత దుర్మార్గంగా దారుణంగా అమానుషంగా ప్రవర్తించేదో ఈ నవల చదివితే తెలుస్తుంది. ఇప్పటికికూడా దోపిడీపాలక వర్గాలు శ్రామికవర్గాల ఎడల ఇలాగే ప్రవర్తిస్తున్నవని ఇప్పటి దోపిడీదేశాల ఏ చరిత్ర చూసినా తెలుస్తుంది. అయితే ఈ దానవులు ఆ దానవుల్లా ఉండకపోవచ్చు. ఏమైతేనేం? దానవులు వేరైనా దానవత్వం ఒక్కటే.

చరిత్రాత్మకమైన నవల రాయడం చాలా కష్టం. రాసి ఒప్పించగలగడం ఇంకా ఎక్కువ కష్టం. కాని, ఈ నవల రాసిన హూవార్డ ఫాస్ట్‌గారు అందర్నీ ఒప్పించి సఫలీకృతులయేరని చెప్పక తప్పదు, ఒప్పుకోక తప్పదు. డికెన్స్ మహాశయుడు "ఎ టేల్ ఆఫ్ టూ సిటీస్" లో ఫ్రెంచి విప్లవాన్ని చిత్రీకరించాడు. కాని, అలా చిత్రీకరించగలగడానికి అదంతా ఆయనకి దగ్గర చరిత్రే. అందులోకూడా అతని పాత్రలు చరిత్రలో ఉన్న పాత్రలు కావు. కాని, ఇందులోని స్పార్టకసే కాదు, క్రాససే కాదు, వరీనియావే కాదు, ఆఖరికి బేటియాటస్‌కూడా చరిత్రలో వారితోపాటు ఉన్నవాడే. రెండువేల సంవత్సరాల క్రిందటి వ్యక్తుల్ని మన కళ్ళకి కట్టినట్లు చూపించగలగడమే కాకుండా, ఆనాటి ఆర్థిక రాజకీయ సాంఘిక జీవితాన్ని యావత్తూ కళ్లకి కట్టినట్లు చూపించగలిగారు హూవార్డ్ ఫాస్ట్‌గారు.

ఇది నిజాయితీతో రాసిన నవల. ఇది ఆవేదనతో రాసిన నవల. ఇది ప్రయోజనంతో కూడుకొన్న నవల, విప్లవాలనీ వాటి కారణాలనీ నగ్నంగా చూపెట్టే నవల, సామాన్యుడు అనన్య సామాన్యుడెలా అవుతాడో చూపెట్టగలిగిన నవల. ఇది సామాన్య జనానికి సాయుధ విప్లవమే శరణ్యమని నిరూపించి చాటి చెప్పే నవల. ఈ నవల చదువుతూంటే మీరు ఏదో ఒక సైడు ఉంటారు. ఉండక తప్పదు.

ఇటువంటి నవల అనువదించగలగడం చిన్న ఫీటు కాదు, బాగా అనువదించగలగడం పెద్ద ఫీటు. ఆ ఫీటు శ్రీ ఆకెళ్ల కృష్ణమూర్తిగారు అద్భుతంగా చేసేరని అందరూ అంటున్నారు. ఆ మాటే నేనూ అంటున్నాను.

"స్పార్టకస్" సినిమా నేను చూసాను. అందులో స్పార్టకస్‌కి వారు న్యాయం చేకూర్చారు. ఈ నవల్లో స్పార్టకస్ న్యాయం, ధర్మం మనకి కనిపిస్తాయి. జీవితమే అతనికి అన్యాయం చేసింది. కానైతే, చరిత్రమాత్రం అతనికి న్యాయమైన స్థానం ఇచ్చి, పేదవారి తిరుగుబాటు జెండాగా అతణ్ణి ఎగరేసి నిలబెట్టింది. అందుకే, ఆ జెండా అంటే పెద్దలకి గడగడ, చిన్నలకి మిలమిల.

9-7-1981

విశాఖపట్నం -2

- రాచకొండ విశ్వనాథశాస్త్రి

## స్పార్టకస్ నవలలోని రోమన్ పాత్రలు :

| | | |
|---|---|---|
| కైయస్ క్రాసస్ | : | రోమన్ - కులీన కుటుంబ యువకుడు, కథ చెప్పటం ఇతనితో మొదలవుతుంది. |
| హెలీనా | : | కైయస్ క్రాసస్ చెల్లెలు |
| క్లాడియా మారియస్ | : | హెలీనా స్నేహితురాలు |
| గేయస్‌మార్కస్ సెన్వియస్ | : | ఏపియన్ మార్గంలో కైయస్ క్రాసస్‌కు కలిసిన మాంసవ్యాపారి |
| సిల్లియస్ | : | కైయస్ క్రాసస్ పినతండ్రి; మాంసవ్యాపారి ప్రస్తావనలో వచ్చే వ్యక్తి |
| ముజర్ షెబాల్ | : | ఏపియన్ మార్గంలో కైయస్ క్రాసస్‌కు కలిసిన సిరియా దేశపు రత్నాల వ్యాపారి |
| సెల్లస్ క్వింటియస్ బ్రూటస్ | : | ఏపియన్ మార్గంలో కాపలా కాయవలసిన మూడవ దళానికి సైనికాధికారి; కైయస్ క్రాసస్‌కి మిత్రుడు |
| ఆంటోనియస్ కైయస్ | : | రోమను భూస్వామి, సలేరియా భవన యజమాని, కైయస్ క్రాసస్‌కు తల్లివైపు బంధువు |
| జూలియా | : | ఆంటోనియస్ కైయస్ భార్య |
| లెంటులస్ గ్రాఛూస్ | : | రోమను సెనేటు సభ్యుడు, వార్డు రాజకీయాల నుంచి పై కెదిగిన వ్యక్తి |
| మార్కస్ లిసినియస్ క్రాసస్ | : | రోమను సేనాని, బానిస విప్లవ విజేత |
| మార్కస్ టుల్లియస్ సిసిరో | : | రోమను మేధావిగా చెలామణి అయ్యే వ్యక్తి |
| మేరియస్ బ్రాకస్ | : | కైయస్ క్రాసస్ స్నేహితుడు, కైయస్ కోసం మల్లుల యుద్ధం ఏర్పాటు చేసినవాడు |
| ల్యూషియస్ | : | బ్రాకస్ స్నేహితుడు, భార్యతో పాటు మల్లుల యుద్ధం చూడడానికి వచ్చినవాడు |
| లెంటులుస్ బేటియాటస్ | : | బజారు రౌడీ, మల్లుల శిక్షణ కేంద్రం యజమానిగా ఎదిగినవాడు |
| మేరియస్ ఎకనూస్ | : | రోమన్ భూస్వామి, మల్లుల తిరుగుబాటులో హతమైన తొలివాళ్ళల్లో ఒకడు |
| కాస్పియస్ | : | సెనేటు సలహాదారులలో ఒకడు |
| గైయస్ తనేరియా | : | సేనాని క్రాసస్ వెంట ఉన్నవాడు, స్పార్టకస్ చెక్కించిన స్మృతి చిహ్నాలలోని పనితనం గురించి వివరించినవాడు |
| వరీనియస్ గ్లాబ్రూస్ | : | స్పార్టకస్‌పై మొదటిసారి దాడికి వెళ్ళిన ఆరు పటాలాలకు అధిపతి |
| అరలస్ పోర్థస్ | : | వరీనియస్ ఆధిపత్యంలోని పటాలాల ఓటమిని సెనేట్‌కి వివరించిన సైనికుడు |

| | | |
|---|---|---|
| సిల్వియస్ కైయస్ స్వలేరియస్ | : | స్పార్టకస్ పై దాడికి వెళ్ళి ఓడిపోయిన మూడో పటాలం అధిపతి |
| కేలియస్ | : | పోర్థస్ తోటి సైనికుడు, బానిసల దాడిలో చనిపోయినవాడు |
| మేరియస్ గ్రాఛూస్ ఆల్వియో | : | గ్లాబ్రూస్ పటాలాలలోని వందమంది దళ అధిపతి |
| పూబ్లియస్ | : | రెండవసారి స్పార్టకస్ మీదకి దాడిచేసి ఓడిపోయిన సేనాని |
| పిలికో మమ్మియస్ | : | సేనాని క్రాసస్ బాల్య స్నేహితుడు, బానిసల చేతిలో మరణించిన వ్యక్తి |
| మార్కస్ సెర్వియస్ | : | మాజీ రాజ సలహాదారుడు, క్రిక్సస్‌ని చంపినవాడు |
| పాంపి | : | రోమన్ సేనానులలో ఒకడు |
| ఆవ్‌లూస్ | : | ఆతరువుల కార్ఖానా మేనేజరు |
| ఫ్లేవియస్ మార్కస్ | : | మొదటి శిలవ వద్దనున్న రోమను, గ్రాఛూస్ స్నేహితుడు, వరీనియాకు స్వేచ్ఛనివ్వటంలో సహాయ పడినవాడు |

**బానిసలు, మల్లులు**

| | | |
|---|---|---|
| స్పార్టకస్ | : | మూడుతరాల బానిస,('కోరూ') తిరుగుబాటు నాయకుడు |
| ఫేర్‌ట్రాక్స్ | : | మొదటి శిలువ మీది బానిస |
| గేనికస్ | : | స్పార్టకస్ స్నేహితుడు, వీరిద్దరిని బేటియాటస్ న్యూబియా గనులనుంచి కొన్నాడు |
| డ్రాబా | : | ఆఫ్రికన్ మల్లుడు, స్పార్టకస్‌తో పోరాడ నిరాకరించి తిరుగుబాటుకు బీజం వేసిన వాడు |
| డేవిడ్ | : | యూదు మల్లుడు, శిలువపై చంపబడ్డ ఆఖరి వాడు |
| పోలిమస్ | : | థ్రేషియన్ మల్లుడు, మల్లులకు మధ్య పెట్టిన ప్రదర్శన పోటీలో డేవిడ్ చేతిలో చనిపోయిన వాడు |
| వరీనియా | : | జర్మను బానిస, స్పార్టకస్ సహచరి |
| క్రిక్సస్ | : | గాల్ మల్లుడు, స్పార్టకస్‌కు బానిసల తిరుగుబాటు గురించి చెప్పినవాడు, ఇతని మరణంతో స్పార్టకస్ తాము ఓడిపోతామన్న నిర్ధారణకు వస్తాడు |
| ఎఖీల్స్, హెక్టర్, ఒడెస్సస్, యూనస్, ఎథినీయస్, సాల్వియస్, వుండార్టు, బెంజోష్, కాస్టస్, నార్డో, మొజార్, హానిబాల్, | \| | స్పార్టకస్‌కి ముందు బానిసల తిరుగుబాటు వీరులు |
| ఫ్రాక్సస్, కాస్టస్, నార్డో, మొజార్ | : | బానిస సేనల నాయకులు |

1

# మొదటి భాగం

క్రీ.పూ. 71 సంవత్సరం. మే నెల. బానిసల తిరుగుబాటు తరువాత రోమ్ నుంచి కేపువా పట్టణానికి పోయే రహదారిని రాకపోకలకు తిరిగి తెరిచి రెండు నెలలయ్యింది. అయితే జనసంచారం ఇంకా పూర్వపు స్థాయికి చేరుకోలేదు. ఆ మాటకొస్తే దేశంలో ఎక్కడా, ఏ రహదారి మీదా ముమ్మరంగా లాభసాటి వర్తక వాణిజ్యాలనేవి జరగటంలేదు. దేశవ్యాప్తంగా కొద్దో గొప్పో అలజడి, కల్లోలాలు చెలరేగుతూనే ఉన్నాయి. రోమ్ - కేపువా రహదారి ఈ కల్లోలానికి చిహ్నం. రహదార్లని చూసి రోమ్ ఎలా ఉందో చెప్పవచ్చు.

కొద్ది నెలలు గడిచి, వసంతకాలం రాకతో ఈ దారిలో విలాసయాత్రలు అనుమతించారు. కేపువా పట్టణ సుందర భవనాలు; దృశ్యాలు రోమన్ పౌరుల్ని మళ్ళీ ప్రలోభ పెట్ట సాగాయి.

ప్రపంచంలోకెల్లా అద్వితీయమైన పరిమళ ద్రవ్యోత్పత్తి కర్మాగారాలు కేపువాలో ఉన్నాయి. అరుదైన ఎన్నో రకాల వాసననూనెలూ, అత్తరులూ, గంధపుచెక్కా, ఎర్ర చందనం ఇంకా అనేకానేక పరిమళ వస్తువులెన్నో కేపువాకు ఎగుమతి అవుతాయి.

రోమ్ నగరంలో కన్నా సగానికి సగం తక్కువ ధరకి కేపువాలో సెంట్లు లభిస్తాయి. సువాసన ద్రవ్యాలంటే పడి చచ్చే స్త్రీ పురుషులు వేరొకందుకు కాకపోయినా, వీటి కోసమైనా కేపువాకు ప్రయాణం కట్టేవాళ్ళు.

## 2

రోమ్ - కేపువా రహదారి మీద మార్చిలో రాకపోకలు ప్రారంభమైన రెండు మాసాల తర్వాత మే నెలలో కైయస్ క్రాసస్, అతని చెల్లెలు హెలీనా, ఆమె స్నేహితురాలు క్లాడియా మారియస్ బంధువులతో గడిపిరావడానికి కేపువాకు ప్రయణం కట్టారు. కైయస్ క్రాసస్‌కు పాతికేళ్ళుంటాయ్. ఉంగరాలు తిరిగిన నల్లటి జుట్టు, ఆకర్షణీయమైన ముఖం, అందమైన విగ్రహం. కులీనుడుగా, అందగాడుగా అందరిచేతా గుర్తింపు పొందాడు. కిందటి పుట్టిన రోజున తండ్రి కానుకగా ఇచ్చిన తెల్లగుర్రమెక్కి అతనూ, పల్లకీల్లో కూర్చుని అమ్మాయిలూ బయలుదేరారు. నడకకి, మోతకి అలవాటు పడి, విరామం ఎరక్కుండా ఏకబిగిని పది మైళ్ళయినా సునాయాసంగా పోగల నలుగురు బానిసలు ఒక్కొక్క పల్లకీని మోస్తున్నారు.

ప్రయాణంలో ప్రతీ సాయంత్రం ఏ బంధువు భవనంలోనో, స్నేహితుని ఇంట్లోనో

గడుపుతూ హాయిగా ఉల్లాసంగా కేపువా చేరుకుందుకు వాళ్ళు అన్ని ఏర్పాట్లూ చేసుకున్నారు. దారి పొడుగునా శిక్షా చిహ్నాలు తారసపడతాయని వాళ్ళకు ముందుగానే తెలిసినా, అవి తమని కలవరపెట్టగలవని వాళ్ళు అనుకోలేదు. నిజానికి, ఆ ఆడపిల్లలిద్దరూ శిలువల్ని గురించి విని ఉత్తేజితులైపోయారు. కైయస్‌కు మొదట్నుంచీ అటువంటివంటే ఓ సరదా. ఆ దృశ్యాలు నన్నేం చికాకు పెట్టగలవులే అనే ధీమా అతనికుంది.

క్లాడియా చూడచక్కని చిన్నదేగాని ఆమె శరీరచ్ఛాయలో మెరుపు లేదు; ఆ కళ్ళల్లో కాంతి లేదు. ఉదాశీనంగా ఉంటుంది. ఉత్తినే అపసోపాలు పడ్డం అలవాటు చేసుకుంది. క్లాడియాకన్నా హెలీనాయే అందంగా ఉంటుంది. అందం, ఆకర్షణ ఉన్నా కైయస్ కళ్ళకి క్లాడియా మందమతిలా కనిపించింది. ఆమెలోని ఏ విశేషం తన చెల్లెల్ని ఆకర్షించిందో అతనికి అర్థం కాలేదు.

రోమ్ నుంచి కొద్ది మైళ్ళు ప్రయాణించాక శిక్షాచిహ్నాలు ప్రారంభమయ్యాయి. కొద్దిమేర రాళ్ళు, ఇసుకమయమైన బంజరు ఉంది. దానికి మొదట్లో ఒక శిలువ పాతేసి వుంది. ఆ శిలువను తాజాగా కోసిన దేవదారు కర్రతో చేశారు. శిలువ వెనక భూమి పూర్తిగా పల్లంలోకి దిగిపోయి ఉండటం వల్ల స్వచ్ఛమైన ఉదయాకాశం కింద అది బోడిగా నిలబడి దృష్టి నాకర్షిస్తోంది. కాని దానిపై వేలాడే మనిషి మాత్రం చప్పున కనిపించడు. తల బరువుతో వాలే అన్ని శిలువల మాదిరిగానే ఇదీ కొంచెం ముందుకు వేలాడి అమానుషంగా కనిపిస్తోంది. కైయస్ గుర్రాన్ని శిలువ వేపు నడిపించాడు. హెలీనా బానిసలకి సైగచేసి అన్న వెనకాల పొమ్మని ఆదేశించింది.

ఆ శిలువ ముందు వాళ్లు ఆగినప్పుడు హెలీనా పల్లకీ మోసే బానిసొకడు, "అమ్మగారూ! కొంచెంసేపు విశ్రాంతి తీసుకోమా!" అని అణకువతో నెమ్మదిగా అడిగేడు. "తీసుకోండి" అంది హెలీనా. బానిసలు పల్లకీలు దింపారు. కృతజ్ఞతా పూర్వకంగా వాటిపక్కన చతికిల పడ్డారు.

శిలువకు కొద్ది దూరంలో ఓ పందిరి కింద పేము కుర్చీలో స్నేహపాత్రుడుగా కనిపించే లావుపాటి పెద్దమనిషి కూచుని ఉన్నాడు. అతన్లో పెద్దరికమూ, పేదరికమూ ఉట్టిపడు తున్నాయి. పెద్ద బొజ్జ, మాసిన దుబ్బుగడ్డం, మురికి బట్టలు, ఘోరంగా కనబడే చేతిగోళ్ళు అతని పేదరికాన్ని బైటపెడుతున్నాయి.

"మీరు చాలా పెందరాళ బయలుదేరారు. ప్రయాణాలకు ఇలాగే బయలుదేరాలి. కేపువాకేనా?" అతడడిగాడు.

"కేపువాకే" అన్నాడు కైయస్.

"బైటి నుంచి ఈ కొత్తచోటి కొచ్చేవాళ్ళకి అన్నీ చూపించి విడమర్చి చెబుతుంటాను. కథకుడ్ని కూడా. చిన్న చిన్న తగూలు, తంపుల్లో తీర్పులు, శిక్షలు చెబుతుండేవాణ్ని. ఇప్పుడు అడుక్కుతినటం కన్నా మీ బోటి వాళ్ళ కేదైనా పనిచేసిపెట్టి ఒక్క దీనారమైనా సంపాయించు

కోడమే మేలు....." అని ఆ లావుపాటాయన స్వీయపరిచయం చేసుకున్నాడు.

శిలువపైన వేలాడే మానవ కళేబరాన్ని ఆ ఆడపిల్ల లిద్దరూ కన్నార్పకుండా చూస్తున్నారు. పక్షులు పీక్కుతిని, ఎండకు ఎండి నల్లబడ్డ ఆ నగ్న మృతకళేబరం మీద వాళ్ళ చూపులు నిలిచిపోయాయి. ఉండి ఉండి కాకుల గుంపొకటి దాని మీద వాలుతోంది. శిలువపైన ముందుకు వాలిపోయిన అతని కళేబరాన్ని చూస్తూ ఉంటే ముందుకు పడిపోదామని అతనికున్నట్లు అనిపిస్తుంది. అతని ముఖం ఎంత భయంకరమైనదోగాని అతని పొడుగాటి జుట్టు ఆ ముఖాన్ని కప్పివేసింది.

కైయస్ ఆ స్థూలకాయుడికి ఓ కాసు పడేశాడు. పుచ్చుకున్నవాడు కూడా అవసరమైన మేరకే కృతజ్ఞత చెప్పాడు. పల్లకీ బోయీలు నోరు మెదపకుండా కూర్చున్నారు. శిలువకేసి పొరపాటున కూడా వాళ్ళు కన్నెత్తి చూడలేదు. వాళ్ళ కిచ్చిన శిక్షణ అటువంటిది!

"చెప్పాల్సి వస్తే ఈ శిలువ ఒక సంకేతం. ఇది అమానుషమనికాని, భయంకరమని కాని అనుకోకండమ్మా. ఈ శిక్ష నేరానికి తగ్గదే. ఒంటరిగా వేలాడుతున్న వీడు ఇక ముందు తారసపడే వాటివేపు మీ దృష్టిని మరల్చలేడు. ఇక్కడ్నుంచి కేపువా దాక ఇటువంటి శిలువలు ఆరువేల నాలుగు వందల డెబ్బై రెండు ఉన్నాయి" అన్నాడు ఆ లావుపాటివాడు.

బానిసల్లో కొందరు కదిలారు. వాళ్ళు విశ్రాంతి తీసుకోడం లేదు. బిగుసుకుపోయి కూర్చున్నారు. కానీ అది ఎవరూ గమనించలేదు.

"ఇది ఒక చిహ్నం మాత్రమే. చెప్పాలంటే ఒక చిహ్నానికి చిహ్నం మాత్రమే" అన్నాడు.

చటుక్కున "అతనేనా స్పార్టకస్ అంటే" అని అడిగింది క్లాడియా.

"స్పార్టకస్ కాదమ్మా."

"అతని శవం కనపడలేదు" అన్నాడు ఓర్చుకోల్పోయిన కైయస్. "ముక్కల కింద కోసిపారేసేరు" అన్నాడా లావుపాటి మనిషి డాంబికంగా. "ముక్కముక్కల కింద నరికిపారేసా రమ్మా. మీవి సున్నితమైన హృదయాలు. విషయాలు చూస్తే హృదయవిదారకమైనవి."

"స్పార్టకస్ అనేవాడే లేడని ఇప్పుడంటారు. నేనున్నానా? మీరున్నారా? కేపువా నుండి ఇక్కడిదాకా మార్గంలో ఆరువేల నాలుగు వందల డెబ్భైరెండు కళేబరాలు శిలువలపై వేలాడు తున్నాయా? ఇవన్నీ శిక్షకు చిహ్నం."

"ఇక్కడున్నాడే వీడు" తన కర్రతో ఆ కళేబరాన్ని చూపిస్తూ అంటున్నాడు; "గాల్ జాతికి చెందినవాడు. పేరు ఫేర్‌ట్రాక్స్. చాలా ముఖ్యుడు. స్పార్టకస్‌కు చాలా దగ్గరగా ఉండేవాడు. వాడు చావడం నేనెరుగుదును. వీడు చావడానికి నాలుగు రోజులు పట్టిందంటే నమ్మండి. దున్నపోతులాంటి మనిషి వీడిని చూడ్డానికి చాలా మంది వచ్చారు. స్పార్టకస్‌తో జరిగిన యుద్ధాలను గురించి ప్రజలలో ఎంత అజ్ఞానం ఉందో మీకు తెలుసా? ఇతనేనా స్పార్టకస్ అని ఈ అమ్మాయి నన్నడుగుతోంది. పెద్దింటివాళ్ళు మీరు, ప్రపంచాన్నుంచి దూరంగా ఎక్కడో కాలం వెళ్లబుచ్చుతుంటారు. స్పార్టకస్ తాలూకు ఒక్క వెంట్రుక కూడా

ఎవరికీ కనపడకుండా అతడిని ముక్కలు ముక్కలు చేశారని ఈమెకి తెలియదు ఇతన్నలా చెయ్యలేదే.''

పల్లకీ బోయీలిప్పుడతనికేసి చూస్తూ వింటున్నారు. వాళ్ళ కళ్ళు నల్లని జుట్టు వెనుక దాగి మెరుస్తున్నాయి.

"ఇతనికి చావడానికి నాలుగురోజులు పట్టింది. అప్పుడయినా ఒక రక్తనాళాన్ని కోసి రక్తాన్ని ప్రవహింపచేసారు కనుక చచ్చాడే కాని లేకపోతే ఎంతకాలం బతికేవాడో. రక్తం పోనివ్వకపోతే ఉబ్బిపోతారు వీళ్లు. జాగ్రత్తగా రక్తం తీసేస్తే బాగా ఎండి, ఒక నెలపాటు ఏ విధమైన దుర్వాసనా వెదజల్లకుండా కొద్దిపాటి కంపుతో ఇలా పడి ఉంటారు. మాంసంముద్ద ఎండబెట్టి జాగ్రత్త చేయమా మనం, అల్లాగే. వీడికి నిర్లక్ష్యం, గర్వం అన్నీ ఉండేవి. మొదటిరోజు అక్కడ వేలాడుతూ చూడ్డానికి వచ్చిన ప్రతి పౌరుడినీ తెగతిట్టాడు. ఎల్లాగైనా బానిస బానిసే; అందుకు నాకేం కోపంలేదతనంటే. మర్నాటి సాయంకాలానికల్లా బిర్రబిగిసిపోయాడు. వాడన్న ఆఖరిమాట లేమిటో మీకు తెలుసా?''

"ఏమిటి?'' గొణిగింది క్లాడియా.

"నే వస్తా. లక్షోపలక్షలై తిరిగొస్తా''నన్నాడు.

## 3

ఆ రోజుల్లో రోమ్ ప్రపంచమంతటికీ తన రహదార్లగుండా రక్తాన్ని ప్రసరింపచేసే గుండెలా ఉండేది. వెయ్యి సంవత్సరాల గడువిచ్చినా ఇంకే దేశమైనా సరే ఇందులో మూడో వంతు పనితనం గల రోడ్లు కూడా నిర్మించగలిగి ఉండేది కాదు. "మా కో రోడ్డు కావాలి" అనేది సెనేటు. ఇంజనీర్లు ప్లాను తయారుచేసేవారు. కాంట్రాక్టర్లు పని చేయించేవారు. ఎక్కడికి కావాలంటే అక్కడికి బాణంలా తిన్నగాపోయే రోడ్డును శ్రామికులు నిర్మించేవారు. రోడ్డు వేసే మార్గంలో ఒక కొండ ఉంటే ఆ కొండపని సఫా;లోతైన లోయ లేదా నది ఉంటే దానికో వంతెన. రోమను రోడ్డు నాపగలిగింది ఏదీ లేదు. రోమ్ నుంచి దక్షిణంగా కేపువాకి ఉన్న రహదారిని ఏపియన్ మార్గమంటారు. ఒక వరస అగ్నిపర్వతపు మన్ను వగైరా, మరో వరస చిన్న కంకర, దానిపై రాతి పేర్పు ఈ విధంగా ఆ రహదారి కలకాలం ఉండేలా నిర్మి వారు. రోమన్లు ఏదైనా రహదారి వేశారంటే అది ఒకఏడు, రెండేళ్ళని కాకుండా శతాబ్దాల పర్యంతం చెక్కు చెదరకుండా ఉండేది.

మానవజాతి పురోగమనానికి రోడ్డు ఒక చిహ్నం. రోమ్ ఉత్పాదక శక్తికి తార్కాణం; రోమన్ ప్రజల కార్యశూరతకు ప్రతీక. రోమన్లు సృష్టించిన వ్యవస్థ సర్వోత్కృష్టమైనదని అది స్పష్టపరుస్తుంది. ఆ రహదార్ల మీద ప్రయాణం చేసే ప్రజలకు రోడ్ల వల్ల కలగవలసిన సమస్త సౌకర్యాలు కలుగుతాయి.

ఉదాహరణకు దూరం సూచించే ఏర్పాటు ఖచ్చితంగా ఉంటుంది. ప్రతి మైలుకు

కొలిచినట్లుండే మైలురాళ్ళుంటాయి. ప్రయాణీకులకు కావలసిన సమాచారమంతా ప్రతి మైలురాయి ఇస్తుంది. రోమ్ నుంచి ఎంత దూరంలో ఉన్నారో, అల్లాగే ఫార్మేయి నుంచి ఎంత దూరం వచ్చారో ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉంటుంది. ప్రతి ఐదేసి మైళ్ళకూ ఒక సత్రం, గుర్రాల శాలలూ, ప్రయణీకులకు అనువైన గుర్రాలూ, భోజన పదార్థాలూ వగైరా ఉంటాయి. కావాలంటే రాత్రిళ్ళు విశ్రాంతి తీసుకోడానికి సదుపాయాలుంటాయి. అలసి సొలసి వచ్చే యాత్రీకులకు స్నానాలు, హాయిగా నిద్ర పోదామనుకున్న వాళ్ళకు పడకగదులూ, ఒకటేమిటి సకల సౌకర్యాలు ఉన్నాయి. ఈ మధ్య కట్టినవి కొన్ని శిల్పంలో గ్రీకు దేవాలయాలను పోలి, మార్గంలో సహజ సౌందర్యాన్ని ఇనుమడింపచేస్తున్నాయి. ఆ రోడ్డు మీద సైనికులు రోజుకు ముప్పై మైళ్ళ చొప్పున కవాతు చేసికొని పోగలరు. సామాను బళ్ళు ప్రవాహంలా పోయేవి. దేశంలోని వివిధ వస్తుసంపదలనూ మోసుకుపోయేవవి. బార్లీ, గోధుమ, ఇనుము, టేకుకలప, బట్టలు, ఉన్ని, ఎన్నో రకాల నూనె పదార్థాలు, పళ్ళు, వెన్న, వండిన, వండని అనేకరకాల మాంసపదార్థాలు, ఒకటేమిటి లెక్కలేనన్ని అల్లాపోతూ ఉండేవి ఆ రోడ్డమ్మట.

ఆ రోడ్డు పొడుగునా ప్రతి కొద్ది అడుగుల దూరానికీ ఒక శిలువ పాతబడి ఉంది. పాతిన ప్రతి ఒక్క శిలువపై ఒక మానవ కళేబరం వేలాడుతోంది.

## 4

కైయస్ అనుకున్న దానికంటే భిన్నంగా ఉదయం వేడిగా ఉంది. పొద్దెక్కిన కొద్దీ శవాల కంపు ఎక్కువౌతోంది. ఈ స్త్రీలు ఆ కంపు భరించలేక చేతిరుమాళ్ళు అత్తరువులలో తడిపి మాటిమాటికీ వాసన చూసేవారు. అంతమాత్రాన ఉండి ఉండి వచ్చి చచ్చేలా ముక్కులు బద్దలుకొట్టే కంపుకెరటాలు ఆగలేదు.

అదృష్టవశాత్తూ వాళ్ళా రోజున భోజనానికి వెళ్ళిన హోటలుకు అరమైలు లోపు ఒక్క శవమూ లేకపోవడం మూలాన ఆకలి ఎప్పుడో చచ్చినా, వెగటు మాత్రం తగ్గింది. ఆ హోటలు గ్రీకు పద్ధతిని కట్టిన ఒంటి అంతస్తు భవనం. వరండా చక్కగా ఉంది. మేజాలమర్చిన ఆ వరండా కిందిభాగం ఒక చిన్న సందులాగుండి, ఆ సందులో ఒక చిన్న వంక పారుతూ ఉంది. దాని కభిముఖంగా ఉన్న గుహ చుట్టూ పరిమళాన్ని వెదజల్లే పచ్చని దేవదారు చెట్లున్నాయి. అక్కడ చల్లని వృక్షాల వాసనలు తప్ప మరేవాసనా లేదు. మెల్లిగా మాట్లాడుకునే భోజన ప్రియుల సంభాషణా మృదునాదమూ, సెలయేర్లు పాడే సంగీతమూ తప్ప మరో శబ్దం వినం. “ఎంత చక్కని ప్రదేశం” అంది క్లాడియా. పూర్వం అక్కడాగిన పరిచయమున్న కైయస్, వాళ్ళు కూచుందుకో చోటు చూసి, కావలసిన పదార్థాల్ని ఆజ్ఞాపించి, తెప్పించడం ప్రారంభించాడు.

అక్కడి ద్రాక్షారసం గ్లాసులలో తళతళలాడుతూ, తాగిన వెంటనే పోయిన ఆకలిని

తిరిగి తెచ్చేదిగా ఉంది. ఇతర దేశస్థులు, సైనికులు మొదలైనవాళ్ళు కూచునే గదికాక, వీళ్ళున్న గది వేరుగా ఉంది. అక్కడ చల్లగా హాయిగా ఉంటుంది.

చల్లని ఉడకబెట్టిన బాతును, నారింజపండ్లనూ తీసుకురమ్మన్నాడు కైయస్. అవి వచ్చేలోపు వాళ్ళు మాట్లాడుకుంటూ ఉండగా, తమ బల్ల వద్ద ఎవరో ఒక వ్యక్తి తారట్లాడ్డం చూసేడు కైయస్. తక్కిన బల్లలన్నీ నిండిపోయాయి. ఆ వ్యాపారస్థుడు వాళ్ళు తన నక్కడ కూచోనిస్తారా అని ఆలోచనలో పడ్డాడు.

"నా పేరు గేయస్ మార్కస్ సెన్వియస్. నేను కూచోడంవల్ల ఇబ్బంది కలుగుతుందని మీరనుకున్న పక్షంలో అనుమానించక చెప్పెయ్యండి. ఏం ఫరవాలేదు" అన్నడా వర్తకుడు. అతను పొడగరి, ఎత్తుకు తగ్గ శరీరం, ఖరీదయిన దుస్తులనుబట్టి చూస్తే, ధనవంతుడనే అనిపిస్తుంది.

"దయ చేసి కూచోండి" హెలీనా సమాధానంగా చెప్పింది. కైయస్ తననీ, తనతో ఉన్న ఆ అమ్మాయిల్నీ పరిచయం చేశాడు.

"మీ కుటుంబాలతో నాకు వ్యవహారాలున్నాయి" అన్నాడతను.

"వ్యవహారాలా?"

"ఔను, నేనొక కైమా వర్తకుడ్ని; కైమా తయారుచేయిస్తా. నాకు రోమ్‌లో ఒకటి, టిర్రేసినాలో ఒకటి యంత్రాగారాలున్నాయి. అక్కడినుంచే నే నిప్పుడు వస్తున్నాను. మీ రెపుడైనా కైమా తిని ఉంటే మేం తయారుచేయించినదే తిని ఉంటారు."

"మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషం, మీరడిగారని మా నాన్నగారితో చెప్తాలెండి" అంది హెలీనా.

భోజన పదార్థాలు వచ్చాయి. క్లాడియా బాతు మాంసం ముక్క నొకదాన్ని నోట్లో పెట్టుకోబోతూ వర్తకునితో ఒక మాటంది. "అంత తాజా మాంసాన్ని వృథా చేసినందుకు మీ కా శిక్షా చిహ్నాలు చాలా చిరాకు పుట్టించినట్లున్నాయి."

కష్టం మీద కైయస్ నవ్వాపుకోగలిగాడు. మాంసం పేరు చెప్పి, తనను హాస్యం చేయడానికి పూనుకున్నారా అని సెన్వియస్ ముఖం ఎర్రబారింది. తను అన్నదాని పరిణామాన్ని ఊహించుకోలేని క్లాడియా తినడంలో నిమగ్ను రాలైంది.

"చిరాకని కదూ మీరంట" సెన్వియస్ అన్నాడు. "నేను దుబారా అంటే సహించను."

"స్పార్టకస్‌గాడి మనుష్యులు బాగానే ఉన్నారు. శుభ్రంగా మేపారు, సగటున ఒక్కొక్కడి బరువు నూటయాభై పౌనులనుకోండి. వాళ్ళు ఆరువేల నాలుగువందల డెభైరెండు మంది ఉన్నారు. అంటే తొంభై లక్షల పౌనుల తాజా మాంసమున్నదన్నమాట - పోనీ ఒక కప్పుడైనా ఉండేదన్నమాట?"

"అలాంటప్పుడు మీరు కొంటాననలేకపోయారా?"

"అన్నాను."

"అమ్మలేదా మరి?"

"చచ్చీ చెడి రెండు లక్షల యాభై పౌనులు కొనగలిగాను."

"మనిషి మాంసమేనా?" నెమ్మదిగా తాపీగా అడిగింది క్లాడియా. "వాటిని ఉడక బెట్టించి, కైమా చేయించి పందిమాంసంతో మిళాయించి, ఉప్పు, ఏలకులూ చల్లించాను. సగం ఈజిప్టుకీ, మరో సగం గాల్ దేశానికీ పంపించాను. ధర కూడా బాగానే ఉంది."

"హాస్యమా?" కైయస్ గొణిగాడు.

క్లాడియా వల్ల జరిగిన పరాభవాన్ని ఆ వర్తకుడు జీవితాంతం మరిచిపోలేడు. తను అమ్మిన మాంసం తిని, తననే వేళాకోళం చేసినవాళ్ళని అతను సహించగలడా మరి.

"నే నేం హాస్యం చేద్దామనుకోలేదే" అన్నాడు సెన్వియస్ యధాలాపంగా. "ఆమె నన్నో ప్రశ్న అడిగింది. దానికి నేను సమాధానం చెప్పాను; రెండు లక్షల యాభై పౌన్ల బానిసల మాంసాన్ని కూరకని, వర్తకానికని నేను కొన్నాను, అంతే!"

"మీ రేమిటింత భయంకరంగా మాట్లాడేస్తున్నారు. మీ సహజమైన అనాగరిక లక్షణాన్ని పోగొట్టుకున్నారు కాదు" అంది హెలీనా.

వర్తకుడు లేచాడు. అందరికేసీ చూసాడు. "క్షమించండి, కావాలంటే మీ పినతండ్రి సిల్లియస్‌ను అడిగి చూడండి; ఆయనే ఈ వ్యవహారమంతా పరిష్కరించాడు. ఏవో కొద్ది రాళ్లు మిగుల్చుకున్నాడు కూడా" అని వెళ్ళిపోయాడు. నారింజకాయ తింటూనే ఉంది క్లాడియా.

"ఎంత అసందర్భపు మనిషో అతను" అంది.

"ఐనా అతను చెప్పేది నిజమేనా" అంది హెలీనా.

అసలే పాలిపోయినట్లు కనబడే క్లాడియా దీనికి కారకురాలిని నేనే కదా అని మరింత పాలిపోయింది. లేచి విశ్రాంతి గదిలోకి నడిచి వెళ్ళింది.

"ఇప్పటి నుంచీ నే నీ కైమా తినను" అన్నాడు కైయస్.

"నే నెప్పుడూ తిననేలేదు" అంది హెలీనా.

# 5

వాళ్ళు ప్రయాణం సాగిస్తున్నారు. మధ్యాహ్నం అయ్యింది. సిరియా దేశస్థుడు ముజర్ షెబాల్ వాళ్ళను తోవలో కలుసుకున్నాడు. రత్న వర్తకం చేస్తాడతను. కాటుక నలుపు గెడ్డం; దానికి సెంటు రాసాడు. నలుపెక్కువై మరింత మెరుస్తోందా గడ్డం. అందంగా లతలు, పువ్వులు మొదలైన కుట్టుపనితో నిండిన అతని నిడుపాటి అంగరఖా అతనెక్కిన తెల్లని గుర్రాని కిటూ అటూ వేలాడుతోంది. వేళ్ళకు వజ్రవైఢూర్యాలు పొదిగిన ఉంగరాలు పెట్టుకున్నాడు. అతని వెంట ఈజిప్షన్, బిదోయిన్ బానిసలు నడుస్తున్నారు. బానిసల తలలపై బరువైన మూటలు. లోకం పోకడల నెరిగిన ఆ వర్తకునితో కైయస్ సంభాషణ కుపక్రమించాడు. ఈ సంభాషణలో అప్పుడప్పుడు తలూపడం వరకే కైయస్ పాత్ర. రోమన్ వ్యక్తిని కలుసు

కోవడమంటేనే షెబాల్‌కు గర్వ కారణం; అందులోను కైయస్ వంటి పెద్దింటి రోమన్లను కలుసుకుంటే ఇంక చెప్పనక్కర్లేదు. రోమనును కోసి చూస్తే, లోపల లోహపు రక్తనాళా లుంటాయి అన్న నమ్మకం అతనికుంది. దానికి సాక్ష్యం, ఆధారం ఈ శిక్షా చిహ్నాలే. ఈ చిహ్నాలు చూసి, తన బానిసలు కూడా బుద్ధి తెచ్చుకోగలరని అతని నమ్మకం. ఈ చిహ్నాలు వాళ్ళకు పాఠం నేర్పగలిగినందుకు అతను సంతోషించాడు.

"అయ్యా! మా దేశంలో స్పార్టకస్ రోమ్‌ను జయిస్తాడు అనుకునేవారంటే నమ్మండి. దాంతో మా దేశంలో కూడా దాని ఛాయలు పడకమానలేదు. కొద్ది మంది బానిసలు తిరగ బడ్డారు. వాళ్ళ పప్పులుడకనివ్వ లేదు మేం. మరి లేవకుండా అణచిపారేసాం. రోమ్ అన్నది అధునాతనమైన వినూత్న సృష్టి అని మా ప్రజలు గ్రహించలేకపోతున్నారు. రోమ్ దేశస్థుడు ధర్మశాస్త్రాధ్యయనపరుడు, సన్మార్గానికి పుట్టినిల్లు. పరిశ్రమ, క్రమశిక్షణ, ప్రజాస్వామ్యం మొదలైన దివ్య పదజాలమే రోమ్ అని నా భావం. శాంతి సౌభాగ్యాలకు ఆటపట్టయిన రోమను రోడ్డుకూ, రోమన్ పరిపాలనా దక్షతకూ ఇదే కిటుకు, మూల రహస్యం. కాని వీటి నన్నిటినీ ఆ జడులకు ఎలా బోధపరిచేది? ఈ శిక్షా చిహ్నాలను చూసి నా మటుకు నేను చాలా సంతోషించాను. సంతృప్తి చెందాను. నేరానికి తగ్గ శిక్ష విధించడం ద్వారా రోమన్ న్యాయం విస్తృత కీర్తి నార్జిస్తుంది. ఆ స్పార్టకస్ ధైర్యం మండ; ప్రపంచంలోని మంచినంతనీ, ఔన్నత్యాన్నంతనీ బరి మీదికి లాగి సవాలు చేసాడు. పోనీ వాడు తెచ్చి పెట్టిన దేమిటయ్యా అంటే అరాచకం, దోపిడీలు, గృహదహనాలు, ఖూనీలు, అల్లకల్లోలం, నానాభీభత్సం. క్రమ శిక్షణాబద్ధమైనది కనుకనే రోమ్ వాడిని తిరస్కరించి తీసిపారేసింది....." ఇంక ప్రవాహానికి అడ్డులేనట్లు చెప్పుకుపోతున్నాడు షెబాల్.

విని విని విసుగెత్తిపోయాడు కైయస్. అతనికి తెలియకుండానే అతని కళ్ళు విసుగు దలను బైటపెట్టాయి. ఇది గ్రహించిన షెబాల్ క్షమాపణ కోరుకుని, హెలీనా, క్లాడియాలకు తన వద్దనున్న రత్నాల హారాలను రెండింటిని బహుకరించి వెళ్ళిపోతూ, వాళ్ళ కుటుంబాలకు, రాళ్ళు కొనే కుతూహలమున్న తదితర స్నేహితులకు, తన గురించి తన వద్ద నున్న రాళ్ళను గురించి, సరసమైన ధరలను గురించి చెప్పవలసిందిగా అర్థించి వెళ్ళిపోయాడు.

## 6

రాత్రికి బస చేయాల్సిన హోటలుకు వెళ్ళే మార్గ మధ్యంలో ఒక సంఘటన జరిగింది. ఆ సంఘటన వాళ్ళ విసుగుదలను తగ్గించింది. మార్గానికి కాపలా కాయాల్సిన మూడవ దళానికి చెందిన సైనికులు కొందరు అక్కడ ఆగారు. ఈటెలు సైనిక గుడారాలలో నిలబెట్టి వాటికి డాళ్ళూ, కత్తులూ, కఠార్లూ తగిలించారు. సైనికులంతా ఒక చోట చేరారు. పందిరి వలె ఒక గుడారం వేసి దాని కింద కఱ్ఱ గిన్నెల్లో సారా సేవిస్తూ కూచున్నారు. వాళ్ళు మోటైన వాళ్ళు. ఢక్కామక్కీలకు తట్టుకుని వాళ్ళ శరీరాలు రాటుదేలాయి. వాళ్ళ తోలు పంట్లాములు,

చొక్కాలు చెమటతో తడిచి కంపు కొడుతున్నాయి. గట్టిగా అరవడమే కాని సున్నితంగా మాట్లాడడం అన్నది వాళ్ళకు తెలియదు. ఆ మాట్లాడే మాటలు కూడా బూతులు మాత్రమే. ఆ శిలువలు, వాటిపై వేలాడే కళేబరాలు వీళ్ళ నిర్వాకమే అన్నది వాళ్ళకు బాగా తెలుసు.

కైయస్, ఆ వనితలు సైనికులను చూస్తున్నారు. సైనికుల అధికారి ఒక చేత్తో సారా గ్లాసు పట్టుకుని, మరో చేత్తో అట్టహాసంగా అభివందనం తెలియచేస్తున్నాడు. స్త్రీలు కూడా అక్కడున్నారు కాబట్టి ఆ స్త్రీల దృష్టి తన వైపు మరల్చుకోవడం యువకుడుగా తన బాధ్యత కాబట్టి చేతిని తెగ ఊపుతున్నాడు. సైనికోద్యోగి సెల్లస్ క్వింటియస్ బ్రూటస్. కైయస్‌కు ఒకప్పటి స్నేహితుడు. కొత్తగా ఉద్యోగంలో ప్రవేశించినవాడు. నిర్భయంగా అవకాశాలను, పరిస్థితులను తన కనుగుణంగా తిప్పుకొని ముందుకు పోగలిగినవాడు. దీనికి తోడు అందమైన వాడు. హెలీనాతో అతని కంతకు పూర్వమే పరిచయముంది. తన సైనికు లెల్లాగున్నారని వాళ్ళ నడిగాడు. కొత్తగా ఉద్యోగంలో ప్రవేశించిన వాడికి అంతా ఉద్యోగం గొడవే. ఆ ప్రశ్నలో ఆ లక్షణం ధ్వనించింది.

"గట్టిగా అరిచే ఛాండాలపు మూక" కైయస్ కటువుగా సమాధానం ఇచ్చాడు.

బ్రూటస్ హెలీనా నడిగాడు: "సైనిక వందనం సమర్పించే దళంతో మీ రెప్పుడైనా...."

"అబ్బే, అంత గౌరవం పొందడానికి నే నేమంత ప్రాముఖ్యం కలదాన్ని."

సారా తాగడం పూర్తయాక బ్రూటస్ మెడలో వేలాడే వెండి ఈల ఊదడం ప్రారంభించాడు. మంత్రముగ్ధం చేసే నాలుగు ఆరోహణ, అవరోహణ స్వరాల కంపనం వినిపించింది. ఆ స్వరాలు సైనికుల్ని అధికారపూర్వకంగా పిలుస్తున్నాయి. దీనికి సమాధానంగా సైనికులు మిగిలిన సారాను ఒక గుక్కలో మింగి తమలో తామే తిట్టుకుంటూ, ఇద్దరిద్దరి చొప్పున ఈటెలు నిలబెట్టిన చోటుకు వెళ్ళి ఆయుధాలను తీసుకుంటున్నారు. బ్రూటస్ తిరిగి అవే స్వరాలను పలికించాడు. ఈల ఊదడంతో క్రమశిక్షణ కనిపిస్తుంది. వాళ్ళంతా చిన్న జట్లుగా చేరారు. బూట్లు టకటకా చప్పుడయాయి. కవాతు చేశారు. మళ్ళీ విడిపోయారు. కొంద రటూ కొంద రిటూ చేరారు. రెండు వైపులా ఆ రెండు వరసలూ నిలబడ్డాయి. ఉట్టిగా నిలబడ్డానికి ఎంత యంత్రతుల్యమైన క్రమశిక్షణ! ఈ గొడవ ఆడపిల్లలకు బాగా నచ్చింది. చేతులు విరిగేలా చప్పట్లు కొట్టారు. స్నేహితుని చేష్టలు తన కేమీ నచ్చకపోయినా సైనిక శిక్షణ కచ్చెరువందిన కైయస్ కూడా మెచ్చుకోక తప్పలేదు.

"అంత బాగానూ యుద్ధం చేయగలరా వాళ్ళు?" కైయస్ అడిగాడు.

"స్పార్టకస్‌నే అడగవోయ్" అన్నాడు బ్రూటస్.

"బలే! బలే!" గట్టిగా అంది క్లాడియా.

బ్రూటస్ వంగి ఆమెకు సలాం చేసాడు. అంత గౌరవం ఆమె ఎన్నడూ పొందలేదు.

"వాళ్ళింకా ఏం చెయ్యగలరు!" క్లాడియా అడిగింది.

"కవాతు చేయగలరు; దెబ్బలాడగలరు, తిట్టగలరు...."

"చంపగలరా?"

"ఓ వాళ్ళు చంపగలరు. ఏం? అలా కనబడరా?"

"వాళ్ళ తీరు నాకు బాగా నచ్చింది" అంది క్లాడియా.

"ఇంకేం కావాలి?" బ్రూటస్ ప్రశ్నించాడు. "వాళ్ళ పాట వినాలని ఉందా?" అని వాళ్ళ వైపు తిరిగి "పదం పాడుతూ కదం తొక్కండోయ్!" అని అరిచాడు. వాళ్ళ బండ గొంతుకలు అరవడం ప్రారంభించాయి. ఆ పదానికి అవరోహణ మొక్కటే ఉంటుంది.

"ఆకసం, భూమి, రోడ్డు, రాయి, ఉక్కు కోసేస్తుంది, ఎముకవరకు!" ఛందస్సు వగైరా విషయాలను పాటించని ఆ పాట వాళ్ళందరి నోళ్ళల్లోనూ పడి అస్పష్టంగా, గొడవగా అంతా కలిసిపోయి ఏదో ఒకే శబ్దంగా తయారయింది. మాటలు వినబడనీయకుండా పాటపాడుతున్నారు వాళ్ళు. పాడడమేమిటి? అరుస్తున్నారు.

"ఏమిటి దీని అర్థం?" తెలుసుకోవాలని హెలీనా అడిగింది.

"అర్థం ఏముంటుంది? కవాతు చేసేటప్పుడు పాడే పాటలకో అర్థం కూడానా? ఆకసం, భూమి, రోడ్డు, రాయి - ఏముంది దీన్లో ఏమీ లేదు; ఈ పాట బానిస యుద్ధంలో తయారుచేసారు. ఈ పాటకి వాళ్ళు బాగా కవాతు చేయగలరు, అంతే."

తిరిగి రోడ్డును శిలువ లలంకరించాయి. వాటికేసి చూసి బ్రూటస్ క్లాడియాతో అన్నాడు. "ఇంతకన్న వీటిని బాగా చెయ్యాలంటారా! మా వాళ్ళే ఎనిమిది వందల మందిని శిలువ వేసారు. మావాళ్ళున్నారే మహా మొండిఘటాలు; చావును ఇచ్చి పుచ్చుకోడంలో వెను కాడరు."

# 7

ఆ రాత్రికి సలేరియా భవనం చేరుకుంటారు. ఒకప్పుడు రోమ్‌కు దక్షిణంగా ఉన్న చిత్తడినేలనూ, అక్కడి విపరీతమైన మలేరియా దోమలనూ, వాటి నివాసాన్నీ జ్ఞాపకం తెస్తుందా పేరు. అటువంటి ప్రదేశం కాలక్రమేణా బాగుపడింది. రాజమార్గం నుండి ఈ భవనం వరకూ జమీందారుగారి స్వంత రోడ్డుంది. ఈ రోడ్డు ప్రధాన రాజమార్గాని కేమీ తీసిపోదు. అక్కడి భూములకూ, ఈ భవనానికీ యజమాని ఆంటోనియస్ కైయస్ అనే ఒక జమీందారు. కైయస్, హెలీనాలకు అతను తల్లి వైపు బంధువు. పట్నం చేరువనే ఉండడం వల్లనో, మరెందుకనో సలేరియా భవనం మరీ విశాలమైనదీ, పెద్దదీ కాదు. కాకపోయినా ఆ తోటల, పొలాల అందమే దాని రమణీయతను వృద్ధి చేస్తుంది.

ఏపియన్ మార్గం వదలి, జమీందారుగారి రోడ్డుకు మళ్ళే చోటు నుండి నాలుగు మైళ్ళు ప్రయాణం చేస్తే సలేరియా భవనాన్ని చేరుకోవచ్చు. అలా మళ్ళడంతోనే ఎంతో మార్పు కనిపిస్తూ ఉంటుంది. ఇక్కడ ప్రతి అంగుళం భూమీ ఎంతో శుభ్రంగా, ప్రతి మొక్కా అందంగా కత్తిరింపబడి, పోషింపబడి, తోటలన్నీ ఎంతో కన్నులవిందైన ఉద్యానాల్లా కనిపిస్తాయి.

ఆనాటి ఈ సమయానికి పశువుల మందలు ఇళ్ళకు చేరుకుంటున్నాయి. ఆవుల మెడలలోని చిరుగంటల శబ్దాలు, మాటిమాటికీ కాపరులూదే కొమ్ముల ధ్వనులూ కలిపిన సంగీతం వినవస్తోంది. మందల నుండి విడివడి ఇటూ, అటూ పరిగెత్తే పశువుల నదలిస్తూ వాటి వెనక పరువెట్టే థ్రేషియన్, ఆర్మీనియన్ గోచిపాతరాయళ్ళను చూచిన కైయస్‌కు ఆ మేకలు, గొర్రెలలో, వాటి వెనుక పోతున్న ఈ నర పశువులలో మానవత్వపు ఛాయ లుంటాయా అని ఆశ్చర్యపోయాడు. ఇంకోవైపు తన మామ మొత్తం ఆస్తి ఎంతుంటుందో అన్న అంచనా వెయ్యడం ప్రారంభించాడు. నూటికి ఏడాది ఒక్కంటికి నూరు రూపాయల చొప్పున వడ్డీ పుచ్చుకుని సంపాదించిన డబ్బు కోటి రూపాయలకు తక్కువుండదని అంచనా. ఎంతో మంది ఏజంట్ల ద్వారా పధ్నాలుగు పెద్ద పెద్ద వ్యాపార సంస్థల్లో అతనో ప్రధాన భాగస్వామి అని అంటారు. స్పెయిన్‌లోని వెండి గనులలో సగభాగమీయనదే. యోధులు, వీరులు నడిపే సంస్థలలో కూడా ఇతని మాటకు ఎంతో విలువ ఇస్తారు.

అతని ఆస్థిని గురించి అంచనా వేయడం అసాధ్యమయిన పని. చుట్టూ పది వేల ఎకరాల పొలం. తోటలో ఉన్న సలేరియా భవనం అందమైనదే అయినా వైశాల్యంలో, శిల్ప సౌందర్యంలో అద్వితీయమని చెప్పలేం. ఇంకా తన మామ ఎంతో మంది ధనవంతుల వలె విశేష భోగలాలసుడు కాలేదు. డబ్బు మింగేసే మల్ల యుద్ధ ప్రదర్శనల జోలికి పోలేదు. ప్రాచ్య దేశ పాలకుల వలె ఘనమైన విందులూ, విపరీతమైన వినోదాలు ఏర్పాటు చేసి తన ధనాధిక్యతను ప్రదర్శించే అలవాటుకు లోబడలేదు. ఏమీ పటాటోపం లేకుండా, శుద్ధ నిరాడంబరంగా జీవించేవాడతను. అలాగని అతని విందులలో సమృద్ధికి, సంతుష్టికి లోటుండదు. కాని కొంతమందిలా దూర దేశాల నుండి తెప్పించే అరుదైన ఆహార పదార్థాలను తన అతిధులకు వడ్డించడం అతనికి కిట్టదు. ఈపాటి ఖర్చు కూడా అతనికి చిరాకు కలిగించేది. కాని ఆ కుటుంబ వ్యవహారాలు ఎన్నడూ బజారున పడలేదు. ఈనాడు జీవించే రోమను సనాతనుడతను. సాంప్రదాయ సిద్ధమైన రోమను పద్ధతులను, ఆచార వ్యవహారాలను అతను పాటిస్తూ తక్కిన వాళ్లు కూడా అలాగే పాటించాలనే భావం కలిగి ఉండేవాడు. అతనంటే కైయస్‌కు భయం. అతని ఎదుట నిలబడడమే కష్టంగా ఉండేది.

తన మామ ముందు కైయస్ ఇంత ఇదైపోవడానికి కారణాలు లేకపోలేదు. ఒకటి - ఆంటోనియస్ కైయస్ ప్రపంచంలో సాధారణంగా చలామణీ అయ్యే తెగకు, తరహాకు చెందిన వ్యక్తి కాడు. ఉద్యోగం పురుషలక్షణం అన్నారు. తనకా ఉద్యోగం, సద్యోగం లేదు. రోమన్ కులీనుడు ఉండవలసిన రీతిగా తాను ఉండడం లేదని మామ భావిస్తున్నాడేమో నని అతని భయం. అతని ఊహలే అతన్ని హడలగొట్టి మామ ముందు నిలబడలేని పరిస్థితి కల్పించాయి.

సక్రమమైన రోమన్ యువకునికుండవలసిన మంచి లక్షణాలేమిటో మననం చేసుకున్నాడు. పౌర విధులకు, బాధ్యతలకు అంకితమైపోవాలి. సామాన్య సైనికుడుగా చేరి

క్రమంగా పెద్ద సైనికోద్యోగిగా ఎదిగేదాకా శ్రమించాలి. ఆదర్శ రోమన్ స్త్రీని పెళ్లాడి కుటుంబాన్ని పోషిస్తూ సంసారసాగరాన్ని ఈదాలి. స్వార్థాన్ని విడనాడకుండాను, స్వార్థరహితం గాను దేశ సేవ చేసి పెద్ద పెద్ద పదవులు సంపాదించి చక్రవర్తికి సలహాదారు కాగలగాలి. డబ్బూ, బిరుదులూ పొందిన పెద్దమనుషుల గౌరవ మన్ననల్ని చూరగొనాలి. పెద్దవాళ్ళే గాక సామాన్య జనం సైతం అతన్ని ప్రశంసించాలి. అయితే అటువంటి లక్షణాలున్న ఒక్క యువకుడూ కైయస్ దృష్టి పథంలో తటస్థపడలేదు. రోమ్‌లో తనతో పరిచయం ఉండి, తన చుట్టూ మూగి తిరిగే యువకుల్లో కొందరు ఆడవాళ్ళ జాతక చక్రాలకు అంకితమై పోయారు. మరికొందరు ధనదాహంతో అక్రమ మార్గాల ద్వారా ఎడాపెడా డబ్బు సంపాదిస్తు న్నారు. ఇంకా కొంతమంది తమ తాతలు, తండ్రులు రాణించిన వార్డు రాజకీయాలు చేబట్టి వోట్లు కొనడం, లంచాలివ్వడం, ముఠాలుకట్టి ముమ్మరంగా వాగ్దానాలు చేసి, తీరా అధికారంలోకి వచ్చాక మొండి చెయ్యి చూపడం ఇత్యాది కార్యకలాపాల్లో తీరిక లేకుండా తిరుగుతున్నారు. ఇవేవీ చేతకాని వాళ్ళు తిండిపోతులుగా, సోమరులుగా, వాగుడుకాయలుగా తయారయ్యారు. తినికూర్చునే జరుగుబాటు లేనివాళ్ళు తప్పనిసరై సైన్యంలో చేరారు. బడుద్ధాయిల సంఘంలో కైయస్ ప్రముఖుడై పోయి నిష్ప్రాచీగా కాలం దొర్లించేస్తున్నాడు. తన జీవిత పద్ధతిని సమర్థించుకుందుకు కొన్ని సిద్ధాంతాలు, సూత్రీకరణలు సృష్టించుకొని వాటిని జాగ్రత్తగా పెంచి పోషించుకుంటున్నాడు. "నువ్వు బతుకు; మరొకడ్ని బతకనివ్వు" అన్నదొక్కటే నాగరికమైన, ఆచరణయోగ్యమైన తత్వమని అతని మతం.

ఆ ప్రాంగణంలో ప్రవేశించినప్పుడు కైయస్ మెదడులో మెదిలిన భావాలివే. ఆ భవనం యొక్క సాంప్రదాయీసిద్ధమైన ప్రశాంత వాతావరణాన్ని భగ్నం చేయలేనంత దూరంలో విశాలమైన ధాన్యాగారాలు, సామాను గదులూ, బానిసల బారకాసులూ ఉన్నాయి. ఉన్నతమైన ప్రదేశంలో చెరువుచుట్టూ నలుచదరంగా కట్టిన భవనమది. వెల్లవేసి ఉంది. ఎర్రని పెంకులతో వేసిన ఇంటి కప్పు. ఇంటి చుట్టూ ఉన్న దేవదారు వృక్షాలూ, బూరుగు చెట్లూ బొమ్మలో గీసిన గీతలవలె ఉండి, ఆ ఇంటి శోభను ఇనుమడింపచేస్తున్నాయి. గుబురుగా పెరిగిన పుష్పభరిత పొదలతో, పసిరిక బయళ్ళతో, వేసవిలో కాలం గడపడానికని కట్టిన రంగురంగుల చలువరాతి బసలతో, ఉష్ణదేశాల నుండి తెప్పించిన పాలరాతి తొట్టెలతో, పాలరాతి జలదేవతా విగ్రహాలతో, నదీకన్యల, గంధర్వుల బొమ్మలతో ఆ ప్రదేశం దివ్య ప్రతిభావిలసితమై ఒప్పుతుంది. కోడిపెట్టలనూ, మేక మాంసాన్నీ, కొన్నట్లుగా రోమన్ బజార్లలో శిల్పాల్ని, భవన నిర్మితాల్ని కొనవచ్చు. ఎంత ధరైనా పెట్టి వాళ్ళను కొనగల బేరగాడని ఆంటోనియస్ కైయస్‌కో పేరుంది. ప్రాచ్య దేశ రాజభవనాలు వంటి భవనాలెన్నో ఉన్నా సలేరియా భవనమే కైయస్‌కు అందమైన దనిపించింది. క్లాడియా ఇందు కంగీకరించింది. గేటుదాటి, భవనంలోకి తీసుకుపోయే ఇటుక రోడ్డుపై కాలుపెట్టే సరికి ఆశ్చర్యం పట్టలేని క్లాడియా హెలీనాతో అంది :

"నే నెప్పుడూ ఇటువంటిది చూడ లేదు! గ్రీకు పురాణాల్లో వర్ణించినట్లు లేదూ నిజానికి?"

"చాలా బాగుంది" హెలీనా సమాధానమిచ్చింది.

ఆంటోనియస్ కైయస్ కూతుళ్లిద్దరు, చిన్న పిల్లలు పరుగు పరుగున వచ్చి, వాళ్ళకు నమస్కరించి పలకరించారు. వాళ్ల వెనుక పిల్లలతల్లి జూలియా వచ్చి నమస్కరించి అతిథుల్ని ఆహ్వానించింది. ఆమె లావుగా ఉంది. ముగ్గురి నెవరినో వెంటబెట్టుకుని ఆంటోనియస్ కైయస్ వచ్చాడు. అతను మర్యాద ఇచ్చి పుచ్చుకుంటాడు. కైయస్‌నూ, అతని చెల్లెలు హెలీనానూ, ఆమె స్నేహితురాలు క్లాడియానూ గంభీరమైన గౌరవంతో పలకరించి తన వెంట వచ్చిన ముగ్గురినీ వీళ్ళకు పరిచయం చేశాడు. అందులో ఇద్దరు కైయస్‌కు ఇంతకు పూర్వమే తెలుసు. ఒకడు పట్టణ రాజకీయవేత్త లెంటులుస్ గ్రాఘూస్. మరొకడు బానిస విప్లవ విజేత, రోమను సేనాని లిసినియస్ క్రాసస్. మూడో వ్యక్తి కైయస్‌కు అపరిచితుడు. తక్కినవారికన్న వయస్సులో చిన్నవాడు, కులీనుడు. రోమను మేధావుల కుండే యుక్తి రహితమైన గర్వం అతనికుంది. ఒక మాదిరిగా అందంగానే ఉన్నాడని చెప్పాలి. అతన్ని పరిచయం చేస్తున్నప్పుడు అతడిని గురించి చెప్పిన కొద్దిపాటి ప్రశంసావాక్యాలను అబ్బే ఏముందిలెండి, దానికేం అన్నట్లు భేషజం లేకుండా తుడిచివేసాడు. పేరు మార్కస్ టుల్లియస్ సిసిరో. మనుషుల స్వరూపాన్నే కాని, స్వభావాన్ని చూడలేని కైయస్‌కు కూడా సిసిరోలో జిజ్ఞాస ఉన్నట్లు కనపడింది. వాళ్ళ నతడు పరిశీలిస్తున్నట్లు, విలువ కడుతున్నట్లు, వాళ్ళ పరిస్థితి ఊహించుతున్నట్లు, కుటుంబం యొక్క మొత్తం ఆస్తి గురించి అతను అంచనా వేస్తున్నట్లు, వాళ్ళకున్న పేరు, ప్రభావాల గురించి అతనాలోచిస్తున్నట్లు గ్రహించాడు కైయస్.

ఆ సుందర భవనానికీ, అంతులేని అన్ని వేల ఎకరాల తోటలకు, యజమానియైన ఆంటోనియస్ కైయస్ ఎంతో వాంఛనీయుడైన పురుషుడుగా కనబడ్డాడు క్లాడియాకు. గ్రాఘూస్, క్రాసస్‌లకు తన మనస్సులో క్లాడియా స్థానం ఇవ్వలేదు. ఆమెకు సిసిరో గురించి ఏమీ తెలియదు. తెలియకపోవడం వల్ల నష్టమేమీలేదని అనుకుంది కూడా. కొక్కెంలా వంపుతిరిగిన ముక్కు, బాగా కండలున్న శరీరమూ కల ఆంటోనియస్ కైయస్‌లో అసంతృప్తిచే అణగారిన వాంఛలూ, తీరని కోర్కెలూ, తృష్ణ ఉన్నట్లు గ్రహించింది క్లాడియా. తెచ్చిపెట్టుకున్న పవిత్రతను ప్రదర్శించే అలవాటు కలవాడతను. ఆంటోనియస్ కైయస్‌లో కనిపించని కామం కమ్ముకున్నట్లు కనిపెట్టింది క్లాడియా. పైకి శక్తివంతులుగా కనబడడానికి ప్రయత్నించినా నిజానికి అశక్తులైన మనుషులంటేనే ఆమెకు ఆసక్తిమెండు. అశ్రద్ధగా నవ్వి, ఆ నవ్వు ద్వారా అతని గురించి తనకంతా తెలిసినట్లు అతనికి తెలియ చేసింది.

ఎదురేగిన గృహస్తు, అతని వెంట వచ్చిన అతిథులూ, అతని భార్యాపిల్లలూ, ఈ అతిథులు అంతా భవనాన్ని సమీపించారు. కైయస్ గుర్రాన్ని ఈజిప్షియన్ బానిసొకడు వచ్చి తీసుకువెళ్ళాడు. అలసట వల్ల పల్లకి మోసిన బానిసలా పల్లకి పక్కనే గడ్డిలో పడుకుని

సాయంత్రంతో బాటు వచ్చిన చలితో వణుకుతున్నారు. నీరసించినపుడు జంతువులు బాధపడ్డట్లే, అలసటవల్ల అవి వణికినట్లే ఆ బానిసలు బాధపడి వణుకుతున్నారు. వాళ్ళకేసి ఎవరూ చూడలేదు. గుర్తించలేదు. ఏం కావాలని అడిగిన పాపాన పోయినవారు లేరు. వాళ్ళల్లో ఇరవైయేళ్ళకు మించని బానిసొకడు దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడ్చాడు. తక్కినవాళ్ళతని కేసి చూడనైనా లేదు. అరగంటయాక మరో బానిస వచ్చి వాళ్ళను బారకాసుకు తీసుకు పోయాడు.

# 8

సేనాని లిసినియస్ క్రాసస్‌తోబాటు, కైయస్ స్నానశాలకు వెళ్ళాడు. క్రాసస్ అతనికి సరదా అయినవాడుగా, సహృదయుడిగా, స్నేహపాత్రుడుగా కనకబడ్డాడు. అత్తరువులు, సువాసనలు వెదజల్లే లవణాలు కలిపిన పన్నీటి తొట్టెలలో వాళ్ళు కాళ్లు బారచాపుకుని కూచున్నారు. దాన్లో మునిగారు. చేతులు చాచి నీటిని తోసారు. అరచేతులతో నీటిపై మర్దించారు. మధ్యవయస్కుల శరీరాలలో ఉండే కొవ్వు పదార్థం క్రాసస్ శరీరంలో లేదు. మధ్యవయుస్కుడే అయినప్పటికీ, అతని శరీరం కండలు తిరిగి గట్టిగా ఉంది. రోమ్ నుండి రాజవీధిని ప్రయాణం చేసే వచ్చారా అని కైయస్ అతన్నడిగాడు.

"అవును, ఆ దారినే వచ్చాం. రేపు కేపువాకు వెళతాం."

"శిక్షా చిహ్నాలను చూసి మీరేమనుకున్నారు" అన్నాడు సేనాని.

"మాకు చాలా తమాషాగా కనిపించాయి. ఇక్కడా అక్కడా రోడ్డు పక్క పక్షులు పీక్కుతిన్న శవాలుండి చెడ్డకంపు కొట్టాయి. గాలి మా వైపు వీచినపుడల్లా ఆ కంపు మాకు చాలా అసహ్యం కలిగించేది. మా వాళ్ళు తెరలు దింపుకునేవారు. అయినా అది తగ్గుతుందా! కాని పల్లకీ బోయీలు మాత్రం దెబ్బ తినేసారు, వికారం పెట్టి చచ్చేవారు" అన్నాడు కైయస్.

"వాళ్ళేవేళ శిలువల మీద వేలాడే వాళ్ళని గుర్తుపట్టారేమో!"

"మా పల్లకి మోసిన బానిసలంతా కొరడా విరిగేలా దెబ్బలు తిని మా వద్దనే పెరిగిన వాళ్ళు. జంతువుల కన్నా వాళ్ళేమైనా నయమా? ఏమీ కాదు. వాళ్ళు గుర్తించగల రంటారా? బానిసలందరిలోనూ ఒకే రకమయిన భావాలుంటాయంటే నమ్మడం కష్టం. బానిసలందరికీ స్పార్టకస్ మీద సానుభూతి ఉందంటారా?"

"ఉందనే నా అభిప్రాయం. లేకపోతే ఈ శిలువ గొడవ ఎందుకు తలబెడతాం. వృథాగా చంపెయ్యడమంటే నాకు సుతరామూ కిట్టదు. బానిస ఒక వాగగల పనిముట్టు అంటాడు సిసిరో. జంతువు సగం మట్టుకే నోరు గల పనిముట్టు. మామూలుగా మనం ప్రతి నిత్యం ఉపయోగించే పనిముట్లున్నాయే అవి జడ పరికరాలన్నమాట. ఇదీ వస్తువులను, విషయాలను అతను విడమరిచి చెప్పే పద్ధతి. సిసిరో మంచి తెలివైనవాడేనని నా ఉద్దేశం. కాని అతనికి స్పార్టకస్‌తో ముఖాముఖి యుద్ధం చేయాల్సిన అవసరం మాత్రం కలగలేదు.

దాన్ని గురించి ఆలోచించే పరిస్థితి కూడా ఏర్పడలేదతనికి. ఆ బానిసలతో బాహాబాహి యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు వాళ్ళు ఉట్టి వాగగల పనిముట్లు మాత్రమే కాదనీ వాళ్ళల్లో ఇంకేదో శక్తి ప్రభవిస్తుందనీ అనిపిస్తుంది."

"అతన్ని మీ రెరుగుదురా? అంటే వ్యక్తిగతంగా తెలుసా?"

"అతనంటే?"

"ఆ స్పార్టకస్‌ని."

సేనాని ఆలోచనా పూర్వకంగా నవ్వాడు. "నిజానికి నే నెరుగను." ఆ మాట కూడా ఆలోచిస్తూనే చెప్పాడు. "తెలిసిన విషయాలన్నిటిని అతికి అతని సంపూర్ణ స్వరూపం తెలుసుకుందామనే ప్రయత్నించాను. అతన్ని గురించి ఎవరికీ బాగా తెలియదు. ఎలా తెలుస్తుంది? పెంపుడు కుక్క తిరగబడుతుందనుకో. తిరగబడ్డా, తిరగబడకపోయినా కుక్క కుక్కే కద. అట్లాగే కుక్కగానే ఉంటూ తెలివిగా తప్పించుకుని గొడవ చెయ్యడం మొదలెడితే మనం ఎలా తెలుసుకోగలం? స్పార్టకస్ సంపూర్ణ స్వభావ నిర్ణయం చెయ్యగల వాళ్ళంతా ఏపియన్ మార్గంలో శిలువల నలంకరించారు. ఆ మనిషే ఒక కలలా వచ్చి కలలాగే కరిగిపోయాడు. మెరుపులా వచ్చి, మాయమయ్యాడు. అతన్ని మళ్ళీ మనం ఒక బానిసగా తయారు చేసుకోవాలి. అంటే అనగనగా ఒక బానిస అని మొదలెట్టి అతన్ని గురించి ఆలోచించాలి."

"అతనసలు బానిసేగా" అన్నాడు కైయస్.

పాపం క్రాసస్‌ని అదృష్టం పరిహాసం చేసింది. రోమను చరిత్రలో ఎన్నడూ జరగనంత ఘోరయుద్ధం జరిగింది. ఈ బానిస యుద్ధంలో ఎంతో కష్టపడి విజయం సాధించిన క్రాసస్‌కి రావలసినంత కీర్తి రాలేదు. రావలసినంత పేరూ, ప్రతిష్ఠా రాలేదు. బానిసలు రోమ్‌ను తమ గుప్పెట్లో పెట్టుకుని గజగజలాడించి సర్వనాశనం చేసిన రోజుల్లో వాళ్ళు వేసిన ప్రతి ఎత్తుకూ, పై ఎత్తు వేసి ఎంతో కష్టపడి వాళ్ళతో యుద్ధం చేసి రోమ్‌ను కాపాడాడు. ఆ బానిసలను నాశనం చేసాడు. ఇంత ఘన విజయం సాధించినా రావలసినంత యశస్సు రాలేదు. క్రాసస్ కొంత చిన్నబుచ్చుకుని బాధపడ్డాడు కూడా. బానిసలతో యుద్ధం చేసామన్న సంగతి జ్ఞాపకం ఉంచుకోడం కాని, దాన్ని గురించి చరిత్ర రాయడం కాని స్వతంత్రులైన రోమన్లకు చిన్నతనం. అందుకే వాళ్ళు అటువంటి యుద్ధమొకటి జరిగిందనే సంగతే మరిచిపోవాలని ప్రయత్నించారు. ఆ మరచిపోవాల్సిన అవసరమే క్రాసస్ సాధించిన విజయాన్ని ఒక చిన్న చూపు చూసింది.

స్నానం పూర్తి చేసి వాళ్ళు బయటికొచ్చారు. స్నానశాలలోని బానిస స్త్రీలు తువ్వాళ్ళు తెచ్చి వీళ్ళ చుట్టూ కప్పి తుడుస్తున్నారు. ఈ భవనం కన్న ఎంతో ఆడంబరంగా కనపడే భవనాలు బోలెడు ఉండవచ్చు. కాని ఎక్కడా ఆంటోనియస్ ఇంట జరిగే సౌకర్యాలలో సగం కూడా జరగవు.

"ఆడాళ్ళ చేత ఈ విధంగా ఉపచారం చేయించుకునే అలవాటు నేనింకా చేసుకోలేదు. నీ కిష్టమేనా?" అడిగాడు క్రాసస్. "నేను దాన్ని గురించి పెద్దగా ఆలోచించనే లేదు" కైయస్

సమాధానమిచ్చాడు. సేనాని ప్రశ్న ఇతన్ని వాళ్ళకేసి చూసేలా చేసింది. ఆ బానిస స్త్రీలు స్పెయిన్‌లోని ఏ జాతికో చెందినవాళ్ళు. ఏమంత అనాకారులు కారు. నిండు యౌవనంలో ఉండి బాగుండక పోలేదు. వాళ్ళకి పాదరక్షలు లేవు. పొట్టి దుస్తులు ధరించారు. ఆవిరి వల్ల బట్టలు చెమ్మగిల్లేయి. దానికి తోడు స్వేదబిందువులు కూడా బట్టలను తడుపుతున్నాయి. వాళ్ళ ముందు ఇతను దిగంబరుడు. తన దిగంబరత్వమే అతని నుద్రేకపరిచింది. ఒకర్తెను దగ్గరగా తీసుకున్నాడు క్రాసస్. ఛండాలంగా ప్రవర్తిస్తూ ఆమెను తన ఇష్టం వచ్చినట్లు నలిపేస్తున్నాడు. ఆమెకేసి అదోమాదిరిగా నవ్వుతున్నాడు. ఆమె అతని దయ సంపాదించు కొనేందుకు ప్రయత్నిస్తోంది. ఏమీ అభ్యంతరం చెప్పనేలేదు.

కైయస్‌కు ఆశ్చర్యం పుట్టుకొచ్చింది. స్నానశాలలో బానిస స్త్రీల నీ విధంగా తడుముతూ, నీచంగా ప్రవర్తిస్తున్న సేనానిని చూసేసరికి కైయస్‌కు అమాంతంగా కోపం వచ్చింది.

అక్కడున్న బల్ల మీద అతను పడుకున్నాడు. కొంతసేపటికి క్రాసస్ కూడా అతనితో వచ్చి చేరాడు. స్పార్టకస్ ప్రసక్తి తిరిగి తెస్తూ "స్పార్టకస్ నీ కెంతటి చిక్కు ప్రశ్నో నాకూ అంతే. నే నతన్నెన్నడూ చూడలేదు. వెర్రెత్తిన దెయ్యం మాదిరి నా చేత గెంతించాడు."

"అతన్ని మీ రెన్నడూ చూడలేదా?"

"ఎప్పుడూ చూడలేదు. అంతమాత్రం చేత అతన్ని గురించి నాకేమీ తెలియదని కాదు. ప్రతిముక్కా సంపాదించి వాటి నన్నిటినీ అతికి అతని ఆకారాన్ని సమకూర్చుకున్నాను. కొందరు సంగీతాన్ని, తదితర కళలనూ కూర్చుతారు. నేనేమో స్పార్టకస్ ఆకారాన్ని సమకూర్చు కున్నాను."

సాచుకుని పడుకునీ మర్దన చేయించుకుంటూ ఆనందిస్తున్నాడు క్రాసస్. ఒకర్తె గంధపు గిన్నెలాటి దాన్లో అత్తరువు పోసి తీసుకొచ్చింది. మర్దన చేసే చోట అత్తరువు వేస్తోంది. పిసుకుతున్న వేళ్ళు అతని శరీరంలో ఆనందాన్ని తట్టి మేల్కొలుపుతున్నాయి.

"మీరు కూర్చిన దాని ప్రకారం అతనెలాగుంటాడు?" కైయస్ అడిగాడు.

"తుది సమరంలో ఆఖరున ఎప్పుడో నన్ను పిలిచాడని అంటారు. ప్రమాణం చేసి నే నా విషయం చెప్పలేననుకో. కాని అతనరిచాడట. 'ఒరే క్రాసస్! వస్తున్నా కాసుకో! లంజాకొడకా!' అనో అలాటిదే మరేదో అరిచాడని అంటారు. నాకు నలభై యాభై అడుగుల దూరంలోనే ఉండి నన్ను చంపడానికి తోసుకొచ్చేస్తున్నాడు ముందుకి. అతనేం దయ్యంలాంటి మనిషి కాదు, మహాశక్తి వంతుడూ కాదు. కాని త్రినేత్రుడినయినా సరే ఎదిరించగల కోపం మాత్రం ఉంది. రోషం ఉంది. అతను యుద్ధం చేస్తుంటే క్రోధం, బ్రహ్మాండమైన కోపం ఉగ్రస్వరూపం దాల్చి యుద్ధ రంగంలో ప్రవేశించిందా అనిపిస్తుంది. నా దగ్గరకు సగందూరం రానే వచ్చేశాడు. ఆ అంతిమ పోరాటసమయంలో, ఆ క్షణాలలో తన చేతులతో పది పదిహేను మందినైనా హతమార్చాడు. ముక్కల కింద నరికేసే వరకూ తన పని మానలేదు."

"అయితే అతని శవం దొరకలేదన్న సంగతి నిజమేనన్నమాట!" కైయస్ అడిగాడు.

"నిజమే, అతను ముక్కలు ముక్కలయ్యాడు. ఇంకేం మిగల్లేదు. శూన్యంలో నుండి శూన్యంలోకి పోయాడు. మల్లయుద్ధ గోదా నుండి వచ్చి మహా యుద్ధ వధ్యశాలలోకి పోయాడు. కత్తితో బతికి, కత్తితో చచ్చేవాళ్ళం మేము. స్పార్టకస్ కూడా అంతే. అందుకే అతనికి నా అభివందనాలు."

"మీ కతనంటే ద్వేషం లేదా?" అని అడిగాడు కైయస్.

"ఎందుకుండాలి? అతను మంచి సైనికుడు. ఇంతా చేసి ఒక బానిస. అటువంటి వాడిని ప్రత్యేకించి అసహ్యించుకునేందు కేముంది? పైగా అతను చచ్చిపోయాడు. నేను బతికున్నాను." మర్దన చేస్తూన్న వేళ్ళ కింద అతను సంతోషంతో మెలికలు తిరుగుతున్నాడు.

# 9

సర్వం జగన్నాధం అవుతున్న రోజులలో కూడా సలేరియా భవనం పాత ఆచారాలకు, అలవాట్లకూ ఆటపట్టయి కొత్త పద్ధతులకు, మార్పుకు ప్రతిఘటన, వ్యతిరేకత చూపింది. తక్కిన పద్ధతులవలెనే అక్కడి విందులు కూడా మార్పులను చొరనీయవు. భోజనకాలంలో సంగీతమన్నా, నాట్యమన్నా ఆంటోనియస్‌కి గిట్టదు. అతనికి కావాల్సిందల్లా సంభాషణ; మంచి మధువు, మంచి భోజనం. ఒక విజ్ఞానవంతుడైన రాజుతో తనను పోల్చుకునేవాడు. గ్రీకు చరిత్ర, వేదాంతం, నాటకశాస్త్రం అధ్యయనం చేసాడు. దానికి తోడు కొంత వైద్యం చేయగలిగేవాడు. భోజనాలయాయి. తోటలోని బంగళాలోనికి పోయారు స్త్రీలు. ఇతని అభిరుచులను ప్రతిబింబించేవాళ్ళే ఇతని అతిధులు. సుష్టుగా భుజించి కుర్చీలకు జేర్లబడి కూర్చున్నారు. పట్టుదలతో, సమర్థతతో, నేర్పుతో రోమ్‌ను పాలించే రోమను సమాజ శిరోభూషణాలు వాళ్ళేనని అనిపించింది కైయస్‌కు.

వాళ్ళ ఉద్దేశంలో ఇతను తినడానికీ, పడుకోడానికీ తప్ప మరెందుకూ పనికిరాని వ్యర్థజీవి. ఇటువంటి వాళ్ళు ఈ మధ్య కాలంలో తయారవుతున్నారు. కొన్ని పెద్ద పెద్ద కుటుంబాలతో సత్సంబంధాలు కలవాడు కనుకనే ఇతనికి ఆ మాత్రం గౌరవమైనా లభ్యమయింది. అదే లేకపోతే వాళ్ళెక్కడ, తనను గౌరవించడమెక్కడ. వాళ్ళంటే కైయస్‌కు భయం.

షడ్రసోపేతమైన విందారగించి ద్రాక్షసారా సేవిస్తూ కూర్చున్నారు. వీళ్ళ శక్తిని ఎదిరించినవాళ్ళు ఏపియన్ మార్గంలో శిలువలపై వేలాడుతున్నారు. స్పార్టకస్ మాంసం ముద్దయిపోయాడు. శిలువ వేయడానికి పనికి రాని మాంస ఖండమైపోయాడు. బానిసను చూసినంత నిర్దయగా ఏ గుర్రాన్ని చూసినా అది సహించదు. కనుక గుర్రాన్ని పూన్చడం కన్న నాగలికి ఇద్దరు బానిసలను కట్టడమే బాగుంటుందని వాదిస్తూ గుర్రాలను గురించి మాట్లాడుతున్నాడు ఆంటోనియస్ కైయస్. ఇతన్నెవరైనా శిలువ వేయగలరా?

సిసిరో నవ్వు వినిపించింది. తక్కిన వాళ్ళంతా ఒక ఎత్తు. ఈ సిసిరో ఒక్కడూ ఒక ఎత్తు. ఇతనే కైయస్‌ను మరింత గాభరా పెట్టేడు. 'అబ్బాయ్! లోపలా, బైటా, కిందా, మీదా, ముందూ, వెనకా, ఇటూ, అటూ, అంతా నీ గురించి నాకు తెలుసు' అని తనకేసి చూసి సిసిరో అనుకున్నట్లుగా భావించాడు కైయస్.

క్రాసస్ వినయం ఉట్టిపడేలా కూచున్నాడు. కూచున్నా, నిలబడినా మిలిటరీవాడిలా టంచెన్‌గా ఉంటాడు. బలవంతుడిగా కనిపిస్తాడు. కంచు విగ్రహం లాంటి మనిషి. నల్లని జుత్తు, నలుచదరపు ముఖం కలిగి రోమన్ సైన్యాధికారిని ముమ్మూర్తులా పోలి ఉంటాడు. సేనాధిపతి అంటే వీడు అనిపిస్తాడు. స్నానాల గదిలో క్రాసస్ ప్రవర్తన జ్ఞాపకం వచ్చింది కైయస్‌కు. కుంచించుకుపోయాడు. స్నానశాలలో అంత నీచంగా ఎలా ప్రవర్తించగలిగాడు చెప్మా? అనుకున్నాడు. కైయస్‌కు ఎదురుగా కూర్చున్నాడు గ్రాఛూస్. మహావృక్షమంతటి మనిషి అతను. బొంగురు గొంతులోంచి పిడుగులుపడ్డట్లు వస్తున్నాయి మాటలు. లావైన తలకు దగ్గరగా అతుక్కుపోయినట్లుంది మెడ. అసలు మెడ అనేది ఉందా లేదా అనిపిస్తుం దందుకనే. రోమమయమైన లావాటి చేతులు, వేళ్ళకు ఉంగరాలు, రాజకీయవేత్తల మాదిరి ఎక్కడా ఇదమిత్థమని తేల్చకుండా సమాధానాలు ఇస్తాడు. నవ్వితే పెంకులెగిరిపోతాయి. ఏదైనా ఒప్పుకోవాల్సి వస్తే పూర్తిగా, హృదయపూర్వకంగా ఒప్పేసుకుంటాడు. కాదని తన వ్యతిరేకత తెలిపేటప్పుడు మాత్రం జాగ్రత్తగా ఆలోచించి, ప్రతి మాటనూ, తూచి మరీ మాట్లాడుతాడు. అతని అభిప్రాయ ప్రకటన డాంబికంగా కనిపిస్తుంది. కాని దానిలో తెలివి తక్కువ మాత్రం ఉండదు.

"బానిసలను నాగలికి కట్టడం వల్ల పని జరుగుతుందన్నారు. జరిగితే జరగవచ్చు" అన్నాడు సిసిరో. "ఆలోచించగల జంతువు, ఆలోచించలేని జంతువుకన్న అన్ని విధాలానయం. నా మట్టుకు సహేతుకంగా కనిపిస్తుంది. గుర్రం కూడా ఉపయోగమైన జంతువే. మన మీద గుర్రాల గుంపులు ఎప్పుడూ తిరగబడలేదు. వాటితో మనం యుద్ధం చేయవల్సిన అవసరమూ ఏర్పడలేదు. గుర్రాలను మనం కొని ఉపయోగిస్తే బానిసలు వాటిని తగలేస్తారు."

"నాకలా తోచదు" గ్రాఛూస్ అన్నాడు.

"ఆయ న్నడగండి తెలుస్తుంది" అన్నాడు సిసిరో, ఆంటోనియస్‌ను చూపించి.

"అది నిజమే, బానిసలు గుర్రాల్ని తగలేస్తారు. గుర్రాలే అన్న మాటేమిటి? యజమాని తాలూకు వస్తువులను, అతని ఆస్తి నంతటినీ వాళ్ళు ధ్వంసం చేస్తారు. యజమానికి చెందిన దేన్నీ వాళ్ళు గౌరవించరు." మరో గ్లాసుడు సారా పోసుకున్నాడు ఆంటోనియస్. "ఈ బానిసలను గురించే మాట్లాడుకుంటూ కూచోవాలిలాగుంది."

"ఎందుకు కూడదు" ఆలోచిస్తూ అన్నాడు సిసిరో. "వాళ్ళెప్పుడూ మనతోనే ఉన్నారు. ఆ మాటకొస్తే, నిజం చెప్పాల్సివస్తే మనం బానిసల చేత బానిసత్వం చేత తయారుకాబడ్డ విచిత్రమైన ఉత్పత్తి. ఒక్క మాటలో చెప్పాలంటే రోమన్లను బానిసలే సృష్టించారు. ఈ మన

గృహస్తు వందల ఎకరాల రమణీయమైన ఈ తోటల్లో నివసిస్తున్నాడంటే బానిసల దయ వల్లనే. అందుకాయనంటే నాకు అసూయగా ఉంది. బానిసల తిరుగుబాటునణచి, విజయం సాధించారు కాబట్టి క్రాసస్ సేనాని గురించి రోమన్లు చెప్పుకుంటున్నారు. అలాగే గ్రాఘూస్ ధనమంతా బానిస వర్తకంలోనే ఆర్జించాడు. తను నెగ్గిన వార్డులోనే ఆ వర్తకమంతా జరుగుతోంది. ఇదిగో ఈ యువకుడు, కైయస్‌ను తలతో చూపిస్తూ, నవ్వుతూ చెప్పాడు." "బానిసలచే తయారుకాబడ్డ విచిత్రమైన ఉత్పత్తి అంటే ఈయనే అనిపిస్తుంది. వాళ్ళీయనను పెంచారు, తిండి పెట్టారు, షికారుకు తీసుకుపోయేవారు, మందూమాకూ వేసే వారు...."

తనను గురించి సిసిరో అన్న మాటలకు కైయస్ ముఖం ఎర్రబారింది. గ్రాఘూస్ విపరీతంగా నవ్వుతూ "మరి నువ్వో సిసిరో?" అన్నాడు.

"బానిసలు ఒక సమస్యగా తయారయింది నా విషయంలోనే. ఎవరైనా రోమ్‌లో మర్యాదగా, దర్జాగా బతకదలచుకుంటే, కనీసం పదిమంది బానిసలయినా ఉండాలి. వాళ్ళను కొనాలి, తిండిపెట్టి మేపాలి. ఉండటానికి బస ఏర్పాటుచెయ్యాలి. ఇవన్నీ నన్నెదుర్కొన్న సమస్యలు." గ్రాఘూస్ నవ్వుతూనే ఉన్నాడు. క్రాసస్ సంభాషణ నందుకున్నాడు. "బానిసలే రోమన్లను సృష్టించారన్న వాదనను నే నంగీకరించను." గ్రాఘూస్ ఉరుములు పడుతున్నట్లు నవ్వుతూనే ఉన్నాడు. సిసిరో చెప్పిన విషయాన్ని విమర్శిద్దామనే పట్టుదల సేనాని క్రాసస్‌లో తగ్గలేదు.

"ఏదో చెప్పి, నేను మిమ్మల్ని బాధించానా?" సిసిరో ప్రశ్నించాడు. "ఇక్కడ ఎవరూ ఎవర్నీ బాధించడం అన్నది ఉండదు. మనమంతా నాగరికులం" సంభాషణ తీవ్రంగా పెరుగుతుందేమోనని, దానికో అడ్డుకట్ట వేయడానికి అన్నాడు.

"అబ్బే బాధ కాదు. మీరు నన్ను గాభరా పెట్టారు" అన్నాడు క్రాసస్.

"ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. మన చుట్టూ నే నన్నదానికి ప్రబల నిదర్శనాలు లెక్కలేనన్ని ఉన్నాయి. ఆ నిదర్శనాలలోని తర్కాన్ని మనం ఒప్పుకోకపోతే ఎలాగ? గ్రీకులను తర్కం వరిస్తుంది. అందుకు వాళ్ళు అడ్డు చెప్పరు కూడా. మన సుగుణం పట్టుదల. దానికేం గాని, మన చుట్టూ చూడండి. మనకు కావలసింది చూడడానికి ఒక బానిస బల్ల వద్ద నిలబడి ఉన్నాడు. మరొకడు ఖాళీ అవుతున్న మన గ్లాసులలో ఎప్పటికప్పుడు సారా తెచ్చి పోస్తున్నాడు. ఇంకొకడు పళ్ళూ, వక్కలూ తెచ్చి ఇస్తున్నాడు. దీనర్థం ఏమిటి? మన జీవిత సారం ఏమిటి? మనం మరొకళ్ళం, మరొకళ్ళం కాము, రోమన్‌లం. సంపూర్ణంగా, అన్ని విధాలా బానిసల నుపయోగించుకోగల్గుతున్నాం కనుకనే మనం రోమన్లం కాగలిగాం."

"రోమ్ ఉండకపూర్వం కూడా బానిసలుండేవారుగా" అన్నాడు ఆంటోనియస్ కైయస్.

"ఇక్కడో కొద్ది మందీ, అక్కడో కొద్ది మందీ ఉంటే ఉండొచ్చు. గ్రీకులకూ ఉండేవి తోటలు. కార్తేజికీ అంతే. మనం గ్రీసునీ, కార్తేజినీ కూడా జయించాం. ఎందుకు? మన

తోటలను వృద్ధి చేసుకొందుకే, మనం మరొకర్ని నాశనం చేయ్యాలిసొచ్చింది. తోటలూ, బానిసలూ రెండూ ఒకటే. ఒకదాని మీద ఒకటి ఆధారపడి ఉన్నాయి. మరొకడు ఒక్క బానిస చేతనే పని చేయించే చోట, మనం ఇరవై మందిచేత పని చేయించాం. మనం బానిసల దేశంలో బతుకుతున్నామనడానికి ఇది చాలు. మనం సాధించిన మహత్తర విషయమేది? స్పార్టకస్. మనం స్పార్టకస్‌లాటి వాడిని చేజేతులా తయారుచేసాం. ఏమంటారు క్రాసస్? మీకు స్పార్టకస్‌తో సన్నిహిత సంబంధం ఉండేది కనుక అడుగుతున్నాను. మరే దేశమైనా స్పార్టకస్ వంటి వాడిని సృష్టించగలదంటారా?"

"స్పార్టకస్ తలెత్తడానికి మనమా కారణం" ఆశ్చర్యం, వ్యతిరేకత ఒక్క ప్రశ్నలో తెలియచేసాడు. మరీ గంభీరంగా ఆలోచించడం క్రాసస్‌కు చేతగాదనీ, సిసిరోవంటి వాడితో తలపడి వాదించడం అతనికి మరీ కష్టమనీ అనుకున్నాడు కైయస్.

"స్పార్టకస్ నరకకూపంలోంచి వచ్చాడని నా అభిప్రాయం" సంభాషణ పెంచాడు క్రాసస్.

"నేనలా అనుకోను."

ఏమీ లేనట్లు నవ్వుతూనే ఉన్నాడు గ్రాఛూస్. ఇంకా తాగుతున్నాడు. తనొక దేశభక్తి కల రోమన్ పౌరుడు కనుక వేదాంతిని కాలేకపోయా నన్నాడు సిసిరోతో. "ఏది ఏమయినా రోమ్ ఉంది. బానిసలున్నారు. వీళ్ళతో ఏం చెయ్యదలుచుకున్నావు సిసిరో?"

"దాన్నర్థం చేసుకోవాలంటాను నేను" సిసిరో సమాధాన మిచ్చాడు.

"ఎందుకు?" అడిగాడు ఆంటోనియస్.

"లేకపోతే వాళ్ళు మనను నాశనం చేస్తారు."

"మీ రా రోడ్డు మీదే ప్రయాణం చేసి వచ్చారా?" క్రాసస్ ప్రశ్నించాడు.

సిసిరో తల ఊపాడు. కత్తి ఝళిపించడం వల్లనే పనులన్నీ జరుగుతాయనుకోవడం శుద్ధ పొరపాటు అని మిలిటరీ మనుషులకు చెప్పి, వాళ్ళ చేత ఒప్పించడం కష్టం. "కసాయి దుకాణంలోని ఆలోచనా పద్ధతి నా కనవసరం. ఇక్కడో పద్ధతి ఆచరణలో ఉంది. మీరేమీ అనుకోకుండా ఉంటే నే చెప్తా. అంటోనియస్ ఇప్పుడున్న తోటలలో పూర్వం మూడువేల కుటుంబాలైనా ఉండేవి. ఒక్కొక్క కుటుంబానికి అధమం అయిదుగురు మనుష్యుల చొప్పున మొత్తం పదిహేనువేల మంది ఉండేవారన్నమాట. ఆ రైతులంతా మంచి సైనికులయ్యారు. ఏమంటారు క్రాసస్?"

"వాళ్లు మంచి సైనికులే. ఇంకా అలాటివాళ్ళు చాలా మంది ఉంటే బాగుండు ననిపిస్తుంది" క్రాసస్ అన్నాడు.

"మంచి సైనికులే కాదు. మంచి రైతులు కూడా" సిసిరో చెప్పుకుపోతున్నాడు. "పచ్చిక బయళ్లూ, తోటలూ కాదు. పూర్వం రైతు కష్టపడి బార్లీ పండించేవాడు. అతను ఒక్క ఎకరం భూమిలో పండించే పంటలో సగం పంటైనా పండే ఒక్క ఎకరం చెక్క మీకుందా

ఆంటోనియస్?"

"దాన్లో నాలుగో వంతు పండే భూమి కూడా లేదు" ఆంటోనియస్ చెప్పాడు.

"అయితే ఎందుకలా అయిందంటారు. పూర్వం పండినంత బార్లీ ఇప్పుడు పండ దెందుకని?" సిసిరో తన అభిప్రాయాల ఉక్కుచట్రంలో వీళ్ళందర్నీ ఇమిడ్చి పారేద్దామనే ప్రయత్నంలో ఆవేశంతో ప్రశ్నిస్తూ, తన వాదనను సమర్థించుకుంటున్నాడు.

"బానిసలకు పని చెయ్యాలని ఉండదు" ఇప్పటికైనా ఈ ప్రసంగానికీ, అందులోను ఈ విషయానికీ స్వస్తి పలుకుదామనే ఉద్దేశంతో ఆంటోనియస్ అన్నాడు.

"అదీ. సరిగ్గా అంతే, వాళ్ళకు పనిచెయ్యాలని ఉండదు. ఎందుకు చెయ్యాలి? ఎవడో యజమాని కోసం పని చెయ్యాల్సి వస్తే ప్రతివాడూ పని ఎగవేయడమే ఒక సాధనగా పెట్టుకుంటాడు. నాగళ్ళు పదును చేద్దామని ఉండదు. వాటిని బండగా తయారు చేద్దామని ఉంటుంది; కొడవళ్ళు విరగ్గొడదామని ఉంటుంది; ఇటువంటి పెనుభూతాన్ని మనంతట మనమే సృష్టించుకున్నాం. ఇక్కడ పదివేల ఎకరాలున్నాయి. పూర్వం ఇదే భూమిమీద ఆధారపడి పదిహేను వేలకు తక్కువ కాకుండా జనం బతికేవారు. ఇప్పుడిక్కడ ఉన్నదల్లా ఒక వెయ్యి మంది బానిసలూ, ఆంటోనియస్‌గారి కుటుంబం. ఇక్కడ ఒకప్పుడు బతికిన రైతులు ఇప్పుడు రోమను రోడ్ల మీద, సందుగొందులలో ఎందుకూ కొరగాకుండా తిరుగుతున్నారు. మన కిదంతా చాలా చిన్న విషయంలా కనిపించొచ్చు. కానీ దీన్నే మనం సరిగ్గా అర్థం చేసుకోవాలని మనవి చేస్తున్నా. సైనికుడుగా మారిన రైతు యుద్ధాన్నించి తిరిగి వచ్చి చూసుకునే సరికి, అతని కగుపించినదేమిటి? డొంకలతో, ముళ్ళ పొదలతో, కలుపు మొక్కలతో బీడుపడిన పొలం అతనికి ప్రత్యక్షమయింది. డబ్బిచ్చిన ప్రతివాడికీ శరీరాన్నిచ్చిన భార్య కనిపించింది. తనను ఆనమాలు పట్టలేక వీధి వెంట ముష్టికి బయలుదేరిన పిల్లలు కనిపించారు. దీని కంతకూ, అతని భూమికీ నష్టపరిహారంగా మనం అతని చేతిలో కొద్దిగా డబ్బు పడేసాం. రోమను వీధుల్లో స్వేచ్ఛగా, యధేచ్ఛగా బతకరా బాబూ అన్నాం. తత్ఫలితంగా మనం బానిసల దేశంలో బతకాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇదే మన జీవితపు పునాది. బానిసలనెలా చూస్తాం? వారిపట్ల మన వైఖరి ఎలాగుంటుంది? అన్నదానిపైనే మన స్వాతంత్ర్యం, మానవ స్వాతంత్ర్యం మన రాజ్యాంగమే కాకుండా భవిష్యత్తులో మానవజాతి యొక్క నాగరికతా సర్వస్వం ఆధారపడి ఉన్నాయి. ఈ భూమి మీద సంచరించే, సంభాషించే ప్రతిదానికీ సమానత్వమివ్వాలన్న గ్రీకు భావాల చెత్త నుండి మనం విడివడాలి. ఇంతకీ సంచరించగల, సంభాషించగల ఈ బానిస ఎవరు? నా దో నిర్వచన ముంది. బానిస అంటే మాట్లాడగల పనిముట్టు. ఇటువంటి ఆరువేల పనిముట్లు రోడ్డు పక్క వేలాడుతున్నాయి. అది వృధాకాదు. అవసరం. కొందరు స్పార్టకస్‌ను ఆకాశం ఎత్తున పొగుడుతున్నారు. నాకు స్పార్టకస్ ధైర్య సాహసాల గురించి వినడం చెడ్డ చావుగా ఉంది. తన యజమాని కాళ్ళనే కరిచే పెంపుడు కుక్కలో ధైర్యసాహసాలేమిటి?"

సిసిరో నిర్దయ చల్లబడలేదు. అతనిలో నిర్దయ నల్లగా కమిలిపోయేటంత కోపంగా మారింది. బానిసలంటే అతనికి ఒళ్ళుమంట. శ్రోతలు తను చెప్పిన విషయం గురించి తను చెప్పినట్లే ఆలోచించేలా చేసేదాకా అతనికి మనశ్శాంతి ఉండదు. తనను వాళ్ళకు గురువుగా చేయగలిగింది అతనిలోని ఆ కోపమే. సగం భయం వల్ల; సగం అతని తర్కానికి ముగ్ధులయి వాళ్ళతన్ని తెల్లబోయి చూసారు.

మాటిమాటికీ గ్లాసులు సారాతో నింపుతూ, పండ్లు మొదలైనవి వారి కందిస్తూ, ఆ బల్ల చుట్టూ తిరుగుతున్నారు బానిసలు. ఆ బానిసలలో మాత్రం ఈ సంభాషణ కాని, సిసిరో యొక్క వాదనాపటిమ కాని ఏ విధమైన సంచలనమూ కలిగించలేదన్న సంగతి గ్రహించాడు కైయస్. విషయలోలుడైన అతనిలో ఏవేవో శరీరవాంఛలు తలలెత్తాయి. వాళ్ళను గురించే ఇంతసేపూ మాట్లాడుకున్నా, ఆ బానిసల ముఖాలలో ఏ విధమైన మార్పుకాని, భావం కాని కనిపించలేదు. ఎంత మందకొడిగా, నిర్జీవంగా, ఆసక్తి లేకుండా వాళ్ళు పని చేస్తున్నారో ఇప్పుడతను తెలుసుకోగలిగాడు. అయితే సిసిరో యథార్థమే చెప్పాడన్న మాట. మాట్లాడగలిగి, నడువగలిగినంత మాత్రాన బానిసలు మనుషులు కాగలరా? ఈ భావం ఎందుకు కలిగిందో కాని దానివల్ల అతనిలో కొంచెం ఉపశమనం కలిగింది.

# 10

అలా తాగుతూ మాట్లాడుతూ, కూచున్నారు వాళ్ళింకా. వాళ్ళ మాటలను వింటూ కూచుంటే పిచ్చెత్తిపోతుందేమో అనుకున్నాడు. కూచోడం శరీరానికీ, మనస్సుకూ కూడా కష్టంగానే ఉంది. ప్రయాణ బడలిక వల్ల ఈ విధంగా ఉందని తనకుతాను సమాధానపరుచు కున్నాడు. భోజనశాల విడిచి వచ్చేసరికి చల్లగాలిలో కాస్సేపు ప్రశాంతంగా కూచుందామ నిపించిందతనికి. వెనుక గుమ్మం దాటి బైట కొచ్చాడు. అక్కడి ప్రదేశమంతా పాలరాతి మయమే. మధ్యలో చలువరాతితో కట్టిన చిన్న చెరువు ఉంది. ఆ చెరువు మధ్యన ఒక జల దేవతా విగ్రహం ఉంది. ఆ విగ్రహం చేతిలో ఒక శంఖం వుంది. ఆ శంఖపు గుల్ల నుండి నీరు పైకి ఎంతో ఎత్తుగా చిమ్ముతోంది. ఆ నీరు చంద్రకాంతిలో మెరుస్తూ నృత్యం చేస్తోందా అనిపిస్తోంది. నల్లని లావాతో చేయబడ్డ పెద్దపెద్ద కుండీలలో మొక్కలు ఉన్నాయి. చంద్రకాంత శిలా వేదికలు నిర్మించబడ్డాయి. ఇంత విపరీతమైన విశేష వస్తు సంపదనూ తన ఇంటి పెరడులో దాచుకోడం ఆంటోనియస్ కైయస్‌కే చెల్లింది.

వృక్షాగ్రాలతో బాటు వంపులు తిరిగిన చంద్రకాంతిని అతనలా చూస్తుండగా అతని ఆలోచనా ప్రవాహానికి ఎవరిదో కంఠస్వరం అడ్డుపడింది.

"కైయస్?"

ఆ సమయంలో అతను ఎవరితోనైనా ఉండటానికి ఇష్టపడును కాని ఈ జూలియాతో మాత్రం ఒక్క క్షణం అక్కడుండటానికి అతను ఇష్టపడడు.

"ఇక్కడికి నే రావడం మంచిదే అయింది కైయస్!"

అర్థం కానట్లు చేతులూపాడు. అదే అతని సమాధానం కూడా. ఆమె అతని వైపుకు దగ్గరగా నడచివచ్చింది. రెండు భుజాల మీదా చేతులేసింది. గోముగా అతని ముఖంలోకి చూసింది.

"కైయస్, నన్ను ఆదరంగా చూద్దూ పుణ్యముంటుంది" అంది.

'ఈమెని ఆదరంగా చూస్తే పుణ్యం ఉంటుందట పుణ్యం!' అనుకున్నాడు కైయస్ తనలో.

"నువ్వు నాకిచ్చే దేమంత పెద్దదికాదు. కష్టమూ కాదు. కాని ఎంత చచ్చినా ఆడదాన్నా? ఆడదాన్నై నేనే ముందుగా అడగడం ఎటువంటిదో ఆ మాత్రం నువ్వు అర్థం చేసు కోలేవా?"

అతనన్నాడు: "జూలియా! నాకు చాలా బడలికగా వుంది. వెళ్ళి పడుకోవాల నుంది."

"బహుశా నే నందుకు తగనేమో" ఆమె గొణిగింది.

"అలా అనుకోకు, జూలియా!"

"మరెలా అనుకోను?"

"నాకు బడలికగా వుంది, అంతే."

"అంతే ఎలాగయింది కైయస్? నీకేసి చూసినప్పుడల్లా, నీ సంగతి ఆలోచిస్తూ ఉంటాను. నన్ను నే నసహ్యించుకొంటుంటాను. నువ్వు ఎంత అందంగా ఉన్నావో అంత ఛండాలంగా....."

అతనామెకు అభ్యంతరం చెప్పలేదు. మనస్సులో ఉన్న అక్కసునంతా కక్కనిస్తే, ఈ గొడవ త్వరగా వదుల్చుకోవచ్చు.

ఆమె చెప్పుకుపోతోంది "అందరికన్న నువ్వేమంత ఛండాలుడివి కాదనుకుంటా. నీ కొక్కడికే చెప్తా. మనందరిలోనూ ఉంది ఛండాలం. మనందరిలోను ఉంది జబ్బు. మనందరి లోనూ ఉంది చావు. మనం చావుతో నిండిన సంచులం. మనం చావునే ప్రేమిస్తాంకదూ, కైయస్. నువ్వు ప్రేమించావా కైయస్. ఆ శిక్షా చిహ్నాలను చూడాలనే కోరికతోనేగా నువ్వా రోడ్డు మీద ప్రయాణం చేసి వచ్చావు. శిక్షట శిక్ష! మనం మృత్యువును ప్రేమిస్తాం కనుకనే, ఆ శిక్షను కూడా ప్రేమించగలిగాం. చల్లని ఈ వెన్నెలలో ఎంత అందంగా ఉన్నావో తెలుసా? ప్రపంచమంతటికీ శిరోభూషణం కాగల నిండు యవ్వనం కల రోమన్ యువకుడవు. ఔనులే! ఒక ముసలిదాని కోసం నీలాటి వాడికి తీరిక ఎక్కడిది? నువ్వెంత చండాలుడివో నేనూ అంతే ఛండాలమైనదాన్నే కైయస్. కాని నేను నిన్నెంతగా అసహ్యించుకుంటానో అంతగానూ ప్రేమిస్తున్నాను. నువ్వు చస్తే బాగుండుననిపిస్తుంది. దౌర్భాగ్యమైన నీ దుర్బల హృదయాన్ని ఎవడైనా కత్తితో కోసి పారేస్తే ఎంత బాగుండును!"

చాలా సేపు నిశ్శబ్దం ఆవరించింది. తొందరలేకుండా తాపీగా అడిగాడు, కైయస్.

"అంతేనా! ఇంకా ఏమైనా ఉందా జూలియా?"

"లేదు లేదు. అయిపోలేదు. ఇంకా ఉంది. నేను కూడా చస్తే బాగుండును."

"నిస్సందేహంగా ఇవి రెండూ తీరే కోరికలే" అన్నాడు కైయస్.

"ఓరి ఛండాలపు..."

"వస్తా జూలియా" కైయస్ తెగేసి అన్నాడు. డాబా వదిలి వెళ్ళాడు. ఏదో ప్రశాంతంగా కాస్సేపు కూచుందామని వస్తే ఇంత గొడవైంది. అత్త ప్రేలాపనలో ఆవంత అర్థం లేదు. చెడ్డ చిరాకు వచ్చింది. ఆమెకే కాని ఏ మాత్రం ఇంగితజ్ఞానం ఉన్నా, ఎంత అసహ్యంగా తను తయారవుతున్నదీ, ఎంత ఛండాలంగా ప్రవర్తిస్తున్నదీ తెలుసుకోగలుగును. జూలియా కి ఇంగిత జ్ఞానం ఉంటేగా? అందుకే ఆంటోనియస్ కైయస్ ఆమెతో వేగలేకపోతున్నాడు.

కైయస్ తన కోసం కేటాయించిన గదిలోకి వెళ్ళాడు. యౌవనంలో ఉన్న ఇద్దరు ఈజిప్షియన్ బానిసలక్కడున్నారు. గదిలో దీపం వెలుగుతోంది. వాళ్ళను పొమ్మన్నాడు. బట్టలు విప్పుకున్నాడు; జరిగిన సంఘటన వల్ల వచ్చిన కోపంతో అతను వణుకుతున్నాడు. మందంగా వాసనవేసే అత్తరువును రాసుకున్నాడు. శరీరం మీద పౌడరు అద్దాడు. పడుకోబోయే టప్పుడు తొడుక్కొనే బట్టలు తొడిగాడు. దీపమార్పి మంచం మీద వాలాడు. చీకటికి బాగా అలవాటుపడ్డాడు. కిటికీలోంచి పడుతున్న తెల్లని చంద్రకాంతిలో అతనికి గదిలోనివన్నీ బాగా కనిపించసాగాయి. గది చల్లగా, హాయిగా ఉంది. చుట్టూ ఉన్న పూలచెట్లూ, అత్తరువూ ఆ గదిని పరిమళంతో ముంచెత్తాయి.

అలా అతను పడుకొని పదినిముషాలైనా కాలేదు కాని, ఆ పదినిముషాలు పది యుగాల్లా అనిపించిందతనికి. అప్పుడు ఎవరో తలుపు మెల్లిగా తట్టారు.

"రావచ్చు" అన్నాడు కైయస్.

క్రాసస్ ప్రవేశించాడు. తలుపుమూసి లోనికి వచ్చాడు. ఆ మహాసేనానిలో ఇంతకు మున్నెప్పుడూ కనిపించనంత పురుషత్వం తొణికిసలాడుతోంది.

## 11

గదిలో పేలికలా పడుతున్న చంద్రకాంతి తన స్థానాన్ని మార్చింది. అసలే బడలికగా ఉన్న కైయస్ మరింత అలసిపోయాడు. ఈ అలసట అతనిలో సంతృప్తి కలిగించింది. ఇంద్రియలోలుడైన కైయస్ సాచుకు పడుకున్న పిల్లిలాగున్నాడు.

"నా కా సిసిరో అంటే అసహ్యం."

క్రాసస్ ఆత్మసంతోషం పొందాడు; మృదువుగా పితృభావంతో కైయస్ నడిగాడు: న్యాయబుద్ధిగల సిసిరోని "నువ్వు ఎందుకు అసహ్యించుకుంటావు, ఎందుకతనంటే నీ కంత అసహ్యం?"

"అతన్నెందు కసహ్యించుకుంటానో నాకే తెలియదు. ఎవరినైనా అసహ్యించుకుంటే

ఎందు కసహ్యించుకోవాలో తెలియాలా? కొందరంటే ఇష్టం. మరికొందరంటే ద్వేషం."

"ఆ శిక్షా చిహ్నాలకు, ఏపియన్ మార్గంలో ఆరువేల పై చిలుకు శిలువలు పాతించడానికి పూర్తిగా కాకపోయినా చాలామటుకు ఇతనే కారకుడనా నీ కతనంటే అంత ద్వేషం?"

"కాదు."

"ఆ శిలువలను చూస్తే నీ కేమనిపించింది?" సేనాని అడిగాడు.

"అప్పుడప్పుడు ఆసక్తిగానే కనిపించాయి. కాని మొత్తం మీద నాకు నచ్చలేదు. ఆడపిల్లలకు నచ్చినట్లుంది."

"ఆహా?"

"రేపు నే నింకోలా అనుకోవచ్చు" చిరునవ్వు నవ్వాడు కైయస్.

"ఏం?"

"ఆ శిలువలను మీరే అక్కడ పెట్టించారు కాబట్టి."

"అబ్బే, నేను కాదు ఆ సిసిరో, మరి కొందరూ పెట్టించారు. పొడిచి చంపినా, శిలువ మీద చంపినా నాకేం పెద్ద తేడా కనిపించదు."

"మొత్తం మీద మీరు స్పార్టకస్‌ని సర్వనాశనం చేసేసారు."

"ఆ ఏముంది?"

"అందుకే నాకు మీరంటే ప్రేమ - వాడిని నే నసహ్యించుకుంటాను."

"స్పార్టకస్‌నా?" అడిగాడు క్రాసస్.

"అవును. స్పార్టకస్‌నే."

"అతను నీకు తెలియదుగా!"

"తెలియకపోతేనేం? అదో పెద్ద విషయం కాదు. సిసిరోని అంతగా అసహ్యించుకోను కాని ఈ స్పార్టకస్ అంటే నాకు చెడ్డమంట. బాగా అసహ్యించుకుంటాను. అతన్ని మీరు పట్టుకుని నా దగ్గరకు తీసుకొచ్చి ఇదుగో కైయస్; వీడ్ని గుండెల్లో పొడిచి చంపు అని అంటేనా!"

"నువ్వెప్పుడూ చూడని స్పార్టకస్‌ని ఎందుకంత అసహ్యించుకోవాలి?"

"నే నతన్ని చూసేననుకోకూడదూ. మీ రెరుగుదురా నేను నాలుగేళ్ళ క్రితం కేపువా వెళ్ళాను. అప్పుడు నాకు ఇరవై ఒక్క ఏళ్ళే. బాగా కుర్రాడిని."

"ఇప్పటికీ నువ్వు కుర్రాడివే" సేనాని చెప్పాడు.

"అబ్బే - అంత కుర్రాడిని కాదు. అప్పుడు మరీని; మొత్తం ఐదారుగురం కలిసి వెళ్ళాం. మేరియస్ బ్రాకస్ నన్ను తనతో కూడా తీసుకెళ్ళాడు." కైయస్ అన్నాడు.

"అవును. నేనూ, మేరియస్ బ్రాకస్, అతని స్నేహితుడొకడు. ఆ స్నేహితుని భార్యా, వాళ్ళిద్దరి పేర్లు నాకు జ్ఞాపకం లేవు. మేం కేపువా వెళ్ళాం. బ్రాకస్ మా కో గమ్మత్తయిన

సర్కస్ చూపిస్తానన్నాడు. అప్పు డది ఇప్పటికంటే చాలా వ్యయంతో కూడిన పని. అటువంటిది చూడాలంటే ఎంతో డబ్బుండాలి. ఐనాసరే బ్రాకస్ ఎంత హుందాగా ప్రవర్తించాడనీ. డబ్బంటే అతనికో లెక్కా!''

"అప్పుడక్కడ లెంటులుస్ బేటియాటస్ అనేవాడి కో మల్లశిక్షణ కేంద్రం ఉండేది కదూ?'' క్రాసస్ ప్రశ్నించాడు.

"ఔను ఉండేది, ఇటలీ కంతటికీ అదే పెద్దదనేవారు. పెద్దదీ, బాగా డబ్బు ఖర్చయేదీ కూడా అదే. అక్కడ ఇద్దరు మల్లుల్ని పోరాడించడానికి ఖర్చయే సొమ్ముతో ఒక ఏనుగును కొనవచ్చునని చెప్పుకునేవారు. ఈ వర్తకంలో ఆ బేటియాటస్ ఓ లక్ష సంపాదించాడంటారు. లక్షొచ్చినా, ఏ మొచ్చినా అతనో పంది. మీ రెరుగుదురా అతన్ని!''

క్రాసస్ తల పంకించేడు. "అతన్ని గురించి చెప్పు; నాకు వినాలని ఉంది. స్పార్టకస్ తిరగబడకముందుగదూ ఇది జరిగింది!''

"స్పార్టకస్ ఇక ఎనిమిది రోజులకు తప్పించుకుపోతాడనగా జరిగిందని జ్ఞాపకం. ఎంతో మంది బానిస స్త్రీల చేత పడుపువృత్తి చేయించేవాడని బేటియాటస్ కో పేరుండేది. ఔను మరి, ఏదో మారుమూల ఏడవాలి కాని నడిబజారులో చేయించడ మేమిటి వాడి మొఖం కాని. దేనికైనా ఓ పద్ధతి అంటూ ఏడిసింది కదా. చేసేదేదో కాస్త సున్నితంగా చెయ్యాలా వద్దా? ఎద్దులాటి మనిషి, లావుగా ఉండేవాడు. నల్లనిజుట్టు, నల్లని పెద్దగడ్డం. అతని బట్ట లెంత మురికిగా ఉన్నాయో.''

"అబ్బ! నీ కెంత జ్ఞాపకం!''

"అంతా జ్ఞాపకమే. బ్రాకస్, నేనూ కలసి వెళ్ళాం. రెండు జతల మల్లులు చచ్చేదాకా పోరాడాలని బ్రాకస్ అన్నాడు. బేటియాటస్ చచ్చేదాకా జరిగే పోరాట ప్రదర్శన ఏర్పాటు చెయ్యమంటే చచ్చినంత వెల కాస్తాడు. కాలక్షేపం కాక రోమ్‌నుంచి వచ్చే డబ్బున్న పెద్దమనుషులు తమకు తోచినట్టల్లా ద్వంద్వయుద్ధ రీతులలో, సాంకేతికంలో మార్పులు తేడానికి ప్రయత్నించడం నా కిష్టం ఉండదంటాడు బేటియాటస్, కాని డబ్బు బ్రాకస్ జేబులో ఉంది. డబ్బే మాట్లాడుతుంది, నిర్ణయిస్తుంది.''

"అల్లాటి వాళ్ళతో డబ్బే మాట్లాడుతుందిలే'' అన్నాడు సేనాని. "వర్తకులంతా అసహ్యించు కోదగ్గవాళ్లే. అందులోనూ ఈ బేటియాటస్ ను వ్వన్నట్లే ఒక పంది. నీకు తెలుసా? వాడికి రోమ్‌లో మూడు పెద్దపెద్ద అద్దెకొంప లున్నాయి. నాలుగోది కూడా ఉండేది. ఒక మంచిరోజు చూసుకుని ఆ కొంప కూలిపోయింది. దాన్లో కాపుర ముంటున్నవాళ్ళల్లో సగం మంది చచ్చిపోయారు. వాడు డబ్బుకోసం ఏమైనా చేస్తాడు.''

"మీకతను తెలుసని నాకు తెలియదు.''

"నే నతనితో మాట్లాడాను; స్పార్టకస్ గురించి అతనికి సముద్రమంత సమాచారం తెలుసు. అసలీ స్పార్టకస్ గురించి తెలిసిన వాడొక్కడేనని నా ఉద్దేశం.''

"చెప్పండి, చెప్పండి."

"అహ! నువ్వు చెబుతున్నావుగా, బహుశా నేను స్పార్టకస్‌ని చూసే నేమోనని!"

"చెబుదురూ" కొంచెం చిరాకుగా అన్నాడు కైయస్.

"బేటియాటస్ గురించి చెప్పమనికదూ నువ్వడిగింది? అదేం పెద్ద విశేషం కాదు. కానీ నువ్వడిగావు కాబట్టి చెబుతా. ఒక ఏడాది క్రితం అనుకుంటా, బానిసలు మనని పట్టుకు చావగొట్టేస్తున్నారు. అందుకే ఈ స్పార్టకస్ ఎవరు? ఇతని స్వరూప స్వభావా లెటువంటివి? అని తెలుసుకునేందుకు ప్రయత్నించాను. శత్రువు అనుపానులు తెలిసిఉంటే వాడ్ని మరో దెబ్బ కొట్టచ్చు...."

వింటున్నంత సేపూ కైయస్ ముఖం నవ్వుతో మెరిసిపడింది. మొత్తం మీద అతనికి తెలియదు స్పార్టకస్‌ను తనెందుకు ద్వేషిస్తున్నాడో. కాని, ఒక్కొక్కప్పుడు అతను ప్రేమలోకన్న ద్వేషంలోనే అమితమైన సంతృప్తి పొందేవాడు.

# రెండవ భాగం

"నాకు సేనాధిపత్యం కట్టబెట్టాక జరిగిన విషయం ఇదీ" అంటూ కైయస్ పక్కన శయనించిన క్రాసస్ చెప్పుకు పోతున్నాడు. "మన సైన్యాల్ని ఆ బానిస వెధవలు చీల్చి చెండాడుతున్న రోజులవి. ఆ వెధవలే ఇటలీకి అధినాధులై కూర్చున్నకాలమది. సిస్-ఆల్పైన్‌గాల్ అనే చోట సైన్యాలతో సహా మకాం వేశాం. నీ బొండాం మిత్రుడు బేటియాటస్‌కు కబురు పంపాను."

బేటియాటస్ ఆ రోజుల్లో కేపువాలో ఖడ్గమల్లుల శిక్షణా కేంద్రం నడుపుతుండేవాడు.

సేనాని క్రాసస్ విడిదికి బేటియాటస్ చేరుకునేటప్పటికి సన్నగా వాన పడుతోంది. ముచ్చటైన స్వంత ఇంటినీ, వెచ్చని కెపువా ఎండనీ విడిచిపెట్టి ఈ సీమకు రావలసి వచ్చినందుకు మహా నొచ్చుకున్నాడు. కనీసం, డోలీలో కూర్చుని వచ్చే సౌకర్యానికైనా తను నోచుకోలేదు. బక్కచిక్కిన ఓ పచ్చ గుర్రం మీద వస్తూ ఆలోచిస్తున్నాడు.

"సేనానులు వ్యవహారాలు నడిపిస్తే నిజాయితీపరులు వాళ్ళాడించినట్లల్లా ఆడాలి. నీ జీవితం నీ ఆధీనంలో ఉండదు. నా వద్ద ఏవో కొద్దిపాటి రాళ్ళున్నాయన్న సంగతి నలుగురికీ తెలుసు. అందుకేగా, నేనంటే అసూయ. కాని నువ్వే ఒక యోధుడవయితే ఎంత డబ్బయినా దగ్గర ఉంచుకోవచ్చునట. నువ్వొక రాజకీయవేత్తవే కనుక అయివుంటే గొప్ప ధనవంతుడ వడానికి కావలసిన అర్హత కలవాడివన్న మాట. ఈ రెండింటిలోను నువ్వేదీకాకుండా నిజాయితీగా డబ్బు సంపాదించుకొనేవాడివే ఐతే ఒక్క నిముషం గుండెల మీద చెయ్యి వేసుకుని విశ్రమించ లేవు. లంచం ఇవ్వకుండా ఇనస్పెక్టరుగాడ్ని తప్పించుకుంటే, రాజకీయవేత్తను తప్పించుకోలేవు కదా. ఈ ఇద్దరి కబంధహస్తాల నుండి తప్పుకున్నా, ట్రిబ్యూన్ తయారు. ఎప్పుడు మేల్కొని చూసినా నిన్ను నిద్రలో ఎవరూ పొడిచి చంపనందుకు నిన్ను నీ వభినందించుకోవల్సిందే. ఈ సేనాని వెధవ ఎవడో ఇటలీ భూభాగంలో సగం మేర న స్నీడ్చుకొస్తున్నాడు. ఏవో ప్రశ్న లడుగుతాడట. నా పేరు క్రాసస్, గ్రాచూస్, సిలేనియస్, మీనియస్ అయి ఉంటే కథ ఈ విధంగా ఉండేది కాదు. దీన్నే రోమన్ న్యాయం, రోమన్ సమానత్వం అనే పదజాలంతో పిలుస్తారు."

సైనిక గుడారాల ఈవలగా కాపలా కాస్తున్న సైనికుడు ఇతని ఆలోచనా ప్రవాహానికి ప్రశ్నార్థకపు అడ్డుకట్ట వేసాడు. ఇద్దరు సైనికులితన్ని సమీపించి, తనిఖీ తతంగం కానిస్తున్నారు. వాళ్ళ చూపుల్లో అనాదరణ. ఆ చూపులు ఆవాహనా తెల్పవు. నిరసనా తెలియచెయ్యవు. అతన్ని పేరడిగారు.

"నన్ను లెంటులుస్ బేటియాటస్ అంటారు."

ఆ సైనికులు అమాయకమైన రైతుబిడ్డలు. కనుకనే ఆ పేరు గుర్తించలేక పోయారు. అత నెక్కడికి పోవాలనుకున్నాడని మాత్రం అడిగారు.

"సేనాధిపతి ఆహ్వానం మీద అతనితో మాట్లాడడానికి వచ్చాను" అని తన వద్ద సేనాని సంతకంతో వున్న అనుజ్ఞాపత్రం చూపించాడు. వాళ్ళది చదవలేరు. ఎవడైనా సరే కాగితం ముక్క పట్టుకొస్తే చాలు, లోపలికి పోగలడు. ఆ రోజులలో వృద్ధిలోనికి వస్తున్న చాలా మందిలాగే బేటియాటస్ కూడా తను చూసిన ప్రతి దాన్నీ అణాపైసలలోకి మార్చిచూసే అలవాటు గలవాడు. అక్కడి రోడ్డు నిర్మాణానికి ఎంతవు తుందా అని ఆశ్చర్యపోయాడు. మకాంలోని సైనికుల కోసం వేసిన తాత్కాలికమైన రోడ్డది. కేపువాలో శిక్షణ కేంద్రం వరకూ వేయించిన రోడ్డుకన్నా చాలా నయం.

అతను సేనాని మకాం సమీపించాడు. ఈ సైన్యాల తాత్కాలిక మకాములు మహా నగరాలను పోలి ఉండేవి. సైన్యాలెక్కడికిపోతే, నాగరికత కూడా అక్కడికి పోయేది. ప్లాన్లలోని గీతలలా అరమైలు వైశాల్యంగల చదరం. దాని చుట్టూ బలిష్టమైన గోడ, పన్నెండడుగల లోతూ, అంతే వెడల్పూ ఉండే కందకం ఉన్నాయి. దాని వెనక పన్నెండడుగుల ఎత్తున్న బరువైన గుంజల పేర్పు ఉంది. కందకానికి అడ్డుగా పెద్ద దర్వాజా ఉంది. ఇతను వెళ్ళగానే ఆ దర్వాజా తెరిచారు. ఇతని రాకని తెలుపుతూ బాకా మోగింది.

అది అతని గౌరవార్థం కాదు. క్రమశిక్షణ; క్రమశిక్షణ కోసమే ఆచరించే క్రమశిక్షణ. ఈ క్రమశిక్షణలో రోమను సైన్యాలు ప్రపంచమంతటిలో అద్వితీయం, అసమానం అని ఎవరైనా అంటే అది అతిశయోక్తి కాదు. దెబ్బలాటలూ, యుద్ధం, రక్తప్రవాహాలూ అంటే అమితమైన ఇష్టం కలవాడే అయినా క్రమశిక్షణ గురించి శిక్షణ కేంద్రాధిపతిగా సర్వమూ తెలిసినవాడే అయినా, ఈ క్రమశిక్షణ మాత్రం అతడిని ముగ్ధుడ్ని చేసి పారేసింది.

జీను మీద మోపిన తన శరీరభారం దులుపుకుంటూ బేటియాటస్ గుర్రం దిగాడు. ఒక ఉద్యోగి వచ్చి అతనెవరో, వచ్చిన పనేమిటో అడిగాడు.

"లెంటులుస్ బేటియాటస్, కేపువావాసిని!"

"ఓహో! అవునవును" అంటూ సాగదీసాడు ఆ యువకుడు. అతని వయస్సు ఇరవై పైబడదు. సెంటు రాసుకుని, అందంగా, చక్కగా తల దువ్వుకుని తయారయే పెద్ద కుటుంబాలకు తగినవాడే ఆ ఉద్యోగి. బెటియాటస్ ఎవరో, అతను దేనికి ప్రాతినిధ్యం వహిస్తాడో, ఇప్పుడిక్కడకు ఎందుకు పిలవబడ్డాడో అతనికి తెలుసు.

"సేనాని మీరొస్తారనే అనుకుంటున్నారు. వచ్చిన వెంటనే తన వద్దకు మీరు రావాలని ఆయన చెప్పారు. తీసుకు వెళ్తా రండి."

"ఏమైనా తినాలనీ, కొంచెం విశ్రాంతి తీసుకోవాలనీ ఉంది."

"సేనాని ఆ ఏర్పాట్లన్నీ చేయిస్తారు. ఆయన చాలా ఆలోచనాపరుడు" అని ఆ యువకుడు చిరునవ్వు నవ్వాడు. ఒక సైనికుడ్ని తట్టి, "వారి గుర్రాన్ని తీసుకెళ్ళి మేతవేసి,

నీళ్ళు పట్టి పడుకోనీ" అన్నాడా ఉద్యోగి.

"ఉదయమెప్పుడో తిన్నది తప్ప ఇంకేం లేదు" అన్నాడు బెటియాటస్. "ఇంత వరకూ ఆగగలిగిన సేనాని నా కోసం మరికాస్సేపు ఆగలేడంటారా?"

కొంచెం కళ్ళు చిట్లించినా గొంతులో ఏ మార్పూ రానీయకుండా "అది వారే చెప్ప గలరు" అన్నాడా యువకుడు.

"మరి గుర్రానికి ముందుగా మేత వేసారుగా!"

ఆ ఉద్యోగస్తుడు మరో చిరునవ్వు నవ్వి, తల ఆడించి "రండి నాతో" అన్నాడు. తానసహ్యించుకుంటూ, ఎందుకూ పనికిరాని వాడనుకున్న కులీనుడైన ఆ యువకోద్యోగిని అనుసరించాడు బేటియాటస్.

శిబిరం ముఖద్వారం వద్ద ఇరువైపులా నిలబడి సైనికులు పహారా కాస్తున్నారు. వీళ్ళ చేతిలో పెద్ద పెద్ద ఖడ్గాలు లేవు. ఈటెలూ, వర్తులాకారమైన డాళ్లనూ, థ్రేషియన్లుపయోగించే వంపు తిరిగిన కత్తుల మాదిరిగా ఉన్న కత్తులనూ వాళ్ళు పట్టుకున్నారు. తెల్లని ఉన్ని వస్త్రాలు ధరించి ఉన్నారు. వర్షం శిరస్త్రాణాలపైబడి ముఖం మీద నుంచి జారి బట్టలను తడుపుతున్నా, నిర్జీవ పదార్థాలపై వర్షం పడితే చలించని విధంగా శిలాప్రతిమలా కదలక మెదలక నిలబడ్డారు సైనికులు. ఎందుకోకాని ఈ దృశ్యం మాత్రం బేటియాటస్ హృదయాన్ని హత్తుకుపోయింది.

వాళ్ళు శిబిరాన్ని సమీపించేసరికి కాపలావాళ్ళు సలాం కొట్టారు. డేరా తెర తొలగించారు. దీపకాంతిలో బేటియాటస్, ఆ ఉద్యోగీ లోపలికి ప్రవేశించారు. శిబిరం ముందు భాగం నలభై అడుగుల పొడవూ, ఇరవై అడుగుల వెడల్పూ ఉంటుంది. దానిలో సామాను బహుకొద్ది: పొడుగాటి ఒక బల్లా, దాని చుట్టూ ఒక డజను మడత కుర్చీలూ ఉన్నాయి. మోచేతులు బల్ల మీద ఆనించి, దానికి ఒక చివర పరచి ఉన్న చిత్రపటాన్ని చూస్తున్నాడొక సైనికోద్యోగి. అతనే మహాసేనాని మార్కస్‌లిసినియస్ క్రాసస్.

వీళ్ళు వెళ్ళగానే సేనాని లేచి నిలబడ్డాడు. వెళ్ళి కరచాలనం చేసాడు. ఇది కూడా బేటియాటస్‌కు బాగా నచ్చింది.

"కేపువా వాస్తవ్యుడు లెంటులుస్ బేటియాటస్ అనుకుంటాను" అన్నాడు సేనాని కరచాలనం చేస్తూ.

బేటియాటస్ ఔనన్నట్లు తల ఊపాడు. ఈ సేనాని మాత్రం నిజంగా సుందర విగ్రహుడు. అందానికి అందమూ ఉంది. మగతనానికి మగతనమూ ఉంది. చూడగానే వీడురా నిజమైన మొనగాడు అనిపించేలా ఉన్నాడు.

"మిమ్మల్ని కలుసుకోగలిగినందుకు చాలా సంతోషిస్తున్నా" అన్నాడు బేటియాటస్.

"మీరు చాలా దూరం నుంచి వ్యయప్రయాసలకోర్చి ప్రయాణం చేసి వచ్చారు. మీరు చాలా అలసిపోయారనీ, ఆకలితో ఉన్నారనీ నాకు తెలుసు."

"నా పరిస్థితి సరిగ్గా అలానే ఉంది. బాగా తడిసాను. విపరీతంగా అలసిపోయాను. పైపెచ్చు చచ్చేటంత ఆకలి ఒకటి. అందుకే నే నీ యువకుడ్ని ఏమైనా తినడానికి వీలుంటుందా అని అడిగాను. ఆయనకు నా కోరిక నిష్కారణమైనదిగా కనబడింది" అన్నాడు బేటియాటస్.

"సైన్యంలో ఏ ఆజ్ఞనయినా సరే, ఎవరైనా సరే, ఏ పరిస్థితిలోనయినా సరే తు.చ. తప్పకుండా పాటించాలి. మీరు రాగానే నా వద్దకు తీసుకురావాల్సిందిగా నే నాజ్ఞాపించాను. ఇప్పుడు మీ ప్రతి కోరికా నేను తీరుస్తా లెండి. ప్రయాసతో కూడిన ప్రయాణంలోని కష్టం నే నెరుగుదును. వెంటనే పొడి బట్టలు తెప్పిస్తా; స్నానం చేయాలని వుందా?"

"స్నానాన్ని ఆపొచ్చు. ఈ కడుపులో ఏదో ఒకటి పడేయ్యాలి." మందహాసంతో ఆ ఉద్యోగి శిబిరం వదిలి వెళ్ళాడు.

# 2

ఉడికించిన కోడిగుడ్లూ, చేపలూ వాళ్ళు తిన్నారు. బేటియాటస్ కోడిమాంసం ఆరగిస్తున్నాడు. పదార్థాలను ద్రాక్షసారాతో తడుపుతూ సుష్టుగా పట్టిస్తున్నాడు. ద్రాక్షసారా, కోడిమాంసం, పాయసం అతని నోటికి అంటుకున్నాయి. క్రాసస్ ఇచ్చిన తెల్లని రుమాలు మీద కూడా పడ్డాయి. చేతులు ఎంగిలయ్యాయి.

క్రాసస్ ఇతడిని పరిశీలిస్తున్నాడు. ఎంతో మంది ఆ కాలపు రోమన్ ఉన్నత వర్గ ప్రజల మాదిరిగానే ఇతడు కూడా ఈ వర్తకజాతిని కావాలని అసహ్యించుకునేవాడు. అందులోనూ మల్లులనూ, సాముగరడీలవాళ్ళనూ తయారు చేసి, అమ్మి, ధనార్జన చేసే ఇతనంటే మరీ అసహ్యం. అమితమైన డబ్బు ఉండి, లావుగా తన ముందు కూచున్న ఇతని వంటి వర్తకజాతి ఇటీవలి ఇరవైయేళ్ళలోనేగా ఒక ఆర్థిక, రాజకీయ శక్తిగా పరిణమించింది. అంటే, ఈ మల్లయుద్ధాలు అక్కడక్కడ, అప్పుడప్పుడు ప్రదర్శింపబడుతూ ఉండేవి. అప్పుడు వీటికి ఇంత ప్రాముఖ్యం లేదు. కాని హఠాత్తుగా ఇదో పిచ్చికింద, వేలం వెర్రి కింద పరిణమించింది. ఎంత చిన్న పట్నంలోనైనా సరే అధమం ఒక కర్రతో కట్టిన మల్ల యుద్ధబరి లేని ఊరంటూ లేదు. దేవాలయం లేని ఊరుంటుందా అన్నట్లే గోదాలేని ఊరుకూడా ఉందా అనే అశ్చర్యం ప్రజల్లో కలుగుతోందంటే ఇవి ఎంతగా వ్యాపించాయో తెలుస్తుంది. ఈ మల్లయుద్ధాలంటే ప్రజల కెంత ఆసక్తి ఉందో చూడాలంటే మారుమూల పల్లెటూళ్ళని చూసినా తెలుస్తుంది. ఒక జెట్టీల జంటతో ప్రారంభమైన ఈ ప్రదర్శన పోరాటాలు వందల, వేల జంటల పోరాట ప్రదర్శనల వరకూ పెరిగి ఒకే జంట నెలల తరబడి అదేపనిగా ప్రదర్శన ఇచ్చేటంత స్థాయికి పెరిగింది. వీటికి అంతు అనేది కనిపించదు.

పెద్ద ఇంటి ఇల్లాళ్ళు మొదలుకొని బజారు రౌడీలదాకా ఒకే వేలంవెర్రి, ఒకే పిచ్చి ఇవంటే. ఈ ప్రదర్శనలూ, ఈ మల్లయుద్ధాలు కొత్త పదజాలాన్ని కూడా సృష్టించాయి. మల్లులను అమ్మడం వల్ల మంచి ధర వచ్చేది. ఇది చూసి ఎన్నో మల్లశిక్షణ కేంద్రాలు

తెరువబడ్డాయి. అలా వచ్చినదే కేపువాలోని లెంటులుస్ బేటియాటస్ యొక్క శిక్షణా కేంద్రం. దేశంలో అన్నిటికన్నా ఇది పెద్దది; లాభసాటియైనది. కొందరమ్మే ఆవులన్నా, గేదలన్నా ప్రజలెంత నమ్మకంతో కొంటారో అలాగే మల్ల యుద్ధ యజమానులు కేపువాలోని బేటియాటస్ శిక్షణ కేంద్రంలో తర్ఫీదు పొందిన మల్లులను ప్రశస్తమయిన సరుకుగా భావించి కొనుక్కొనే వారు. వీధుల్లో తిరుగుతూ, ఎందుకూ కొరగాని వాడనిపించుకున్న బేటియాటస్ ఈ వేలం వెర్రి రాగానే, ఒక్క దెబ్బని ధనవంతుడు కావడమే కాకుండా, ఇటలీలోని మల్లశిక్షకులలో ప్రసిద్ధికెక్కినవాడై యశోధనాన్ని కూడా సంపాదించాడు.

క్రాసస్ ఇతనికేసి పరీక్షగా చూచి 'ఎల్లా తింటున్నాడో!' అనుకున్నాడు. వీళ్ళంతా అంత ధనాన్ని ఎలా ఆర్జించగలరు అన్న విషయం అతనికిగాని, కులీనులైన అతని మిత్రులకు గాని ఎన్నటికీ అర్థంకాదు. తెలివితేటల్లో తనూ, తన స్నేహితులూ బేటియాటస్ కన్న ఏ మాత్రమూ తీసిపోరు. అతని విషయమే చూద్దాం. ఒక సైనికుడుగా తన విలువ నెరిగినవాడు. రోమను సంపద అయిన పరిపూర్ణతా, బ్రహ్మాండమైన పట్టుదలా అతనిలో మంచిపాళ్ళల్లోనే ఉన్నాయి. గ్రీకు చరిత్రకారుల గ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదివి జీర్ణించుకున్నవాడు. విపులంగా, వివరంగా ప్రతి చిన్న విషయానికీ ఎంతో ప్రాధాన్యం ఇచ్చి, ఎంతో జాగ్రత్తగా ఆలోచించి తనకు విశ్వాసం, సంతృప్తి కలిగేదాకా ఏ దాడినీ ప్రారంభించడు. పోనీ ఈ యుద్ధంలో ఇంతకుముందు పాల్గొని అపజయంతో అపఖ్యాతి పాలయిన తన పూర్వపు సైనికాధిపతుల వలె స్పార్టకస్ అంటే నిర్లక్ష్యం చేసేవాడా అంటే అదీ కాదు. అతని శక్తిని తక్కువ అంచనా వెయ్యనేలేదు. ఇదిగో ఈ అతికాయుడి ముందు మాత్రం తనో తక్కువవాడినేమోనని బాధ పడసాగాడెందుకో.

"స్పార్టకస్ గురించి ఇతరులు చెప్పలేని ముఖ్య విషయాలు మీరు చెప్పగలరనే ఉద్దేశంతోనే మిమ్మల్నిక్కడకు ఆహ్వానించాను" అన్నాడు క్రాసస్.

"ముఖ్య విషయాలంటే?" బేటియాటస్ ప్రశ్నించాడు.

"నా శత్రువు యొక్క స్వభావం."

మరింత ద్రాక్షసారా గ్లాసులో పోసుకుంటూ, కళ్లు చిన్నవి చేసి క్రాసస్ వైపు ఓరచూపు చూసాడు బేటియాటస్. చీకటి పడుతోంది. బల్ల మీద రెండు దీపాలు పెట్టి వెళ్ళాడో సైనికుడు.

దీపకాంతిలో బేటియాటస్ మరోలా కనుపించసాగాడు; సంధ్యచీకట్లు అతనికింత వరకూ తన నిజస్వరూపాన్ని బైటపడకుండా తోడ్పడ్డాయి.

తువ్వాలుతో తుడుచుకుంటున్న అతని ముఖం మీద కాంతిపుంజాలు ఇటూ అటూ కదుల్తున్నాయి. అతనిది పెద్ద బొర్రముక్కు; ఆ ముక్కు ఒకమారిటూ ఒకమారటూ, ఆగకుండా కదులుతూనే ఉంటుంది. అతని కళ్ళల్లోంచి అనుమానాస్పదమైన ఒక కాంతి, ఒక చూపు తొంగిచూస్తూ ఉంటుంది. ఏదో అల్లాటప్పా మనిషికింద ఇతన్ని జమకట్టడం తెలివితక్కువ అని క్రాసస్ అనుకున్నాడు.

"మీ శత్రువు గురించి నాకేం తెలుసునంటారు?"

బైట నుంచి బాకా చప్పుడు వినిపించింది. సాయంత్రం కవాతు ముగిసినట్లుంది. బూట్లు తొడిగిన సైనికుల లయబద్ధమైన పదధ్వని స్పష్టంగా వినిపిస్తోంది. భూమి కంపిస్తోందా అనిపిస్తోంది.

"నాకున్న శత్రువల్లా ఒక్కడే. అతనే స్పార్టకస్" క్రాసస్ ప్రతిమాటనూ తూచి జాగ్రత్తగా చెప్పాడు.

రుమాలు ముక్కుకడ్డంపెట్టి చీదాడు అతికాయుడు.

"మీకు స్పార్టకస్ తెలుసు కదా?"

"తెలుసు."

"ఇంకెవరికీ తెలియదు మీకు తప్ప. స్పార్టకస్‌తో ఇంతకు పూర్వం యుద్ధం చేసిన వాళ్ళెవరూ అతన్నెరగరు. బానిసలతో యుద్ధమనుకుని బయలుదేరారు. బాకా ఊది, బాజా బజాయించి, కత్తి ఝళిపిస్తే ఈ బానిస వెధవలు పారిపోతారని వాళ్ళు భ్రమించారు. ఎన్ని మార్లు చావుదెబ్బలు తిన్నా, వీళ్ళ సైన్యాలను బానిసలెన్ని మార్లు చీల్చి చెండాడి తరిమికొట్టినా, బానిసలేమిటి, యుద్ధమేమిటనేగాని సరిగ్గా ఆలోచించలేకపోయారు. అనుకున్నట్లు జరగలేదు. చివర కీ రోజున రోమ్ అటో ఇటో తేల్చి పారెయ్యదలుచుకుంది. అటయితే రోమ్ ఉండబోదు; సర్వనాశం. ఈ విషయం నాకన్న మీకే బాగా తెలుసుననుకుంటాను."

పట్టుతప్పిన పెద్ద ప్రభలా పొట్ట చేతబట్టి, అదే పనిగా నవ్వడం ప్రారంభించాడు విపరీతంగా.

"ఇది మీకు హాస్యంగా తోచిందా?" ఆశ్చర్యపోయిన సేనాని అడిగాడు.

"నిజం ఎప్పుడూ హాస్యంగానే ఉంటుంది."

అవమానం వల్ల కలిగిన కోపాన్ని పైకి రానీయకుండా, ఆ నవ్వు వెలిసేదాకా ఆగాడు క్రాసస్.

"రోమ్ ఉండనే ఉండదు - స్పార్టకస్ ఒక్కడే ఉంటాడు" కడుపు చెక్కలయ్యే నవ్వు అణిగింది. ముసిముసి నవ్వుల్లోకి దిగింది. అతనికేసి చూస్తున్న క్రాసస్‌కి ఇతను తాగి మాట్లాడుతున్నాడా; కాక స్వతహాగా ఆ స్వభావమే అంతా అన్న విషయం అర్థం కాలేదు.

మరో గ్లాసుడు ద్రాక్షాసారా పోసుకున్నాడు బేటియాటస్, దయాభిక్ష వేడుకునే వాడిలా మాట్లాడ్డం ప్రారంభించాడు: "మీరు నన్ను ఉరితియ్యాలే కాని, ఊరికే మేపకూడదు."

"నేనొక కల కన్నాను" తిరిగి పూర్వపు విషయం వైపే సంభాషణను మరల్చుదామనే ఉద్దేశంతో క్రాసస్ అన్నాడు, "ఆ కలలో నేను కళ్ళకు గంతలు కట్టుకుని యుద్ధం చేసాను. నిద్రపోయేదాక మనం ఎదుర్కొనే సమస్యల ప్రతిబింబాలుగా కొన్ని కలలు ఉంటాయి. స్పార్టకస్ గురించి నాకేమీ తెలియదు. అదుగో అతనితో చేసే యుద్ధమే కళ్ళకు గంతలు కట్టుకుని చేసే యుద్ధం. గాల్ ప్రజలు ఎందుకు యుద్ధం చేస్తారో నాకు తెలుసు. అట్లాగే గ్రీకులు, జర్మన్లు, స్పానియర్డుల యుద్ధోన్మాదం నేనెరుగుదును. కాని ఈ బానిసలకు

యుద్ధమేమిటి? నా కర్థం కానిదల్లా ఈ బానిస ప్రకటించిన యుద్ధమే. ఎందుకు వీడికీ యుద్ధం? ప్రపంచంలోని చెత్తనంతటినీ, అల్లరిమూకనంతటినీ, అలగా జనాన్నందరినీ కూడగట్టుకుని మరే ఇతర దేశమూ సృష్టించలేని, గర్వింపదగ్గ అద్భుతమైన రోమన్ సైన్యాన్ని వీడెందుకు నాశనం చెయ్యతలపెట్టాడు. ఐదేళ్ళు అహర్నిశలు అవస్థపడితే ఒక సైనికదళం నిర్మాణమవుతుంది. 'నాకీ దళం తప్ప వేరు ప్రపంచం లేదు. దళమే నేను; నేనే ఈ దళం. దళమే నా జీవిత సర్వస్వం; ఏ ఆజ్ఞనయినా సరే జవదాటక తు.చ. తప్పక శిరసావహించాలి' అని ఒక సైనికుడనుకునే స్థితి తీసుకురావాలంటే ప్రతి రోజూ, రోజుకు పదిగంటలపాటు కఠోర శిక్షణ ఇవ్వాలి. అలా అయిదేళ్ళపాటు ఇచ్చాక, శిఖరం అంచులుదాటి కవాతు చేసు కుంటూపో అనేసరికి మరో ఆలోచన లేకుండా కవాతు చేసుకుపోతారు. అటువంటి బ్రహ్మాండమైన రోమను సైన్యాలను బానిసలు నాశనం చేశారు. ఏమిటిదని తెలుసుకుందుకే, ఈ స్పార్టకస్ గురించి అంతా తెలుసుకుందామనే మిమ్మల్ని కేపువా నుంచి ఇక్కడకు రావలసిందిగా పిలిపించాను. అప్పుడుగాని నా కళ్ళకున్న గంతలు తొలగిపోవు."

ఆలోచనాపూర్వకంగా తల పంకించాడు బేటియాటస్. కొద్దిగా మెత్తబడ్డాడు.

"మొదట అతన్ని గురించి చెప్పండి; ఎలాగుంటాడతను, మీ కెక్కడ తటస్థ పడ్డాడు?" క్రాసస్ అడిగాడు.

"అతను పెద్దమనిషి తరహాగా, చాలా పెద్దమనిషి తరహాగా, విధేయుడుగా కనపడే థ్రేషియన్. ఇంతమటుకతన్ని గురించి చెప్పేది నిజం." బేటియాటస్ ద్రాక్షసారాలో వేలు ముంచి వేలుకొసలతో బల్ల మీద వాయిస్తున్నాడు. "అతనో బ్రహ్మ రాక్షసిలాగుంటాడని కొందరంటారు. కాదు! కానే కాదు! అతనేం రాక్షసుడు కాడు; ఏమంత పొడుగయిన మనిషీ కాడు. నల్లగా ఉంగరాలు తిరిగిన జుట్టూ, గోధుమరంగు కళ్ళూ. అతని ముక్కు ఎప్పుడో పగిలింది. అది ఒకటి మినహాయిస్తే అతనో అందమైన వ్యక్తే అని చెప్పవచ్చు; ఆ పగిలిన ముక్కే అతనికి గొర్రెలా కనిపించే ముఖవైఖరి తెచ్చిపెట్టింది. విశాలమైన ముఖం, మృదువైన స్వభావం ఇవన్నీ చూసేవాళ్ళను మోసగిస్తాయి. అతని నిజవైఖరిని దాచేస్తాయి."

"ఏమీ దాచకుండా అతని గురించి చెప్పాలనే నా కోరిక. లేకపోతే ఇతని గురించి ఉన్నదున్నట్లు తెలుసుకోగలుగుతానా నేను? నాతో చెప్పిన విషయాలు ఇతరులకేమీ తెలియ కుండా రహస్యంగా ఉంచుతానని హామీ ఇస్తున్నాను" క్రాసస్ నెమ్మదిగా మాట్లాడుతున్నాడు. బేటియాటస్ చెప్పిన విషయం ప్రస్తుతానికటుంచి మరో ప్రస్తావన తెచ్చాడు. "అతని పూర్వ చరిత్ర కావాలి. అతన్ని మీరు ఎక్కడ కొన్నారో అతనప్పటి కేంచేసేవాడో అన్నీ చెప్పాలి."

"మల్లుడంటే ఎవరు?" నవ్వుతూ చేతులతో కూడా ప్రశ్నించాడు బేటియాటస్. "వాడు బానిస మాత్రం కాడు. కేపువాలోని మల్లులు మటుకు బానిసలు కారు. వాళ్ళకో ప్రత్యేకత ఉంది. కుక్కలచేత దెబ్బలాడించాలనుకోండి, అందుకు అమ్మాయిలు ఆడుకుందుకు పెంచుకునే కుక్కపిల్లల్ని కొనుక్కుంటారా? అలాగే మనుషుల చేత దెబ్బలాడించాలంటే

సిసలైన మనుషులే కావాలి. వాళ్ళు కోపంతో పళ్ళు పటపటలాడించగలగాలి. ఎదుటివాడిని అసహ్యించుకోగలగాలి. క్రోధపూరితులు కావాలి. అందుకు నా ఏజంట్లకు కోపం కలవాళ్ళను ఏరుకురండిరా అని చెప్తాను. అటువంటి బానిసలు ఇళ్ళల్లో చాకిరీ చెయ్యడానికీ పనికిరారు; అమ్మేద్దామన్నా పనికిరారు!"

"అమ్మెయ్యడానికి ఎందుకు పనికిరారు?"

"మనసు విరిగిన మనిషి మనకెందుకూ! దానికి విరుగుడు కనిపెట్టక పోతే, ఆ మనిషిని అంతం చెయ్యవలసిందే కాని, అతని చేత పని చేయించలేం. కూసే గాడిద మేసే గాడిదను చెరుస్తుంది. వాడు పని చెయ్యడు; మరొకడిని చెయ్యనివ్వడు. అటువంటి అంటురోగం లాంటివాడు."

"అయితే ఎందుకూ పనికిరాడంటారు కదా. అటువంటి వాడు ఎందుకు దెబ్బ లాడతాడు?"

"అదీ! అలా అడగండి. ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోతే మల్లుని చేత పని చేయించుకోవడం కష్టం. మల్లుడు దెబ్బలాడడానికి అసలు ఇష్టపడడు. అయితే ఎందుకు దెబ్బలాడతాడంటారు మీరు. కట్లు విప్పి ఆయుధం చేతిలో పెట్టి క్షణికమయిన స్వాతంత్ర్యం వాడి కిస్తాం కనుకనే వాడు దెబ్బలాడతాడు. ఆ ఆయుధం వాడి చేతిలో ఉన్నంతసేపూ, చేతికి సంకెళ్ళు లేనంత కాలం నేనొక స్వేచ్ఛాజీవినని భ్రమిస్తాడు. వాడి కంతకన్న కావలసిందే ముంది? చేతిలో ఆయుధం, స్వేచ్ఛను గురించి కలగనడం."

"అలాంటివాళ్ళు మీకెక్కడ దొరుకుతారు?" సేనాని ప్రశ్నించాడు.

"గనుల్లో. మీ సైన్యం, కఠోర క్రమశిక్షణ, భీకర సంగ్రామం ఇవన్నీ భూతల స్వర్గంగా, ఉరి స్తంభం పెళ్ళిపీటగా కనిపించేవాళ్ళెవరయినా ఉంటే వాళ్ళు కావాలి నాకు. గనులలోనే అటువంటి వాళ్ళు కనిపిస్తారు నా ఏజంట్లకు. అక్కడే కనిపించాడు స్పార్టకస్. అతనొక 'కోరూ'. 'కోరూ' అంటే ఏమిటో తెలుసా? అదొక ఈజిప్షియన్ మాట అనుకుంటా."

తల పంకించాడు క్రాసస్.

"అంటే మూడుతరాల బానిసన్నమాట! బానిసయొక్క మనుమడు. ఈజిప్ట్ భాషలో ఆ మాటకు ఏహ్యమైన జంతువు అనే అర్థం కూడా ఉంది. ఒక పాకే మృగం. జంతువులే తాకడానికి అసహ్యించుకునే జంతువు."

"అయితే స్పార్టకస్ ఒక 'కోరూ' అన్నమాట. అతను ఈజిప్ట్‌వాడా?"

"థ్రేషియన్. కాని ఈజిప్ట్ నుండి తీసుకొచ్చాం. ఈజిప్ట్ బంగారు వర్తకులు ఏథెన్సు నుండి కొంటారు. 'కోరూ'లనే కొంటారు."

"ఎందుకు?"

"వాళ్ళను గురించి ఒక గాథ వుంది; కొన్ని నమ్మకాలున్నాయి. వాళ్ళే భూమి అడుగున బాగా పనిచేయగలరట."

"ఓహో! అయితే స్పార్టకస్‌ను గ్రీస్‌లో ఎందుకు కొనాల్సి వచ్చింది?"

"నా కతన్ని ఎక్కడ కొన్నారో మాత్రమే తెలుసు. అద్దైనా నేను కొన్నాను కాబట్టి, థెబిస్‌లో."

"నాకు స్పార్టకస్ గురించీ, ఈజిప్ట్ గురించీ చెప్పండి ముందు."

# 3

మతోపన్యాసాలలో, మత గ్రంథాలలో కనబడే నరకం అనబడేదానికి పూర్వం కూడా మనుషులు చూసిన ఒక భూతల నరకం ఉండేది. తన చూసినదే, తయారు చేసినదే రాసే స్వభావం కలవాడు మానవుడు.

జులై మాసంలో భయంకరంగా మండే ఎండల్లో, థెబిస్ నుండి నైల్‌నది ఎగువకు, మొదటి జలపాతం వరకూ వెళితే భూతాలభూమిలో, అడుగు పెట్టినట్లుంది. నది పక్కన ఉన్న ఆకుపచ్చనిచారలు ఎండిపోయి, మాడిపోయాయి. ఆ ఎడారిలోని కొండలూ, గుట్టలూ తెల్లని సన్నని ఇసుకగా మారాయి. ఇక్కడ దాన్ని గాలి స్పృశిస్తుంది. ఇసుక అంత ఎత్తున లేస్తుంది. కబంధ హస్తాల్ని ఎక్కడెక్కడికో చాస్తుంది. వేసవిలో నది నెమ్మదిగా, నీరసంగా ప్రవహిస్తుంది. ఆ నదిలో నీటి మీద తెల్లని పొడి చల్లబడి ఉంటుంది. సర్వమూ అదే. అప్పుడే తాపం అధికమౌతుంది.

అయినా, అక్కడ గాలి అనేదైనా ఉంటుంది కొద్దో గొప్పో. అది దాటితే న్యూబియన్ ఎడారి తూర్పు దక్షిణాలకు వ్యాపించి ఉంటుంది. అక్కడ వాయు ప్రసారం స్తంభిస్తుంది. భూమి చచ్చిపడి ఉంటుంది. గాలి మాత్రం ఉంటుంది, కాని కదలదు. ఎండ దానికి మెరుగు పెడుతుంది. మనిషి శరీరం అక్కడ పనిచెయ్యదు. అక్కడ ప్రతిదీ మామూలుగా కనబడదు. ఏవైనా ఉంటే, వంగి వక్రమై ఉంటాయి. ఎడారి కూడా మారిపోతూ ఉంటుంది.

ఈ ఎడారిలో తాపం, వడగాల్పులు కెరటాలు, కెరటాలుగా వెన్నును చరుస్తూ ఉంటాయి ప్రతి క్షణం. ఎంత వేడిగా ఉండాలో అంత వేడిగానూ ఉంటూ మనిషిని చావకుండా మాత్రం మిగులుస్తుంది. ఉద్వేగమయిన భీషణ ఉష్ణోదధిలో కాలం, వైశాల్యం, సరిహద్దులూ లేక భయపెడుతుంది. నరకమంటే ఏమిటి? ఎక్కడ దీ నరకం? జీవితంలో ప్రతి నిత్యకృత్యం, ప్రతి చిన్నపనీ, భయంకరంగా పరిణమించినచోట నరకం ప్రారంభమౌతుంది. మనిషి భూమిని నరకంగా మార్చడం చూసిన అన్ని తరాలవాళ్లూ ఈ విషయాన్ని గ్రహించారు. ఇప్పుడక్కడ నడవడం కష్టం. భయం వేస్తుంది. గాలి పీల్చడం కష్టం, చూడడం కష్టం, ఆలోచించడం కష్టం.

ఇంతట్లో వింతైన, హడలగొట్టే నల్లని పర్వత శ్రేణులు కనిపిస్తాయి. ఇదే నల్లపర్వత శ్రేణి; ఆ నల్లరాతిలో తెల్లని మెరిసే చారలు, పాలరాతి నరాల వంటి చారలు కనిపిస్తాయి. అబ్బ! ఎంత ప్రకాశవంతంగా ఉందీ పాలరాయి! దివ్యతేజాన్ని వెదజల్లే ఈ చలువరాయి

ఎలా మెరుస్తోందో! అవును; దానికి దివ్యతేజమే ఉంది. స్వర్గంలో మార్గాలన్నీ బంగారమైనవేగా! ఈ తెల్లని పాలరాయి బంగారంతో నిండి ఉంది. అందుకే ఇక్కడకు మానవునిరాక.

ఎడారి మధ్యలోని నల్ల పర్వతశ్రేణిని ఈజిప్షియను వర్తకులు ఎప్పుడో కనిపెట్టారు. ఆ రోజులలో వారికి రాగి, ఇత్తడి పనిముట్లుండేవి. అందుకే ఉపరిభాగంలో మాత్రం చెక్కగలిగి, గోకగలిగే వారు. అలా తరాల తరబడి గోకగా గోకగా బంగారం వచ్చింది. రాతియుగం పోయి ఇనుపయుగం వచ్చింది. ఇనుపగునపాలు, గూటాలు, సుత్తులూ, పద్దెనిమిది పౌన్ల సమ్మెటలూ, ఎన్నో ఇనుప పనిముట్లూ పనిని సులభసాధ్యం చేశాయి.

కాని ఒక కొత్తరకపు మనిషి కావలసి వచ్చాడు. వేడినీ, ధూళినీ, శారీరక వికారాలనూ తట్టుకొని, రాతి లోలోతులలోకి మెలికలు తిరుగుతూపోయే బంగారపునాళాలను తవ్వి తీయగలగడానికి ఇథియోపియా లేదా ఈజిప్ట్ రైతు పనికిరాడు. మామూలు బానిస ఖరీదు హెచ్చు. పైగా ఇక్కడ వేగంగా చస్తాడు. బానిసకు పుట్టి, బానిసలను కని, బానిసలయ్యే పద్ధతికి తట్టుకోగలిగి మొండి కోరూలూ, యుద్ధోన్మాదమహాపిశాచం ఆవహించడంవల్ల మతి పోగొట్టుకున్న సైనికులు మాత్రమే ఇక్కడ ఉపయోగపడతారు. సన్నని, లోతైన నల్లరాతి గోతులలో పనిచేయడానికి పిల్లలు కూడా కావాలి. గోతులు చిన్నవిగా, లోతుగా ఉండటం వల్ల అక్కడ పిల్లలే పని చేయగలరు.

పూర్వపు ఈజిప్టు భూస్వాముల రోజులు పోయాయి. నవాబుల ధనాగారాలలో ధనం క్షీణించింది. అప్పుడా గనులపై బలిష్ఠమైన రోమనుహస్తం పడింది. బానిస వ్యాపారం సాగించే రోమన్లు తిరిగి గని పని ప్రారంభించారు.

మెడకూ మెడకూ ఇనుప గొలుసులు తగిలించిన నూట ఇరవై ఇద్దరు థ్రేషియన్లు మండే ఇనుపగొలుసుల నీడ్చుకుంటూ మొదటి జలపాతం దగ్గర నుంచి ఇంత దూరమూ నడిచి వచ్చారు. ఆ నడిచే వాళ్ళల్లో పన్నెండోవాడు స్పార్టకస్. తక్కిన అందరిలాగానే ఇతను కూడా ఇంచుమించు దిగంబరుడు. అతని చర్మం తోలులా పావంగుళం దళసరెక్కింది. కొంతైనా సౌకర్యాన్ని ఇస్తాయని అతను చిరిగిన చెప్పులు తొడుక్కున్నాడు. ఒక చిన్న గోచీ గుడ్డ, పొడుగాటి అట్టలు కట్టిన జుట్టు; అందరికీ ఉన్నట్లే ఓ గడ్డం.

స్పార్టకస్ అనే ఈ మనిషి ఎలాగున్నాడు? అతని వయస్సు ఇరవైమూడేళ్లు ఉండవచ్చు. ఆ వయస్సు తాలూకు చిన్నెలేవీ అతన్లో కనిపించవు. అతనిలాంటి మనుషులకు అనంతమైన శ్రమ తప్ప వేరేమీ లేదు. ఆ శ్రమకి బాల్యం, యవ్వనం, వార్ధక్యం అనే తేడాలు లేవు. అది నిరంతర శ్రమ. ముఖం, జుట్టు, గడ్డం సమస్తం తెల్లటి ఇసుకపొడితో నిండిపోయి ఉన్నాయి. ఆ ఇసుక వెనక అతని చర్మం భగభగ మండుతోంది. తెల్ల తోలు, పసుపురంగు జుట్టు ఉండే ఉత్తరాదిబానిసలయితే ఆ ఎండవేడికి ఆగలేక అమాంతం చచ్చి ఊరుకుంటారు. స్పార్టకస్ వంటి గోధుమరంగు వాళ్ళు బతకగలరు. ఆ రంగు జీవానుగతమైంది.

గొలుసులు మోసే మనుషులు పొట్టిగా ఉన్నారో, పొడుగ్గా ఉన్నారో చెప్పడం కష్టం.

సంకెళ్ళు తగిల్చిన మనుషులు నిటారుగా నిలబడరు. వంగి నడుస్తారు. వాళ్ళ శరీరాలు ఎండకు బాగా ఎండి, మొరటుబారి ఏమీ నీరు లేనట్లుగా కనిపిస్తాయి.

థ్రేస్ కొండలలో జీవించడమంటే మాటలు కాదు. శతాబ్దాల తరబడి ఏరేసి, చెరిగేసి, దులిపేస్తే ఏది మిగులుతుందో అదే మిగిలిందక్కడ. ఆ మిగిలినవి ఎంత మొండిఘటాలో ప్రాణాన్ని ఎంత గట్టిగా పట్టుకొని వేలాడతాయో అర్థమవుతుంది. ప్రతిరోజూ పిడికెడు గోధుమ గింజలే అతని ఆహారం. బార్లీ, రొట్టె ఉన్నా అది బాగా ఎండిపోయి రాయిలా తయారయి కూచుంది. ఆ ఆహారమే అతని జీవికను నిలబెడుతూ వచ్చింది. అతడి మెడ బలిష్ఠంగానే ఉంటుంది. కాని ఇత్తడి, ఇనుము మొదలయిన లోహాలు స్పృశించే చోట, బరువులు ఆనేచోట కురుపులున్నాయి. అవి రసికారుతున్నాయి. కండలు తిరిగిన భుజాలుండి వాటికి సరిపడేలాగే శరీరం ఉంది. కొంచెం చిన్నదిగా కనిపిస్తుందతని శరీరం. విశాలమైన ముఖం. ఒకప్పుడు మేస్త్రీ ఇనుపఊచతో కొట్టడం వల్ల పగిలి బల్లపరుపుగా కనబడే ముక్కు. కళ్ళకు మధ్య దూరం అవసరమైన దానికన్నా ఎక్కువగా ఉందా అనిపిస్తుంది.

ముఖంలో మృదుత్వం కనిపిస్తుంది. మొత్తం మీద గొర్రెను పోలిన ముఖ వైఖరి. మాసిన గెడ్డంలో, ఆ గెడ్డాన్ని నింపిన ఇసుక వెనుక అతనినోరు పెద్దదిగా, అతనో సూక్ష్మగ్రాహి అని తెలియచేసేదిగా ఉంటుంది. అతను పెదిమలు కదిలిస్తే అతని పలువరుస స్వచ్ఛంగా అందంగా ఉంటుంది. అతనిలో అందమైన విషయమొక్కటే ఉంది. అవి అతని చేతులు; బలంగా, పెద్దవిగా ఉంటాయా చేతులు.

బానిసకొడుకైన బానిసకు పుట్టిన థ్రేషియన్ బానిస స్పార్టకస్ ఆ విధంగా ఉంటాడు. అతని గమ్యస్థానమేమిటో ఎవరెరుగుదురు? అతని గతం అంతా శారీరక శ్రమ, బండ చాకిరీతో గడిచింది. ఆ గతమైనా నానావిధ భాధల ఆగాధంలో, కారుమబ్బులు కప్పి కనువిప్పి చూసినా ఈషణ్మాత్రం కనిపించని కాలగర్భంలో కలిసిపోయింది. అయితే ఇతనే స్పార్టకస్. గతకాలపు మధురస్మృతి లేకపోగా, భవిష్యత్తుని గురించి తీయని కలలు భగవంతు డెరుగు! అసలు ఆలోచించని వ్యక్తి కాడు బానిస స్పార్టకస్. మానవుడు నిష్ఫలంగా శ్రమించడం వినా మరొకటుంటుందని అతనికెప్పుడూ తలపునకు రాలేదు. కొరడా దెబ్బలు తినక్కర్లేకుండా, కొరడా వెన్నంటి తిరగనక్కర్లేకుండా మానవుడు కష్టపడి పనిచేసే రోజొకటుంటుందని అతనెప్పుడూ అనుకోలేదు.

శరీరభారాన్నీడుస్తున్న ఆ వ్యక్తి ఏమనుకుంటున్నాడు? ఏ మాలోచిస్తున్నాడు? మెడలో గొలుసులు తగిలించిన మనిషి పెద్దగా ఆలోచించే విషయాలుండవు. తనెప్పుడు మళ్లీ తింటాడో, తాగుతాడో, కునుకు తీస్తాడో, ఈ విషయాలు తప్ప మరింకేం ఆలోచించడు. స్పార్టకస్‌లో, అతని థ్రేషియన్ సహచరులలో క్లిష్టమైన భావాలు లేవు. వాళ్ళకున్నదల్లా ఒకే ఒక వస్తువు. వాళ్ళు పంచుకున్నదల్లా ఒకే ఒక వస్తువు. అదే ఆ గొలుసు. మనుషులను రాక్షసులుగా తయారుచేసి దేవతలను గురించి ఆలోచించమంటే ఆలోచిస్తారంటావా?

తలఎత్తి చూసాడు స్పార్టకస్. ఎదురుగా నల్లని పర్వతశ్రేణి కనపడింది. బానిసలకు కూడా తెలిసిన భూగోళశాస్త్రమొకటి వుంది. స్పెయిన్ దేశపు వెండిగనులు, ఉత్తరాఫ్రికా ఇనుపగనులు, అరేబియా బంగారుగనులు, గాల్ దేశపు తగరపుగనులు, కాకసస్ కొండల నడుమనున్న రాగిగనుల గురించి బానిసలకు బాగా తెలుసు. వాళ్ళున్న ప్రదేశం కన్నా భయంకరమైనదేదో వాళ్ళకి తెలియడం లేదు. నిజానికి వాళ్ళున్న న్యూబియా నల్లపర్వత ప్రాంతంకన్నా అధమమైనది ప్రపంచంలో ఎక్కడా చూడం.

దానికేసే చూసాడు స్పార్టకస్. తక్కిన వాళ్ళు కూడా చూస్తారు. ఆ బారుబారు క్షణకాలం ఆగుతుంది. బాధల బరువును ఈడ్చుకుపోతున్న వాళ్ళు కష్టాల కదలిక నొక్క క్షణం ఆపుతారు. గోధుమ, నీరు మోసే ఒంటెలు కూడా ఆగుతాయి. మేస్త్రీలు కూడా తమ కొరడాలతో, అంకుశాలతో ఆగుతారు కాస్సేపు. నరకకూపాన్ని పోలిన ఆ నల్లని పర్వతశ్రేణిని అంతా చూస్తారు. అంతలో వీళ్ళకు తెలియకుండానే ప్రయాణం సాగిపోతుంది.

ఆ నల్లని రాళ్ళు ప్రకాశిస్తున్న సూర్యుడినే మింగేసాయి. మరింత నల్లబడి భయంకరంగా రాబోయే దౌర్భాగ్యాన్ని సూచిస్తున్నాయి. ఆ నాటి పని ముగిసింది. భూమిని ఛేదించుకుని, గని గోతులనుండి బైటపడ్డారు అప్పటికే అక్కడ పని చేస్తున్న బానిసలు.

"వాళ్ళెవరు? వాళ్ళెవరు?" స్పార్టకస్ అనుకున్నాడు; ఆలోచించాడు.

తన వెనుకనున్న మనిషి గొణిగాడు : "భగవంతుడా నన్ను రక్షించు."

కాని భగవంతుడిక్కడ ఎవరినీ రక్షించడు. అసలు భగవంతుడిక్కడ ఉండడు. దెయ్యమూ, దేవుడూ చొరలేని ప్రదేశమిది. తనకి కనిపించేది ఎడారిలో నివసించే ఒక రకమైన వింతజాతి కాదని తెలుసుకున్నాడు స్పార్టకస్. తనలాటి మానవమాత్రులే వాళ్ళు. ఒకప్పుడు తనున్నట్లు ఉన్న పిల్లలు కూడా ఉన్నారు వీళ్ళల్లో. కొన్ని సంవత్సరాలుగా రాయిగా ఘనీభవించిన స్పార్టకస్ హృదయం భయంతో, ఆందోళనతో ముడుచుకుపోయింది. తనలో జాలి, కరుణ ఇంకిపోయాయనుకున్నాడతను. కన్నీటి బావులు కనుపించవిక అనుకున్నాడు. కాని నీరు లేనట్లు కనిపించే అతని శరీరంలో కన్నీటి బిందువులకు కొరత లేక పోయింది. తమ ఉనికిని ధృవపరచుకునేందుకు, కనుకొలకుల నుండి జలజలా రాలాయి. వాళ్ళకేసి చూసాడు. కొరడా అతని వెన్నుచరచి కదలిపొమ్మని హెచ్చరిస్తుంది.

ఆ గని గోతులలోనికి వాళ్ళు పాకుతూ, బంగురుకుంటూ పోతారు. పైకి వచ్చేటప్పుడూ అంతే. వాళ్ళు వచ్చినప్పటి నుంచీ స్నానం చేసి ఎరుగరు. ఇకముందు చెయ్యరు. నల్లని ఇసుకా, తెల్లని ఇసుకా కప్పిన శరీరం వాళ్ళది. వాళ్ళ జుట్టు పొడుగ్గా, చిక్కులుపడి అట్టలుకట్టి ఉంటుంది. పిల్లలు కానివాళ్ళకు పెద్ద గడ్డాలున్నాయి. కొందరు నల్లవాళ్ళు; కొందరు తెల్లవాళ్ళు. కాని ఇక్కడ ఎవరూ వీళ్ళు తెలుపు, వాళ్ళు నలుపూ అనే విషయం చూడలేరు. నల్లగా ఉన్నా, తెల్లగా ఉన్నా బానిస బానిసే. మోకాళ్ళ మీద, మోచేతుల మీద చర్మం నల్లబడి చాలా దట్టంగా, అసహ్యంగా ఉంది. వాళ్ళంతా దిగంబరులు. దిగంబరత్వమే చూసి సిగ్గుచేత

తలవంచుకునేటంత దిగంబరులు. బట్టలు వాళ్ళకు ప్రాణంపోసి మరింతకాలం బతికిస్తాయా? ఈ గనుల వల్ల సాధింపబడే ప్రయోజనం ఒక్కటే. రోమన్ యజమానులకు విపరీత లాభాలు ఆర్జించిపెట్టాయా గనులు.

అక్కడి వాళ్ళు ధరించే వస్తువు ఒకటుంది. వాళ్ళు నల్లని రాతిగోతుల నుండి వచ్చేసరికి గొలుసులతో బంధించడానికని ప్రతి ఒక్క బానిస మెడలోనూ ఇనుపదో, ఇత్తడిదో ఒక మెడపట్టీ ఉంటుంది. ప్రతి మెడపట్టీకి మేస్త్రీ ఆ గొలుసు తగిలిస్తాడు. అలా ప్రతి ఇరవై మందినీ ఒక గొలుసుతో బంధించి వాళ్ళ బసకు పంపుతారు. ఇంతకు పూర్వం ఏ ఒక్కడూ న్యూబియన్ ఎడారినుంచి తప్పించుకుపోలేదు. ఇకముందెన్నడూ, ఎవడూ తప్పించుకు పారిపోలేడు. ఒక ఏడాదిపాటు గనులలో పనిచేసేవాడి కింక ప్రపంచమేమిటి? మానవ సమాజ మేమిటి? ఆ గొలుసు ఒక అవసరమే కాదు. ఒక చిహ్నం, ఒక సంకేతం.

మనిషి బానిసగా మారినప్పుడు, తక్కిన తనబోటివాళ్ళను తన మందలోవారే, తన జాతివారే అనుకుంటాడు. స్పార్టకస్ కూడా తన జాతికేసి, తన మందకేసి తెల్లబోయి చూసాడు. "మాట్లాడండి" అతనిలో అతననుకున్నాడు. "ఒకళ్ళతో ఒకళ్ళెందుకు మాట్లాడకూడదో!" వాళ్ళు మాట్లాడరు. మృత్యువులా మౌనంగా ఉంటారు వాళ్ళు. "నవ్వండి" అతనిలో అతనే తర్కించుకుంటాడు. కాని ఎవ్వరూ నవ్వరు.

అవసరమైన పనిముట్లు, సుత్తులు, గునపాలు, పారలు, పలుగులు, ఉలులు వగైరా అన్నీ వాళ్ళు మోసుకుపోతారు. అందులో చాలా మందికి తలచుట్టూ కట్టబడి పనితనం కనిపించని నాటుదీపాలుంటాయి. సాలెపురుగుల్లా సన్నగా ఉన్న ఆ పిల్లలు ఉండి ఉండి తటాలున శరీరాన్ని గుంజి లాక్కుపోతున్నట్లు నడుస్తారు. ఈ పిల్లలు ఎన్నటికీ ఎదగరు. పైగా నానాటికి క్షీణిస్తారు. వాళ్ళిక్కడ రెండేళ్ళ కన్నా ఎక్కువ కాలం పనిచేయలేరు. గనుల గోతులు సన్నగిల్లి మెలికలు తిరిగేచోట్ల వీళ్ళు పనిచెయ్యక తప్పదు. థ్రేషియన్లకు పక్కగా వాళ్లూ గొలుసులాగుతూ పోతున్నారు. కొత్తవాళ్ళ రాక వాళ్ళలో ఆసక్తీ, తెలుసుకుందామన్న పిల్లలకుండే సహజమైన ఆకాంక్ష కలిగించదు. అవి ఎన్నడో నశించాయి. ఎవరు చచ్చినా, ఎవరుపోయినా వాళ్ళకేం లెక్కలేదు. అది నిర్లక్ష్యం మాత్రం కాదు. అది వాళ్ళ కనవసరం.

స్పార్టకస్‌కు తెలుసు; "అనతికాలంలో నాకూ అనవసరమే" తనలో తనే అనుకున్నాడు.

ఆ బానిసలు తినడానికి పోతున్నారు. థ్రేషియన్లు వారి వెంట వెళ్ళారు. నల్లరాతి కొండకు చేర్చి పూర్వమెప్పుడో కట్టిన బారకాసుకు వాళ్ళు వెళ్ళారు. నల్లరాతి పలకలతో కట్టారు దాన్ని. ఆ పలకలు చదునుగాలేవు. ఆ బారకాసు గాలికి, వెలుతురుకు వెలియై ఒక వైపే తెరుచుకుని ఉంది. ఎంత కాలం నుండో తుడవకపోవడం వల్ల చెత్తా, చెదారం అన్నీ ఆ నేలకు తాపడమైపోయాయి. మేస్త్రీ ఎప్పుడూ దీనిలోనికి రాడు; లోపల ఏదైనా గొడవ సంభవిస్తే వాళ్ళకి తిండీ, నీరూ బంద్ చేస్తారు. దాంతో ఆకలికి మాడలేక, దాహానికి ఆగలేక బానిసలు లొంగి ఆ గుహలోంచి బైటకి పాకి వస్తారు. లోపల ఎవరైనా చస్తే తక్కినవాళ్ళా

శవాన్ని మోసుకొస్తారు. ఒక్కొక్కప్పుడాచీకటిగా ఉండే బారకాసు లోపల ఎక్కడో ఎవరైనా చచ్చినా శవం కుళ్ళి దుర్గంధం ముక్కులు బద్దలు కొట్టేవరకూ వాళ్ళకు తెలియనే తెలియదు. అటువంటి దౌర్భాగ్య ప్రదేశమా బారకాసు.

లోనికి పోయేటప్పుడు మాత్రమే బానిసలకు గొలుసులుండవు. లోపలికి వెళ్ళే ముందే వాళ్ళకి తినడానికి కొక కర్ర గిన్నె, తోలు సంచిలో ఒక శేరు నీళ్ళు ఇస్తారు. అదే వాళ్ళకొక రోజు రేషను; నాలుగు శేర్ల నీళ్లు కూడా అటువంటి మండుటెడారిలో నాలిక తడపడానికైనా చాలవు. ఆ విధంగా బానిసల శరీరాలు నీరులేక ఎండిపోయేవి. త్వరగా వాళ్ళకు మూత్రకోశం చెడేది. బాధవల్ల వాళ్ళు పని చేయలేకపోతే, చావమని ఎడారిలోకి తోలేస్తారు. చంపడానికదో మార్గం.

ఇవన్నీ స్పార్టకస్‌కి తెలుసు. బానిసల గురించి అతనికి బాగా తెలుసు. అతనిది బానిసజాతి; ఆ జాతిలోనే పుట్టి, పెరిగి, పెద్దవాడౌతున్నాడతను. బానిసత్వంలోని మూల రహస్యాన్నెరుగునతను. అదొక వాంఛ - ఆనందం కోసం కాదు, సౌఖ్యం గురించి కాదు. రుచికరమైన ఆహార విషయమై కాదు, గానసుధను ఆలకిద్దామని కాదు; సంతోషం కోసం ప్రాకులాడేదికాదు, ప్రేమను గురించి పాకులాడేదికాదు, స్త్రీలు, సారా వీటివేటిని గురించీ కాదు. కష్టసహిష్ణుత అలవర్చుకొని ఎలాగో ఒకలాగ జీవించడం. చావకుండా బతికిఉందామనే ఈ వాంఛ ఎందుకో అతనెరుగడు. దీనికో కారణమూలేదు. అర్థమూ లేదు.

తను చావకూడదు. అందుకే అతను అలవాటుపడుతూ, అవసరమైనట్లు సాగుతూ, పరిస్థితులకు దాసుడౌతూ, వాతావరణానికి అనుకూలంగా మారుతూ, అదే సమయంలో ఇదంతా గ్రహిస్తూ జీవిస్తున్నాడు. ఎలా పడితే అలా జారగల, వంగగల, సాగగల స్వభావ మతనిది. గొలుసు మెడను చుట్టుకుని లేనప్పుడు సంపాదించిన స్వేచ్ఛ నతడు జాగ్రత్తగా భద్రపరుస్తాడు. కాని సముద్రాలను దాటి, నైల్ మహానదిని దాటి, ఈ ఎడారిలో తనూ, తన సహచరులూ ఈ గొలుసును ఎంతదూరం మోసుకొచ్చారో! వారాల తరబడి అదే గొలుసు. ఇప్పుడే అతనికి కొంచెం స్వేచ్ఛ. ఆ స్వేచ్ఛా సమయంలో సంపాదించిన శక్తిని మాత్రం వృథా చెయ్యకూడదు. ఎన్నో వారాలు లభించనంత నీటిని ఒక్క గుక్కలో తాగడు. గంటల తరబడి ప్రతి నీటి చుక్కనూ తాగుతాడు. తన శరీరంలోని ప్రతి కణంలోకి, ప్రతి అణువులోకి ఆ నీరు పోవాలని అతను భావించినట్లుంది. అతనాహారం తీసుకుంటాడు. గోధుమ, ఎండిన మిడతలు వేసిన బార్లీ పులుసు. ఇదీ అతని ఆహారం. ఎండిన మిడతలు శక్తినిస్తాయి. గోధుమ, బార్లీ అతని కండరాలు. అంతకన్న చెత్త కూడా తిని బతికాడతను. అన్నం పరబ్రహ్మస్వరూపం; ఆహారాన్ని గౌరవించాలి; పూజించాలి. ఆ పరబ్రహ్మ స్వరూపాన్ని దూషించినవాడికి, అస హ్యించుకొన్నవాడికి, ఆ తిండికూడా దొరకదు. అదీ లభ్యం కాకపోతే మరణం తథ్యం. తమస్సు బారకాసై, ముఖద్వారం ఆ తమస్సుకి నోరై తెరుచుకుకూచుంది. ఆ బారకాసు చీకటిలోనికి అతను వెళుతున్నాడు. దుర్గంధతరంగం అతని నాసికారంధ్రాన్ని ఛేదించుకు

పోయి మతి చెడగొడుతుంది. వాసనవల్ల ఎవడైనా చస్తాడా? వాసన భరించలేక వాంతి చేసుకునే వాడు ఉట్టి వెర్రి వెధవయి ఉండాలి. అతని కడుపులోని ఒక్క తులం ఆహారం కూడా ఆ విధంగా బైటికి పోనివ్వడం అతనికేమాత్రం ఇష్టం లేదు. దుర్గంధంతో ద్వంద్వయుద్ధం చెయ్య దలచుకో లేదతను. అటువంటి వాటికి ఎదురు తిరిగి సాధించే ప్రయోజనం శూన్యం. దానికి బదులు అతను దుర్గంధాన్ని ఆహ్వానిస్తాడు; కౌగలించుకుంటాడు. శరీరం అంతటా ప్రవేశించ మంటాడు. దాంతో దాని క్రౌర్యం చస్తుంది.

చీకట్లో నడుస్తున్నప్పుడు అతని కాళ్ళే అతన్ని తీసుకుపోతాయి. ఆ కాళ్ళే అతని కళ్ళు. అతను పడకూడదు, తూలకూడదు. తూలినా, పడినా రెండు చేతులలో ఉన్న నీరో, ఆహారమో పడిపోతుంది. రాతిగోడ దాకా పోయి అక్కడ దానికి జేర్లపడి కూచుంటాడు. ఇక్కడే అన్యాయం ఒక మెట్టు దిగింది. అతను జార్లబడ్డ రాయికి అతనంటే ఎంతో జాలి; చల్లగా ఉంది. తింటున్నాడు. మధ్యమధ్యన జాగ్రత్తగా తాగుతున్నాడు. అతని చుట్టూ కదలిక ఉంది. ఉచ్ఛ్వాస్వ నిశ్వాసలు వినిపిస్తున్నాయి. జాగ్రత్తగా వింటే వాళ్ళ హృదయాల స్పందన కూడా వినొచ్చునేమో. తనలాగే తింటున్న పిల్లలు, పెద్దలు నమిలేటప్పుడు దవడలు చేసే చప్పుడు వినిపిస్తోంది. ఆఖరు ముద్ద అతి జాగ్రత్తగా తింటున్నాడతను. ఆఖరు చుక్క నీటిని ఆప్యాయంగా తాగాడు. కర్రగిన్నె నాకి మరీ తింటున్నాడు. ఆకలి అతన్ని నాశనం చెయ్యలేదు. ఆహారమే బతుకు; ఆహారంలోని ప్రతి అణువూ అతని ప్రాణం.

అందరూ తిన్నారు. కొందరు చాలనందుకు నిరాశ చెందారు. మరికొందరు సంతుష్టి చెందారు. మూలుగులూ, కన్నీళ్లూ, నిట్టూర్పులూ అక్కడ ఉండనే ఉన్నాయి. ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్నారు; మూల్గుతున్నారు. గట్టిగా, మరీగట్టిగా, చీకటిని కోసుకుని చెవులబడు తోందా ఏడుపు. కొంచెం మాట్లాడుకుంటున్నారు కూడా; ఎవరో ఆక్రోశిస్తున్న గొంతుతో అడుగుతున్నారు:

"స్పార్టకస్ - ఎక్కడున్నావు నువ్వు?"

"ఇక్కడా, ఇక్కడున్నానోయ్ థ్రేషియన్" అన్నాడతను.

"ఇక్కడున్నావా థ్రేషియన్" మరో గొంతు అడిగింది. 'థ్రేషియన్' 'థ్రేషియన్' ఎన్నో గొంతులన్నాయి. అక్కడున్న మనుషు లతని చుట్టూ చేరతారు. తక్కిన బానిసలు కూడా వింటూ ఉండొచ్చు. మొత్తం మీద అక్కడ నిశ్శబ్దం వినిపిస్తోందిప్పుడు. నరకంలోకి కొత్తగా వచ్చిన వాళ్ళంతేనేమో, తమ కన్న ముందుగా ఇక్కడకు వచ్చిన వాళ్ళప్పుడే ఈ ఎడారి సౌఖ్యాన్ని అనుభవించేస్తున్నారు. జీవితం ఎడారిలోనే ప్రారంభమైందని వాళ్ళనుకుంటారు. అలా అనుకుంటేనే నయం. కాని ఎడారికి బానిసలుగా రాక పూర్వం తమ జీవిత స్మృతులను జ్ఞప్తికి తెచ్చుకొని నెమరువేసుకుంటే ఎంత విషాదకరంగా ఉంటుంది. ప్రస్తుత జీవిత విధానం ఎంత బాధావహంగా, భయావహంగా ఉంటుంది. అందుకే వాళ్ళు స్మృతులంటే భయపడ తారు. పాత వాళ్ళు దేనికి భయపడతారో అదే ఈ కొత్తగా వచ్చినవాళ్ళు చేస్తూ కూచున్నారేమో.

తమ జీవితాలలోని స్మృతులను పునశ్చరణ చేసుకుంటున్నారేమో. కొందరికి థ్రేస్, అక్కడి పర్వత శిఖరాలూ, చల్లదనమూ, ఆకుపచ్చని దేవదారు అడవులూ, వాటిలో ప్రవహించే సెలయేళ్ళూ, ఆనందంతో హాయిగా ఆ రాళ్ళల్లో తిరుగుతూ మేస్తూ ఉండే మేకలూ జ్ఞప్తికి వస్తే రావచ్చు. నల్లరాతి గుండెలలో బస చేసే మనుషుల హృదయాలలో ఏముంటుందో, ఏ ఏ స్మృతులూయెల లూగుతాయో ఎవరెరుగుదురు?

అతన్ని వాళ్ళు 'థ్రేషియన్' అని పిలుస్తారు. వాళ్ళందరూ అతని చుట్టూ అన్ని వైపులా కూచుని ఉన్నారు. చేత్తో తడుముతా డతను. ఒకరి ముఖం తగులుతుంది. అన్నీ కన్నీళ్ళే. అరె! కన్నీళ్ళు శుష్కదండుగ.

"మన మెక్కడున్నాం స్పార్టకస్! మన మెక్కడున్నాం?" ఒకడు గుసగుసలాడాడు.

"మనం ఎక్కడికి పోలేదు? ఇక్కడికి ఎలాగొచ్చామో జ్ఞాపకముందీ?"

"ఐనా మన నెవరు జ్ఞాపకముంచుకుంటారు?"

"మనం ఎక్కడికీ పోలేదు" అని తిరిగి అదే మాటంటాడతను.

"మన నెవరు జ్ఞాపకముంచుకుంటారులే!"

ఆ మాదిరిగా మాట్లాడడం కష్టమే. అతను వాళ్ళకు తండ్రిలాగున్నాడు. పూర్వపు తెగల సాంప్రదాయమది. రెట్టింపు వయసున్న వాళ్ళయినా సరే తాము గౌరవించే వ్యక్తిని 'నాయనా' అనీ, 'తండ్రీ' అనీ సంభోదిస్తారు. ఆ సాంప్రదాయం ప్రకారమే అతను వాళ్ళకు తండ్రి. వాళ్ళంతా థ్రేషియన్లే; కాని అతన్నే 'థ్రేషియన్' అంటారు. అందుకే అతను మృదువుగా పాడతాడు, పిల్లలకు కథ చెప్పే తండ్రిలా.

తన పాటతో వాళ్ళను ముగ్ధులను చేసాడతను. వాళ్ళ దైన్యాన్ని కాస్సేపు వేరే ఉంచుతాడు. ఈ అంతులేని చీకట్లోనుంచి వాళ్ళను కాపాడతాడితను, ట్రాయ్‌లో ముత్యాలారబోసిన సముద్రతీరానికి తీసుకుపోతాడు వాళ్ళని - అవిగో ఆ తెల్లని గోపురాలు, ఆ మృదువైన గీతం ఎక్కడికో అంతరిక్షమార్గంలోకి పోతూ ఇంతలోనే కిందికి దిగుతూ భయాందోళన అనే కట్లు విప్పుతోంది. ఆ చీకట్లో కూడా చలనం కనిపిస్తోంది. బానిసలందరికీ గ్రీకు భాష రాదు. అదీకాక థ్రేషియన్ భాషకూ, అటిక్ భాషకూ తేడా ఉంది. పరీక్షా సమయాలలో ఉత్తేజం కల్గించడానికని పూర్వమెప్పుడో ఒకజాతి తన విజ్ఞానాన్నంతటినీ ఒక భద్రగీతిగా రచించి జాగ్రత్తపెట్టినట్లుందా గీతం. దాన్ని మాత్రం వాళ్ళు భాషలతో సంబంధం లేకుండా అర్థం చేసుకోగలరు. అది సకల భాషాతీతమైన మహోత్కృష్ట భావమేమో మరి.

కొంతసేపటికి స్పార్టకస్ నిద్రపోతాడు. నిద్రలేమిని ఎప్పుడో జయించాడతను. చిన్ననాటి సంఘటనల స్మృతిపథంలో విహరిస్తున్నాడు. చల్లని ప్రశాంతమైన, ప్రకాశవంతమైన నీలిమాకాశం కావాలతనికి. చల్లగా మెల్లగా వీచే మలయమారుతం కావాలతనికి. అవన్నీ అక్కడ లభ్యమవుతాయి. మేకలను కాస్తూ దేవదారు అడవిలో వృద్ధుని పక్క అతను పడుకున్నాడు. ముదుసలి అతనికి చదువు నేర్పుతున్నాడు. ప్రతి అక్షరాన్నీ ఇసుకలో తన

చేతి కర్రతో రాసి చూపిస్తున్నాడు. "చదువుకో, నా బంగారుబాబూ" వృద్ధుడంటున్నాడు. "చదివితే బానిసలైన మనం కూడా ఒక ఆయుధాన్ని దగ్గర ఉంచుకోగలం, అదే లేని రోజున అడవులలో పశువులలా మన బతుకు వృధా. అనగా అనగా ఎన్నో రోజుల క్రితం మంచి రోజులుండేవి. దాన్ని స్వర్ణయుగం అనేవారు. ఆ యుగంలో భగవంతుడూహించిన ఊహలను, ఆలోచనలను జ్ఞప్తికి తెచ్చుకుని రాయగలిగి, చదవగలిగి ఉంటారనే ఉద్దేశంతోనే నిప్పు నుపయోగించగల శక్తి నిచ్చిన భగవంతుడే మానవునకు రాయగల శక్తిని కూడా ప్రసాదించాడు. ఆ రోజుల్లోనే మనుషులు దేవునికి దగ్గరగా ఉండి అతనితో ముఖాముఖి మాట్లాడగలిగి ఉండేవారు. అప్పుడు బానిసలు లేరు. అలాంటి రోజు తిరిగి వస్తుంది."

ఆ విధంగా స్పార్టకస్ జ్ఞాపకం చేసుకుంటున్నాడు. అతని స్మృతిపథ విహారం కలగా మారుతుంది. నిద్రాదేవత ఒడిలో నిద్రిస్తాడు.

ఉదయాన్నే ఒక పెద్ద శబ్దం అతన్ని నిద్రనుండి లేపుతుంది. బారకాసు ముఖ ద్వారం వద్ద నగారా మోగిస్తారు. ఆ శబ్దం కొండల మధ్య ప్రతిధ్వనిస్తుంది. అతను లేస్తాడు, అక్కడున్న తోటి బానిసలంతా లేస్తారు. చీకటిని నెట్టుకుంటూ గుమ్మం దగ్గరకు చేరతారు. కర్రగిన్నె, నీటిసంచీ కూడా పట్టుకుపోతాడు స్పార్టకస్. అవి కూడా లేకపోతే ఆ రోజుకు తిండి లేక తిప్పలు మిగులుతాయి. బానిసత్వంలో ఉండే చిన్న చిన్న మార్పులు అతను గ్రహించలేని వాడు కాదు. బానిసల పద్ధతులలో బాగా ఆరితేరినవాడు. కదులుతూ తన చుట్టూ కదులుతున్న వాళ్ళ శరీరాల కదలిక గుర్తిస్తాడు. అతని ప్రసక్తి లేకుండానే అతని శరీరం చుట్టూ ఉన్న కదలికతో పాటు కలిసి కదిలింది.

ఎప్పుడూ ఉండనంత చల్లగా ఉంది ఎడారి. ఇంకో గంటకు కాని సూర్యోదయం కాదు. ఈ కాస్సేపూ ఎడారి మనతో స్నేహంగా ఉంటుంది. ఆ నల్లని బండరాళ్ళు కూడా చల్లని గాలిని పీలుస్తున్నాయా అనిపిస్తుంది. ఏమో, అవి కూడా ఆనందిస్తున్నాయేమో! అందమైన నక్షత్రాలు ఒక్కొక్కటే తమ పని ముగిసిందన్నట్టు మెల్లమెల్లగా జారుకుంటున్నాయి. ఆకాశం నీలంగా స్వచ్ఛంగా ఉంది. ఎడారిలోని బంగారపు గనులలో పనిచేస్తున్న బానిసలకు కూడా ప్రకృతి ప్రాతఃకాల ఉపశమనాన్ని అందిస్తుంది. మధురాతిమధురమైన భావాలు వాళ్ళ హృదయాలలో మెదిలి వాళ్ళ ఆశలను పునరుద్ధరిస్తాయి.

రొట్టెలు తింటూ, నీళ్ళు తాగుతూ మేస్త్రీలు ఒక వైపు గుమిగూడి ఉన్నారు. బానిసలకు మాత్రం మరో నాలుగు గంటల దాకా ఏమీ ఇవ్వరు. ఉన్నివస్త్రాలు కప్పుకొన్న మేస్త్రీ ఒక బరువైన కర్ర ఒక కొరడా పట్టుకొని ఉంటాడు. ఒక నిడుపాటి కత్తి అతని మొలలో వేలాడు తుంది. వీళ్ళెవరు? ఈ మేస్త్రీ జాతికి చెందిన వీళ్ళెవరో? స్త్రీలు లేని ఈ భయంకరమైన ఎడారిలోకి వచ్చి తమ కాలాన్ని వృధా చేసుకుంటారెందుకు?

వాళ్ళది అలెగ్జాండ్రియా. మొరటు బారిన బండమనుషులు వాళ్ళు. స్వభావం అతి తీక్షణమైనది. హెచ్చుజీతాలు గిట్టే అవకాశం ఉంది కనుకా, బంగారంలో కొంత భాగం

వాళ్ళకు ఇస్తారు కనుక వాళ్ళిక్కడకు వస్తారు. వాళ్ళు కూడా జీవితాన్ని గురించీ, భవిష్యత్తు గురించీ కలలు కనేవాళ్ళే. ఈ గనుల సంస్థలో అయిదేళ్ళు కష్టపడితే, తక్కిన జీవితశేషాన్ని కులాసాగా, నిర్విచారంగా ధనవంతులుగా గడపవచ్చునని వాళ్ళ ఆశ. వాళ్లు భవిష్యత్తులో జీవించే ఆశాజీవులు. రోమ్ నగరంలో ఒక సుందర భవనాన్ని అద్దెకు తీసుకొని, అనుభవించడానికీ, వంటకూ అయిదారుగురు బానిసయువతులను కొనుక్కొని, స్నానశాలలో, ఆటపాటలలో కాలాన్ని వెళ్ళబుచ్చుతూ, ప్రతినిత్యం తాగగలిగినంత తాగి, ఆడగలిగినన్ని తందనాలాడవచ్చని వాళ్ళ ఆశ. రోమన్ పౌరసత్వం కూడా లభిస్తుంది అనే ఆశ వాళ్ళ నీ ఎడారిలో కలలు కనేలా చేస్తుంది. ఈ ఎడారి నరకరూపంలో ఎంత లోతుగా దిగబడితే ఆ రోమన్ భూతల స్వర్గానికి అంత బలమైన పునాది వేసి ఎంతో ఎత్తుగా నిర్మించుకోలేమా అని వారి ఉద్దేశం. వారి భవిష్యజ్జీవితం ఎలాగున్నా, ప్రస్తుతం వాళ్ళు జైలరు పని చెయ్యాలి.

గ్రీక్, అరబిక్ భాషలు కలగాపులగం చేసి మాట్లాడే గమ్మత్తయిన, తమాషా అయిన మనుషులు వాళ్ళు. గ్రీషియన్లు ఈజిప్టునెప్పుడో రెండున్నర శతాబ్దాల వెనుక జయించారు. వీళ్లు ఈజిప్షియన్లూ కాక, గ్రీషియన్లూ కాక అలెగ్జాంౡ్రియనులుగా చెలామణీ అవుతున్నారు. దీన్ని బట్టి వాళ్లు దుర్నీతిలో ఆరితేరినవారనీ, మానవద్వేషులనీ తేటతెల్లమౌతోంది. వాళ్ల సంకరజాతి దానికి ప్రధానకారణం. దైవానికిగాని, దెయ్యానికిగాని భయపడరువాళ్లు.

ఆ ప్రాతఃకాలపు చల్లని ఘడియలలో గొలుసులు మోసే బానిసలు పర్వతశ్రేణివైపు పోతూ ఉండేటప్పుడు, స్పార్టకస్ ఈ మేస్త్రీలనే పరకాయించి చూస్తున్నాడు. వీళ్లు తన యజమానులు. వీళ్ళే తన చావుబతుకులను నిర్ధారణ చేసే పెద్దమనుషులు. అందుకే వాళ్ళ అలవాట్లూ, ప్రవర్తనా పద్ధతులూ, ఒకరికీ, మరొకరికీ మధ్యగల తేడాలు జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. గనులలో మంచి యజమాని అనేవాడుండడు. కాని ఇతరచోట్ల ఇంతకన్న దుర్మార్గులుండకపోవచ్చు. బానిసల నదలిస్తూ, తీసుకుపోతున్న వాళ్ళను మరీ దీక్షగా చూస్తున్నాడు. ఇంకా బాగా పొద్దు తిరగకపోవడం వల్ల వాళ్ళ రకరకాల ముఖకవళికలు, వైఖరులూ స్పష్టంగా కనిపించకపోయినా పరిశీలన బాగా చేతయినవాడు కాబట్టి, వాళ్ళ నడకనుబట్టీ, నిలబడే పద్ధతిని బట్టీ వాళ్ళ మనోగతభావాలను తెలుసుకోగలిగాడు.

చల్లగా ఉంది. బానిసలు దిగంబరులుగా ఉన్నారు. పురుషావయవాలను కప్పగల గోచీగుడ్డ కూడా వాళ్ళకు లేదు. వణుకుతూ, చేతులతో శరీరాన్ని కప్పుకుంటూ అక్కడ నిలబడ్డారు బానిసలు. పేదవాడి కోపం పెదవికి చేటు. అలాగే బానిసకోపం కూడా. స్పార్టకస్‌లో కొద్దికొద్దిగా కోపం అలుముకుంటోంది. "ఏదైనా సహించవచ్చునేమో కాని దీన్ని సహించలేం. పురుషావయవమైనా కప్పుకోడానికి గోచిపాత లేని వాడు జంతువా? మనిషా?" అనుకున్నాడు. "కాదు. మనుషులం కానేకాదు. జంతువులమూ కాదు. అంతకాన్న హేయమైన ఏదో వేరే జాతి. రోమన్లు మా దేశాన్ని ఆక్రమించినప్పుడు మేం కష్టపడి పనిచేసే తోటలు హస్తగతం చేసుకున్నప్పుడు, ఈ గని పనికని మమ్మల్ని తీసుకొచ్చారే కాని, జంతువులను తీసుకురాలేదు.

అవి అక్కడే ఉన్నాయి. అందుకే అవి మాకన్న నయం."

ఢంకా శబ్దం ఆగింది. కొరడా విసిరిన కొసగాలుల సంగీతం తప్ప మరింకేమీ వినం. గాలిలో పైకెత్తి ఉంచారు కొరడాలు. అప్పుడే వాటికి మాంసాన్ని చూపడం ప్రారంభించడం వాళ్ళకూ ఇష్టం లేదా అనిపిస్తుంది. ఇప్పుడు ఆకాశం మరింత తేజోవంతమైంది. భూగర్భంలోకి దిగిపోయి పాలరాతి పెచ్చులనూడతీస్తున్న వణికే పిల్లలను చూసాడు స్పార్టకస్. తక్కిన థ్రేషియన్లూ చూసారు. అందులో ఒకడితని చెవి పక్కన జేరి గుసగుసలాడాడు.

"నాయనా! నాయనా! ఎంతటి నరకమయ్యా ఇది?"

"అంతా బాగుపడుతుంది" స్పార్టకస్ సమాధానం చెప్పాడు. తనకన్న వయస్సులో రెండింతలు పెద్దగా ఉన్నవాళ్ళు తనను నాయనా అని అప్యాయంగా పిలిచి, ఆదరంగా మాట్లాడినప్పుడు అందులోనూ వాళ్ళను విచారం పట్టి కుంగతీస్తున్నప్పుడు ఏం చెబుతా డతను? అతను చెప్పవలసినదేదో చెప్పాడు.

అన్ని గ్యాంగులూ పర్వత శ్రేణివైపు పోతాయి పనిలోకి. గుంపుగా నిలబడ్డ థ్రేషియన్లు, ఆరుగురు మేస్త్రీలు మాత్రం వెనక ఉండిపోయారు. కొరడాలను ఇసుకలో ఈడుస్తూ క్రొత్తగా వచ్చిన ఈ థ్రేషియన్లను సమీపించారు మేస్త్రీలు. మేస్త్రీ ఒకడు వాళ్ళను ప్రశ్నించాడు:
"థ్రేషియన్లూ, మీ నాయకు డెవడు?"

సమాధానం లేదు.

"కొరడా ఇంకా నిద్రలేవలేదు. ఇంత త్వరగా దాన్ని నిద్రలేపమంటారా?"

స్పార్టకస్ అన్నాడు : "నన్ను వాళ్ళు నాయనా అంటారు."

అతనికేసి మేస్త్రీ ఎగాదిగా చేసి "నాయనా అనిపించుకోడానికి నువ్వింకా కుర్రాడివే".

"అది మా దేశాచారం."

"ఇక్కడ మరికొన్ని ఆచారాలున్నాయి. కుర్రాడు అల్లరి చేస్తే తండ్రిని వాయిస్తాం. విన్నారా అంతా?"

"మీ రన్నది వింటున్నాను!"

"థ్రేషియన్లంతా వినాల్సిందే. ఈ ప్రదేశం చెడ్డదే కావచ్చు. మేం తలుచుకుంటే ఇంతకన్న అధ్వాన్నం అవచ్చు కూడా. మీ బొందిలో ప్రాణ మున్నంతకాలం మిమ్మల్ని పని చెయ్యమనీ, వినయ విధేయతలు చూపమనీ చెప్తాం మేం. మీరు చస్తే మే మేమీ అడగం. కొన్ని చోట్ల బతకడం కంటే చావడమే నయమనిపిస్తుంది. ఇక్కడ బతకడంకన్న చావడమే మేలనిపించగలం. తెలిసిందా?"

సూర్యుడు పైకి ప్రయాణం చేస్తున్నాడు. మళ్ళీ తాపం రగులుతోంది. గునపం, పారా, సుత్తీ. సుత్తి పైకెత్తాడు స్పార్టకస్. గంట గంటకూ సుత్తి దెబ్బ బలంగా మరింత బలంగా పడుతోంది, ఉపయోగపడే శక్తి ఒక్కొక్క పాను చొప్పున ఖర్చవుతోంది; అతనెప్పుడూ జీవితంలో ఇంత కష్టమైన పని, ఇంత ఎక్కువగా, ఇంత ఎక్కువసేపు చెయ్యలేదు. పూర్వం

కూడా బానిస చాకిరీ చేసినవాడే. కాని ఈ బానిసత్వం మరింత అధమాధమమైనది. అతని శరీరంలో నరాలు బి(రబిగిసిపోయాయి. బిగించిన తీగలులాగున్నాయి; నొప్పితో మూల్గుతున్నాయి. అదొక పద్దెనిమిది పౌన్లు సుత్తి అని చెప్పడం సులువే. కాని ఆ సుత్తినే ఎత్తే చేతుల కష్టాన్ని వర్ణించడానికి మాత్రం ఈ అంకెలూ, అక్షరాలూ పనికిరావు. నీరు ప్రాణతుల్యమయిన ఈ ప్రదేశంలో అతని శరీరంలోని నీరు చెమటగా పైకి పోతోంది. అతని శరీరం మీద చెమట కాలవలు కట్టింది. చెమట నుదిటి మీద నుంచి కళ్ళల్లోకి ప్రవహిస్తోంది. ఎడారిలో చెమటలు కక్కడమంటే చావే అని అతనికి తెలుసు. కాని చెమట ఆగదు. దాహం, విపరీతమైన దాహం అతనిలో రాక్షసిలా ప్రవేశించింది. భయంకరంగా పరిణమించింది దాహం.

నాలుగు గంటలంటే శాశ్వతకాలం. బానిసలకన్న తమ వాంఛలను అణుచుకోగల వారులేరు. కాని ఈ నాలుగు గంటలు నాలుగు యుగాలు. ఒకడి దగ్గర నుండి మరొకడి వద్దకు నీటి సంచులు పోతున్నాయి. గ్యాంగులన్నీ నీటి సంచుల రాక కెదురు చూస్తున్నాయి. స్పార్టకస్‌కు అమితంగా దాహం వేసింది. థ్రేషియన్లందరికీ వేసింది. తోలు సంచులలోని చల్లని నీరు కడుపులోకి జారింది. ఆ నీటిని అంతా తాగారు. గబగబా తాగేసారు. తాగిన పిమ్మట వాళ్ళ తప్పిదం తెలుసుకున్నారు. ఎంతటి ఆలోచన లేనిపని చేసామా అని బాధపడ్డారు.

సూర్యుడు నడి నెత్తిమీదకు వచ్చినప్పుడు, మంటలవర్షం కురిపిస్తున్నప్పుడు, వడగాడ్పులు వీస్తున్నప్పుడు పని చెయ్యగల శక్తీ, ఆ బలమూ వాళ్ళలో తగ్గిపోతుంది. అప్పుడే వాళ్ళ వీపుల మీద కొరడాలు యధేచ్ఛగా విహారం చేస్తాయి. కొరడా ఉపయో గించడంలో ఎంత నైపుణ్యం ఉందో! అది శరీరంలోని ఏ భాగాన్ని కావాలంటే ఆ భాగానికి ఎంత గమ్మత్తుగా తగులుతుందో! కావాలంటే నెమ్మదిగా స్పృశించగలదు. తేలికగా తగల గలదు. భయపెట్టేలా బాధించగలదు. జాగ్రత్త! ఖబడ్దార్ అని భయపెట్టేలా హెచ్చరించగలదు. బానిస నుదుటికైనా తగులుతుంది. వీపు మీద మోగుతుంది. నోటి మీద కావాలంటే అక్కడే తగిలి ఊరుకుంటుంది. ఎక్కడ కావాలంటే అక్కడ తగిలేలా చెయ్యగలడు మేస్త్రీ. అది అతని విద్య. మానవుల శరీరాలపై సంగీతాన్నాలపించగలది కొరడా. పూర్వంకన్న ఇప్పుడు దాహం మరింత ఎక్కువైంది. నీళ్ళు ఇంతకు పూర్వమే తాగేసారు. కాబట్టి పని పూర్తి అయేవరకూ ఇంక నీరు దొరకదు. అటువంటి రోజే, అటువంటి ఘడియలే శాశ్వతమైపోతాయి. ఇంక కాలానికి అంతులేదా అనిపిస్తుంది.

అయినా అది అంతమవుతుంది. ఏదో ఒక కాలంలో ప్రతీదీ ప్రారంభమై, మరో కాలంలో అంతమయితీరాలి. తిరిగి ఢంకానాదం వినబడుతుంది. ఆనాటి పని ముగుస్తుంది. కాదు, మర్నాటికి వాయిదా పడుతుంది.

సుత్తి కిందకు దించి రక్తం చిందే తన చేతులను చూసుకుంటాడు స్పార్టకస్. కొందరు థ్రేషియన్లు అధిక శ్రమ వల్ల కూచున్న వాళ్ళు లేవలేకపోతారు. పద్దెనిమిదేళ్ళ కుర్రాడొకడు

పడుకొని, ఒక పక్కకు ఒత్తిగిలి, కాళ్ళు పొట్టలోకి ముడుచుంటాడు. స్పార్టకస్ అతని వద్దకు వెళ్ళాడు.

"నాయనా! - నాయనా! నువ్వేనా?"

"అవునమ్మా నేనే" అని స్పార్టకస్ అతని నుదుటిపై ముద్దెడతాడు.

"నాయనా! నేను చచ్చిపోతున్నా. చచ్చిపోతాను. నా ఆత్మ ఏమైనా మిగిలి ఉంటే ఆది నీ కీయదలుచుకున్నా. నా పెదవి మీద ఒక్క ముద్దెట్టు."

అతని పెదవుల మీద స్పార్టకస్ ముద్దెడతాడు. ఏడవడానికి కన్నీళ్ళు చాలవు; ఎండిన మోడుల్లాటి మనుషులు వాళ్ళు.

# 4

ఆ నల్లరాతి కొండల్లో, మండుటెండల్లో, పనిచేసే దిగంబరుడు స్పార్టకస్ గురించి, ఇతర థ్రేషియన్ల గురించి తన కథనాన్ని ముగించాడు బేటియాటస్. చెప్పడానికి చాలా సేపే పట్టింది. వర్షం తగ్గింది. ఆకాశం కింద అంతటా ఆగాధమైన చీకట్లు అలుముకున్నాయి. మల్లులకు శిక్షణ గరిపే బేటియాటస్, ఉన్నత కుటుంబంలోపుట్టిన క్రాసస్ దీపకాంతిలో కూచున్నారు. దీపం మిణుకుమిణుకు మంటోంది. బేటియాటస్ బాగా తాగి మత్తెక్కి ఉన్నాడు. అతని ముఖంలో వేలాడే కండలు మరింతవదులై ఇంకా బాగా వేలాడుతున్నాయి. అతను చెప్పే విషయంలో అతనే బాగా లీనమైపోయేడు. విచిత్రమైన స్వభావం కలిగిన దుఃఖిత స్వభావుడు, ఆ బంగారం గనులను గూర్చిన ఉదంతం ఎంతో శక్తివంతంగా, విపులంగా, కరుణారసపూరితంగా చెప్పబట్టే క్రాసస్ తనకు తెలియకుండానే ఆ కథ విని జాలిపడ్డాడు.

క్రాసస్ అజ్ఞానికాడు; అమాయకుడు కాడు. ఎవరూ ఎదిర్చి పోరశక్యం కాని స్పార్టకస్‌పై రోమ్ సమీకృత శక్తి తాలూకు ప్రభావం ఎలా ఉంటుందో, ఎంత మటుకు ఉంటుందో తెలుసుకున్నవాడే. ఈ బానిస లజేయులా? స్పార్టకస్‌ను ఇంకా అర్థం చేసుకోవాలన్న వాంఛ అతనిలో ప్రగాఢమైంది. వీలయితే, స్పార్టకస్ హృదయంలోకి ప్రవేశించి తన చిక్కు ప్రశ్నలకు సమాధానం వెతుకుదామనిపించిందతనికి. ఈ వర్గపు ప్రజల వాంఛలేవి? ఏ నాటికీ తీరని, ఈ వర్గ ప్రజల వాంఛల చిక్కు ప్రశ్నలనెలా అర్థం చేసుకోడం? అందని ఆకాశాలలో వెలుగుతూ, ఆరుతూ కవ్వించే తారకలను తాకేందుకు, అందుకొనేందుకు గొలుసులతో బంధించిన హస్తాలను చాచిన ఈ బానిసల ప్రయత్నాలేమిటి? ఇవి తెలుసుకోవాలని, తెలుసుకుని కార్యనిర్ణయం చేసుకోవాలని అతనికుంది. బేటియాటస్‌ను క్రీగంట చూసాడు. ఇన్ని విషయాలు చెప్పినందుకుగాను ఈ అతికాయుడికి తను కృతజ్ఞుడై ఉండాలన్న విషయం గ్రహించాడు.

"అయితే స్పార్టకస్ అటువంటి చోటు నుంచి ఎలా పారిపోగలిగాడు?" అని అడిగాడు.

"అతను పారిపోలేదు. అసలెవరూ అక్కడ నుంచి పారిపోలేరు. అలాంటి ప్రదేశాల

లోని సుగుణమేమిటంటే అక్కడ జీవించడానికి అలవాటుపడిన ఏ మనిషీ, మరే ఇతర మానవ సమాజంలోనూ జీవించడానికి ఇష్టపడడు. నేనే అక్కడి నుంచి ఈ స్పార్టకస్‌ను లాక్కొచ్చాను."

"ఎందుకు? అతనక్కడ ఉన్నాడనీ, స్పార్టకస్ అతనేననీ మీ కెలా తెలుసు?"

"నా కేమీ ముందుగా తెలియదు. మల్లుల విషయంలో నాకున్న పేరంతా ఓ కల్పిత గాధ కింద జమ కట్టేస్తారు లాగుంది. ఓడంత శరీరముండి, దమ్మిడీకి మారని వాడినని మీ ఉద్దేశమేమో; నా పనిలో కూడా ఒక కళ వుంది."

"మీరు స్పార్టకస్‌ను ఎలా కొన్నారో చెప్పండి."

"నేను మరోలా పుట్టి ఒక దళానికి నాయకత్వం వహిస్తే బాగుండును. మీకు మల్ల యుద్ధాలు చూడాలని ఆసక్తి ఉండొచ్చును. అవంటే విసుగెత్తిపోయాను నేను."

"నేనూ చాలినంత పోరాటం చేసినవాడినే."

"అయితే అవచ్చు. పెద్ద ఎత్తున మారణహోమం చేసే మీ పద్ధతికి భిన్నమయిన ధైర్యసాహసాలు మల్లయుద్ధంలో ప్రదర్శింపబడుతుంటాయి. మూడు వంతుల వరకు నాశమైన సైన్యాన్ని మీకిచ్చి స్పార్టకస్‌ని చితగ్గొట్టి, రోమను సంపదను, యశస్సును తిరిగి సంపాదించుకు రమ్మన్నారు మిమ్మల్ని. ఇప్పుడు ఇటలీ మీ చేతుల్లో ఉందంటారా? నిజం చెప్పాలంటే ఇటలీ స్పార్టకస్ చేతిలో ఉంది. మీ రతన్ని ఓడించవచ్చు. రోమ్‌ను వ్యతిరేకించి ఏ శక్తీ మనలేదు. కాని, ఈ క్షణంలో అతనిదే పై చెయ్యి, అవునా?"

"అవును" అన్నాడు క్రాసస్.

"స్పార్టకస్‌కు శిక్షణ గరపిందెవరు? నేను. అతనెప్పుడూ రోమ్‌లో పోరాడలేదే. చూడదగ్గ పోరాటాలు రోమ్‌లో జరగలేదు. రోమ్‌కు కావలసిందల్లా వధ్యశాల. నిజమైన గొప్పయుద్ధాలు కేపువాలో జరిగాయి. సిసిలీలో జరిగాయి. ఆమాటకొస్తే మీ సైనికదళాలు యుద్ధమే చెయ్యలేవు. ఉక్కు., తోలు, డాలు కప్పుకొని పొడుగాటి కర్రలాంటి ఈటెలతో పొడుచుకుంటారు మీరు. కత్తి చేతబట్టి దిగంబరంగా బరిలోకి వెళ్లి, ఇసుకపైబడి మెరిసే నెత్తుటి వాసన చూడండి. నగారా మోగుతూ, సూర్యుడు ప్రకాశిస్తూ, స్త్రీలు చేతిరుమాళ్లు విసురుతూ హుషారునిస్తూ తన దిగంబర శరీరం నుండి, అవయవాల నుండి దృష్టి మరల్చక చూస్తుంటే, శరీరంలోని కండలు, తదితర భాగాలు ముక్కలుగా కోయబడి కంటబడ్డప్పుడు, తన రక్తం తన పాదాలపైనే పడ్డప్పుడు, నరాలు భూమి మీద మెలికలు తిరిగి పడిఉండి, గట్టిగా బాధతో అరిస్తే, ఆవేశంతో నిండితే అటువంటిదాన్నే యుద్ధం అంటాన్నేను. దానికి మామూలు మనుషులు పనికి రారు. మరోలాటి మనుషులు కావాలి. వాళ్ళెక్కడ దొరుకుతారు? డబ్బు సంపాదించాలంటే, డబ్బు ఖర్చు చేసే స్వభావం నాది. అందుకు నా ఏజంట్లను అన్ని చోట్లకీ పంపుతాను. రెండేళ్ళకోమారు న్యూబియా ఎడారికి పంపుతాను. ఒక మాటు నేనే స్వయంగా వెళ్ళి ప్రత్యక్షంగా చూసాను. ఆ ఒక్కమాటే చాలు. గనిపని చెయ్యడానికి బానిసలు కావాలి.

వాళ్ళలో కొందరు మహా అయితే రెండేళ్లు పని చెయ్యగలరు. కొందరు ఆరునెలల్లోనే ఎందుకూ పనికి రాకుండాపోతారు. లాభించే పద్ధతి ఏమంటే త్వరత్వరగా బానిసలను తొలగించాలి. వారి స్థానే కొత్తవాళ్ళను నియమించాలి. ఇది తెలిసిన బానిసలు నిరాశ చేత అన్నిటికీ తెగిస్తారు. ఆ తెగిం పో అంటుజాడ్యం; అంతా తెగిస్తే మనతాడు తెగిందన్నమాటే. చెప్తేవినక, కొరడాకి లొంగక, ఇతరులకు కూడా చెప్పి వాళ్ళనూ, తనలాగే తయారుచేయగల బానిసను చంపి ఎండలో కొర్రువెయ్యాలేగాని, అటువంటివాడు ఎందుకూ పనికిరాడు. వా డన్నిటికీ తెగించే ఉంటాడు. వాడినలాచేస్తే తక్కిన వాళ్ళు చూసి బుద్ధి తెచ్చుకోవచ్చు; కాని అటువంటి పని వల్ల ఎవరికీ లాభం ఉండదు సరికదా డబ్బు దండగ; అందుకని నేనో చిన్న ఏర్పాటు చేసాను. పని చెయ్యకుండా మొండికెత్తిన బానిసలను నాకు అమ్మమని మేస్త్రీతో చెప్పాను. మేస్త్రీ కూడా ఇంత డబ్బు చేసుకోగలడు, ఎవరికీ నష్టముండదు. అలా కొన్నవాళ్ళే మంచి మల్లులవ గలరు; అయ్యారు కూడా."

"ఈ స్పార్టకస్‌ని అలాగే కొన్నారా?"

"సరిగ్గా అలాగే. స్పార్టకస్‌ను, గేన్నికస్ అనే మరో థ్రేషియన్‌నూ, నేనలాగే కొన్నాను. ఆ రోజుల్లో థ్రేషియన్లకు యుద్ధం బాగా చెయ్యగలరనే పేరుండేది. మొదటి సంవత్సరం బాకు. రెండో ఏడు పొట్టి కత్తి. మూడో ఏడు నిడుపైన ఖడ్గం. నిజానికి థ్రేషియన్లెప్పుడూ బాకు ముట్టనేలేదు. కానీ పేరలా ఉండేది. బాకు యుద్ధాలు థ్రేషియన్లు చేస్తే తప్ప ఆడవాళ్ళు చూసేవారే కాదు."

"అతన్ని మీరు స్వయంగా వెళ్ళి కొన్నారా?"

"నా ఏజంట్ల ద్వారా కొన్నాను. గొలుసులతో కట్టి వాళ్ళిద్దరినీ అలెగ్జాండ్రియా నుండి ఓడ మీద పంపారు. నేపుల్సులోని మా ఓడరేవు ఏజంటు వాళ్ళనిక్కడికి డోలీల మీద తీసుకొచ్చాడు."

"అయితే మీ దేం చిన్న వర్తకం కాదు." లాభసాటిగా ఏదైనా జరుగుతున్నట్లు తోస్తే క్రాసస్ మరింత జాగ్రత్తగా చూస్తాడు. అతని వర్తకం పెద్దదే అన్న విషయం అంగీకరించాడు.

"అయితే మీకు నచ్చిందన్నమాట. అలా కొద్ది మందే మెచ్చుకోగలరు. ఇంతకీ కేపువాలో నా పెట్టుబడి యేమాత్రం ఉంటుందంటారు?" అడిగాడు బేటియాటస్.

తెలియదన్నట్లు తల ఊపి, క్రాసస్ "నా కది ఎప్పుడూ తట్టలేదు. మల్లులను చూడొచ్చు. వాళ్ళ యుద్ధమూ చూడొచ్చు. కాని దానికయ్యే ఖర్చెంత అనే ఆలోచన సామాన్యంగా ఎవరికీ రాదు" అన్నాడు.

బేటియాటస్ గ్లాసు కింద పెట్టి బొ్రముక్కు మీద వేలుతో రాస్తూ "ఊహిం చండి" అన్నాడు.

"పది లక్షలా?"

"యాభై లక్షల దీనారాలు" నెమ్మదిగా బరువుగా అన్నడా మాటలు. "యాభై లక్షల

దీనారాలు, మీరే చూడండి. అయిదు దేశాల్లో నాకు ఏజంట్లున్నారు. నేపుల్సు రేవులో ఒక ఏజంటు. మల్లులను మేపినప్పుడు మంచి ఖరీదైన తిండే మేపుతాం. గోధుమ, బార్లీ, గొడ్డుమాంసం, మేక వెన్న. ఇద్దరేసి పోట్లాడే బరులు ఉన్నాయి. రాతితో కట్టిన బరి ఉందే, అదే పది లక్షలు చేస్తుంది. ఆ ఊళ్లో ఉండే ఒక సైనిక దళాన్ని పూర్తిగా మేపుతున్నాను. వాళ్ళకు బస ఏర్పాటు చేసాను. ఇక లంచాల సంగతి వేరే చెప్పాలా. ట్రిబ్యూన్‌కీ, వార్డు రాజకీయవేత్తలకీ యాభై వేల దీనారాలు చాలవు కదా. ఆడాళ్ళ గురించి అలా ఉండ నివ్వండి."

"ఆడవాళ్ళా?" ఏమిటన్నట్టడిగాడు క్రాసస్.

"మల్లుడంటే మామూలు బానిస కాదని ముందే సెలవిచ్చాను. అతని నరాలు ఉత్సాహంగా పని చెయ్యాలంటే అతని కో ఆడది అవసరం. అప్పుడే బాగా తిని, బాగా పోట్లాడగలడు. ముసలిడొక్కుల్నీ, ఎందుకూ పనికిరాని వాళ్ళనూ కొనను. నేను కొన్నవాళ్ళంతా పిక్కల్లాంటి గుంటలు, బలంగా ఆరోగ్యంగా ఉండే ఇరవై ఏళ్ళలోపు ఆడపిల్లలు. నా కన్నీ తెలుసు. నేనే స్వయంగా అన్ని రకాల పరీక్షలు చెయ్యగలను." అతను గ్లాసు ఖాళీ చేసి పెదిమలు చప్పరిస్తూ, సారాగ్లాసు తిరిగి నింపుకున్నాడు.

"స్పార్టకస్ భార్య అంటారే ఆమెవరు?"

"వరీనియా" అన్నాడు బేటియాటస్. తనలో తనే ఏదో ఆలోచిస్తున్నాడు. అంతర్ముఖుడయ్యాడు; అతని కళ్ళల్లో ఈర్ష్య, కోపం, కామం గోచరించాయి. "వరీనియా' ' తిరిగి అన్నాడు.

"ఆమె గురించి చెప్పండి."

కొంచెం ఆగి ఆలోచించాడు. "నేను కొన్నప్పుడు దాని వయస్సు పందొమ్మిదేళ్లు; జర్మను ముండ. బంగారపు జుట్టూ, నీలంకళ్ళూ. మీకు ఇష్టమయితే అది బాగా నచ్చి తీరుతుంది. దానిని చంపేసేవాడినే. అలాగెందుకని మొగాడి ముఖం కిట్టని దీన్ని ఆడది అనవసరమనుకొనే స్పార్టకస్‌కి తగిలించి పారేశా. ఎలాగుందంటారు. గమ్మత్తు."

"ఆమెను గురించి చెప్పారు కారు!"

"చెప్పానే" బేటియాటస్ కొంచెం దురుసుగా అన్నాడు.

"మీరు గేన్నికస్‌ను, స్పార్టకస్‌ను ఇక్కడకు డోలీలపై రప్పించామన్నారు. గొలుసులు తగిలించే అనుకుంటా" క్రాసస్ అన్నాడు.

అంగీకారసూచకంగా ఊగింది బేటియాటస్ తల.

"అయితే అతన్నింతకి పూర్వం మీరెప్పుడూ చూడలేదన్నమాట?"

"లేదు. నేను మనుషుల్ని అందరిలాగా చూడను. ఆ ఇద్దరూ పెద్ద గడ్డాలతో, రసికారే పుళ్ళుతో ఆపాదమస్తకం కొరడా దెబ్బలతో, నే చూసేటప్పటికి పరమ అసహ్యంగా ఉన్నారు. వాళ్ళ దగ్గరకు వెళ్తే కడుపులో తిప్పేసేటంత దుర్వాసన వచ్చింది. వాళ్ళు విసర్జించినది వాళ్ళ

ఒంటిమీదే ఎండి అంటుకుని ఉంది. వాళ్ళ కళ్ళే వాళ్ళలోని తెగింపును, సాహసాన్ని ప్రతిబింబించాయి. మరొకళ్ళయితే మా పాకీదొడ్లు కూడా తుడవడానికి మీరు పనికిరారు పొండి అందురు. కాని నాకు తెలుసు వాళ్ళ శక్తి. అది నా కళ. స్నానం చేయించి, క్షురకర్మ చేయించి, నూనె బాగా మర్దన చేయించి, బాగా తిండి పెట్టించి, వాళ్ళను......."

"ఇంక వరీనియా గురించి చెప్తారా?"

"చంపేసారు."

సారా గ్లాసును అందుకోబోయాడు బేటియాటస్. ఆ ప్రయత్నంలో దాన్ని తలకిందులు చేసేసాడు. తలను బల్ల మీద ఆన్చి, ఆ ఎర్రని సారాచుక్కలు చూస్తూ ఉండిపోయాడు. అక్కడ ఎర్రని మచ్చలలో అతనికేం కనిబడిందో, అతనేం చూసాడో ఎవరెరుగుదురు? గతా న్నవలోకించి ఉండొచ్చు, భవిష్యత్తునూ చూసి ఉండొచ్చు. అసలు మనుషులకే తప్ప మృగాలకి తాము చేసిన పనుల యొక్క ఫలితాలనూహించుకోగల శక్తి లేదు కదా! ఇతను స్పార్టకస్‌కు శిక్షణ ఇచ్చినవాడు. భవిష్యత్తనేదేదో పెద్ద బ్రహ్మాండమైన అల్లిక. దానికి మొదలేదో! తుది ఏదో! ఆ అల్లికలో తనో దారమైపోయాడు, ఒక పోగైపోయాడు. రాబోయే ఎన్ని యుగాలకు, కాలాలకు స్పార్టకస్‌ను తయారు చేసినవాడిగా అతని పేరు చెప్పుకుంటారో? అతని పేరు చిరస్థాయిగా మానవజాతి స్మృతిపథంలో మెదులుతుందో? స్పార్టకస్‌ను తయారుచేసిన మనిషి ఆ స్పార్టకస్‌నే నాశనంచేయ సమకట్టిన వ్యక్తి కెదురుగా కూచొని ఉన్నాడు.

# 5

మహాకాయుడైన నీ స్నేహితుడు లెంటులుస్ బేటియాటస్ అంటూ క్రాసస్ సేనాని చెప్పుకుపోతుంటే, అతని పక్కనే పడుకున్న కుర్రాడు కైయస్ క్రాసస్ కునికిపాట్లు పడుతూ కథలోని కొన్ని భాగాలు మాత్రమే వింటున్నాడు. క్రాసస్ పెద్ద కథకుడు కాడు. ఆ కథ అతని మనస్సులోనే, స్మృతిపథంలోనే భయం రూపంలో, ఆలోచనల మాదిరిగా మిగిలి పోయింది. బానిసయుద్ధమూ అయింది. స్పార్టకస్ పనీ అయింది.

పూర్తిగా నిద్ర పట్టని కైయస్ రాజవీధి నలంకరించి ఉన్న శిలువలను గురించి యోచిస్తున్నాడు. చచ్చిన స్పార్టకస్ అతన్ని భయపెట్టిన మాట వాస్తవం. మృతుడైన బానిసను తనసహ్యించుకున్నాడు. కానీ కళ్ళు తెరచి నీడలో ఉన్న క్రాసస్ ముఖం చూసినప్పుడు మాత్రం అతని కా అసహ్యం ఎందుకో అర్థం కాక తికమక చెందాడు.

"నువ్వు నిద్రపోవడం లేదు" అన్నాడు క్రాసస్. "చచ్చి ఎక్కడికోపోయిన ఆ స్పార్టకస్ అంటే నీకంత అసహ్యం ఎందుకు?"

కైయస్ క్రాసస్ తన ఆలోచనలో మునిగి ఉన్నాడు. నాలుగేళ్ళ క్రితం జరిగిన సంఘటన. బ్రాకస్‌తో కలిసి ఏపియన్ మార్గాన కేపువాకు ప్రయాణం కట్టాడు కైయస్.

బ్రాకస్ అతన్ని సంతోష పెట్టాలనుకున్నాడు. వీలైనంత ఎక్కువగా, బ్రహ్మాండంగా సంతోష పరచాలనుకున్నాడు. మెత్తని దిండ్ల మీద, సోఫాలో తన శిష్యుడి పక్కన కూచుని మల్ల యుద్ధాలు చూడ్డంకన్న బాగుండేదేముందీ ప్రపంచంలో. ఇప్పటికి సరిగ్గా నాలుగేండ్ల క్రితం, తను సలేరియా భవనంలో గడుపుతున్న ఈ నాటికి సరిగ్గా నాలుగేండ్ల క్రితం ఎంత డబ్బు ఖర్చయినా సరే కేపువాలో మల్లయుద్ధం చూపిస్తానని మాట ఇచ్చిన బ్రాకస్‌తో, ఒకే పల్లకీలో ఇదే మార్గంలో ప్రయాణం చేసాడు కైయస్. ఇసక మీద రక్తం చిందుతుంది. వెచ్చనీ, ఎర్రనీ, చిక్కని రక్తం; దాన్ని చూస్తూ ద్రాక్షాసారాను సేవిస్తూ ఆనందిద్దామని మిత్రద్వయం అనుకున్నారు.

ఇటలీలో ప్రధానమైన పెద్ద మల్లయుద్ధ శిక్షణ కేంద్రాన్నీ, ప్రదర్శనశాలనూ, గోదాలనూ కట్టించిన లెంటులుస్ బేటియాటస్‌తో అతనికప్పుడే పరిచయమయింది.

ఇదంతా నాలుగేండ్ల క్రితం అనుకున్నాడు కైయస్, బానిసయుద్ధానికి పూర్వం, అసలీ స్పార్టకస్ పేరు ఎవరికీ తెలియని కాలం. కాని ఇప్పుడో బ్రాకస్ చచ్చి స్వర్గాన ఉన్నాడు. స్పార్టకస్ నశించాడు.

# మూడవ భాగం

సలేరియా భవనానికి వాళ్ళు వచ్చిన నాటికి సరిగ్గా నాలుగు సంవత్సరాల క్రితం చక్కని వసంత కాలంలో ఒక మనోహరమైన రోజు. అటువంటి రోజున సుష్టుగా భుజించి, మధ్య మధ్య తేన్చుతూ, తన ఆఫీసు గదిలో కూచున్న లెంటులుస్ బేటియాటస్ తో అతని గ్రీకు గుమాస్తా వచ్చి ఎవరో ఇద్దరు రోమన్ యువకులు ఏవో జంటల్ని గురించీ, పోరాట ప్రదర్శనల గురించి అడుగుతున్నారని చెప్పాడు.

ఆ ఆఫీసు, ఆ గుమాస్తా, తదితర సరంజామా బేటియాటస్ సిరిసంపదల్ని, భోగ భాగ్యాల్ని వెల్లడి చేస్తున్నాయ్. వార్డు రాజకీయరంగంలో ప్రవేశించి, రోడ్ల మీద రాజకీయ సంబంధమైన గూండాచర్యలు, రౌడీ చర్యలు జరిపించి, కొట్లాటలు నడిపించి, నేర్పుతో తెలివితేటలతో ఒక్కొక్క ఉన్నత కుటుంబంతోటే పరిచయం, తరువాత సంబంధం ఏర్పరచు కుని, ఎంతో నిర్మాణాత్మక కృషితో మంచి సమర్థతగల గూండాముఠాలను నిర్మించుకొని, వాటి కోసం అవసరమైనంత ధనాన్ని వెనుకాడక ఖర్చుపెట్టి, అనేక చిల్లర మల్లర వేషాలు వేసి కూడబెట్టిన డబ్బును అందరికంటే ముందు, ఒక మల్లుల శిక్షణ కేంద్రంలో పెట్టుబడి పెట్టడమనేదే అతను చేసిన మహా తెలివైన పని. దాంతో అతనికి సుడి తిరిగింది. అదృష్టం చల్లని చూపు చూసింది. భవిష్యత్తనే తరంగం మీద తను అదృష్టంలోకి స్వారీ చేసుకు పోతున్నానని అందరితో చెప్పడం అతనికి చెడ్డ సరదా. బేటియాటస్ నడిపిన గ్యాంగుల కన్నా బలమైనవి, శక్తివంతమైనవి కూడా రోమన్ రాజకీయ చరిత్ర నుండి తుడిచిపెట్టుకు పోయాయి. ఒక్కొక్కప్పుడు అనుకోకుండా శత్రువు ఎన్నికల్లో గెలిచాడంటే పూర్వం అధికారంలో ఉన్న ముఠాలన్నిటికీ చావే. వాడికున్న కసి అంతా తీర్చుకుంటాడు. ఇన్ని చిక్కులున్నాయి.

కనుకనే ఇతర మార్గాలన్వేషించి బాగుపడాలన్న బేటియాటస్ దృష్టి ఈ మల్ల యుద్ధాల మీద పడింది. అతనికీ జెట్టీల ద్వంద్వయుద్ధాలు బాగా లాభించేవిగా కనిపించాయి. వాటికి పెట్టుబడి పెట్టడానికి తగిన అర్హతలన్నీ ఉన్నాయని భావించాడతను. పైగా అవి చట్టసమ్మత మైనవి కూడా. ఇంతగా పరిశీలించి ఈ మార్గాన్నే ఎంచుకున్నాడు బేటియాటస్. ఈ మల్ల యుద్ధ ప్రదర్శనలు ఇంకా బాల్యదశలోనే ఉన్నట్లు అతనికి తెలిసిపోయింది. మొదట్లో యథాలాపంగా ఏర్పాటు చేసిన వినోదం చివరికి రోమన్ సమాజాన్ని గంగవెర్రులెత్తించింది. చరిత్ర సృష్టించింది. వందల కొద్దీ మల్లుల జంటలు రోజుల తరబడి, వారాలపైబడి అదే పనిగా ఎడతెరిపి లేకుండా ప్రదర్శనలివ్వడం మామూలైపోయింది. శిక్షణ పొందిన మల్లులకు గిరాకీ పెరిగింది. వాళ్ళ కోసం ప్రజల్లో ఒక తహతహ బయలుదేరింది. ఎంత తహ తహ పుట్టుకొస్తే అంతగానూ వస్తువు ధర పెరుగుతుంది. కావలసినంత మంది మల్లులు తయారుగా

లేనందున ఉన్న కాస్తమందికి ధర పెరిగింది; ధరలు చుక్కలనంటాయి. రాతి గోదాలు ఊరూరా బయల్దేరుతున్నాయి. ఇటలీ కంతటికీ అసమానమైన, అద్వితీయమైన గోదా కేపువాలో కట్టారు. లెంటులుస్ బేటియాటస్ వెంటనే కేపువాకు ప్రయాణం కట్టాడు. అక్కడ శిక్షణా కేంద్రం నిర్మించాలని నిర్ణయించాడు.

బేటియాటస్‌కు ఆరంభశూరత్వం, అనవసర పటాటోపం తెలియవు. అందుకనే మొదట చాలా చిన్న ఎత్తున పని ప్రారంభించాడు. అసలు సూది మొనంత భాగం ముందు సంపాదిస్తే, ఏదో రకంగా ఆ తరవాత సామ్రాజ్యాన్నే స్థాపించవచ్చునన్న సూత్రం అతనికి కంఠస్థం. అందుకే మొదట్లో ఒక చిన్న పాక వేయించాడు. ఒక్క జంట మల్లుల్నే తెప్పించాడు. పని ప్రారంభించాడు. అలా అయిదు సంవత్సరాలు గడిచేసరికి, ఒక్క జంట పదిజంటలై, ఆఖరికి ఈ నాటికి నూరు జంటలకన్న మించి అతని వ్యాపారం సాగిపోతోంది. బ్రహ్మాండమైన ఒక శిక్షణ కేంద్ర స్థాపకుడనే పేరు అతనికి చూస్తుండగానే వచ్చేసింది. పూర్వం కట్టిన పాక ఇప్పుడు రాతితో కట్టిన మల్లుల బస కింద మారిపోయింది. స్వంత తాలింఖానాలు, స్నానశాలలు, ప్రత్యేక శిక్షణా పద్ధతులు; కొద్ది మంది తమ బంధువులతోకాని, స్నేహితులతో కాని వచ్చి ప్రత్యేక పోరాట ప్రదర్శనలు చూడటానికి తగిన చిన్న చిన్న గోదాలు, ఒకటేమిటి ధనార్జన చేయగల అన్ని హంగులూ, అవకాశాలూ సమకూరాయి. శాంతిభద్రతలు కాపాడేందుకు తానై ఒక పోలీసు బలగాన్ని తయారుచేసి, దాన్ని పోషించడం ప్రయాస, అధిక ధనవ్యయం అని గుర్తించి, మిలిటరీ ఉద్యోగులకు, సైనికులకు లంచాలిచ్చి వాళ్ళనే తన పని కోసం ఉపయోగించుకున్నాడు. అతని వంటింట్లో ఒక చిన్న సైన్యానికి కావలసినంత వంట వండేవారు. మల్లులు, వాళ్ళ కోసం కొన్న ఆడాళ్ళు, శిక్షకులు, ఇళ్ళల్లో పనిచేసే దాసీజనం, పల్లకీలు మోసే బానిసలు అంతా మొత్తం నాలుగువందల మందిని మేపేవాడు. ఆనాటి అతని ఆత్మ సంతుష్టికి కారణం లేకపోలేదు. సూర్యకాంతి వింత హొయలు కూర్చే ఆ చల్లని వసంతకాల ప్రభాత సమయంలో అతను కూచున్న ఆ ఆఫీసు ఈ మధ్యే అతను సంపాదించాడు. మొత్తం మీద ఇప్పటి అతని అభ్యుదయం అతనికే ఆశ్చర్యం కలిగించి సంతుష్టి కింద మారింది. తానిటు వంటి వ్యాపారిగా జీవితం ప్రారంభించిన తొలి రోజులలో కిటికీలకూ, గుమ్మాలకూ తెరలు కట్టడమేమిటని వాటిని తెగ అసహ్యించుకునేవాడు. అతను పెద్దింటివాడుకాడు. అలా కనబడటానికి అతనెప్పుడూ ప్రయత్నం చేసేవాడు కాడు. అధికంగా లాభాలు వచ్చిన తరువాత డబ్బుకి తగ్గ హుందా ఉండవలసిన అవసరాన్ని మాత్రం గుర్తించాడు. గ్రీకు బానిసలను కొనడం ప్రారంభించాడు. అతను కొన్న గ్రీకు బానిసలలో జమాఖర్చులు తెలిసిన గుమాస్తా ఒకడు, ఒక శిల్పి కూడా ఉన్నారు. గ్రీకు పద్ధతిలో వరుసలు తీరిన గదులూ, మూడువైపుల గోడలుండి, ఒక వైపున తెరుచుకుని ఉండే ఒక రకమైన డాబాను కట్టవలసిందిగా ఆ గ్రీకు శిల్పి ఇతన్ని ప్రోత్సహించాడు. అటువంటి డాబాను కట్టించాడు. తెరలు తొలగిస్తే సూర్యకాంతీ, చల్లగాలీ సమృద్ధిగా గదులలో ప్రవేశిస్తాయి. ఆ

పాలరాతి నేల, అతను కూచుని ఆఫీసు పనులు చేసుకొనే ఆ తెల్లని మేజా-ఇవన్నీ అతని అభిరుచుల్ని తెలియచేస్తున్నాయి. తెరువబడిన వైపు వీపు పెట్టి, ద్వారాని కెదురుగా కూర్చున్నాడు బేటియాటస్. అవతలగా గుమాస్తాల గదులున్నాయి. రోమ్‌లోని సందు గొందులు, రౌడీమూకలు, ఇతని పూర్వపు స్థితి ఒకప్పటి గాథగా మారి, ఇతనికి దూరంగా నిలిచింది.

అత్తరువు పూసుకుని, ఖరీదైన దుస్తులు ధరించి, ఉంగరాలు తగిలించుకున్న ఇద్దరు యువకులు వచ్చారని గుమాస్తా వచ్చి చెప్పాడు. బాగా లాభించేట్టు కనబడ్డా, బొత్తిగా కుర్రకారుతో వ్యవహారం మరి. అందులో ఒకడు మరీ కుర్రాడు; మహా అయితే అతని వయస్సు ఇరవై ఒక్కటుండవచ్చు. మరో అతను ఇతన్ని ఖుషీ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు.

"వాళ్ళని లోపలికి పంపు" అన్నాడు బేటియాటస్.

ఆ ఇద్దరు యువకులూ అతని గదిలోకి ప్రవేశించారు. వాళ్ళు రాగానే వినయం ఉట్టిపడేలా లేచి నిలబడ్డాడు బేటియాటస్. వచ్చినవాళ్ళని కూచోమని రెండుకుర్చీలు చూపించాడు; వాళ్ళు కూచునేలోపలే వాళ్ళే మాత్రం ధనవంతులై ఉంటారా అని విలువలు కట్టడం ప్రారంభించాడు. ధనవంతులకు మల్లే కనిపించినా, వాళ్ళదంతా పై పై పటాటోపమే తప్ప జేబు బరువు తక్కువేనని అంచనా వేసాడు బేటియాటస్. ఉన్నత కుటుంబంలో జన్మించి ఉండొచ్చుకాని, కులీనుల కుండవలసిన సంప్రదాయాల కనుగుణంగా లేదు వాళ్ళ ప్రవర్తన. ఆ ఇద్దరిలోకి లేబ్రాయపువాడైన కైయస్ క్రాసస్ సరిగ్గా ఆడపిల్లలాగున్నాడు. బ్రాకస్ పెద్దవాడు. కొద్దో గొప్పో తెలివితేటలున్నవాడు. అతనే వ్యవహారం నడిపిస్తున్నాడు. కాంతి హీనమైన కళ్ళూ, ఎల్లప్పుడూ అసహ్యాన్ని సూచించే సన్నని పెదవులూ, ఇసుకరంగు జుట్టూ- ఇదీ అతని వర్ణన. అతనే మాట్లాడుతున్నాడు. వింటూ కూచున్న కైయస్ అతనివైపు కళ్ళు అప్పగించి ప్రశంసాపూర్వకంగా చూస్తున్నాడు.

"నేను లెంటులుస్ బేటియాటస్‌ని, ఒక వ్యాపారస్తుడ్ని." వాళ్ళ దగ్గర తనో తక్కువ వాడిలా ప్రవర్తిస్తే ఆ సాయంత్రానికి వాళ్ళ వద్ద అయిదువేల దీనారాలైనా లాగొచ్చునని బేటియాటస్ అభిప్రాయం. తమ ఇద్దర్నీ అతనికి పరిచయం చేసి వెంటనే అసలు విషయం ఎత్తుకున్నాడు బ్రాకస్.

"మేం ఇద్దరం చూడటానికి రెండు ద్వంద్వ యుద్ధాలు ఏర్పాటు చెయ్యగలరా?"

"ఒట్టి మీ ఇద్దరికోసమేనా?"

"మేమూ, మరో ఇద్దరు స్నేహితులం అంతే."

తీవ్రంగా ఆలోచించేవాడిలానటిస్తూ, తలఊపి తన లావుపాటిచేతుల్ని దగ్గరగా తీసుకున్నాడు. అతని వేలినున్న ఉంగరాల్లో పొదిగిన మరకతమాణిక్యాలు బాగా కనిపిస్తున్నాయి.

"ఓ, ఏర్పాటు చేయగలం" అన్నాడు బేటియాటస్.

"మల్లులు చచ్చేదాక" బ్రాకస్ నెమ్మదిగా తాపీగా అన్నాడు.

"ఏమిటీ?"

"మల్లులు చచ్చేదాకా పోరాటం జరపాలి."

"రోమ్ నుంచి ఎప్పుడు యువకులు వచ్చినా చచ్చేదాకా దెబ్బలాడితేనే చూస్తామంటా రేమిటి? పోట్లాట చూడొచ్చు, రక్తాన్నీ చూడొచ్చు, కాని చచ్చేదాకా ఎందుకు?" అడిగాడు బేటియాటస్.

"మేం కావాలన్నాం, అందుకు."

"ప్రపంచంలో ఎక్కడా కనబడని థ్రేషియన్ పోరాటం మీకు చూపించగలను. వాళ్ళు చచ్చేదాకా పోట్లాడి తీరాలని అంటే మాత్రం మంచి కత్తిసాము చూడలేరు మీరు. మీరిల్లా డబ్బిస్తారో లేదో వాళ్ళల్లా దెబ్బలాడి ఒక్క క్షణంలో చచ్చి ఊరుకుంటారు. రోమ్‌లో మీరెప్పుడూ చూసి ఉండని ప్రదర్శన. పాయింట్ల లెఖ్ఖనైతే రోజస్తమానమూ మీ కిప్పించలగను. ఆ మాటకొస్తే ఈ ఊళ్ళో ఏ గోదాలోనైనా సరే రోమ్‌లో మీరెన్నడూ చూడలేని ఘనమైన ప్రదర్శనలు చూసే అవకాశం ఉంది. ప్రత్యేక ప్రదర్శనలు ఏర్పాటు చెయ్యడంలో పేరుపడ్డవాడిని. నాకు కసాయి వాడని మాత్రం పేరురాలేదు. మీ రిచ్చిన డబ్బుకు మించిన పోరాట ప్రదర్శన ఏర్పాటు చేయగలను."

"కాని పోరాట ప్రదర్శన మల్లులు చచ్చేదాకా మాత్రం జరిగితీరాల్సిందే" అన్నాడు బ్రాకస్. "నాతో బేరం పొసగదని మీకు తోస్తే మరో చోటకి వెళతాను" బ్రాకస్ అన్న ఈ మాటలు తీక్షణంగా కనిపించినా, మెల్లిగానే అన్నాడతను.

"మీరు బేరం సాగనివ్వరని నేనన్నానా? రెండు జతలు ఉదయం నుంచి సాయంత్రం వరకు పోరాడే ఏర్పాటు చేస్తాను. అంటే రోజుకి ఎనిమిది గంటలన్న మాట. అందులో ఎవరైనా బాగా దెబ్బతిన్న పక్షంలో ఆ స్థానంలోకి మరొకడిని తెప్పిస్తా. మీకూ, మీ స్నేహితులకూ కావలసినంత సరదా, చూడవలసినంత రక్తం అన్నీ ఉండేలా చేస్తా. అందుకుగాను ఎనిమిదివేల దీనారాలవుతుంది; అందులోనే ఆహారం,ద్రాక్షసారా, తక్కినసౌకర్యాలు అన్నీ ఉంటాయి."

"మాకు కావలసిందేదో మీకు మేం చెప్పాం. ఊరికే బేరమాడుతూ కూచోడం అంటే నాకు చెడ్డ అసహ్యం" బ్రాకస్ కొంచెం కోపంగానే అన్నాడు.

"అయితే సరే. ఇరవై అయిదువేల దీనారాలవుతుంది."

కైయస్‌కు ఆశ్చర్యం వేసింది. ఇంత డబ్బేనా అని భయమేసింది. బ్రాకస్ మాత్రం ఓస్ ఇంతేనా అన్నట్లు భుజాలెగరేసి, "సరే, కాని వాళ్ళు దిసమొలలతో పోరాడాలి."

"సరే, సరే."

"నా దగ్గర మాత్రం నాటకం పనికిరాదు. ఏవో రెండు దెబ్బలు తగిలించుకొని చచ్చిన వాళ్ళలా ఇసుకలో పడుకుని తమాషా చేస్తే మాత్రం నాకు మండుకొస్తుంది. ఎవడు చచ్చినా మీ మనిషొకడు వచ్చి మేం చూస్తుండగా వాడి తల నరకాలి. ఆ ఏర్పాటు ముందుగా మీరు చేసి తీరాలి."

బేటియాటస్ తల పంకించాడు.

"ప్రస్తుతం నేను మీకో పదివేలిస్తాను. మిగిలినది ప్రదర్శన పూర్తి అయ్యాక."

"అలాగే కానివ్వండి. మా గుమాస్తా మీకో రశీదిస్తాడు. ఒడంబడిక మీద సంతకాలు చేద్దాం. వెళ్ళే లోపులో ఆ మల్లు ల్నోమారు చూడాలని ఉందా?"

"పొద్దునకి మే మిక్కడికి రావచ్చా?"

"ఓ! కాని మిమ్మల్ని నేను హెచ్చరించి తీరాలి. ఇటువంటి పోరాటాలు సాధారణంగా ఎంతోసేపు జరగవు. త్వరగా అంతమవుతాయి."

"నన్నేం హెచ్చరించకు మహాశయా" అంటూ కైయస్‌వైపు తిరిగి ప్రశ్నించాడు బ్రాకస్ "వాళ్ళనోమారు చూద్దామని ఉందేమిటోయ్?"

కైయస్ సిగ్గుతో నవ్వి తలూపాడు. డబ్బు చెల్లించి, ఒడంబడిక మీద బ్రాకస్ సంతకం చేసింతరువాత వాళ్ళు బైటకు వెళ్ళి పల్లకీలెక్కారు. అక్కడి నుంచి తాలింఖానాకు పోయారు. బ్రాకస్‌పై దృష్టి నిలిపి తదేకధ్యానంతో చూస్తున్నాడు కైయస్. అంత గొప్పగా, ప్రశంసనీయంగా ప్రవర్తించిన మనిషి కైయస్ దృష్టిలో మరొకడు లేడు. డబ్బునంత ఖాతరు చెయ్యకుండా ఏమీ లెక్కలేనట్లు ఎంత హుందాగా ప్రవర్తించాడని. డబ్బు విషయ మొకటేమిటి. మానవజీవిత మంటేనే అతను చూపే ఆ నిర్లక్ష్యమే అతన్ని ఆకర్షించింది. అదో రకమైన మానవ ద్వేషం, అటువంటిది అలవర్చుకోడమే కైయస్ ఆశయం.

తాలింఖానా వద్ద బానిసలు పల్లకీలు దింపారు. నూటయాభై అడుగుల పొడుగు, నలభై అడుగుల వెడల్పు గల ఆవరణ అది. దానికి మూడువైపులా చుట్టూ పొడుగాటి, గట్టి ఇనుప ఊచలున్నాయి. ఒక వైపున మల్లుల గదులున్నాయి. ఇదంతా చూసే సరికి ఈ మల్లులకు శిక్షణ ఇవ్వడం పులులు, సింహాలవంటి క్రూర జంతువులకు శిక్షణ ఇవ్వడం కంటే చాలా కష్టం అనిపించింది కైయస్‌కు. మల్లుడంటే ఉట్టి ప్రమాదకరమైన క్రూరజంతువే కాదు, ఆలోచించే శక్తి గల తెలివైన క్రూరమృగం. ఆ తాలింఖానాలో నిండు శరీరాలు కలవాళ్ళని చూడగానే ఆహ్లాదం వల్ల ఒళ్ళు జలదరించింది కైయస్‌కి. కర్రలూ, కత్తులూ పట్టుకుని ఓ వంద మంది కనబడ్డారు. వాళ్ళ ఒంటి మీద లంగోటీ తప్ప మరో బట్ట లేదు. జుట్టు కురచగా కత్తిరింపబడి ఉంది, నున్నని గెడ్డాలు. యుద్ధంలో మంచి అనుభవం గడించిన ఆరుగురు శిక్షకులు కూడా ఉన్నారు. శిక్షకుని చేతిలో స్పానిష్ కత్తి, మరొక చేతికి బలమైన ఇత్తడి తొడుగూ ఉన్నాయి. ఆ శిక్షకులు మల్లుల మధ్య అతి జాగ్రత్తగా ముళ్ళ మీద నడిచే వాళ్ళలా నడుస్తున్నారు. ఏ మాత్రం అపాయాన్నైనాసరే ఇట్టే వెతికి పట్టుకోగల కళ్ళతో వాళ్ళు మల్లుల మధ్య మెసలుతున్నారు. ఆవరణ చుట్టూ చాలా చోట్ల నిలబడి పెద్ద పెద్ద ఖడ్గాలు ధరించిన సైనికులు పహారా కాస్తున్నారు. ఆ ఖడ్గాలే చాలు క్రమశిక్షణ పట్టాలు తప్పకుండా చూడడానికి. ఇటువంటి మల్లులెంత తక్కువమంది చచ్చినా వాళ్ళ ఖరీదు హెచ్చే ఉంటుందని గ్రహించాడు కైయస్.

కండలు తిరిగిన శరీరాలు కలిగిన మల్లుల బెబ్బులుల ఠీవిని మరిపించే విధంగా

కనబడ్డారు. ఇంచుమించు వాళ్ళల్లో మూడు రకాలవాళ్ళున్నారు. ఆ రోజులలో ఇటలీలో ఈ మూడు రకాల వాళ్ళే ప్రఖ్యాతి పొందారు. ప్రజలు మోజు చూపించే థ్రేషియన్లున్నారు. థ్రేషియన్లని పిలవబడేవాళ్ళలో గ్రీకులూ ఉండొచ్చు, యూదులూ ఉండొచ్చు. కాని వాళ్లు చేసే ప్రత్యేకమైన సాముపద్ధతి వల్లనే జాతిభేదాలతో సంబంధం లేకుండా వాళ్ళందరినీ థ్రేషియన్లనేవారు. వాళ్ళు 'సికా' అనే చిన్న వంపు తిరిగిన కత్తితో సాము చేస్తారు. థ్రేస్‌లో జూడియాలో ప్రజలా ఆయుధాన్ని సర్వసాధారణంగా వాడుతూ ఉంటారు. ఈ థ్రేషియన్లన బడే వారందరినీ అక్కడినుంచే తీసుకొచ్చారు. 'రిటియార్జై' అనేవాళ్ళిప్పుడే వెలుగులో కొస్తున్నారు. వాళ్ళ యుగం ప్రారంభం కాబోతోంది. రెండు తమాషా అయిన ఆయుధాలతో వాళ్లు సాము చేస్తారు. చేపల వల, చేపలను పొడిచే ఒక రకమైన ఈటె. ఆ ఈటెనే త్రిశూలం అనేవారు. ఇవి వారి పోరాట సాధనాలు. బేటియాటస్ ఎప్పుడూ ఈ 'రిటియార్జై' అనే రకంలో నల్లని పొడవాటి ఆఫ్రికన్లనీ, ఇథియోపియన్లనీ చేర్చేవాడు. ఉట్టి కత్తి కాని, లేదా కత్తీ, కేడెమూ ఉపయోగించే మర్మిలోన్లనే వాళ్ళకూ రిటియార్జైలకూ ఉజ్జీకట్టేవాడు. 'మర్మిలోన్లు' జర్మన్, గాల్ జాతులకు సంబంధించిన వాళ్లు.

"ఒక నల్లవాడినీ, థ్రేషియన్‌నీ ఉజ్జీ కట్టించండి" అన్నాడు బ్రాకస్.

ఒక్క క్షణం అతనికేసి చూసాడు బేటియాటస్. "అదేం ఉజ్జీ, థ్రేషియన్ ఆయుధం చిన్నబాకు" అన్నాడు.

"నా కదే కావాలి" బ్రాకస్ పట్టుపట్టాడు.

బేటియాటస్ అర్థం కానట్లు చూసి అతనికి కనపడ్డ ఒక శిక్షకుడివైపు రమ్మన్నట్లు తలూపాడు. నృత్యంలాగ, ఖచ్చితంగా చెయ్యబడుతున్న కసరత్తు చూస్తున్నాడు కైయస్. యూదులూ, థ్రేషియన్లూ చిన్న చిన్న కత్రకత్తులతో, డాళ్ళతో అభ్యాసం చేస్తున్నారు. నల్లటి ఆఫ్రికన్లు వలలు విసురుతూ, పొడుగాటి కర్రలనూపుతూ ఆభ్యాసం చేస్తున్నారు. పెద్ద పెద్ద శరీరాలు కలిగిన బలిష్టమైన గాల్‌లూ, జర్మన్లూ పొడుగాటి కత్రకత్తులతో సాము చేస్తున్నారు. వీటిని చూసిన కైయస్‌లో వ్యామోహపరవశత్వం వ్యాపించింది. తిరిగి తిరిగి అదే కసరత్తును అంత సునాయాసంగా, లాఘవంగా ఎంతో ఠీవితో అభ్యసిస్తున్న అంత సుశిక్షితులైన మనుషులను తానెన్నడూ చూడలేదు. మానవ జీవితం ఎంతో వైభవోపేతమైనది; ప్రాణప్రద మైనది. అటువంటిది ఉట్టి వధ్యశాలాప్రయోజనం సాధించేదిగా తయారు చేయబడుతోంది. ఆ భావం అతనిలో ఒక్క క్షణకాలం తళుక్కున మెరిసి మాయమయింది. రాబోయేదా న్నూహించుకున్న కైయస్‌కు ఇంత భావప్రకోపనం కలిగించే సంఘటన లింకెప్పుడూ తన జీవితంలో లేవనిపించింది. విసుగుదల అతన్ని చంటికుర్రాడిగా ఉన్నప్పుడే వరించి పూలహారం వేసింది. ఇప్పుడు మాత్రం అతను విసుగు చెందలేదు.

శిక్షకుడు వివరిస్తున్నాడు "బాకుకి పదునై నవైపొక్కటే ఉంటుంది. ఒక్క మాటా బాకు వలలో పడిందా థ్రేషియన్ పని సరి. ఈ కేంద్రంలో ఒకడు అనవసరంగా చచ్చాడన్న

మాటే, అదేం సరైన ఉజ్జీకాదు."

"తీసుకురా వాళ్ళని" బేటియాటస్ మధ్యలో ఆపాడు.

"జర్మన్‌తో ఎందుకు కాకూడదు?"

"నేను డబ్బిస్తున్నా. నాతో వాదించొద్దు" బ్రాకస్ ఖండితంగా చెప్పేసాడు.

శిక్షకుడి మెడలో ఈల వేలాడుతోంది. చెవులు గింగురుమనేలా మూడుమాట్లు దాన్ని ఊదేసరికి కసరత్తు చేస్తున్న మల్లులంతా ఆగారు.

"మీ కెవరు కావాలి?" అడిగాడతను బేటియాటస్‌ని.

"డ్రాబా."

"డ్రాబా!" శిక్షకుడు గట్టిగా అరిచాడు.

వలనూ, కర్రనూ ఈడ్చుకుంటూ ఒక నల్లని మనిషి వీళ్ళ వైపు వస్తున్నాడు. దెయ్యం లాంటి మనిషి. చెమటతో తడిసిన అతని నల్లని శరీరం సూర్యకాంతి పడి మెరుస్తోంది.

"డేవిడ్."

"డేవిడ్!" మళ్ళీ అరిచాడు శిక్షకుడు.

ఇతనో యూదు. కోపంతో నిండిన సన్నని పెదవులు, ఆకుపచ్చగా కనపడే కళ్ళూ. నున్నని గెడ్డం, గద్దముఖం, సన్నని మనిషి. అతని చేతిలో కర్ర కత్తి ఉంటుంది. అతని చూపులు వాళ్ళని పొడుచుకుని, పోయి ఎక్కడికో చూస్తున్నాయి.

"యూదులు సికాతో చాలా గమ్మత్తులు చేస్తారు. వాళ్లు దాంతో తప్ప ఇక దేనితోనూ పోరాడలేకపోయినా నేర్పుగా పోట్లాడగలరు" అన్నాడు బ్రాకస్.

"పోలిమస్."

"పోలిమస్!" శిక్షకుడరిచాడు.

ఇతనో థ్రేషియన్. నడియవ్వనంలో ఉండి మంచి అందంగా ఠీవిగా ఉన్నాడు.

"స్పార్టకస్."

అతనా ముగ్గురితోనూ కలిసాడు. ఈ ఇద్దరు రోమను యువకులకూ కొంత దూరంలో ఆ నలుగురూ నిలబడ్డారు. వాళ్ళేదో వింతైన, భయంకరమైనజాతికి చెందిన వాళ్ళని అనుకున్నాడు కైయస్.

"బాగున్నారంటారా?" బేటియాటస్ అడిగాడు.

ప్రాణం పోయినా సరే కైయస్ అయితే దానికి సమాధానం చెప్పకలిగేవాడు కాడు. నెమ్మదిగా బ్రాకస్ అన్నాడు. "ఆ పగిలిన ముక్కున్నవాడు తప్ప, తక్కినవాళ్ళంతా బాగానే ఉన్నారు. అతను మల్లుడిలా కనబడడే."

"పైకి కనిపించేది మోసం చేస్తుంది" బేటియాటస్ అతనికి చెప్పాడు. "అతను స్పార్టకస్. చాలా బాగా, శక్తివంతంగా చురుకుగా దెబ్బలాడగలడు."

"అత నెవరితో ఉజ్జీ కడతారు?"

"ఆ నల్లని మల్లునితో" బేటియాటస్ సమాధానం చెప్పేడు.

"చాలా బాగుంది, డబ్బు కిట్టుబాటయిందనుకుంటా."

ఆ విధంగా స్పార్టకస్‌ను చూసాడు కైయస్. నాలుగేండ్ల పిమ్మట ఆ మల్లుల పేర్లు వగైరా వివరాలేమి జ్ఞాపకం లేకపోయినా, ఆ తెల్లని సూర్యకాంతి, అక్కడ తనకు కలిగిన భావాలూ, తను పీల్చిన చెమటగబ్బూ అతను మరచిపోలేదు.

## 2

ఆ రాత్రి ఆమె నిద్రపోదు. కొద్ది క్షణాలపాటైనా సరే నిద్రను జారనివ్వదు. నిద్రను తరిమేస్తుంది. కళ్ళు తెరుచుకుని చీకటిలో పడుకున్న ఆమె వరీనియా. ఆమె పక్కన స్పార్టకస్ మాత్రం నిద్రపోతున్నాడు. ఎంతో ఆరోగ్యంగా నిద్రపోతున్నాడు. ఎంతో సంపూర్ణమైన నిద్ర ననుభవిస్తున్నాడు. మెత్తని మెల్లని ఉచ్ఛ్వాసనిశ్వాసాలే అతనిలో మండే అగ్నికి ఆజ్యం.

ఉదయాన్నే తానెదుర్కోవలసినదాన్ని తెలుసుకున్న మానవుడు, తనకు సంభవింపనున్నదేదో ముందుగానే తెలిసిన మానవుడు ఇంత నిశ్చింతగా ఈ విధంగా ఎలా నిద్రపోగలడు? అతనికా శాంతి ఎక్కడి నుండి లభిస్తుంది?

అతి తేలికగా మెల్లగా వరీనియా అతన్ని స్పృశిస్తుంది. అతని చర్మాన్ని, కండలను, అవయవాలను, తన చేత్తో నెమ్మదిగా తాకుతుంది. అతను నిద్రిస్తున్నాడు. అతని చర్మం జీవం తొణికిసలాడుతూ, నిగనిగలాడుతూ ఉంది. కండలు సడలి, అవయవాలు వదులై విశ్రాంతి తీసుకుంటున్నాయి. ఎంతో విలువైనది నిద్ర. నిద్రే అతనికి జీవం పోస్తుంది.

నిద్రించు, నిద్రించు, నా ప్రేమైక హృదయాంతరంగుడా, నా మృదువైన ఉగ్రస్వరూపీ. నిద్రించు. నిద్రించి నీ శక్తి వృధా చేయక జాగ్రత్త పెట్టు.

ఆమె శరీరమంతా అతని శరీరాన్ని తాకేలా, ఆమె హృదయసీమ అతని హృదయ ధ్వనిని ఆహ్వానించేలా, వినేలా, ఆమె ముఖమతని ముఖానికి చేర్చి బుగ్గకు బుగ్గ చేరేలా ఆమె బంగారు శిరోజమతని శిరోభూషణమైన కిరీటాన్ని పోలినట్లు చేసేలా, నెమ్మదిగా అతనిపై వాలింది. ఇప్పటి మధురస్మృతుల వల్ల, ఈ ప్రేమ వల్ల ఆమెలోని భయాలు శాంతించాయి. ప్రేమ, భయం ఒకే చోట నివసించలేవు.

మా జాతి నమ్మికతో చేసే ఒక పని నువ్వు చెయ్యాలి అందామె ఒకసారి. అతనామెను చూసి చిరునవ్వు నవ్వాడు. "ముక్కు నుంచీ, నోటి నుంచీ ఆత్మపైకి వెళుతుందని; ఊపిరి విడిచినప్పుడల్లా ఆత్మ పైకి వెళుతుంటుందని నా తెగవారి నమ్మకం. నువ్వు గ్రీకువాడివి. గ్రీకు లేదీ నమ్మరు" అందామె. "నేను గ్రీకు వాడిని కాను, థ్రేషియన్‌ని. ఐనా గ్రీకులేది నమ్మరన్నది నిజం కాదు." "గ్రీకులు దేన్ని నమ్మితే నాకెందుకు? తన తెగలో వాళ్ళు చేసేది అతను చేస్తాడా? ఆమె నోటికతని నోటిని ఆనించి అతని ఊపిరినీ, ఆత్మనూ ఆమెలోకి పంపుతాడా? అప్పుడామె కూడా అతనికంతే చేస్తుంది. వాళ్ళ ఆత్మ లొకదానితో ఒకటి

కలిసి భిన్న స్వరూపాలు కలిగిన ఒకే ఆత్మగా చిరస్థాయిగా నిలిచిపోతాయి."

చిన్న పరుపుమీద ఆ గదిలో ఆమె అతనితో శయనించింది. ఆ గది వాళ్ళ ఇల్లు. ఏడడుగుల పొడవు. ఐదడుగుల వెడల్పు గల గది అది. దానిలో ఉన్నవల్లా ఒక కుండ, చిన్న పరుపు. ఇవైనా వాళ్ళ స్వంతం కావు. ఏదీ వాళ్ళది కాదు; వాళ్ళిద్దరూ కూడా వాళ్ళ స్వంత ఆస్తి కానే కాదు.

నేను స్త్రీలను దానం చెయ్యను, ఎరువిస్తా అని చెప్పడం బేటియాటస్‌కు ఎంతో సరదా. నా మల్లులకు నే నెరువిస్తాను. పురుషాంగం ముడుచుకుపోయేవాడు బరిలో ఎందుకూ పనికిరాడు. మల్లుడంటే పల్లకీబోయీ కాదు. మల్లుడంటే మొగాడు. మొగాడు కాకపోతే చూసేవాళ్ళు పదిదీనారాలైనా ఇవ్వరు. మగాడికి ఆడది కావాలి మరి. అందుకే చస్తే లొంగని ఆడాళ్ళను కొంటా. వాళ్ళెవరికీ లొంగరు కాబట్టి వాళ్ళను చవకగా అమ్మేస్తారు. నా మల్లులకు చెబుతా. అబ్బాయిలూ వీళ్ళని మచ్చిక చేసుకోండి, లొంగదీసుకోండని.

వరీనియా బేటియాటస్‌లో మోహపూరితమైన ఆశలు విప్పింది. అతని ఏజెంట్లామెను రోమ్‌లో 500 దీనారాలకు కొన్నారు. ఆమెలో ఏ దుర్గుణమూ లేకపోతే అంత అందంగా ఉన్నదాన్ని అంత చవకగా ఎవరూ అమ్మరు. ఐనా ఆమెకేసి చూస్తే ఆశ, మోహం అతనిలో విజృంభించకమానలేదు. జర్మను తెగల స్త్రీల వలె ఆమె పొడుగ్గా, మంచి అవయవ సౌందర్యం కలిగి, కంటికి నదరుగా ఉంది. ఇటువంటి పొడుగాటి సౌందర్యవంతులే బేటియాటస్ ప్రశంసలకు పాత్రులయేవారు. దీనంతటికి తోడు ఆమె ఇరవైయేళ్ళయినా నిండని జవ్వని. అదీకాక ఆమె బంగారుజుట్టుతో మనోహరంగా ఉంటుంది. అందువల్ల బేటియాటస్‌కు ఆమె పట్ల ఎంతో మోజు.

మొదటి రాత్రి ఆమె పొందుకై ప్రయత్నించినప్పుడే అతనికి తెలిసిపోయింది ఆమెలో లోపం. పిచ్చెత్తిన పులిలా తయారయిందా రాత్రి. కాళ్ళతో తన్నుతూ, ఉమ్మేతూ, గిచ్చుతూ, గీరుతూ భయంకరంగా తయారయింది. మంచి బలమైన శరీరం కనుక స్పృహ తప్పేవరకూ ఆమెను కొట్టడం కూడా చాలా కష్టమయింది. ఆ యుద్ధంలో అతని గదిలోని ఖరీదైన వస్తువులన్నీ రూపుమాసిపోయాయి. ఆమె పడిపోయేదాకా కొట్టడం వల్ల అందమైన గ్రీకు పూలకూజా కూడా పొడై పోయింది. అతని భంగపాటు, ఆగ్రహమూ ఆమెను చంపి పారెయ్యమని తెగబలవంతపెట్టాయి. అతను కొట్టడాని కుపయోగించిన విలువైన దీపాలూ, ఖరీదైన పాత్రలూ, విగ్రహాల ఖరీదూ, ఆమెను కొనడానికి ఖర్చయిన డబ్బూ కలిపితే ఆమె విలువ ధనం రూపంలో హెచ్చయిపోయి, ఆమెను చంపడం వల్ల నష్టమే అధికమౌతుంది కాని లాభం లేదనుకున్నాడు. ఆమె రూపానికి తగ్గ ధరకామెను బజారులో అమ్మెయ్యడానికి కూడా అతనికిష్టంలేదు. ఆమెను మల్లుల కప్పగించి, వాళ్ళ చేత దీని మదం అణిగేలా చేయిద్దాం; వాళ్ళ చేత లొంగదీయిద్దాం అనుకున్నాడు. అప్పటికే పగిలిన ముక్కుతో గొర్రెను పోలిన ఆకృతికల స్పార్టకస్‌ని అతడు అసహ్యించుకునేవాడు. అతని బహిరాకృతి లోపల

కణకణ మండే జ్యోతిని కప్పుతోందని బేటియాటస్ కేం తెలుసు! ఆ జ్యోతినే తక్కిన బానిసలంతా గౌరవిస్తారని అతనేం ఎరుగును. తన అసహ్యానికి గురి అయిన స్పార్టకస్ ఆమెకు తగిన జతగాడని అనుకున్నాడు బేటియాటస్.

ఈమెను నువ్వుపయోగించుకో అని వరీనియాను అతనికిచ్చి స్పార్టకస్‌ను పరిశీలనగా చూస్తున్నాడు. అంతగా తా నసహ్యించుకునే వీడేమనుకుంటున్నాడో ఏమంటాడో చూద్దామని అతనున్నాడు. నీ ఇష్టం వచ్చినట్లు చేసి ఈమెను లొంగదీసుకో. కాని కొట్టడం, అనాకారిగా చెయ్యడం పనికిరాదు. ఆమెను చూస్తున్న స్పార్టకస్‌లో కామం లేదు. నిశ్శబ్దం తాండవిస్తోంది. ఆ సమయంలో వరీనియా ఏమీ అందంగా లేదు. ఆమె ముఖం మీద రెండు లోతైన, బలమైన గాయాలున్నాయి. ఒక కన్ను బాగా వాచి, ఎర్రగా కనిపిస్తోంది. కమిలిన దెబ్బల దద్దు లామె నుదుటి మీద, మెడమీద కనిపిస్తున్నాయి. చేతుల మీద కూడా అదే.

చూడు నీ కేం ఇస్తున్నానో, అని అప్పటికే చినిగి పేలికలుగా ఉన్న ఆమె బట్టల నూడతీసాడు. స్పార్టకస్ ఎదుట ఆమె వివస్త్రయై నిలబడింది. ఆ క్షణంలో ఆమె స్పార్టకస్ ప్రేమను చూరగొంది. ఆ క్షణంలో ఆమెను చూసేసరికి అతనిలో ప్రేమ పెల్లుబికింది. అతను ప్రేమించినది ఆమె నగ్నస్వరూపాన్ని కాదు. తన కళ్ళల్లో, ఆత్మలో, హృదయంలో, తుఫానులా రేగిన భావాలనామె అణచుకొని, తోసుకొస్తున్న క్రోధాన్ని నిలదొక్కి, రగిలే బాధనీ, ముంచుకొచ్చే అవమానాన్నీ పైకి కనబడనీయకుండా, ఊడతీస్తున్న బట్టల్ని పట్టుకు వేలాడ కుండా మానాన్ని తన చేతులతోనైనా కప్పుకుందుకు అణుమాత్రం ప్రయత్నమైనా చెయ్యకుండా నిశ్చల సమాధిలా, మౌనముద్రాభంగిమ నభినయించే నాట్యకత్తెలా, ఠీవిగా, హుందాగా, బేటియాటస్‌ను కాని, స్పార్టకస్‌ను కాని చూడకుండా తన కలలో తానై, తన భావమే తానై నిలబడి బట్టలు లేకపోయినా వివస్త్ర కాని ఆమెను ప్రేమించాడతను. ఆమెనే ప్రేమించాడు.

ఆ రాత్రి ఆమె ఓ మూల ముడుచుకు పడుకుంది. అతనామె జోలికి పోలేదు. కాని రాత్రి చలి హెచ్చవుతున్నప్పుడు మాత్రం "అమ్మాయీ! నువ్వు లాటిను మాట్లాడుతావా?" అని అడిగాడు. దానికి సమాధానం లేదు. "నాకు జర్మన్ భాష రాదు కనుక లాటినులో మాట్లాడుతున్నా. చలి హెచ్చవుతోంది. చాప మీద పడుకో." అప్పటికీ సమాధానం రాలేదు. చాపను ఆమెవైపు జరిపాడు. పొద్దునలేచి చూసే సరికి ఆ చాప వాళ్ళిద్దరి మధ్య పడి ఉంది. ఇద్దరూ నేల మీదే పడుకున్నారు. సంవత్సరంన్నర క్రితం జర్మనీ అడవులలో తనను బంధించి తీసుకొచ్చింది మొదలు ఇప్పటి వరకూ మరొక జీవి తన పట్ల అంత దయార్ద్ర హృదయంతో ప్రవర్తించిన సంఘటన అదొక్కటే అనుకుంది.

ఉదయం కాబోయే ఆ చల్లని నిశా సమయాన అతన్ని చూస్తుంటే ఆమెలో ఆ మొదటి రాత్రి మధురస్మృతులు కరిగి మహోత్తుంగ ప్రేమతరంగాల్లా ఉప్పొంగుతున్నాయి. ఇది అతను గుర్తించలేకపోతే అతని హృదయమొక పాషాణమే. అతను కదిలాడు. వెంటనే కళ్ళు తెరచి ఆ మసక చీకటిలో ఆమెను తన బహిరింద్రియం ద్వారా కాక అంతరేంద్రియంతో

చూశాడు. ఇంకా పూర్తిగా మెలకువ రాలేదతనికి. ఆమెను తన వైపు లాక్కొని లాలించాడు.

అప్పుడామె అతని బాహువుల్లో కూరుకుపోయి అతని హృదయాన్ని కన్నీటి చుక్కలతో తడుపుతుంది.

# 3

ఆ ఉదయమే పోరాటం జరగాలి. అది ఆ గాలిలో, ఆ ప్రదేశమంతటా రెండు వందల మందికి పైగా ఉన్న ఆ మల్లులలో ప్రతి ఒక్కడిలో విద్యుత్తులా ప్రవహించి సర్వ వ్యాపకమైంది. ఇద్దరు రోమను కుర్రాళ్ళు డబ్బు సంచులు మూటకట్టుకొని పట్టుకొచ్చారు. కనుక రెండు జతల మల్లులు అంటే నాలుగు నిండు ప్రాణాలు ఇసుకలో నెత్తురు కారి చావాలి. ఇద్దరు థ్రేషియన్లు, ఒకడు ఆఫ్రికన్, ఒకడు యూదుడు. ఆఫ్రికన్ వల, త్రిశూలం ఉపయోగిస్తాడు కాబట్టి పని సులభమైపోతుంది. చాలా మంది వర్తకులిటువంటి ఉజ్జీలనే సహించరు. ఆకుక్కను నువ్వు పెంచావు కాబట్టి దాన్ని సింహంతో పోట్లాడించు అంటే బాగుంటుందా. కాని బేటియాటస్ డబ్బు కోసం ఏమైనా చేస్తాడు.

నల్లని మల్లుడు డ్రాబా ఆ రోజు ప్రాతఃకాలాన్ని తన స్వంత భాషలో ఆహ్వానిస్తూ వందన సమర్పణ చేశాడు. "మృత్యుదివసమా నమస్కారం" చాప మీద పడుకొని ఆలోచనలో పడ్డాడు. ప్రతి నిస్సహాయుని జీవితంలోనూ కరుణ, ప్రేమ, ఆటల, పాటల, తీయని మాటల, ముద్దులమూటల, మధుర క్షణాల చక్కని స్మృతులుంటాయనీ, ఆనందంతో అనురాగంతో గెంతిన రోజు ఉండకపోదనీ, ప్రతివాడూ చావుకు భయపడతాడనీ అనుకొన్నాడు. జీవితం నిరర్థకంగా సాగుతున్నా దాన్నే పట్టుకుని వేలాడుతాడేం ప్రతివాడూ? తన కుటుంబం నుంచి, ఇంటి నుంచి, దేశాన్నుంచి, ఆఖరికి ఆశల నుంచి దూరమైన మానవుడు, దయాదాక్షిణ్య రహితంగా అవమానానికీ, అనాదరణకీ, బాధలకీ బానిస అయిన మానవుడు, ఇతరుల ఆనందం కోసం, ఒకళ్ళనొకళ్ళు పొడుచుకు చంపుకునేందుకు శిక్షణ పొంది జంతువులా బతికే మానవుడు జీవితాన్ని పట్టుకు వేలాడతాడేం? బతుకంటే వ్యామోహం చూపిస్తాడేం?

తను ఒకప్పుడు నిజాయితీగా బతికిన గృహస్తు. ఇల్లూ, వాకిలీ, పెళ్ళాం పిల్లలతో శాంతియుత దినాలలో గౌరవింపబడి, యుద్ధ సమయాలలో ఆదరింపబడిన జీవితం తనది. ఆటువంటి స్వచ్ఛంద జీవితాన్ని గడిపిన తను చేపల వల చేత బట్టి, త్రిశూలం సంధించి, ఎవరో కేరింతలు కొట్టడానికనీ, చప్పట్లు చరుస్తారు కదా అనీ, నవ్వడానికనీ మరొకడిని చంపాలి.

ఆ రోజు నిద్ర లేచాక అతని ఎముకలు, కండలు నొప్పిగా ఉన్నాయి. తన మనస్సునూ, శరీరాన్నీ స్పార్టకస్‌ను చంపడానికి సంసిద్ధపరచ పూనుకున్న కొద్దీ అవి మరింత నొప్పెడుతున్నాయి. తెల్లవాళ్ళందరిలోకీ అతను స్పార్టకస్‌నే అమితంగా గౌరవిస్తాడు. ప్రేమిస్తాడు. కాని "మల్లుడా! మల్లుల సహవాసం మాను" అని చెప్పారు.

# 4

స్నానశాలవైపు నలుగురూ మౌనంగా నడుస్తున్నారు. మాట్లాడి ప్రయోజనం లేదు; ఇప్పుడు మాట్లాడుకోవలసినదీ లేదు. అప్పటి నించి గోదాకి పోయే వరకూ వాళ్ళు కలిసే ఉన్నప్పటికీ మాట్లాడుకోవడం పరిస్థితిని మరింత పాడు చేస్తుంది.

అప్పుడే స్నానాల తొట్టెలు ఆవిరి సెగలతో వేడెక్కాయి. స్నానశాల చాలా భాగం చీకటిగానే ఉంది. నలభై అడుగుల పొడవూ, ఇరవై అడుగుల వెడల్పూ ఉండి తలుపులు మూసినపుడు ఇంటి కప్పులో ఉన్న చిన్న అద్దపు కిటికీల గుండా కొద్ది కాంతి ప్రసరిస్తుందే తప్ప ఇంకే వెలుతురూ రాదు. ఈ పాలిపోయిన వెలుతురులో నీరు మబ్బుగా ఉంటుంది. తెల్లని ఆవిరి దానిపై తెరలు కమ్మి ఆ గదినిండా అల్లుకుంది. స్పార్టకస్ శరీరంలోంచి ప్రతి రంధ్రం ద్వారా అది ప్రవేశించి బిర్ర బిగిసిన అతని ప్రతి కండరాన్ని వదులు చేసింది. ఏదో అనిర్వచనీయమైన హాయినీ, సౌఖ్యాన్ని ప్రసాదించింది. ఈ ఆవిరి, ఈ వేడి నీళ్ళు అతనికి అంతుచిక్కని ఆశ్చర్యం కలిగిస్తాయి. ఐనా న్యూబియా ఎడారి మృత్యువును మాత్రం నుండి సంపూర్ణంగా కడిగివేయలేకపోయింది. గోధుమ, బార్లీ, బంగారం మొదలైన మానవావసర వస్తూత్పత్తిలో తాను పాల్గొన్నంత కాలం అతని శరీరం మురికితో అసహ్యంగా, అనవసరమైందిగా ఉంచబడేది. కొరడా దెబ్బలకు, తన్నులకు, తాడింపులకూ, మాడ్చి చంపడానికి తన శరీరాన్ని ఉపయోగించేవారు. కాని ఇప్పుడు తానొక చంపే, చంపబడే జంతువుగా మారాడు గాబట్టి అశేషశ్రమతో భూమిలోతులో నుండి తవ్వి తీసిన మేలిమి బంగారం కన్నా విలువైనదిగా చూడబడుతున్నది అతని శరీరం.

విచిత్రంగా తోచవచ్చు గాని ఇప్పుడే అతనిలో ద్వేషభావం పొడచూపింది; పూర్వం ద్వేషించడానికి తీరక ఉండేది కాదు. ద్వేషం ఇప్పుడతని కందుబాటులో ఉంది. తన ద్వేషానికి కారకుడయినవాడు లెంటులుస్ బేటియాటస్. రోమ్‌ను అసహ్యించుకున్నాడు, బేటియాటస్‌నూ అసహ్యించుకున్నాడు. రోమ్‌కు సంబంధించిన ప్రతి విషయాన్ని అసహ్యించుకున్నాడు. భూమిని సేద్యం చేయడంలో, పశువుల మందలను పెంచడంలో, మట్టి నుండి బంగారం తీయడంలో పుట్టి పెరిగాడు స్పార్టకస్. తోటి మానవుణ్ణి ముక్కలుగా కోసి చిత్రవధ చేయడానికి, ప్రాణప్రదమైన రక్తాన్ని గోదా ఇసుకలో ప్రవహింపజేయడానికి మాత్రమే పోషించ బడుతున్న మానవుడిని ఒక్క రోమ్‌లోనే అతను చూసాడు.

స్నానశాల విడిచి మాలీసు చేసే బల్లల దగ్గరకు వాళ్ళు వెళ్ళారు. మాలీసువాడి వేళ్ళు నేర్పుగా అతని కండరాలను అత్తరువులు వేసి వదులుగా సాగదీస్తున్నప్పుడు అతనెపుడూ కళ్ళు మూసుకునే ఉండేవాడు. మొదటిసారి ఈ మాలీసు పనికని వచ్చినప్పుడు వెతుకుతూ నలుపుతూ అతని శరీరంపై వేళ్ళు విచ్చలవిడిగా విహరించినప్పుడు తను బందీ అయిన పెంపుడు జంతువులా, ఉన్న కాస్త స్వేచ్ఛా పోగొట్టుకున్నట్లుగా, తన శరీరం పరాధీనమైనట్లుగా బెదిరిపోయాడు. ఇప్పుడతను దాని ఉపయోగానికి అలవాటు పడ్డాడు. ఈ బల్లమీద అతను

పన్నెండుసార్లు పడుకున్నాడు. అంటే పన్నెండుసార్లు పోరాడాడన్న మాట! కేపువాలోని పెద్ద గోదాలో ఎనిమిదిసార్లు! పోరాడినంతసేపూ అరుస్తూ పిచ్చెక్కిన జనసమూహం 'కొట్టు, నరుకు!' అని తనను హెచ్చరిస్తూనే ఉన్నారు. తానెన్నడూ చూడని మహా నగరాలనుంచి తమ ప్రియులతో, ప్రియురాండ్రతో తమాషా ఆనందిద్దామని వచ్చిన ధనవంతులైన రసజ్ఞుల వినోదం కోసం, బేటియాటస్ బరిలో నాలుగుమార్లు.....

ఆ బల్లలపై పడుకున్నప్పుడు సాధారణంగా అతనికి కలిగే ఆలోచనలే ఈనాడు కూడా కలిగాయి. అవి అతని హృదయఫలకంపై చిత్తరువులా నిలిచిపోయాయి. ఎంతో ఘోరమైన గనులలోనిపని, పొలంపని, గోదాలో నిలబడి మరో అభాగ్యుని హతమార్చడంకన్నా ఘోరం కాదు. అక్కడి బీభత్స దృశ్యం మరెక్కడా చూడం. చావడానికి నిర్ణీతమైన ఆ సమయంలో కలిగే అవమానం మరెన్నడూ కలగదు. అందుకే ఏ రకమైన మానవజీవిత విధానం మల్లుని జీవితమంత నీచమైనది కాదనుకున్నాడతను. ఉత్తమాశ్వాన్ని పెంచినట్లు పెంచుతున్నారు! ఐనప్పటికీ ఈ గోదాలోనే ఒక గుర్రాన్ని చంపుదామా అని ఎవరైనా అంటే లెంటులుస్ బేటియాటస్, అతని వంటి రోమన్ పౌరులు ఉన్నపాటున మండిపడేవారే! అవమానాన్ని, భయాన్నీ అతను భరించాడు. మాలీసువాడి వేళ్ళు దెబ్బలు తగిలిన శరీర భాగంలోని ప్రతి అణువునూ, కండరాన్నీ పట్టుకు సాగదీస్తూ లాలిస్తున్నాయి.

అక్కడికే అతడదృష్టవంతుడు. తలచుకొన్నంత మాత్రాన భయంతో, బాధతో తన సహచరులు దిగులు చెందేలాటి గాయాలు తనకెన్నడూ తగల్లేదు. నరాలు తెగలేదు. ఎముకలు విరగలేదు. కంటిగుడ్డు ఊడనూలేదు. కర్ణరంధ్రాల్లో కత్తిపోటు పడనూలేదు. తల బద్దలవనూ లేదు. ఇది నిజంగా అతని అదృష్టమే. అతనికి తగిలినవన్నీ చిన్న చిన్న గాయాలే. అంత తక్కువ దెబ్బలతో బయటపడడం తన నైపుణ్యమేనని అతడు భావించలేదు. చంపడంలో, కసాయితనంలో నైపుణ్యం! పిల్లికున్నంత చురుకుదనం అతనికుంది. ఆకు పచ్చని కళ్ళున్న యూదునికున్నంత చురుకుదనమూ అతనికుంది. తన పక్క బల్లపై పడుకున్న ఆ యూదుడెంత ఏహ్యంగా చూడబడతాడో! మంచి బలమైనవాడూ, ఆలోచించగలిగినవాడు. ఆలోచించినా ఆగ్రహించపోవడమే కష్టం. కాని, గోదాలో కోపం తెచ్చుకున్నాడా చచ్చాడన్న మాటే. భయమయితే ఫరవాలేదు గాని, కోపం మాత్రం రాకూడదు. అదేమంత కష్టంగాదతనికి. ఇంతవరకూ అతని భావాలే అతన్ని బతికేలా చేసాయి. ఈ విషయం ఎవరికీ తెలీదు. "బానిసా. వాడు దేన్నీ గురించి ఆలోచించడు. మల్లుడయితే మృగమే." పైకి అలా కనబడుతుంది. కాని లోపల సరిగ్గా దానికి తల్లకిందులుగా ఉంటుంది. ఎప్పుడైనా జన్మానికి ఓ శివరాత్రిలా ఆలోచిస్తే చాలు స్వతంత్రుడైన మనిషి బతకగలడు! కాని ప్రతిక్షణం, అనునిత్యం ఆలోచిస్తేనే గాని బానిస బతకలేడు! కాని భావం బానిసకు శత్రువు. ప్రతినిత్యం ఎదుర్కొనే శత్రువు. వరీనియాని ఆ ఉదయం వదిలినప్పుడు స్పార్టకస్ అనుకున్నాడు. ఆమె ఎన్నడూ లేదనీ, ఆమె గురించి ఆలోచించకూడదనీ. అతడు బతికితే ఆమె కూడా ఉన్నట్లే;

కాని ప్రస్తుతం అతను బతకనూ లేదు. మరణించనూలేదు.

మర్దన పూర్తయింది. నలుగురు బానిసలూ బల్లలు దిగి ఉన్ని వస్త్రాలను కప్పుకొని భోజనశాలవైపు కదిలారు. ఒక గిన్నెడు మేకపాలు, పందిమాంసం ముక్కలు వేసిన గోధుమపులుసు వడ్డించారు. ఇక్కడికి వచ్చిన ప్రతివాడూ తన జీవితంలో మొదటిసారిగ సుష్టుగా తిన్నది ఈ శిక్షణా కేంద్రంలోనే. కడుపు నిండా తిని దెబ్బలాడలేరు కనుక గోదాలో ప్రదర్శన ఇవ్వవలసినవారికి మాత్రం కొంచెం తక్కువ పెడతారు.

స్పార్టకస్‌కు ఆకలిలేదు. వేరువేరుగా, దూరదూరంగా కూర్చున్న ఆ నలుగురికీ తిండి సయించదు. ఏ మాంసంముక్కో ఒకటి రెండుసార్లు కొరికేవారు. ఒకరి ముఖాన్ని ఒకరు చూసుకునేవారు. చుట్టూ ఉన్న అంత గొడవలోనూ నిశ్శబ్దంగా ఉన్న ఈ నలుగురూ కల్లోల సముద్రం మధ్య ద్వీపంలా ఉన్నారు. తక్కిన మల్లులు వీళ్ళతో మాట్లాడనూలేదు. చూడనూ లేదు. వీళ్ళున్నారనే విషయం పట్టించుకోలేదు. ఇదీ, ఆఖరి భోజనం చేసేవాళ్ళకి ఇచ్చే మర్యాద.

వీళ్ళ నెలా ఉజ్జీలు వేశారో అందరకూ తెలిసిందే. చిన్న కత్తి ఆయుధంగా కల స్పార్టకస్‌ను వల పట్టుకొని త్రిశూలధారుడై పోరాడే నల్లని మల్లుతో ఉజ్జీవేశారని ప్రతివాడికీ తెలిసింది. యూదునితో థ్రేషియన్ దెబ్బలాడాలన్న విషయమూ తెలిసింది. స్పార్టకస్ చస్తాడు. యువకుడయిన థ్రేషియన్ కూడా అంతే అనుకున్నారు. ఇదంతా స్పార్టకస్ తప్పు. జర్మను పిల్లతో తాను పడుకోడమే గాక, ఆమె తన భార్య అని అందరకూ చెప్పడం, అదీగాక అందరూ అతణ్ణి ప్రేమించేలా చేసుకోడం అతని తప్పే! ఆ హాలులో కూర్చున్న మల్లులెవరూ ఈ విషయం స్పష్టంగా చెప్పలేకపోవచ్చు. ఇదంతా ఎందుకు జరిగిందో ఎలా జరిగిందో వాళ్ళెవరికీ తెలీదు. సరళమయిన మృదుస్వభావమూ, గొర్రెవంటి ముఖవైఖరీ, పగిలిన ముక్కూ కలిగి ఉన్నాడు స్పార్టకస్. అతని నిర్ణయాలను అంతా పాటించేలా చేసేందుకు ఇవన్నీ తోడ్పడ్డాయి. న్యాయ నిర్ణయం చేయమని, తేల్చి చెప్పమని అంతా ఇతని దగ్గరకు వచ్చేవారు. అతడు ఏది నిర్ణయించినా తక్కినవాళ్ళంతా దాన్ని పాటించేవారు. వింతైన ఉచ్చారణ చేస్తూ మృదువుగా మాట్లాడే అతని మాటల్ని అంతా వినేవారు. సంతోషంగా ఉన్న వ్యక్తిలా కనపడే వాడతను. ఎప్పుడూ తల వంచలేదు. బానిసలకిది కొత్త! ఎప్పుడూ కోపంగా మాట్లాడలేదు. స్వరం హెచ్చించలేదు. సంతృప్తి అతన్ని తక్కినవారి నుండి వేరు చేసింది. చంపేందుకు శిక్షణ పొందే వీరితో అతను ఆ విధంగా ప్రవర్తించేవాడు.

"మల్లులు మృగాలు!" బేటియాటస్ తరచు అనేవాడు. కాని స్పార్టకస్ జంతువు కా నిరాకరించాడు. అందుకే అతను ప్రమాదకరం. కత్తి నుపయోగించడంలో నిపుణత ఉండడం మూలాన అతని వల్ల చాలా డబ్బు వచ్చే అవకాశమున్నా, మంచి బేరం వచ్చినప్పుడు స్పార్టకస్ లాభసాటిగా చావటమే నయమనుకున్నాడు బేటియాటస్.

భోజనాలయ్యాయి. "వాళ్లెక్కడ? విశేషాధికారాలు గలవాళ్ళు" అనేవారు అటు వంటి వాళ్ళను అట్టి పరిస్థితుల్లో. ఆ రోజు వారిని వెలివేశారు. వాళ్ళను తాకకూడదు. వాళ్లతో మాట్లాడగూడదు. ఆఖరికి వాళ్ళకేసి చూడగూడదు! అయినా గేనికస్, స్పార్టకస్‌ను కౌగిలించుకొన్నాడు. ముద్దెట్టుకున్నాడు. అది చాలా విచిత్రమైన సంఘటన. అందుకు శిక్ష ముప్పయి కొరడా దెబ్బలు. గేనికస్ ఎందుకలా చేశాడో అర్థం చేసుకోలేనివాళ్ళు ఆ మల్లుల్లో లేరు.

# 5

ఆనాటి ఉదయాన్ని లెంటులస్ బేటియాటస్ ఎన్నోమార్లు జ్ఞప్తికి తెచ్చుకుని దీర్ఘాలోచనలోపడేవాడు. ఎన్నోమార్లు దాన్నే తన సూక్ష్మ పరిశోధనకు గురిచేసేవాడు. ఆ తరువాత ప్రపంచాన్ని కదిల్చిపారేసే సంఘటనలు జరిగాయి. ఆ సంఘటనలకు కారణం అదే అని ఆరోపించడానికి ప్రయత్నించేవాడు. ఆడంబరంగా పిచ్చిగా అలంకరించుకున్నారా అన్నట్లు కనిపించే ఇద్దరు రోమను యువకులు తన గోదాలో ప్రత్యేక ప్రదర్శన చూస్తామంటూ రావడం వల్లనే, ఈ విపరీత సంఘటనలు జరిగాయని అతను నిర్ధారణ చెయ్యనేలేదు. ఇంకా ఒక వారం కాలేదు. ఈ సందర్భంలోనే రోమ్‌లో అద్దెకిచ్చే అతని కొంపల్ని గురించి ఆలోచించాడు. ఈ అద్దెకొంపలమీద పెట్టుబడి లాభదాయకమని వర్తకవర్గాలవారు భావించిన రోజులవి. సాధారణంగా వర్తకంలో ఉండే ధరల పెరుగుదల, తగ్గుదల వగైరా సమస్యలు దానిలో లేవు. ఆ ఇళ్లు తెచ్చేరాబడి తగ్గడమంటూ ఉండదు. వీలును బట్టి పెరుగుతుంటుంది. అతను నాలుగంతస్తులమేడ ఒకటీ, ఐదంతస్తుల దొకటీ కొన్నాడు. ప్రతి మేడలో అంతస్తుకో డజను చొప్పున గదులుండేవి. ఏడాదికి ఒక్కో గది మీద తొమ్మిదివందల సెస్టెర్‌సెస్ ఆదాయం వచ్చేది.

అదనపు రాబడి రావాలంటే, అదనంగా అంతస్తులు కట్టాలన్న విషయం గ్రహించడానికి అతనికి అట్టేకాలం పట్టలేదు. తక్కువ జీతాలు సంపాదించేవాళ్ళు మాత్రం పెట్టుబడి పెట్టగలిగే స్థితిలో ఉండేవారు కాదు. ధనవంతులు చుక్కలనంటే భవనాలు నిర్మించుకొన్నారు. వెంటనే తన ఐదంతస్తుల మేడను ఏడంతస్తుల మేడ చేసాడు. అలాగే నాలుగంతస్తుల మేడ మీద మరో రెండంతస్తులు వేయించేసరి కా మేడ కుప్పకూలి చతికిలబడింది. నష్టం వాటిల్లింది అనే విచారానికి తోడు, ఆ కొంపలో అద్దెకున్న ఇరవైమంది చచ్చిన పాపం అతన్ని చుట్టుకొంది. అంతటితో ఒదిలిందా, మొత్తం మీద ఈ గొడవ మాపు చేయించాలంటే ఎంతో డబ్బు లంచాల రూపంలో తగలెయ్యాలి.

ఆ రోజు దుర్దినమన్నది నిజం. పొద్దున్నే గేనికస్‌ని కొట్టడంతో ప్రారంభమైంది. నిజానికి మల్లులను కొట్టగూడదు. ప్రపంచమంతటికీ అద్వితీయమైన, అనుల్లంఘనీయమైన క్రమశిక్షణని యీ శిక్షణకేంద్రం అమలుపరుస్తుంది, ఆచరిస్తుంది. చిన్న కత్తితో పోరాడే మల్లుడిని వల, త్రిశూలం పట్టుకుని పోరాడే ఆఫ్రికావాడితో ఉజ్జీ కట్టడం రెండో తప్పు.

మూడోది ఆ పోరాటం జరిపించడం. ఇవన్నీ మల్లుల క్రోధానికి కారణమయ్యాయి.

అతిథుల రాక కెదురుచూస్తూ, గోదా దగ్గర నిలబడ్డాడు బేటియాటస్. వ్యక్తిగతంగా ఈ రోమన్లంటే ఎటువంటి భావమున్నా, ఏమనుకున్నా డబ్బు కియ్యవలసిన గౌరవమొకటి ఉందిగా. రౌడీమూకల నాయకుడుగా రోడ్లమీద తను తిరిగిన రోజులలో, ఎలాగో ఒక లాగు నాలుగు లక్షలు సంపాదించి యోధవరుల సమాజంలో తానో సభ్యుడుగా చేరాలని తహతహలాడేవాడు. కలలు కనేవాడు. తనూ ఆ పెద్ద మనుషుల జట్టులో జేరిన పిమ్మట, ధనమంటే ఏమిటో, అదేం చేయగలదో గుర్తించి, తానిప్పటికి ఎక్కవలసిన ఎత్తు ఇంకా ఉందని అనుకున్నాడు. అతని కెదురుగా అనంతమైన సోపానపథం కనిపించింది.

అతను కైయస్‌కోసం, బ్రాకస్‌కోసం నిరీక్షిస్తున్నాడు. ఆ హడావుడిలో గేనికస్ కొరడా దెబ్బలు తిన్న సంగతి అతని ఆలోచనలోకి రాలేదు. కూచున్న చోటు నుండి కదలకుండా గోదా అంతా చూడడానికి వీలుగా ఎత్తైన ప్రదేశంలో ఓ చిన్న మంటపం కట్టించాడు. చల్లని ద్రాక్షాసారా, అనేకరకాల తీపి ఫలహారాలూ, రకరకాల పళ్లూ ఎప్పటికప్పుడే వాళ్ళ ఆకలిని తీర్చటానికి అక్కడ ఉంచారు. వాళ్ళ మీద ఎండపడకుండా చారల వితానం ఒకటి ఉంది. మధ్యాహ్నం ఎండ ఎక్కువై, అతిథులకు చెమట పడుతుంది కాబట్టి విసనకర్రలు పట్టుకొని విసరటానికి ఇద్దరు బానిసల్ని నియమించాడు. ఎంత వింతైన, విచిత్రమైన కోర్కెనయినా అతిథులు కోరిన వెంటనే తీర్చడానికని అన్ని ఏర్పాట్లూ చేసాడు. ఆ ఏర్పాట్లన్నీ తన ఆధ్వర్యంలో జరిగినందున కొంత గర్వించాడు. ప్రదర్శన ప్రారంభమయేలోపు వాళ్ళకు విసుగు అనిపించకుండా సంగీతం, నృత్యం ఏర్పాటు చేశాడు.

అతిథులు వచ్చారు. ముందుగా ఒక మల్లుడిని చూస్తామన్నారు. యూదుణ్ణి తీసుక రావడానికని మనిషిని పంపాడు బేటియాటస్. ఇరువైపులా శిక్షకులు నడుస్తుంటే వీళ్ళ దగ్గరగా వచ్చి నిలబడ్డాడు యూదుడు. ఉన్ని వస్త్రం కప్పుకున్నాడతను. కళ్ళు చల్లని గులకరాళ్ళలా ఉన్నాయి. అతిథులలో స్త్రీ పండ్లిగిలించింది. నవ్వలేకపోయినా నవ్వును బలవంతపెట్టింది. కైయస్ హడలిపోయాడు. ఈ మల్లుడు గనుక తిరగబడితే ఆ ఇద్దరు శిక్షకులు వీణ్ణి ఆపలేరని అతడి నమ్మకం. మల్లుడు తనకు బారెడు దూరంలో ఉన్నాడు. గోడకాని, కటకటాలుకాని ఏవీ అతణ్ణి తననుంచి వేరు చేయడంలేదు. ఆకుపచ్చని కళ్ళు, చిన్ననోరు, గెద్దముక్కులా వంపు తిరిగిన ముక్కు, అంటకత్తెర వేసిన తల - వీడి వ్యవహారం చూస్తే మనిషిలా లేడు.

"ఆ గుడ్డ తీసిపారేయ్‌మనండి" అన్నాడు బ్రాకస్ బేటియాటస్‌తో.

"తీసేయ్" అన్నాడు బేటియాటస్.

కొద్ది క్షణాలు అలాగే నిలబడ్డాడు యూదుడు. నిలబడి చటుక్కున తనవంటి మీద బట్టను తీసిపారేశాడు. సన్నంగా, పొడుగ్గా రాళ్ళలాంటి కండలు కలిగిన అతని శరీరం నగ్నంగా నిలబడింది. అతడిపుడు దిగంబరుడు! చలనంలేని కంచువిగ్రహంలా నిలబడ్డాడు. కైయస్ చూశాడు. అతని దృష్టిలో వ్యామోహం పొలుకలిసింది. ల్యూషియస్ విసుగుచెందిన వాడిలా

నటించాడు. గట్టిగా త్వరత్వరగా గాలి పీలుస్తున్న అతని భార్య నోరు తెరుచుకొని అలాగే చూస్తూండిపోయింది.

"కండలు కలిగిన జంతువు" అన్నాడు బ్రాకస్.

యూదుడు వంగి ఉన్ని వస్త్రాన్ని తీసి తిరిగి కప్పుకొని వెళ్ళిపోయాడు. శిక్షకులు వెన్నంటారు.

"అతడిని ముందు దెబ్బలాడమనండి" అన్నాడు బ్రాకస్.

# 6

ఆ కాలంలో యూదులు కాని, థ్రేషియన్లుకాని సాంప్రదాయ సిద్ధంగా పోరాడే బాకుతో పాటు వాళ్ళ కో డాలు కూడా ఇచ్చి తీరాలని చట్టంలో లేదు. అది చట్టరూపంలో ఉన్నపుడు కూడా, చట్టం ఉల్లంఘించడానికే అన్న సూత్రం తరుచూదానికి వర్తిస్తూ ఉండేది. ఇత్తడి చేతి తొడుగులు, శిరస్త్రాణాలలాగనే ఈ డాలు కూడ ఉంటే బాకు యుద్ధంలో ఉండే మజా ఉండదు. దానిలో ఉండే అద్భుత లాఘవం, చురుకుదనం అన్నీ చస్తాయి. నలభై ఏళ్ళ క్రితం మల్ల యుద్ధాలు అక్కడక్కడ అప్పుడప్పుడు జరిగేవి. కవచాలు, శిరస్త్రాణాలు నిడుపాటి పెద్ద పెద్ద డాళ్లు, స్పానిష్ కత్తులతో దెబ్బలాట మొదలెట్టేవారు. దాన్లో ఉషారు లేదు, ఉద్రేకమూ లేదు. రక్తపుబొట్టు కంటికి కనిపించదు. కత్తిమీద కత్తిపడి చప్పుడవడం, డాలు డాలు వేసి కొట్టుకోవడం. ఇలా గంటలకు గంటలు జరిగేది. ఎవడికీ ఒక్క వెంట్రుక కూడా తెగేది కాదు. అప్పుడు కూడా ఈ మల్లయుద్ధం వల్ల డబ్బు సంపాదించేవాడిని ముండను తార్చేవాణ్ణి అసహ్యించుకున్నట్లు అసహ్యించుకునేవాళ్ళు.

మల్లయుద్ధాలలో కొత్త మార్పులు రావడంతో రోమ్ ప్రజలు వెర్రెత్తిపోయారు. ఈ వ్యాపారం చేసేవారిలో ఎంతో మంది రాజ్యాంగసభాసభ్యులయారు. ధనవంతులయారు. దీనికి రెండు ప్రధాన కారణాలున్నాయి. ఒకటి రోమను సైన్యాలు ఆఫ్రికాను జయించడం; రెండు రోమను పెట్టుబడి ఆఫ్రికాలో చొచ్చుకుపోవడం. బలంగా ఎత్తుగా ఉండే నీగ్రోలు బానిస బజారుల్లో కొనుగోలు వస్తువుగా మారారు. మల్లులపై ధనార్జన చేసే వర్తకుడెవడో ఈ నల్లని మనిషి చేతిలో చేపల వలా, త్రిశూలం పెట్టి కత్తితో పోరాడే మరో మల్లునితో ఉజ్జీకట్టి దెబ్బలాడనిద్దామని బుద్ధిపుట్టింది. ఈ తమాషా రోమనులకు నచ్చింది. నానాటికీ దీని మీద మోజు హెచ్చిపోయింది. దాంతో ఇటువంటి పోరాట ప్రదర్శనలు మామూలయిపోయాయి. థ్రేస్, జ్యూడియాలు రోమనుల హస్తగతం అవడంతో పాటు రెండోమార్పు ప్రవేశించింది. అక్కడ కొండల్లో కాయకష్టం చేసే బలవంతులయిన మోటురైతులు పట్టుబడ్డారు. విపరీతమైన పదును కలిగి వంపుతిరిగివుండే ఒక రకమైన చిన్న బాకును వీళ్లుపయోగిస్తారు. నల్లని త్రిశూలధారులకన్న ఈ థ్రేస్, జ్యూడియా రైతులే మల్లయుద్ధ పద్ధతుల్లో ప్రధానమైన మార్పు తీసుకువచ్చారు. సాధారణంగా కవచమూ, కేడెమూ

ఉపయోగించరు. కత్తి కత్తిని, డాలు డాలుని కొట్టుకునే పురాతన మల్ల యుద్ధ రీతులుమారి మెరుపు మెరిసినట్లుండే బాకు యుద్ధం, ఘోరమైన బలమైన గాయాలు, రక్తం, కడుపు చీల్చుకుపోయి వేళ్ళాడే పేగులు, మాంసపు పేలికలూ, యుద్ధనైపుణ్యం, బాధ, విపరీతమైన చురుకుదనం ప్రవేశం చేశాయి.

బ్రాకస్ తన యువస్నేహితునకు చెప్పినట్లు "ఒకమారు థ్రేషియన్ల కొట్లాట చూస్తే ఇంక మరేమీ చూడవు తెల్సా! మిగిలినదంతా అర్థరహితం, విసుగు పుట్టించేదీ. థ్రేషియన్ల పోరాటమే హుషారుగా ఉంటుంది."

ద్వంద్వ యుద్ధానికి సమయం సమీపించింది. నాట్యకత్తె, సంగీత గాయకులు వెళ్ళి పోయారు. ఆ చిన్న బరి ఖాళీ అయింది. నిశ్శబ్దం రాజ్యం చేసింది. ఒక్కొక్కప్పుడు నిశ్శబ్దం బాధపెడుతుంది. రోమన్లు నలుగురూ పందిరి నీడలో కూర్చొని లేత గులాబీరంగు ద్రాక్షసారా సేవిస్తూ నిరీక్షిస్తున్నారు.

# 7

గోదావైపు తెరుచుకున్న ఒక్క షెడ్‌లో ఇద్దరు థ్రేషియన్ మల్లులు ఒక నల్లని ఆఫ్రికా మల్లు కూర్చొని యూదుని కోసం ఎదురుచూస్తున్నారు. సంతోషరహితంగా ఒక బల్లమీద వాళ్ళాసీనులయారు. వాళ్ళను స్వాధీనులని పిలుస్తారు. యశస్సుకాదు, ప్రేమకాదు, గౌరవం కాదు ఇవేవీకాదు; సిగ్గు వాళ్ళ సాహచర్యం చేస్తోంది. మౌనాన్ని తోసిపుచ్చుతూ ఆఫ్రికా మల్లుడన్నాడు :

"భగవంతుడు నన్ను ప్రేమిస్తే బాల్యంలోనే చద్దును."

"కాదు" స్పార్టకస్ వ్యతిరేకించాడు.

అప్పుడా నల్లని వాడు అడిగాడు : "నీకు భగవంతుడంటే నమ్మకముందా?"

"లేదు."

"అయితే నువ్వు నమ్మేదేవిటి స్పార్టకస్?"

అందమైన థ్రేషియన్ యువకుడు పోలిమస్ అందుకుని, "నువ్వూ, నేనూ కసాయి దుకాణంలో వర్తకుడమ్మే మాంసపు ముద్దల్లాంటి వాళ్ళం."

"నువ్వింకా ఏవేవి నమ్ముతావ్ స్పార్టకస్?" నల్లవాడు అడిగాడు. "మనిషి దేన్ని గురించి కలగంటాడు? మృత్యుముఖద్వారంలో నిలబడ్డమనిషి దేన్ని కలగంటాడు?" అన్నాడు స్పార్టకస్.

మృదువుగా మాటాడిన నల్లమల్లుని కంఠస్వరం స్పార్టకస్ హృదయంలో ప్రతిధ్వనిస్తోంది: "నేను చాలా ఒంటరిగా నా ఇంటినుంచి ఎంతో దూరంగా ఉన్నాను. ఇంటికి తిరిగిపోదామనే బలీయమైన కోరికతో ఉంటున్నా. ఇంక ఏ మాత్రం బతకదలుచుకోలేదు. సహచరుడవైన నిన్ను నేను చంపాలి! కాని చంపను."

"కారుణ్యానికి ఇదా చోటు?"

"బడలికకు ఇది ప్రదేశం. నేను అలసిపోయి ఉన్నాను?"

"నా తండ్రి బానిస" స్పార్టకస్ అన్నాడు. "నా కతడొక సుగుణం నేర్పాడు. బానిసలోని ఒకే ఒక సుగుణం జీవించడం."

"మనం ఇద్దరం జీవించడం కష్టం."

"ఇతరులకు మల్లేనే బానిసలకు కూడా అతని చచ్చేరోజులు ముందుగా తెలియనివ్వదు జీవితం."

కాపలావాళ్ళు వీళ్ళ సంభాషణ విన్నారు. బల్లేలతో గోడపై కొట్టి మాటాడకూడదన్నట్లు సైగ చేశారు. యూదుడు వచ్చాడు. ఏ పరిస్థితిలోనూ అతను మాట్లాడడు. అతనెప్పుడూ మాట్లాడలేదు. సిగ్గుతో, విచారంతో వంచిన శిరస్సుతో, కృంగిన హృదయంతో అతనక్కడ నిలబడ్డాడు. బాకా మోగింది. థ్రేషియన్ యువకుడు లేచాడు. అతని కింది పెదవి బరువుగా కదులుతోంది. కప్పుకొన్న బట్టలనక్కడ వదలి వాళ్ళిద్దరూ బయల్దేరారు. తలుపు తెరుచుకుని థ్రేషియన్ యువకుడూ, యూదుడూ దిగంబరులుగా గోదా ప్రవేశించారు.

ఆ నల్లని మనిషికి ఆసక్తి నశించింది. మృత్యుదేవతా పీఠం మీద తను కూచున్నాననుకొన్నాడు. యాభై రెండు పర్యాయాలు వలపన్ని, త్రిశూలం సంధించి బతికి బైటపడ్డాడు. కాని ఇప్పుడు జీవితంతో అతన్ని బంధిస్తూ వచ్చిన తాడు తెగింది. మోచేతులు మోకాళ్ళపై ఆన్చి, అరచేతులలో తల పెట్టుకొని స్మృతులను నెమరు వేస్తున్నాడు. స్పార్టకస్ మాత్రం తలుపు సందులోంచి గోదావైపు చూస్తున్నాడు. థ్రేషియన్ తన జాతివాడే, యూదుడు మాత్రం తన హృదయాన్ని అదోమాదిరిగా చీలుస్తున్నాడు. ఇటువంటి ద్వంద్వయుద్ధాలు జరిగినప్పుడు ఒకడు చావడం తథ్యం. కాని జీవితమున్నంతకాలం జీవించడానికి ప్రయత్నించాలి; స్పార్టకస్ సారాంశం కూడా జీవితమే. అతనిలోని ఆ విషయాన్ని గుర్తించారు ప్రజలు. బతుకుదామనే కోర్కె తారలవరకూ లేచిన ఆశాసౌధం. అతనిప్పుడు తలుపులోంచి చూస్తున్నాడు. గోదాలో జరుగుతున్నదంతా చూస్తున్నాడు.

ఆ మల్లులిద్దరూ బరిలో నిలబడి తమ మాంసాన్నీ, రక్తాన్నీ కొన్న పెద్దమనుషులవైపు చూస్తున్నారు. నూనె పట్టించిన వారి శరీరాలు నల్లగా మెరుస్తున్నాయి. ఇద్దరూ ఒకరి నుంచి ఒకరు పది అడుగులు వెనక్కు తగ్గారు. వాళ్ళని ఇసుక, ఎండ విడతీస్తున్నాయి.

ఇప్పుడు శిక్షకుడు బరిమీదకు వచ్చాడు. రెండు కత్తులు మెరుగుపట్టిన కర్రపళ్ళెంలో పెట్టి గౌరవానికి చిహ్నంగా ప్రదర్శన ఏర్పాటు చేయించుకున్న వాళ్ళ దగ్గరకు తీసుకెళ్ళాడు. వాళ్ళవైపు వంగి పళ్ళెం వాళ్ళకు చూపినపుడు ఎండపడి పన్నెండంగుళాలు పొడుగున్న కత్తుల వాడి అంచులు మరింత మెరిసాయి. నల్ల చేవతో చేసిన పిడి ఉన్న ఆ కత్తులు ఎంతో పనితనాన్ని చూపిస్తాయి. కత్తులు కొంచెం వంపు తిరిగి ఉన్నాయి. దాన్ని తాకితేచాలు, చర్మం కోసుకుపోతుంది.

బ్రాకస్ తలూపాడు. కత్తి తగిలిన మాదిరి స్పార్టకస్‌ను ద్వేషం. ఆపాదమస్తకం తాకింది. ఐనా సంబాళించుకున్నాడు; అణచుకున్నాడు. మల్లులు కత్తులను తీసుకోడం చూసాడు;

వాళ్ళు తన దృష్టిపథం నుండి దూరంగా వెళ్ళారు. ఐనా అతనికి వాళ్ళ ప్రతికదలికా తెలుసు. వాళ్ళిద్దరినీ ఆందోళన హెచ్చరిస్తోంది. వాళ్ళలో నిరుపయోగమైన చురుకుతనం కదులుతోంది. ఒకరినొకరు చూసుకొంటున్నారు. ఒకరినుంచి ఒకరు ఇరవై అడుగుల దూరం పోయారు. ఒంగి ఇసుకలో కత్తిపిడి తోముతూ చేతులకు ఇసుక పట్టించుకుంటున్నారు. వాళ్ళ హృదయాలు వేగంగా, బలంగా, బరువైన యంత్రాలలా కొట్టుకుంటున్నాయి. వణుకుతూ, బిగిసిన రబ్బరు తాళ్ళలాగున్నాయి వాళ్ళ కండలు.

శిక్షకుడు ఈల ఊదాడు; మల్లులిద్దరూ తిరిగి స్పార్టకస్ దృష్టిపథంలోకి వచ్చారు. మెరిసే కత్తులు పట్టుకొన్న ఆ దిగంబరులైన మల్లులిద్దరూ పొంచి ఉన్నారు. భూమిని గట్టిగా అదిమిపట్టినట్లు చిన్న చిన్న అడుగులేస్తున్నారు. నేలకు పాదాలు పూర్తిగా ఆన్చి మోపుతూ, ఇంతలో తొందరగా, వడిగా అడుగువేస్తున్నారు. ముందుకు పోబోయి వెనక్కు తగ్గుతున్నారు. ఆ ఎండలో ఇసుకలో వాళ్ళ పాదాలు నేలను బలంగా తాకుతున్నాయి. ఇంతలో వాళ్ళు దగ్గరగా వచ్చారు. కంపిస్తున్నారు. వచ్చిన వెంటనే విడిపోయారు. రోమన్లు చప్పట్లు కొడుతున్నారు. యూదుని ఛాతీపై సన్నని రక్తపుచార మెరిసింది.

తగిలిన దెబ్బగురించి మల్లులిద్దరికి తెలియదు. వాళ్ళనే ఆధారంగా చేసుకొని తీవ్రంగా, వేగంగా, పూర్తిగా భూమి తిరుగుతోందా అనిపించేలా వాళ్ళిద్దరూ ఒండొరులపై దృష్టి కేంద్రీకరించి చూస్తున్నారు. కాలచక్ర పరిభ్రమణం ఆగింది. జీవితం, అనుభవం యావత్తూ వీరిరువురి మీదా కేంద్రీకరింపబడినట్లుంది. ఒకరినొకరు ఆ విధంగా తీవ్రంగా చూసుకోడం, వాళ్ళిద్దరికీ బాధాకరంగా పరిణమించింది. తీవ్ర నిర్ణయం శక్తి ఒకేఒక్క సంపూర్ణ కంపనం కింద మారిందా అనిపించే మాదిరి వాళ్ళిద్దరూ ఒకరినొకరు తాకారు. అప్పుడు వాళ్ళిద్దరూ మెలివేసుకుపోయారు. రెండు శరీరాలూ విడదీయలేని విధంగా కలిసిపోయాయా అనిపించేలాగున్నారు. ఎడంచేత్తో కుడిచేతిని పట్టుకొని, శరీరం, శరీరం కలిపి ముఖానికి ముఖం చేర్చి నిలబడ్డారు. బిగిసిన పిడికిలి ఇరువురికి నొప్పెట్టింది. మరింత దగ్గరగా వచ్చి ఒకరినొకరు చంపాలని మౌనంగా అరిచారు. ఒకరినొకరు ద్వేషించుకొన్నారు. వాళ్ళిద్దరికీ ఒకేఒక్క ప్రయోజనం తెలుసు. అది మృత్యువు ప్రయోజనం. ఒకడు బతకాలంటే, మరొకడు చచ్చితీరాలి. ఒకరికొకరు పెనవేసుకుపోయారు. బిగిసిన నరాలతో, కండలతో వాళ్ళిద్దరూ అసలు ఒకే శరీరమన్నట్లూ, దాన్నెవరో అనవసరంగా మధ్యకు చీల్చడం వల్ల రెండు అర్ధభాగాలుగా మారినట్లూ అనిపించారు.

రక్తమాంసాలు ఓర్చుకోగలిగినంతసేపు వాళ్ళల్లాగే నిలబడ్డారు. థ్రేషియన్ భుజం మీద పెద్ద యెర్రని చార కనిపించింది. రొప్పుతూ, రోజుతూ, ద్వేషించుకుంటూ, కంపిస్తూ, రక్తం, నూనె చెమట పామిన శరీరంతో రక్తధారలు వాళ్ళ పాదాలవద్ద ఇసుకరేణువులకు ఎర్రరంగు పూస్తుంటే, ఒకరికొరు పన్నెండడుగుల ఎడంగా విసిరివేయ బడ్డారు.

అప్పుడు థ్రేషియన్ దెబ్బతీసాడు. చేతిని సాచి కత్తి ఝళిపిస్తూ యూదుని మీద అశనిపాతంలా పడ్డాడు. మోకాలు భూమికాన్చి, కత్తిమొన పైకి పట్టి, దెబ్బ తప్పించుకొని

థ్రేషియన్‌ని వెనక్కి తోసేసాడు యూదుడు. థ్రేషియన్ భూమిపై పడ్డాడో లేదో యూదుడప్పుడే అతనిమీదున్నాడు. ఆ ప్రదర్శనలో అదే అత్యావేశజనకంగా, భీకరంగా, బ్రహ్మాండంగా కనిపించే ఘట్టం. మృత్యువు థ్రేషియన్ శరీరాన్ని కోసుకొని లోపలికి జొరబడుతోంది. అతను మెలికలు తిరిగాడు, దొర్లాడు, వణికాడు, ఘోరమైన ఆ కత్తి దెబ్బనుంచి రక్షించుకుందుకు పాదాలడ్డుపెట్టాడు. కాని అతని శరీరమంతా యూదుని ఆధీనంలోకి పోయింది. యూదుడు తెగపొడుస్తున్నాడు, కోసి పారేస్తున్నాడు. థ్రేషియన్‌కి శక్తి నశిస్తోంది. చంపగలిగే దెబ్బ, అవతల వాడిని కొట్టగల శక్తి అతనిలో లేదు; కంపిస్తున్నాడు. నిరాశాపూరిత సాహసం అతన్ని ఏదో చెయ్యమంటోంది.

థ్రేషియన్ నిలబడగలిగాడు. రక్తసిక్తమైన అతని శరీరం ఎలాగో లేచిందని చెప్పాలి. అతన్ని కిందపడేసిన దెబ్బ అతని ప్రాణానికే దెబ్బకొట్టింది. బలాన్ని వమ్ముచేసింది. ఒక చేత్తో పడకుండా కాసుకుంటూ, నిలదొక్కుకుంటూ, కత్తి పుచ్చుకుని, ముందుకూ, వెనక్కూ ఊగుతూ యూదుని దెబ్బలు తప్పించుకుందుకు గాలిలో కత్తి తిప్పుతున్నాడు. గాలినే పొడుస్తున్నాడు. యూదుడు దూరంగా నిలబడి ఇతని సమీపానికింకా రాలేదు. థ్రేషియన్ ముఖం మీద పోట్లుపడ్డాయి. మోకాలి నరాలు తెగి, చేతులుతెగి, కాళ్ళుతెగి, శరీరమంతా తెగి తన ప్రాణప్రదమైన రక్తం పాదాలకింద ఇసుకలోనికి ప్రవహించి ఇంకుతోంది.

ఐనా చావుబతుకుల నాటకంలో అద్భుతమైన చరమాంకం సమాప్తం కాలేదు. అప్పటి వరకూ పరవశత్వపు మైకంలో పడ్డారు ప్రేక్షకులు. గొంతులు బొంగురయ్యేటట్లు "బలే! బలే!" "కొట్టు! కొట్టు!" అంటున్నారు.

యూదుడు మాత్రం కదల్లేదు. అతనికి ఒక్క దెబ్బే పడింది. కాని, రక్తం కారడానికి అదిచాలు. కదిలినప్పుడల్లా రక్తం దాన్లోంచి కారిపోతోంది. హఠాత్తుగా అతడు తన కత్తిని ఇసుకలోకి విసిరేశాడు. తలవంచుకుని నిలబడ్డాడు.

శరీరం ప్రతి అంగుళం రక్తాన్ని పోసుకున్న థ్రేషియన్ మోకాటిమీద నేలకొరిగాడు. కత్తిని వదలి ప్రాణం వదిలే స్థితిలో ఉన్నాడు. రోమన్లు గొంతు చించుకుంటున్నారు. ఎడ్లను తోలే కొరడాలాంటిది ఒకటి ఈడ్చుకుంటూ, శిక్షకు డొకడు అక్కడకు వచ్చాడు. వెంట ఇద్దరు సైనికులున్నారు.

"దెబ్బలాడరా! చెత్త వెధవాయి!!" శిక్షకుడు అరిచాడు. కొరడా తాడు యూదుని నడుంచుట్టూ, పొట్టచుట్టూ తిరుగుతోంది.

"దెబ్బలాడు" అని కొరడా పదేపదే బలవంతపెడుతోంది. అతడు కదలడు. థ్రేషియన్ బోర్లపడి బాధతో మూల్గుతున్నాడు. నెమ్మదిగా ఏడుస్తున్నాడు. బాధనింక భరించలేక తీవ్ర స్థాయిలో గట్టిగా విలపిస్తున్నాడు. బాధలఏడ్పు ఆగింది. అతనింక కదలడు. అప్పుడే కొరడా యూదుణ్ణి బాధించక ఆగింది.

నల్లని మల్లు స్పార్టకస్‌తో పాటు తలుపు సందునుండి చూస్తున్నాడు. మాట్లాడకుండా జరిగినదంతా చూస్తున్నాడు.

సైనికులు ఆ థ్రేషియన్ని ఈటెలతో పొడిచారు. ఒక సైనికుడు చిన్నదైనా బలమైన ఒక సుత్తిని తన బెల్టునుండి తీశాడు. మరో సైనికుడు థ్రేషియన్ శరీరం కిందకు బల్లెం పోనిచ్చి బోర్లపడి ఉన్న ఆ శరీరాన్ని వెల్లకిలా తిప్పాడు. మొదటి సైనికుడు సుత్తితో అతని కణతపై ఒక బలమైన దెబ్బ మోదాడు. ఆ దెబ్బతో ముఖం ఆకారరహితమయింది. మానవ రక్తం చవిచూసిన సుత్తి పట్టుకుని ఆ చేత్తోనే ప్రేక్షకులకు సలాం చేశాడు. మరో శిక్షకుడు గాడిద నొకదాన్ని తోలుకొచ్చాడు. చచ్చిన థ్రేషియన్ కాళ్ళకు గాడిదకున్న గొలుసు కట్టారు. ఈటెలు తిరుగవేసి సైనికు లా గాడిదను బాదారు. రక్తపూరితమైన, తల పగిలిన ఆ థ్రేషియన్ శరీరాన్ని లాక్కుపోతోందా గాడిద. ఇది చూసి రోమన్లు చప్పట్లు చరిచారు. ఉల్లాసంతో ఆ కులకాంత జేబురుమాలు ఆడించింది.

రక్తం పడ్డ ఇసుకమీద మంచి ఇసుక అద్దారు. శుభ్రపరిచారు. మరో జంట పోరాడే ముందు నాట్యం, సంగీతం ప్రారంభమయ్యాయి.

# 8

గాబరాగా బేటియాటస్ మంటపం దగ్గరకు వెళ్ళాడు. అంత డబ్బూ చెల్లించిన వాళ్ళ మనసుతీరేలా యూదుడు దెబ్బలాడలేదేమో; ఏ మెడనరమో చేతినరమో కోసి పోరాటపు తుది ఘడియలకు ఎర్రని రక్తపురంగు వెయ్యలేదేమో; వాళ్ళేమనుకుంటున్నారో తెల్సుకునేందుకు వాళ్ళ వద్దకు బయలుదేరాడు. ఒక చేత్తో మధుపాత్ర పట్టుకున్న బ్రాకస్ "మాంచి ఉల్లాసభరితంగా ఉంది; మనసుతీరింది" అన్నాడు.

"ఆ యూదుణ్ణి ఇక్కడకు పంపు. ఇక అతడిని శిక్షించకండి."

"ఇక్కడికే!" లూషియస్ ఏదో అనబోయాడు.

"అవును ఇక్కడికే! వాణ్ణి వళ్ళు కడుక్కోవద్దని చెప్పండి. పోట్లాడేటపుడెలాగున్నాడో అలాగే పంపించండి."

బేటియాటస్ ఆ పనికై బయలుదేరినపుడు, బ్రాకస్ ఏదో చెప్పుకుపోతున్నాడు. ఎంత నిరర్ధకంగా మాట్లాడినా రసజ్ఞులకు సాధారణంగా కొంత మినహాయింపు ఉంటుంది. తను చూసిన దానిలోని గొప్పతనం, నేర్పు, విశేషచాకచక్యం, ఆ నైపుణ్యం వీటన్నిటి గురించీ వివరించుకుపోతున్న బ్రాకస్‌కు కూడా అంత మినహాయింపూ ఇవ్వాలి. "వంద ప్రదర్శనల్లో ఏ ఒక్కటి ఇలా ఉన్నా అదృష్టమే. క్షణకాలపు ప్రతిభ ఒక గంటసేపు కత్తిసాముకన్న ఎన్నో రెట్లు నయం. పేరుపడ్డ పోరాటం అంటే ఇదే. పోరాటంలోనూ ఎవడో ఒకడు సఫా అయేదాకా జరిగేపోరాటం; యూదుణ్ణి చూసి అతనే తనకన్న బలవంతుడని తా నతనికి సమఉజ్జీ కాదని థ్రేషియన్ తెలుసుకున్నాడు."

"కాని మొదట రక్తాన్ని కళ్ళజూసింది వాడేగా?" లూషియస్ వ్యతిరేకత చూపాడు.

"అబ్బే, దాన్లో ఏముంది బొంద; వాళ్ళిద్దరూ ఇదివరకెప్పుడూ ఒకరితో ఒకరు దెబ్బలాడి

నట్లు కనబడదు. అలా చేస్తే ఒకళ్ళ సంగతి ఒకళ్ళకు తెలుస్తుంది. ఒకడి లోటుపాట్లు ఒకడికి తెలుస్తాయి. దాంతో కత్తిసాము మొదలెట్టుదురు. దానికీ నైపుణ్యం, సహనం కావాలనుకోండి. వాళ్ళు దగ్గరగావచ్చి పెనవేసుకుపోయి ఒకరినొకరు లంకె వేసుకున్నట్లు నిలబడ్డారు చూశారూ; అప్పుడు యూదుడు విడివడి థ్రేషియన్ భుజం మీద ఒక వేటు వేశాడు. ఆ దెబ్బే కుడిచేతికి తగిలితే అక్కడితో ఆఖరైపోను. థ్రేషియనుకు మాత్రం తెలుసు; తనకన్నా యూదుడే బలవంతుడని. అందుకే కావా తిప్పడం మొదలెట్టాడు. నూటికి తొంభైతొమ్మిది మంది మల్లులు అటువంటిదే జరగకుండా చూస్తారు. ఒకళ్ళ నొకళ్ళు పట్టుకుని దగ్గరగా పెనవేసుక నిలబడ్డమే నయం. ఒక మనిషి శక్తినంతా ఉపయోగించి అటువంటి కత్తితో ఒక పోటు పొడవడం అంటే ఏవిటో తెలుసా? నేను యూదుణ్ణి ఎందుకు రప్పిస్తున్నానో చూపిస్తా."

అతడు మాట్లాడుతుండగానే యూదుడు వారిని సమీపిస్తున్నాడు. ఇంకా నగ్నంగానే ఉన్నాడు. రక్తం, చెమటవాసన కొడుతూ ఉండే క్రూరమైన, భయావహమైన, నరరూప రాక్షసుని చిత్రంలా వాళ్ళ ఎదుట నిలబడ్డాడు యూదుడు. వంచిన తల ఎత్తలేదు. అతని కండలు ఇంకా కంపిస్తూనే ఉన్నాయి.

"వంగవోయ్" బ్రాకస్ ఆజ్ఞాపించాడు. యూదుడు కదల్లేదు.

"వంగు" బేటియాటస్ అరిచాడు.

ఇద్దరు శిక్షకులు యూదుణ్ణి పట్టుకుని వాళ్ళముందు పడేలా బలవంతంగా నెట్టారు. బ్రాకస్ అతని వీపు చూపిస్తూ కొత్త విషయాన్ని కనిపెట్టిన వాడిలా చెప్పాడు.

"అదుగో, అదుగో అక్కడ చూడండి. కొరడా దెబ్బలు కాదు. స్త్రీ తన గోళ్ళతో గీస్తే ఎలాగుంటుందో అలాగే అతని చర్మం మీద నాటుపడింది చూడండి. కిందనుండి మీద పడుతున్న థ్రేషియన్ని కొయ్యడానికి వీడు ప్రయత్నించినపుడు వా డా దెబ్బకొట్టాడు. వాణ్ణి పంపించేయండి." బ్రాకస్ బేటియాటస్‌వైపు తిరిగి అన్నాడు: "వాణ్ణి ఇక బాదకండి. మీ కతని వల్ల డబ్బు రాకపోతే నాతో చెప్పండి. అతనికి పేరు తెప్పిస్తా నేను. ఓయీ మల్లుడా ఈ ద్రాక్ష సారా నీ గౌరవార్థం" అని మధుపాత్ర ఖాళీ చేశాడు. తలవాల్చుకుని అలాగే మౌనంగా నిలబడ్డాడు యూదుడు.

# 9

"రాళ్ళు కూడా ఏడుస్తాయి" ఆఫ్రికావాడు చెపుతున్నాడు. "ఈ ఇసుక కూడా బాధతో మూల్గుతుంది. ఏడుస్తుంది. కాని మనం బాధపడం."

"మనం మల్లులం" అన్నాడు స్పార్టకస్.

"నీ కున్నది కటిక రాతిబండ గుండె కాదు కదా?"

"నేనొక బానిసను. బానిసకు రాతిగుండె ఉండాలి. లేదా అసలు ఉండకూడదు.

నీకు జ్ఞాపకముంచుకునేందుకు కొన్నైనా మంచి విషయాలు ఉన్నాయి. కాని నేనొక 'కోరూని' జ్ఞాపక ముంచుకునేందుకు మంచి విషయమనేది లేదు."

"అందుకేనా నా బాధ చూసినా, నీలో చలనం కలగదు?"

"అది నాలో చలనం కలిగించేందుకు సహాయపడదు" ఆసక్తి లేనివాడిలా జవాబిచ్చాడు స్పార్టకస్.

"స్పార్టకస్! నాకు నువ్వేం అర్థం కావడంలేదు. నువ్వు తెల్లవాడివి; నేను నల్లవాడిని. మన మధ్య ఆ తేడా ఉంది. నా దేశంలో ఎవడి హృదయమయినా విచారంతో నిండితే వాడే డుస్తాడు. కాని మీ థ్రేషియన్లలో కన్నీరే కనబడదు. నా వేపు చూడు, నీకేం కనిపిస్తోంది."

"ఒక మనిషి ఏడ్వడం కనిపిస్తోంది" స్పార్టకస్ అన్నాడు.

"ఏడుస్తున్నందుకు నేనేమైనా మగతనం తక్కువైనా వాణ్ణా? స్పార్టకస్, నే చెపుతున్నా; నీతో నేను పోట్లాడను."

"మనం దెబ్బలాడకపోతే ఇద్దరమూ చస్తాం" స్పార్టకస్ నిశ్చలంగా సమాధానమిచ్చాడు.

"ఐతే నన్ను చంపెయ్యి. నేస్తం, బతకలేక చచ్చాను. ఇక నన్ను చంపెయ్యి. బతకడ మంటే నాకు మహా చిరాకు."

"ఏయ్, అక్కడ గొడవ చేయకండి" షెడ్ గోడమీద కొట్టారు సైనికులు. నల్లవాడు తన పెద్ద పిడికిలి బిగించి ఆ గోడమీద బాదాడు. దాంతో షెడ్ కదిలింది; బాదడం మానేసి బెంచిమీద చేతుల్లో ముఖం ఆన్చి కూచున్నాడు. స్పార్టకస్ అతని దగ్గరకు వెళ్ళి, అతని తల ఎత్తి నుదుటిమీద స్వేదబిందువులను లాలనగా తుడిచాడు.

"మల్లుడా! మల్లుల సహవాసం మాను."

"స్పార్టకస్! ఎందుకయ్యా మానవుడు పుట్టింది?" బాధతో, ఆవేశంతో గొణిగాడు.

"బతకడానికి!"

"అదేనా సమాధానమంతా?"

"అదొక్కటే సమాధానం."

"నీ సమాధానం నా కర్థమవలేదు థ్రేషియన్!"

"ఏం? ఎందుకవలా నేస్తం" ఇంచుమించు బతిమాలుకున్నట్లు అడిగాడు స్పార్టకస్. "పసిపాపలకు తెలుసే ఆ సమాధానం. తల్లి కడుపులోంచి బయటపడగానే అదేగా అతి సామాన్యమైన, అతి సహజమైన సమాధానం."

"నా కది సమాధానం కానేకాదు. నన్ను ప్రేమించినవాళ్ళ కోసం నా హృదయం బద్దలవుతుంది; రగిలిపోతుంది."

"ఇతరులు నిన్ను ప్రేమిస్తారు!"

"ఇక వద్దు. ఇంకొద్దు" అన్నాడు నల్లమల్లుడు.

# 10

కాలం గడిచినకొద్దీ, కేపువాలో పోరాడిన ఆ రెండుజంటల మల్లులు ఆనాటి ఉదయపు సంఘటన కైయస్‌కు స్పష్టంగా జ్ఞాపకం లేవు. జీవితంలో తానెన్నో తమాషాలు చూశాడు. డబ్బిస్తే బోలెడు కొనవచ్చునటువంటివి. స్పార్టకస్ అనేది ఒక థ్రేషియన్ నామధేయం మాత్రమే. థ్రేషియన్ల పేర్లన్నీ ఒకలాగే ఉంటాయని రోమన్లు అనుకునేవారు. గేనికస్! స్పార్టకస్! మేనికస్! ఫ్లారకస్! లియకస్! ఈ కథ చెప్పేటప్పుడు యూదుణ్ణి కూడ థ్రేషియన్ కింద జమకట్టి చెప్పుకుపోయాడు కైయస్. ప్రజలు ఈ మల్ల యుద్ధాల గురించి కథలుగా చెప్పుకునేవాళ్ళు. మత్తుపదార్థం అలవాటు చేసుకున్నట్లే, ఈ ప్రదర్శనలకు కూడా అలవాటు పడ్డారు. ప్రదర్శనల పరిభాష థ్రేషియన్ అన్న పదానికి రెండర్థాలు సృష్టించింది. బాల్కన్ ప్రాంతానికి దక్షిణంగా ఇటలీవరకు నివసించే నానారకాల జాతుల ప్రజలూ, బాల్కన్ ప్రాంతానికి తూర్పుగా వ్యాపించిన ప్రదేశమంతటా, నల్లసముద్రం వరకూ నివసించే జాతుల వాళ్లనందరినీ థ్రేషియన్లనే పిలిచేవారు. మేసిడోనియా సమీపాన ఉన్న ప్రజలు గ్రీకుభాష మాట్లాడతారు. వంపుతిరిగిన చిన్న కత్తిని ఈ జాతులవాళ్ళంతా సాధారణంగా ఉపయోగించే ఆయుధం కానట్లే థ్రేషియన్లకు గ్రీకు మాతృభాష కానేకాదు.

అదలా ఉండగా రోమ్‌లో క్రీడల పరిభాషలో, రంగస్థల పదజాలంలో థ్రేషియన్ అంటే 'సికా' అనే చిన్న కత్తితో పోట్లాడేవాడని అర్థం. అందువల్లనే యూదుడు కూడా థ్రేషియనే! ఒక జంట యుద్ధం చేయడం చూశాడు కైయస్. మరో జంట ప్రారంభించబోతోంది. వాళ్ళిద్దరూ బోనులోంచి బైటకు వచ్చిన పెద్దపులుల్లా బయటకు రావడం, నీడను దాటి వెలుతురులోకి రావడం, సూర్య కాంతిలో రక్తపు మరకలు పడ్డ ఇసుకలో నిలబడడం అన్నీ జ్ఞాపకమున్నాయి. నిర్ణీత ప్రదేశంలో మల్లులిద్దరూ ఆగారు. తమ రక్తమాంసాలను కొన్న రోమన్లకి ఇక్కడే గౌరవాభివందనం అర్పించాలి. జీవితం నిరర్థకం చేయబడ్డ క్షణం ఇదే. మానవుని అంతస్తును, హోదాను, సిగ్గును, అభిమానాన్ని, జీవితపు అర్థాన్ని, పరమార్థాన్ని మార్చివేసే, మాడ్చివేసే క్షణం ఇదే.

ఆఫ్రికా వాడితో పోల్చి చూస్తూ మహారాక్షసుని ముందు నిలబడ్డ మరుగుజ్జులా కని పించాడు థ్రేషియన్. ఈ సందర్భంలో బ్రాకస్ ఏదో అన్నాడు. అత నన్నది ఏదో తను మరచిపోయాడు. వాటికి అంత పెద్ద విలువలేదు. అందుకే కాలప్రవాహం ఆ మాటలను కడిగిపారేసింది. శరీరంలోని అణువణువూ చీల్చిచెండాడుకునే మృత్యు ప్రదర్శన కైయస్‌కోసం ఏర్పాటు చేయించాడు బ్రాకస్. ఇది ఒక గమ్మత్తయిన తమాషా అనుకున్నాడు కైయస్.

మల్లులిద్దరూ వందన సమర్పణ చేశారు. సారా సేవిస్తున్న రోమన్లు ఏవేవో తింటూ కూర్చున్నారు. అప్పుడొకడు ఆయుధాలు తీసుకువచ్చాడు. స్పార్టకస్‌కు ఒక కత్తి, నల్లవాడికి పొడుగాటి బలమైన బరువైన త్రిశూలం, ఒక చేపల వల. లజ్జాభిమానాలతో. అవమానంతో

వారిద్దరూ హాస్యగాళ్ళలా కనపడ్డారు. ఆ మండపపు నీడలో ద్రాక్షసారా సేవిస్తూ, తీపి వస్తువులు చప్పరిస్తూ రోమన్లు తమాషా చూసి, ఆనందించడం కోసం ప్రపంచాన్నంతటినీ బానిసత్వంలో ముంచారు.

ఇద్దరూ ఆయుధధారణ చేశారు. అపుడు ఆఫ్రికా మల్లుడికి పిచ్చెత్తినట్లనిపించింది కైయస్‌కు. కాని ఆ ఆఫ్రికావాడి మాతృభూమికి వెళ్ళి అతడి పూర్వపు జీవితం చూస్తే కైయస్ గాని, బ్రాకస్‌గాని, లూషియస్‌కాని అతనికి పిచ్చెక్కిందనుకోరు. రోమను సైనికులు అతని దేశా న్నాక్రమించుకుని, రోమను బానిసవర్తకు లక్కడి మానవ జీవిత ఫలసాయాన్ని నేర్పుతో బంగారంగా మార్చక పూర్వం ఒక నదీతీరాన ఇతని కో ఇల్లుండేదని, భార్యా పిల్లలుండే వారని, సేద్యం చేసి స్వచ్ఛంద జీవితం గడిపేవాడని వీళ్ళెప్పుడూ ఊహించుకోలేరు.

అందుకే ఆఫ్రికా వాడికి పిచ్చెత్తిందని వాళ్ళనుకున్నారు. అతడు వల దూరంగా పారేసి దిక్కులు పిక్కటిల్లేలా యుద్ధనినాదం చేయడం చూసారు. పెద్దగా బొబ్బలు పెడుతూ రోమన్ల మండపం వైపు పరుగెత్తుకు వస్తున్నాడు. దూసిన కత్తి పుచ్చుకుని అతన్ని ఆపడానికి శిక్షకుడొకడు వచ్చాడు. తన శూలంతో శిక్షకుణ్ని గుచ్చి గాలిలోకి ఎగరవేశాడు. బాధతో అరుస్తూ శిక్షకుడు భూమ్మీద వాలాడు. ఆరడుగుల ఎత్తునున్న కంచె దోవకడ్డుగా నిల్చింది. కాగితం ముక్కను చింపిపారేసినట్లు కంచెను లాగి పారేశాడు. ఉద్వేగంతో, ప్రచండశక్తితో అతని రూపమే మారింది. అతని శరీరం మహోదగ్రభయంకర ఆయుధమైనది. మండపం అతని ధ్యేయం. అటు పరిగెత్తుతున్నాడు.

గోదా నలుమూలలనించీ సైనికులు పరుగెత్తుకొస్తున్నారు. ఒక సైనికుడు కాళ్ళు ఎడంగాపెట్టి, ఎడమచేతిని ముందుకుసాచి కుడిచేత్తో బలమైన బల్లాన్ని విసిరాడు. రోమన్ ఈటెను ఎదిర్చి ఓర్చగలది ఏదీలేదు ఈ ప్రపంచంలో. అది ఎన్నో సైన్యాలను నాశనం చేసింది. కాని ఆఫ్రికా మల్లుని అది నాశనం చెయ్యలేదు. వీపున గుచ్చుకున్న ఆ బల్లెం ఛాతీని దూసుకపైకి కనబడుతున్నా అతని ప్రయత్నాన్ని మాత్రం అది ఆపలేకపోయింది. బల్లెం గుచ్చుకున్న శరీరంతో, తాడిత భుజంగంలా, సుడిగాలిలా శీఘ్రంగా రోమన్లున్న మండపం వైపు పోతున్నాడు. మరొక బల్లెం అతని ప్రక్కలో, వేరొకటి వీపుమీద, ఇంకొకటి మెడమీద గుచ్చుకున్నయి. ఆఖరిదాంతో అతని పని ముగిసింది. కాని అతడు సాచిన చేతి నుండి త్రిశూలం ప్రచండ వేగంతో మండప స్థంభాన్ని తాకింది. భయకంపితులై రోమన్లు హడలెత్తారు. పడ్డచోట రక్తం కాలువలు కడ్తోంటే, ఆ మల్లుడు ప్రాణం వదిలాడు.

ఇంత జరుగుతున్నా స్పార్టకస్ మాత్రం కదలకుండా, మెదలకుండా నిలబడ్డ చోటనే మిగిలిపోయాడు. ఏ మాత్రం కదిలినా అతడూ ఖతమైపోయేవాడు. కత్తిని ఇసుకలోనికి గిరాటు వేసి నిలబడ్డాడతను. జీవించడమే జీవితానికి సమాధానం!

# నాలుగవ భాగం

ఆంటోనియస్ కైయస్ ఇచ్చే ఆతిథ్యాన్ని స్వీకరించడం కోసం మర్యాదస్తులైన స్త్రీ పురుషులు సలేరియా భవనానికి వచ్చారు. స్పార్టకస్ గురించి, అతని తిరుగుబాటు గురించి ఎంతగానో ఆలోచించారు. శవాలు వేలాడే ఏపియన్ మార్గాన ప్రయాణం చేసి ఈ భవనానికి చేరుకున్నవాళ్ళే. కొందరు దక్షిణ రోమ్‌నుంచి వచ్చారు. సిసిలీ నుండి ఉత్తరంగా ప్రయాణం చేసి సిసిరో వచ్చాడు. అతనక్కడ ప్రభుత్వశాఖలో బాధ్యతగల పెద్ద ఉద్యోగి. రోమన్ న్యాయ శాస్త్రం కరుణావిహీనమైనా, ధర్మబద్ధమైనదని ప్రపంచానికి ఎలుగెత్తిచాటే కఠిన శిక్షాచిహ్నాలు ప్రయాణంలో వాళ్ళకి ప్రతి నిముషం కనపడ్డాయి.

బానిసలకూ, రోమన్లకూ మధ్య జరిగిన యుద్ధాలు రోమను పాలన కిందనున్న ఆక్రమిత ప్రాంతాల నన్నింటినీ, రోమన్ రిపబ్లిక్కునీ కదలించి పారేసాయి. ఆ రాజవీధిని ప్రయాణం చేసిన కొద్దిపాటి గ్రహణశక్తి కల ఏ వ్యక్తైనా సరే అటువంటి భీషణసంగ్రామాల గురించి ఆలోచించకమానడు. తన వంటి వా రెందరో శిలువలపై వేలాడుతున్న సంగతి ఆలోచించి, వ్యాకులపాటు చెంది నిద్రలో అటూ ఇటూ దొర్లని బానిసంటూ లేడా తోటలలో.

శిలువ మీద రోమన్ క్రౌర్యానికి బలియై, నెమ్మదిగా ప్రాణంలోని ప్రతి అంగుళాన్నీ కోల్పోతూ, ఆ బానిసలు భరించిన బాధ రోమన్ దేశమంతటా, ప్రతి పల్లెలో, ప్రతి వాడలో, ప్రతి ఇంటా, ప్రతి హృదయంలో - అసలు హృదయమనేదే ఉంటే అంతటా వ్యాపించింది. సిసిరో వంటి యోచనాపరుని హృదయంమీద కూడా వీటి ప్రభావం పడింది.

సిసిరో పిన్నవయస్కుడే; సరిగా ముప్పై రెండేండ్లు కూడా దాటని యువకుడే. కాని అతనికన్నా వయస్సులో, విత్తంలో అధికులు కూడా అతన్ని గౌరవిస్తారు. ఆంటోనియస్ కైయస్ వంటి పెద్ద మనుషులే అతన్ని గౌరవిస్తారనేది గమనార్హం.

సిసిరోకి వంశపరంపరానుగతమైన మర్యాద లేదు. పోనీ ప్రస్తుతమైనా అతని కుటుంబం ప్రాముఖ్యతలో ఉందా? అంటే అదీలేదు. ఇతరుల దయను చూరగొనగల గుణ విశేషమూ అతనిలో అంతగా లేదు. ఇతనిలో ప్రత్యేకమైన ఆకర్షణీయాంశం లేదని ఇతని స్నేహితులే చెబుతూ ఉంటారు. తెలివితేటలైతే ఉన్నాయి కాని, ఆ మాత్రం తెలివి అందరికీ ఉంటుంది. కార్యసాఫల్యమార్గంలో అడ్డు తగులుతుందని తోస్తే ఈషణ్మాత్రమైన న్యాయా న్యాయ విచక్షణాజ్ఞానం లేక, నీతినియమాలను కూలదోసి, స్వధర్మాన్ని పాటించక, అంతరాత్మ ప్రబోధం వినక, కరుణావిహీనంగా ప్రవర్తించే ఆనాటి కొందరి యువకులవంటి వాడే సిసిరో. దీని అర్థం అతనికి ధర్మంతో, న్యాయంతో, కరుణతో ఏ విధమైన సంబంధమూ లేదనికాదు. స్వీయాభివృద్ధికి తోడ్పడేటంత వరకే వాటిని పాటిస్తాడు. కేవలం ఆశగలవాడు మాత్రమే కాడు సిసిరో. కార్యసిద్ధి కోసం శాంతంగా, తెలివిగా ప్రయత్నించే మనిషి.

ఇప్పటివరకూ అతని అంచనాలెప్పుడూ విఫలమవలేదు. అంత చిన్నతనంలో ఎన్నో విజయాలు సాధించి, అందరికీ ఆశ్చర్యం కలగచేసేడు. పద్దెనిమిదో ఏటే ప్లీడరయాడు. పేరు కోసం, గౌరవం కోసం నిరపాయమైన ఒక దాడిలో పాల్గొన్నాడు. ముప్ఫైయేండ్లు నిండే సరికి ప్రభుత్వ పరిపాలనా శాఖలో ఒక ఉన్నతోద్యోగం సంపాదించాడు. వేదాంతం, ప్రభుత్వం వంటి విషయాల మీద అతను కొన్ని వ్యాసాలు రాసాడు; ఉపన్యాసాలిచ్చాడు. వీటిని చదివిన ప్రజలకు అతను రాసిన ఆ కాస్త విషయమూ, లోతుగా పోలేని అతని స్వల్ప పరిజ్ఞానమూ కూడా గ్రంథచౌర్యం చేసి, స్వంతసరుకుగా చెలామణి చేస్తున్నాడని తెలుసుకో గలిగినంత జ్ఞానం లేకపోయింది. ఎవరికెంత పేరుందో, ఎవరిపలుకుబడి ఎంతో అతనికి ముందుగానే తెలిసేది. ఆ రోజులలో అధికారం, పలుకుబడిగల వర్గాలతో సంబంధమేర్పర్చు కుందుకు చాలా మంది తహతహలాడేవారు.

నీతికీ, న్యాయశాస్త్రానికి మధ్యనున్న తేడాని అతనెప్పుడో కనిపెట్టేసాడు. న్యాయశాస్త్ర మన్నది బలవంతులు తమ కిష్టమైన విధంగా ఉపయోగించుకుందుకు సృష్టించుకున్న పరికరం. అమాయకులు కొలిచే ముప్ఫైమూడుకోట్ల దేవతలలాగ నీతి బలహీనుల భ్రమ. బానిసత్వం అనేది న్యాయమనీ, ధర్మబద్ధమైనదనీ వాదించేవాళ్ళెవరైనా ఉంటే వాళ్ళు వెర్రివెధవలని సిసిరో అభిప్రాయం. ఆ రాజమార్గంలో, ఉత్తరంగా ప్రయాణంచేస్తూ, శిలువల మీద వేళ్ళాడే బానిసల భయంకరమైన బాధనతడు గ్రహించకపోలేదు. అది తనను కదల్చకుండా, తన హృదయాన్ని స్పృశించకుండా మాత్రం చూసుకుంటాడు. ఏ విషయంతోనూ ప్రమేయం లేకుండా ఆసక్తి కోసం ఆసక్తి చూపడంలో అతను పరిపూర్ణత పొందాడు. బాధలేకుండా, జాలి కలిగకుండా శిలువ వేయబడ్డ గాల్‌లు, ఆఫ్రికన్లు, థ్రేషియన్లు, యూదులు, జర్మన్లు, గ్రీకులు మొదలైన వారి గురించి తెలుసుకున్నాడు. తక్కినవాళ్ళలా బానిసలను ఊరికే అసహ్యించుకోలేదతను. బానిసల మానసిక వాంఛలను బాగా అవగాహన చేసుకుని మరీ అసహ్యించుకొనేవాడు సిసిరో.

క్లాడియా ఆ సాయంత్రం సలేరియా భవనానికి వచ్చి సిసిరోని చూసినప్పుడు అతని స్వభావాన్ని గ్రహించలేకపోయింది. క్లిష్టమైన భావాలు లేనివాళ్ళను మాత్రమే క్లాడియా అర్థం చేసుకోగలిగేది, హెలీనా అలా కాకుండా ఇతని స్వభావాన్ని గుర్తించి గౌరవించింది.

ఆ రోజుల్లో రాత్రి చాలాసేపు పనిచేసే రోమన్లు తక్కువ. రోమను దీపాలు నిస్తేజంగా పాలిపోయిన పచ్చని కాంతినిచ్చేవి. ఆ కాంతిలో వస్తువుల్ని చూస్తే కళ్ళు నొప్పులు పుట్టేవి. అందుచేతనే రాత్రి పూట పని చేయడం, అందులోనూ బాగా తిని, తాగినతర్వాత పనిచేయడం ప్రశంసనీయాంశంగా కాని, వైపరీత్యంగాకాని కనిపించేది. హెలీనా ఆ రాత్రి అతని గదిలోకి ప్రవేశించేసరికి సిసిరో తన పక్కమీద కాళ్ళు ముడుచుకుని కాగితం మీద ఏదో రాస్తూ కూర్చున్నాడు.

"ఏమిటి రాస్తున్నారు?" ఆమె అతన్ని అడిగింది.

"బానిస యుద్ధాల మీద వ్యాసం రాస్తున్నాను" అతడు సమాధానం చెప్పాడు.

"అంటే చరిత్రన్నమాట?"

"చరిత్రకాదు" సిసిరో నిజమే చెప్పాడు. లేని దున్నట్లు చేసి మసిపూసి మారేడుకాయ చేయగలిగిన అతని పద్ధతులెలా ఉన్నా చరిత్రలో కాలనిర్ణయం కూడా ఇమిడి ఉంటుంది కదా! "కంటి కగుపించే విషయాలూ, ఒక విషయం జరిగిన పద్ధతీ, తీరూ వీటియందే నా ఆసక్తి అంతా" అన్నాడు. "ఎవరైనా ఏపియన్ మార్గంలోని శిక్షాచిహ్నాలైన ఆ శిలువలను చూస్తే వాళ్ళకు అనిపించేదేమిటి? రోమన్లంటే పగసాధించుకునే ప్రజ అనేభావం కలగొచ్చు. వాళ్ళు బానిసలు కాబట్టి స్వతంత్రుల చేతిలో చావడమనేది సహజం అని కొందరనేస్తారు; అది కొందరికి నిజంగానే కనిపించొచ్చు. నాక్కావల్సింది అది కాదు. మనం ఆ మాదిరిగా అంతమంది బానిసల్ని ఎందుకు చంపాలి అన్నదే నా క్కావాలి."

"ఈ బానిసలనే కనుక బజారున అమ్మితే మంచి లాభాలార్జించే అవకాశాలున్నాయని కొందరంటారే" హెలీనా పెదవులపై మందహాసం గోచరించింది.

"కాస్త నిజం, బోలెడంత అబద్ధం" సమాధానం సంధించాడు సిసిరో. "విషయాలను లోతుకుపోయి చూడాలంటాను నేను. పైపైన చూసి సంతృప్తి చెందే స్వభావం నాకు సరిపోదు. ఈ బానిసల తిరుగుబాటు విప్లవమే అనుకో. దీని అంతరార్థం ఏమిటి అన్నదే నా క్కావలసి నదల్లా. భ్రాంతి అనేది గొప్ప వినోదమైపోయింది రోమన్లకు. నామటుకు నే నీ భ్రాంతిలో పడటానికి సిద్ధంగాలేను. ఈ బానిసలతో యుద్ధం గురించి గుసగుసలాడుకోడానికి కూడా, అసలు ఇలాంటిది ఒకటుందనుకునేందుకు కూడా మనం ఇష్టపడం. ఆ యుద్ధానికి సంబంధించిన సేనానులే దాన్ని గురించి అంతా గప్‌చుప్‌చేసిపారేసారు. బానిసయుద్ధంలో పాల్గొంటే యశస్సూ, కీర్తీ అట్టే ఉండకపోవచ్చు."

"కాని నిజంగా అదేమంత ముఖ్యమైన విషయం కాదు."

"కాదా! ఐతే ఏపియన్ మార్గంలో ప్రయాణం చేసి, వాటినన్నిటినీ కళ్ళారా చూసిన మీకు ఆ శిలువలు ప్రాముఖ్యంలేనివిగా కనిపించాయా? వాటి ఆవశ్యకత ఏమీ లేదనేనా?"

"నిజానికి అవి ఎంతో వెగటు పుట్టించాయి. అటువంటివి చూడ్డానికి నాకేమీ సరదా ఉండదు. క్లాడియాకి నచ్చుతాయి."

"ఇంకోలా చెప్పాలంటే ఏదోకొంత ప్రాముఖ్యత వాటికుందన్నమాట."

"స్పార్టకస్ గురించీ, బానిసయుద్ధాల గురించీ ప్రతివాళ్ళకీ తెలుసుగా?"

"ప్రతీవాళ్ళకీ తెలుసా! నాకేమీ నమ్మకం లేదు. క్రాసస్‌కి కూడా బాగా తెలుసంటే నేన్నమ్మను. మన కీ స్పార్టకస్ విషయమంతా అగమ్యగోచరమయిపోయింది. ప్రభుత్వపు రికార్డు ప్రకారం అతనొక థ్రేషియన్ బానిస, బందిపోటు దొంగ. క్రాసస్ ఆలోచనల్లో అతను న్యూబియా ఎడారుల్లోని బంగారుగనుల్లో పనిచేసిన బానిస. దీనిలో ఏది నమ్మడం! కేపువాలో శిక్షణ కేంద్రం వెలగబెట్టిన బేటియాటస్ చచ్చి నరకాన్నున్నాడు. అతని గుమాస్తాగా పనిచేసిన

గ్రీకుబానిసే ఇతనింక బతకడం నిరుపయోగమనుకుని గొంతుకోసి యమపురికి పంపేశాడాయె. మరి అతని గురించి ఇంకెవరు రాయగలరు? నా వంటివాళ్ళు తప్ప."

"నీవంటి వాళ్ళే రాయాలి" హెలీనా అంది.

"నువ్వలాగన్నందుకు సంతోషం. కాని స్పార్టకస్‌ను అసహ్యించుకోవడం తప్ప అతగాడి గురించి నాకేమీ తెలీదు."

"అంతెందుకు! మా అన్నయ్య అసహ్యించుకుంటాడు."

"అయితే నువ్వు అసహ్యించుకోవా?"

"ఫలానా అని నాకేం లేదు. అతనొక బానిస అంతే" అంది హెలీనా.

"అంతేనన్నమాట. ఐతే వఠిబానిసగ స్పార్టకస్ ఎలా అవగలిగాడు? అదుగో అదే నేను సమాధానం చెప్పాల్సిన చిక్కుసమస్య. ఇదెక్కడ, ఎలా ఎందుకు ప్రారంభమయిందో తెలుసుకోవాలి నేను. నీకు విసుగు కలిగించడం లేదుగదా?"

"అబ్బెబ్బే చెప్పు ఫర్వాలేదు" అంది హెలీనా. రోములో ఆమెకు పరిచయమున్న సిసిరో వయస్సు యువకులు కొత్తరకం అత్తరుల గురించీ, ఏ మల్లులమీద ఎంత పందెం వేసినదీ, ఏ గుర్రం నెగ్గే అవకాశముందో, వాళ్ళ మధ్యనే అనుభవించిన సాని గురించీ, సంసారి గురించీ చెప్పుకునేవాళ్ళు. అటువంటి సంభాషణలతో విసిగి వేసారిన హెలీనా అతన్ని చెప్పమంది.

సిసిరో చెప్పాడు : "ఏదైనా ఓ విషయం గురించి రాయడమంటే నాకు చాలా సరదా. నీలాగే చాలామంది బానిస విప్లవానికి ప్రాముఖ్యత ఏమిటనుకుంటా రేమోనని నాభయం. కాని చూశావూ; మనందరి జీవితాలూ ఈ బానిసలమీదనే ఆధారపడి ఉన్నాయి, అందుకే ఈ బానిసల తిరుగుబాటు మనం అనుకునే దండయాత్ర లన్నిటికన్నా ఎక్కువ యుద్ధ కాండను పెంచింది."

ఆమె వింటోంది.

"ఇది నిన్నటిదీ; మొన్నటిదీకాదు. నూట ఇరవై ఐదు సంవత్సరాల క్రితం ప్రారంభ మయింది. మనం నిర్బంధంలో ఉంచిన కార్తైజీనియన్ బానిసల తిరుగుబాటు దీనికి నాంది. అటు పిమ్మట రెండు తరాలు గడిచాక గ్రీస్‌లోని లారియమ్ గనుల్లో జరిగిన బానిస మహా విప్లవం. ఆ తరువాత స్పెయిన్ గని పనివాళ్ళ బ్రహ్మాండ విప్లవం. పిమ్మట కొద్ది సంవత్సరాలకే మన రిపబ్లిక్కునే కదిలించి పారేసిన సిసిలియన్ బానిసల తిరుగుబాటు. ఆ తరువాత ఇరవై సంవత్సరాలకు సాల్వియస్ అనే బానిస నాయకత్వాన జరిగిన తిరుగుబాటు. బానిస యుద్ధాలనేసరికి మనం సాధారణంగా చెప్పుకునే యుద్ధాలివి. వీటిలో ఒక దానికీ మరొక దానికీ మధ్య చిన్న చిన్న తిరుగుబాటులు జరిగాయి. ఎంతో సంక్షోభం వ్యాపించింది. ఇదంతా కలిసి మనకూ, బానిసలకూ మధ్య జరుగుతున్న ఎడతెగని పోరాటం. నిశ్శబ్దంగా సాగిపోయే యుద్ధం. మనం సిగ్గు పడవలసిన యుద్ధం. అందుకే దీని గురించి ఎవరూ మాట్లాడరు.

అందుకే ఏ చరిత్రకారుడూ దీని గురించి రాయడు. దాని గురించి రాయడానికీ, అసలు దానికేసి చూడ్డానికే భయపడతాం. ఎందుకీ భయం? రెండుదేశాల మధ్య యుద్ధాలుండేవి. రెండు పట్టణాలమధ్య యుద్ధాలు జరిగేవి. రెండు పార్టీలు పోట్లాడుకు చచ్చేవి. ఆఖరికి ఇద్దరు సోదరులు కొట్టుకొనేవారు. కాని ఇదో; అన్ని దేశాలకూ వ్యతిరేకంగా, అన్ని పట్టణాలకూ వ్యతిరేకంగా, అన్ని పార్టీలకు వ్యతిరేకంగా సాగుతోంది ఇది."

"నన్నడలగొడుతున్నావ్!" హెలీనా అంది.

తల ఊపి సిసిరో ఆమెవైపు ఏదో వెతికేవాడిలా చూశాడు. ఆమె తన చేతులతో అతని చేతిని మూసిపట్టుకునేవరకు అతడా చారిత్రక విషయాలతో ఆమెను గాభరా పెట్టాడు. తన నుంచి అతనివైపు ఒకరకమైన వెచ్చదనం ప్రవహించిపోతున్నట్లు ఆమె భావించసాగింది. వయస్సులో తనకన్నా ఏమంత పెద్దవాడుగాకపోయినా జాతి భవిష్యత్ గురించి అంత తీవ్రంగా ఆలోచించే యువకుడు ఇక్కడే ఆమెకు తటస్థపడ్డాడు. తాను రాస్తున్న దొకపక్కనబెట్టి మృదువుగా ఆమెచేతిని తాకుతూ ఆమెను చుంబించాడు. ఆ శిక్షా చిహ్నాలను జ్ఞాపకం తెచ్చుకుంది. కుళ్ళుతూ, ఎండకు ఎండుతూ పక్షులు పీక్కుతింటూన్న ఆ మానవ మాంస ఖండాలింక ఆమెను భయపెట్టలేదు. వాటన్నిటినుంచీ సిసిరో ఒక తర్కాన్ని తయారుచేశాడు.

ఎట్టకేలకు నన్నర్థం చేసుకోగల స్త్రీ దొరికిందిగదా అని సిసిరో సంతోషపడ్డాడు. ఆ సంతోషం ఆమెను జయించాననుకున్నందువల్ల అతనిలో కలిగిన స్వీయశక్తి విశ్వాసాన్ని పెంచింది. తనకు పర్యాయపదమే శక్తిగా భావించి ఆ శక్తిని సారించగా తా నావిర్భవించినట్లూ హించాడు. ఒక క్షణంలో తను నడుంబిగించి స్పార్టకస్‌ను అణచిపారేసిన శక్తితో చేతులు కలిపి తిరిగి తలెత్తకుండా పదేపదే అతన్ని దెబ్బతీస్తున్నట్లనుకున్నాడు. అతనికేసి చూసిన హెలీనాకు హఠాత్తుగా అతని ముఖం అసహ్యంతో, కాఠిన్యంతో నిండినట్లనిపించింది. అలవాటు ప్రకారం తనని తానసహ్యించుకుంటూ ఆమె అతనికి లొంగింది.

## 2

చాలా అసహ్యంగా నీచపుచావు చచ్చాడు బేటియాటస్. స్వంత బానిసచేతిలో చావడమంటే నీచపుచావుగాక మరేమిటి! బ్రాకస్ కోసం ఏర్పాటు చేయించిన రెండు జతల మల్లయుద్ధ ప్రదర్శనలూ నిష్ఫలమయాయి. వాటినేగనుక అతడు జరగకుండా చేసుకున్నట్ల యితే తన చావునేకాక ఇంకా ఎన్నిటినో నివారించేవాడేమో. పోనీ, జరిగించాడు. అనుకోని విధంగా పరిణమించిన ఆ పోరాటాలలో పాల్గోగా మిగిలిన ఇద్దరు మల్లులనూ నరికించేసినా గొడవలేకపోను. కలతకు కారకులయిన మల్లులను చంపడానికి ఏ అభ్యంతరమూ ఎవరూ చెప్పరు కూడా, అసలదొక ఆచారమయిపోయింది. స్పార్టకస్ అనేవాణ్ణి చంపినంత మాత్రాన చరిత్రగమనం మారుతుందా అనేది సందేహాస్పదం. ఏ శక్తులు స్పార్టకస్‌ను ముందుకు తోసుకొచ్చాయో అవే శక్తులు ఇతడులేని పక్షంలో వేరొకణ్ణి తయారుచేసేవి. స్పార్టకస్ ఈ

పన్నాగం ఎలా పన్నాడు అని బోధపడనివాళ్ళకు ఇదే సమాధానమిస్తుంది. అది ఒకడి పన్నాగం కాదు. ఎంతో మంది పన్నినది, ఏదో ఒక శక్తి పన్నినది. అతడు నిద్రలో మూల్గుతూ తీవ్రమైన మాటలేవో పేలుతూ పడుకున్నాడు. అతని పక్కనే అతడి భార్య వరీనియా మెలకువగా కూచుంది. ఆ నిద్రలోనే అతడెన్నెన్నో విషయాలగురించి మాట్లాడాడు. ఇప్పుడతను థ్రేస్ కొండలలోని బాలుడు. అంతలో అతను న్యూబియా బంగారుగని పనిమనిషి. అప్పుడే అతడు గోదాకి వచ్చేశాడు. 'సికా' అతని చర్మాన్ని కోసింది. బాధతో అతను అరిచాడు. ఆ పలవరింతలను సహించలేకపోయింది వరీనియా. అతన్ని లేపింది; చెమట పట్టిన అతని నుదిటిపై ముద్దిడుతూ తడుతూ మృదువుగా లాలిస్తూ, ప్రేమిస్తూ అతణ్ణి లేపింది. వరీనియా చిన్నపిల్లగా ఉన్నపుడు తన తెగలోని స్త్రీ పురుషులు ఒండొరులు ప్రేమించుకున్న సమయాల్లో ఎలా ప్రవర్తించేవారో చూసేది. దాన్ని భయాన్ని జయించడం అనేవారు. భయాన్ని జయించడమే ప్రేమ. ఆమె ఖైదీగా పట్టుబడ్డప్పుడు ఈ తీయని తలుపులు స్మృతిపథాన్నుంచి తొలిగాయి.

ప్రస్తుతం ఆమెలోని ప్రాణం, ఉనికి, జీవితం, పని, ఆమె రక్తంయొక్క చలనం, హృదయస్పందన అన్నీ మేళవించుకుని ఈ థ్రేషియన్ బానిసపై ప్రేమగా మారాయి. తన జాతిలోని స్త్రీ పురుషుల అనుభవాలు ఎంతో నిజమని, ఎంతో పురాతనమని ఇప్పుడే పూర్తిగా తెలుసుకోగలిగింది. ఆమె ప్రేమలోని మాయ వాస్తవమయినది. అతన్ని ప్రేమించడం చాలా సులభం. అదీకాక అతను రకరకాలుగా ఉండే మనిషీకాడు. సరళమైన మనిషి. ప్రధానంగా స్పార్టకస్‌లో కనిపించేది పరిపూర్ణత. అత నద్వితీయుడు. సంతుష్టి కలవాడు. ఒక మానవుడుగా అత నేమిటో ఎరిగిన తరువాతనే వచ్చిన ఆత్మసంతృప్తి అది. అతడు అందరి చేత గౌరవించబడ్డాడు; ప్రేమించబడ్డాడు. కాని ఆమె ప్రేమ మరోలాంటిది.

"నువ్వు ఏ కలగంటున్నావ్" అని అడిగిందామె, "నన్ను దగ్గరగా అదిమిపట్టుకో పాడు కలలేం రావు."

అతనలాగే చేశాడు. నెమ్మదిగా ఆమెనడిగాడు : "మనం ఇద్దరం కలిసి ఉండకపోవచ్చు. అది నువ్వెప్పుడయినా ఊహించావా?"

"ఐతే?"

"ఐతే అప్పుడేంచేస్తావు వరీనియా."

"అప్పుడు నేను చస్తాను" ఆమె ఒక్కమాటలో సమాధానం చెప్పేసింది.

"నన్ను నువ్వు బాగా ప్రేమించినట్లయితే నేను దూరంగా ఉన్నా, చచ్చిపోయినా చచ్చిపోతాననవు."

"నువ్వలా అనుకుంటున్నావా?"

"అవును."

"ఐతే నేను చచ్చిపోతే నీకు చచ్చిపోవాలని ఉండదా?"

"నాకు జీవించాలనే ఉంటుంది."

"ఏం!"

"జీవితమే లేకపోతే మరింకేదీ ఉండదుకనుక."

"మరి నువ్వు లేకపోతే మరి నాకు జీవితమే ఉండదే" అంది ఆమె.

"నువ్వు నాకొక మాటిచ్చి అది తప్పకుండా చేస్తానని ఒట్టుపెట్టాలి."

"నేనొకమారు మాట ఇస్తే, అది చేస్తా. లేకపోతే మాట ఇవ్వనే ఇవ్వను."

"ఎప్పుడూ నిన్ను నువ్వు చంపుకోనని మాట ఇవ్వాలి" స్పార్టకస్ అన్నాడు.

ఆమె కొంతసేపు వరకు సమాధానమివ్వలేదు.

చివరకు ఆమె చెప్పింది "అలాగే. నేనెప్పుడూ ఆపని చెయ్యనులే."

కొద్దిసేపటికి ఆమె కౌగిలిలో అతను ప్రశాంతంగా, హాయిగా నిద్రపోయాడు.

## 3

వ్యాయామానికి వేళ తెలిపింది ప్రభాతభేరీ నాదం. పొద్దుట భోజనానికి ముందు ఇద్దరిద్దరు చొప్పున వరుసలు తీరి ఒకరివెనుక ఒకరు నలభై నిముషాలు వ్యాయామం చేయాలి. నిద్రలేచిన ప్రతివాడి కొట్టు తెరిచి ఒక గ్లాసుడు మంచినీళ్ళిస్తారు. అతని కో స్త్రీ ఉంటే ఆమె చేత ఆగది శుభ్రం చేయించి ఆమెను కేంద్రంలో ఇతర పనులకు పంపించేస్తారు. బేటియాటస్ శిక్షణాకేంద్రంలో వృధా అనేది కనిపించనే కనిపించదు. బానిసస్త్రీలు శిక్షణా కేంద్రంలోని వంటిల్లు తుడవాలి. అంట్లుతోమాలి. వంట చేయాలి. వంటిల్లు వెనుకనున్న పెరడు దున్నాలి. స్నానశాలలు బాగుచేయాలి. గొర్రెలను పెంచాలి. చవకగా తయారయే అంబలిపోసి, కొరడాతో బాది వీళ్ళందరి చేత పని చేయించేవారు. భూస్వాములకన్నా బాధపెట్టే వాడు బేటియాటస్. కాని స్పార్టకస్ అన్నా, వరీనియాఅన్నా అతని కెందుకో భయంగానే ఉండేది. వాళ్ళల్లో దేన్నిచూసి భయం కలిగేదో అతనికే తెలీదు.

ప్రత్యేకం ఆరోజు మాత్రం శిక్షణాకేంద్రమంతటా అసహనమూ, యేహ్యాభావం పూర్తిగా వ్యాపించిపోయాయి. మల్లుల్ని ఆవరణలోకి శిక్షకులు తోలిన పద్ధతిలో, ఆఫ్రికా మల్లుని శరీరాన్ని శిలువవేయడంలో, బానిసస్త్రీలను అకారణంగా కొరడాలతో బాదడంలో ఇదే కనిపిస్తోంది. ఆ రోజు ఉదయం వరీనియా అంటే వాళ్ళకి భయం వెయ్యలేదు. ఆమెకు గట్టిగా కొరడాదెబ్బలు తగిలాయి. తక్కిన వాళ్ళకన్నా కొరడా ఆమెనెక్కువ మార్లు తాకేది. వరీనియా వంట గదిలో పని చేస్తుంది. అందుకే ఆమెనక్కడికి తోలేశారు.

బేటియాటస్ క్రోధం అక్కడి వాతావరణమంతటా వ్యాపించింది. అసలు ఏ వర్తకుడి కయినా ఒకందుకే కోపం వస్తుంది. ఆర్థిక నష్టం వల్ల! మొదట అనుకున్నదానిలో సగం డబ్బు ఇవ్వడం మానేశాడు బ్రాకస్. కావాలంటే వ్యాజ్యం వేసుకోవచ్చు. కానీ వ్యాజ్యాలతో, వ్యవహారాలతో ఎవడు పడగలడు. అందులోనూ ఒక రోమన్ ఉన్నతకుటుంబీకుడికి వ్యతిరే కంగా రోమన్ కోర్టులో న్యాయం లభించడమేమిటి. అతని కోపం ఎన్నోరూపాల్లో ఎన్నో

విధాలుగా అక్కడంతా తాండవిస్తోనే వుంది. వంటగదిలో ఆడాళ్ళందరినీ పెద్ద కర్రతో బాదేశాడు వంటవాడు. తమ యజమాని చేతి దెబ్బలు చవి చూసిన శిక్షకులు మల్లుల్ని వాయించారు.

స్పార్టకస్ తన స్థానంలో ఉన్నాడు. ఒకవేపు గేనికస్. మరోవైపు గాల్ మల్లుడు క్రిక్సస్ ఉన్నారు. శిక్షకులు రోజుకన్నా హెచ్చుగా ఆయుధాలు ధరించారు. ముఖ్యంగా కత్తి, నిడుపాటి ఖడ్గం. తలుపులు తెరిచిఉన్నాయి. అక్కడ నలభై మంది సైనికులు చేతుల్లో పెద్ద ఈటెలు ధరించి నిల్చున్నారు. ఉదయభానుని వెచ్చదనం ఇసుకను తాకుతోంది. కాని స్పార్టకస్‌లో ఆ వెచ్చదనంలేదు. "ఏమిటిదంత?" అని గేనికస్ అతన్ని ప్రశ్నించాడు. తలఊపి మౌనంగా ఉండిపోయాడు స్పార్టకస్.

"పోనీ వాళ్ళల్లో వక్కడినైనా చంపాడుకాదు. చావదలుచుకుంటే ఇంతకన్న మంచిచావే చావొచ్చుగా."

"నువ్వింత కన్న మంచిచావు చావగలవా?"

"అతడో కుక్కలా చచ్చాడు. నువ్వూ అంతే" క్రిక్సస్ అనే గాల్ చెప్పాడు. "పొట్ట పెగుల్చుకుపోయి ఇసుకలో పడి చచ్చాడతను. నువ్వూ అంతే."

తానేం చేయాల్సిందీ అప్పుడే గ్రహించాడు స్పార్టకస్. సరిగా చెప్పదల్చుకుంటే ద్రవీభూతంగా ఉన్న గ్రహణశక్తి ఇప్పుడే ఘనీభవించింది. అది ఒక రూపం పొందుతోంది. దాని అంతం, రాబోయే కాలాల్లో ఉందోలేదో. ఆ వాస్తవికతకు అతనితో, అతని చుట్టూ ఉన్న హతభాగులతో సంబంధముంది. ముమ్ముందు జరగబోయే వాటితోనూ సంబంధముంది. నీగ్రో కళేబరాన్ని చూశాడు. కొరడాలతో విపరీతంగా మోదిన శరీరం అది. కత్తులు, బల్లేలు, ఆ శరీరాన్ని చీల్చినచోట్ల చర్మం వలవబడి ఎర్రని మాంసపుముద్దలు, రక్తం చిమ్మి గడ్డకట్టి ఎండిపోయింది. ఉన్నతమయిన, బలిష్ఠమయిన అతని భుజాలమధ్య తల ముందుకి ఒక పక్కగా పట్టుతప్పి వేలాడుతోంది.

ఈ రోమనులకు జీవితమంటే ఎంతరోత అనుకున్నాడు స్పార్టకస్. వాళ్ళెంత సులభంగా చంపగలరు. చావు అంటే అంత వ్యామోహమూ, ఉత్సాహమూ. తనబోటి బానిస జాతి రక్తంతో, ఎముకలమీద బతికేవాళ్ళకు అది ఎందుకుండదూ. శిలువెయ్యడమంటే ఎంత మోహపరవశత చెందుతారో వాళ్ళు! ఆ జబ్బు కార్తేజ్‌లో పుట్టింది. బానిసను చంపడానికి ఈ శిలువ వెయ్యడమే సరైన పద్ధతి అనుకున్నారు కార్తజీనియన్లు. రోమన్ల హస్తాలెక్కడకు సాచితే అక్కడకు ఈ శిలువ వ్యాపిస్తోంది.

బేటియాటస్ ఆవరణలోనికి వచ్చాడు. పెదిమలు కదిలీ కదలకుండా స్పార్టకస్ తన పక్కనున్న గాల్‌ను అడిగాడు. "నువ్వెలా చస్తావుమరి?"

"థ్రేషియన్! నువ్వెలా చస్తావో నేనూ అలానే."

"అతను నా నేస్తం" మృతుడైన నీగ్రోని చూపి చెప్పాడు స్పార్టకస్. "అతను నన్ను ప్రేమించాడు!"

"ఆ ప్రేమే కొంపకూల్చుతుంది."

వెనుక సైనికులు నిలబడగా చెప్పుకుపోతున్నాడు బేటియాటస్ "మిమ్మల్ని నేను మేపుతున్నాను. మీకు మంచి మంచి వేపుడు కూరలూ, మంచినీటి చేపలూ, పలావూ పెట్టి మరీ మేపుతున్నాను. మీకు స్నానాలు, మాలీసులు చేయిస్తున్నా. గనిగోతుల్లో పనిచేసే మీ మూకనంతటినీ, ఓడల అడుగునపడి ఏడ్చిన మిమ్ములనందరినీ చావకుండా ఇక్కడకు తీసుకువచ్చి మేపితే సోమరిపోతుతనానికి చక్రవర్తులై రోమ్‌నే తినేస్తున్నారు మీరు. పూర్వం మీరుండే నీచస్థాయికన్నా అధమాధమమైనదేదీ లేదు. అలాంటి మీకు ఏం కావాలంటే అదిచ్చి మీరెక్కడ బాధపడిపోతారో అని సకల సౌకర్యాలూ, సదుపాయాలూ చేశాను నేను."

"నువ్వు నా నేస్తానివేనా?" స్పార్టకస్ అడిగాడు. గాల్ పెదిమలు కనీకనబడకుండా మెదిపాడు.

"మల్లుడా, మల్లుల సహవాసం మాను!"

"నేను నిన్ను నేస్తం అంటాను" స్పార్టకస్ అన్నాడు.

చెపుతున్నాడు బేటియాటస్: "ఆ నల్లకుక్క మసిపూసిన హృదయంలో కృతజ్ఞత లేదు. మీలో ఎంతమంది ఉన్నారలాంటివాళ్ళు."

మౌనంగా నిలబడ్డారు మల్లులు.

"నా దగ్గరకు ఒక నల్లవాణ్ణి తీసుకరండి" శిక్షకుల కాజ్ఞాపించాడు బేటియాటస్. వాళ్ళు వెళ్ళి ఆఫ్రికన్లలోంచి ఒకణ్ణి అతని దగ్గరకు ఈడ్చుకుపోయారు. ఇదంతా పూర్వమే ఏర్పాటు చేసుకున్నారు. బాజాలు వాయించడం ప్రారంభమయింది. ఇద్దరు సైనికులు వచ్చి బల్లేలను పైకెత్తారు. బాజాలు మరింత వేగంగా, గట్టిగా మోగుతున్నాయి. భయంతో, బాధతో గింజుకుంటున్నాడు; కొట్టుకుంటున్నాడు నీగ్రో. రెండు రోమన్ ఈటెలు హృదయ ప్రదేశంలో దిగాయి. క్షణం క్రితం నిండు ప్రాణంతో ఉన్న నీగ్రో ఇప్పుడు ఇసుకలో పడి ఉన్నాడు. రెండు ఈటెలు చిత్రంగా కోణాకృతి ధరించాయి. రోమన్ మృత్యువు అతన్ని అలంకరించింది. తన దగ్గర నిలబడ్డ ఉద్యోగి వైపు తిరిగి బేటియాటస్ చెపుతున్నాడు: "ఇప్పుడికనేం ఖంగాళీ చేయరు. ఈ కుక్కలు ఇంక గుర్రైనా పెట్టలేవు."

"నేను నిన్ను నేస్తమంటున్నా" గేనికస్ స్పార్టకస్‌తో అన్నాడు. ఏమీ అనలేదు గాల్. బరువుగా, దీర్ఘంగా గాలి పీలుస్తూ నిలబడ్డాడు.

అప్పుడు ఉదయపు కవాతు ప్రారంభమయింది!

## 4

కొంత కాలం తర్వాత బేటియాటస్ సెనేట్ పరిశీలనా సంఘం ముందు హాజరయ్యాడు. తన శిక్షణా కేంద్రంలో కుట్రలు, మయోపాయాలు పన్నినట్లు తన కేమీ తెలీదని, అసలు

అలా పన్నడం అసాధ్యమని, అటువంటివి తాను నమ్మలేక పోతున్నానని చెప్పి దీనికి ఆధారంగా అతనొక విషయాన్ని వినిపించాడు. శిక్షణా కేంద్రంలో స్వేచ్ఛ ఇస్తానని ఇద్దరు మల్లుల్ని జీతాలిచ్చి పోషిస్తాడు. అప్పుడప్పుడు ఆ ఇద్దరూ ప్రదర్శనలిస్తారు కూడా. అందులో ఒకడికి ముందనుకున్న విధంగానే స్వేచ్ఛ ఇస్తారు. రెండోవాడు కొద్ది దెబ్బలతో తిరిగి వస్తాడు. మల్లుల రహస్యాల్ని చెప్పే మరొక మల్లుడిని ఆ ఖాళీ జాగాలో నియమిస్తాడు. దీన్ని బట్టి చూస్తే ఏ కుట్రా తనకు తెలీకుండా జరిగే అవకాశం లేదు అని అతని వాదన.

ఎన్నిసార్లు బానిసల తిరుగుబాట్లు జరిగినా వీటికి కారణంగాని, కారకులుగాని, ఈ విషఫలితాలకు దారితీసిన పరిస్థితులుగాని, అవిచ్ఛిన్నంగా సాగిపోతున్న వీటి మూలంగాని ఎప్పుడూ తెలుసుకోలేక పోతున్నారు. సిసిలీలో పెద్ద ఎత్తున జరిగిన విప్లవానికైనా, ఏ కొద్ది మంది దౌర్భాగ్యులనో శిలువెయ్యడంతో అంతమయ్యే తోటల్లో జరిగే విఫల ప్రయత్నాలకైనా మూలం ఇదీ అని సెనేటు నేటికి చెప్పలేక పోయింది. ఐనా మూలకారణాలు తెలుసుకు తీరాలి. విడివిడిగా ఉన్న దేశాలను రోమను రోడ్లు దగ్గరగా చేర్చాయి. ప్రపంచానికే ముఖ్య పట్టణం అనదగిన బలవత్తరమైన రోమ్‌లో ఆనందానికి, ఆహారానికి లోటులేదు. ఇక్కడే ఒక జబ్బు వ్యాపిస్తోంది. దాని మూలం ఎవరికీ తెలియదు.

అప్పుడు సెనేటు బేటియాటస్‌ను అడిగింది: "ఐతే కుట్రగాని, మాయోపాయంగాని, దురాలోచనగాని జరుగుతున్న సూచనలేవీ కనబడలేదా?"

"ఏమీ కనబడలేదు."

"మీరా ఆఫ్రికావాడికి మరణశిక్ష విధించినపుడు - మేం అది సరైనదేనని భావిస్తున్నాం లెండి - ఏ విధమైన నిరశనా లేదా?"

"లేదే!"

"బయటనించి ఏ విధమైన సహాయంకాని, అన్యుల ప్రోత్సాహంకాని ఉండే అవకాశం ఉందంటారా?"

"దానికి అవకాశం ఏమీ లేదు" బేటియాటస్ చెప్పాడు.

"బయటనించి సహాయంకాని, ధనంకాని ఈ నాయకత్రయం - స్పార్టకస్, గేనికస్, క్రిక్సస్‌లకు లభించిందంటారా?"

"అటువంటిదేమీ లేదని భగవత్సాక్షిగా చెప్పగలను" అని సమాధానమిచ్చాడు బేటియాటస్.

## 5

కానీ ఎవరూ ఒంటరిగా లేరు. అందులోనూ స్పార్టకస్ ఎప్పుడూ ఒంటరిగా ఉండడు. తను నిర్మించుకున్న ఏ గూటిలోనో ఏకాకిగా ఉండిపోడు. అదే అతనిలోని పరమాద్భుతమైన శక్తి. మేరియస్ బ్రాకస్ ఏర్పాటు చేయించిన ప్రదర్శన పోరాటాలు అనుకోని విధంగా పరిణమించిన నాటికి కొంత కాలం ముందు సిసిలీలో మూడు పెద్ద తోటలలో తిరుగుబాట్లు

లేచాయి. ఈ తిరుగుబాట్లలో పాల్గొన్న మొత్తం తొమ్మిదివందల మందిలోనూ చాలా కొద్దిమందిని తప్ప తక్కినవాళ్ళను శిలువలపై వేలాడతీశారు. ఈ రక్తపాతం అయాక కానీ బానిసలను చంపడంవల్ల ఎంత డబ్బు నష్టం వస్తుందో గ్రహించలేకపోయారు. చంపగా మిగిలిన వంద మందినీ ఓడలవాళ్ళకు అమ్మేసారు. ఆ ఓడలలోనే బేటియాటస్ ఏజంటు ఒకడు బలిష్ఠమైన పొడుగాటి క్రిక్సస్‌ను చూసాడు. బానిసలు పెంకెఘటాలని పేరుపడడం వల్ల వాళ్ళకు ధరకిట్టుబాటయేది కాదు. బానిస వ్యాపారం చేసే వాళ్ళకు ఆస్టియా నౌకా కేంద్రంలో అల్లరి, గొడవ జరగడం మంచిదికాదని తోచి అతని గత చరిత్ర చెప్పకుండా క్రిక్సస్‌ను వదుల్చు కొన్నారు. మొత్తం మీద స్పార్టకస్ ఏకాకిగా లేడు. ఒక బ్రహ్మాండమైన అల్లికలో తను ఓ భాగం కాకపోనూలేదు. అతని పక్క గదిలో క్రిక్సస్ ఉండేవాడు.

సాధారణంగా ప్రతి సాయంత్రం తలుపునకు తల చేరువగా పెట్టి పడుకుని బానిసత్వ విమోచనకై అర్థశతాబ్దం నుంచీ ఎడతెరిపి లేకుండా సిసిలీలో జరుగుతున్న నిరంతర పోరాటగాథలను క్రిక్సస్ చెప్పగా వినేవాడు. బానిసల్లో బానిసై పుట్టినవాడు స్పార్టకస్. కానీ, తనవంటి వారిలోనే పురాణ పురుషులవతరించారు. ఎఖీల్స్, హెక్టర్, ఒడెస్సస్‌లవంటి మహానుభావులుదయించారు. పాటల్లో, పద్యాల్లో వాళ్ళ కీర్తి ప్రస్తుతింపబడకపోయినా, దేవతల జాబితాల్లో వారి పేర్లు చేర్చి నైవేద్యాలు, హారతులూ ఇవ్వకపోయినా వాళ్ళు మహానుభావులే! మానవ సమాజపు ధృవతారలు. ఇదే చాలు. రోమన్లలాగనే వాళ్ళ దేవతలు బానిసల జీవితాలతో సంబంధం లేనివాళ్ళు. కాబట్టి, ఎఖీల్స్, అలాగే హెక్టర్, ఒడెస్సస్ సామాన్యమానవులు. బానిసలు; అందులోనూ దిగంబరులైన బానిసలు. బజారులో గాడిదలకన్నా తక్కువ ధరకు అమ్ముడుపోయే సరుకు, నాగలికికట్టి పొలం దున్నించడానికి ఉపయోగించే జంతువులు. కాని వాళ్ళు ఎటువంటి అఖండులు; దీవిలోని ప్రతి ఒక్క బానిసనూ విడిపించి, స్వేచ్ఛనిచ్చి మూడు రోమన్ సైనికదళాలను తుత్తునియలు చేసాడు యూనస్. గ్రీకువాడు ఎథీనియన్. థ్రేస్‌వాడు సాల్వియస్, జర్మనీవాడు వుండార్టు. యూదుడైన బెంజోష్ కార్తేజ్ నుండి పారిపోయి పడవనడిపే వాళ్ళందరితో సహా ఎథీనియన్‌తో కలిశాడు.

వింటున్న స్పార్టకస్ తన హృదయం గర్వంతో, సంతోషంతో ఉప్పొంగి పోతోందను కునేవాడు. తన హృదయాన్ని, ఆత్మను, పవిత్రం చేసే సోదరత్వం, ఆత్మీయత ఈ స్వర్గస్థులయిన మహాపురుషుల పట్ల తనకు కలిగినట్లు భావించేవాడు. మృత్యుంజయులైన ఈ వీరుల పేర్లు విన్నప్పుడల్లా అతని హృదయం ఆవేశంతో, ఉద్రేకంతో స్పందించేది. వారి మనస్సులో మెదిలిన భావాలు తనకి తెలుసు. తనకు తెలుసు వారే కలలు కన్నారో. సకలేంద్రి యాలతో వాళ్ళు ఏది వాంఛించారో తనకు తెలుసు. వాళ్ళ సంబంధం అంతర్జాతీయమైనది. వాళ్ళ ప్రకాశమైన విప్లవజ్యోతులు విఫలతవల్ల జాలిగొల్పేవి. రోమన్లు బానిసలను శిలువకు దిగగొట్టేవారు. బానిస కావడానికి నిరాకరించే బానిసకు ముట్టే బహుమానాన్ని అందరూ చూడ్డానికి ఈ శిలువలు.

ఎంత ఎక్కువ కాలం మల్లునిగా జీవితం గడిపితే అంత తక్కువగా ఈ సంగతుల గురించి మాట్లాడేవాడు క్రిక్సస్. భూత భవిష్యత్ కాలాలు మల్లుని కేమీ ఉపయోగించవు. అతనికి ఉన్నదల్లా వర్తమానమే. తన చుట్టూ నిరాశావాదపు గోడలు నిర్మించుకున్నాడు క్రిక్సస్. స్పార్టకస్ ఒక్కడే ఆ గోడల్ని బద్దలు కొట్టి మహాబలవంతుడైన గాల్‌ని చూడగలిగాడు. ఒకమాటు క్రిక్సస్ అతనితో చెప్పాడు: "నువ్వు చాలా మంది స్నేహితుల్ని సంపాదిస్తావు స్పార్టకస్. స్నేహితుణ్ణి చంపడం చాలా కష్టం. నా మానాన నన్ను బతకనీ."

ఈనాటి ఉదయం కసరత్తు పూర్తయిన పిమ్మట భోజనశాల లోనికి పోయే ముందు అంతా ఆ ఆవరణలో గుమిగూడారు. శరీరాలు వేడెక్కి చమటలు కారుతున్నాయి. ఆ మల్లులు అక్కడ నిలబడ్డారు. కొంతమంది కూర్చున్నారు. వాళ్ళ మాటలు వాళ్ల నోళ్ళల్లోనే మిగిలిపోయాయి. ఎదురుగా ఆవరణ గోడకు రెండు కళేబరాలు వేలాడుతున్నాయి. ఆఫ్రికన్ల కళేబరాలు రెండూ మేకువేసి గోడకి దిగగొట్టారు. చచ్చినవాడు చేసిన నేరానికి బతికినవాణ్ణి శిక్షించారు. అలాఉంది రోమన్ న్యాయశాస్త్రం. అలా శిక్షింపబడిన వాని శరీరం కింద ఇంకా రక్తం పడి ఇసుకలో మడుగులు కడుతూ ఉంది. రక్తదాహం గల ఈ రోమన్లు బతికిఉన్న తోటి మానవుణ్ణి చంపితే, చచ్చినవారి రక్తం పీల్చే పక్షులు కొన్ని అక్కడ వాలి దాహం తీర్చుకుంటున్నాయి. వ్యసనమనస్కులై ఉన్నారు మల్లులు. వ్యాకులపాటు గొంతుకలో అడ్డుపడి వారెవరినీ మాటాడనివ్వలేదు. ఇది కథ ప్రారంభం మాత్రమేనని అనుకున్నారు వాళ్ళు. బేటియాటస్ మరింతగా వాళ్ళని బాధిస్తాడని అభిప్రాయ పడ్డారు. ఇదొక చెడుకాలం.

సైనికులు తినడానికని పోయారు. శిక్షణా కేంద్రం పక్కగా ప్రవహించుకుంటూ పోయే ఏటి ఒడ్డునగల చెట్ల తోపులో ఆయుధాలు పెట్టి కూచున్నారు. స్పార్టకస్ వాళ్ళని చూస్తున్నాడు. శిరస్త్రాణాలు లేవు; ఆయుధాలు లేవు. దూరంగా ఉన్నారు వాళ్ళు. తదేక దీక్షతో దృష్టి వాళ్ళపై నిలిపాడు.

"ఏమిటి చూస్తున్నావ్?" గేనికస్ తెలుసుకోగోరాడు. వా ళ్ళిద్దరదీ చాలా కాలం నుంచి ఒకటే వృత్తి; ఒకే చోట ఇద్దరూ సహచరులయిన బానిసలు. గనులలో, థ్రేషియన్ కొండలలో చిన్నప్పుడూ, ఎప్పుడూ వాళ్ళు కలిసే ఉన్నారు.

"ఏమీలేదు."

క్రిక్సస్ వ్యాకులచిత్తుడై ఉన్నాడు. అతనిలో చాలా కాలంగా హింస అణగిఉంది. "దేన్ని చూస్తున్నావ్ స్పార్టకస్?" అని క్రిక్సస్ కూడా అడిగాడు.

"అబ్బే. ఏం లేదు."

"ఏమీ లేకపోవడమేమిటి. నీలో ఏమీ లేకపోతేనే థ్రేషియన్లంతా నిన్ను నాయనా అని పిలుస్తున్నారా?"

"క్రిక్సస్ నువ్వెవర్ని ద్వేషిస్తావ్?"

"ఆ నల్లవాడు కూడా నిన్ను నాయనా అనేవాడా స్పార్టకస్! నువ్వతనితో ఎందుకు

దెబ్బలాడలేదు. అవసరమొచ్చినపుడు నాతో దెబ్బలాడతావా?"

"ఏ మల్లునితోనూ నే నిక దెబ్బలాడను" ప్రతీమాటా తూచి ప్రశాంతంగా చెపుతు న్నాడు స్పార్టకస్. "మొన్నమొన్నటిదాకా నా కది తెలీదు. కాని ఇప్పుడు మాత్రం నేను తెలుసుకున్నా."

ఓ అరడజను మంది ఈ మాటలు విన్నారు. అతని చుట్టూ చేరారు. అతని దృష్టి ఆ సైనికుల మీద లేదింక. మల్లులను చూస్తున్నాడతను, తన తోటి మల్లులు. ఒక్కొక్కరి ముఖాన్నే పరిశీలనగా వాటి తూనిక కడుతున్నట్లుగా చూస్తున్నాడు. అరడజను మంది ఎనమండుగురు, పదిమంది, డజనుమంది అయారు. ఇంకా అతడేమీ అనలేదు. వాళ్ళలో ఇంతకు పూర్వం ఉన్న మనోవ్యధ మాయమయింది. ఉద్రేకం, ఆవేశం, ఉద్వేగం వాళ్ళ కళ్ళల్లో మెరుస్తున్నాయి. ఆ కళ్ళల్లోంచి హృదయాల్లోకి ఎక్కడికో అతడు చూస్తున్నాడు.

"నాయనా! ఏం చేద్దాం?" గేనికస్ అడిగాడు.

"చెయ్యా ల్సొచ్చినపుడు ఏం చెయ్యాలో అది చేద్దాం. ప్రస్తుతం దీన్ని బద్దలు కొట్టండి....."

అప్పుడు భవిష్యత్తు కళ్ళముందు గోచరించింది. థ్రేషియన్ బానిస వెయ్యేళ్ళ వాడయాడు. వెయ్యి సంవత్సరాల్లో జరగనిది ఇప్పుడు కొద్ది క్షణాల్లో జరగబోతోంది. అదుగో మళ్ళీ వాళ్ళు బానిస లవుతున్నారు. ఇంత ఆవేశం ఉండి కూడా వాళ్ళు బానిసలే. పొద్దుట భోజనంకోసం భోజనశాల వైపు వెళ్ళారు.

అప్పుడే బేటియాటస్ పల్లకీ వాళ్ళ పక్కగా పోయింది. ఎనిమిదిమంది మోసే ఆపల్లకీలో బేటియాటస్, అతని గుమాస్తా కూచునిఉన్నారు. బానిస లెంత క్రమశిక్షణతో ఉన్నారో అనుకు న్నాడు బేటియాటస్. ఆఫ్రికావాణ్ణి చంపిన ఖర్చు హెచ్చయినా, బాగానే జరిగిందనుకొన్నాడు.

# 6

భోజనాల గదిలో జరిగింది ఇదీ అని ఎప్పటికీ, ఎవరూ సరిగ్గా చెప్పలేరు. ఎలా చెప్పడం? బానిసల సాహసాన్ని చిత్రించేందుకు చరిత్రకారులు లేరే. ఒకవేళ బానిస చేసిన పనులకు చరిత్రలో స్థానం ఇచ్చితీరాల్సిన అవసరమే ఏర్పడిందనుకోండి; అప్పుడైనా బానిసలను కొనుక్కునేవాడే, వాళ్ళ నసహ్యించుకొనే వాడే, వాళ్ళంటే భయపడేవాడే ఆ చరిత్ర రాసేందుకు తయారయ్యేవాడు.

వంటగదిలో పనిచేస్తూ తను స్వయంగా చూసింది వరీనియా. చాలా కాలం గడిచాక ఆ సంగతి ఆమె ఎవరికో చెపుతోంది. మనమూ ఆ విప్లవపు రణగొణధ్వని విందాం. బ్రహ్మాండాన్ని బద్దలు చేసిన శబ్దం గుసగుసలాడుకునే స్థాయికి దిగినా అదెప్పుడూ వినబడ కుండా మాత్రం పోదు. భోజనాల హాలుకి ఒక వేపున వంటగది ఉంది. మరో చివర ఆ గదిలోకి ద్వారముంది.

ఆ భోజనాలగది బేటియాటస్ సృష్టి. పూర్వపు పద్ధతిన కట్టిన రోమన్ భవనానికి

అతడు మెరుగులు దిద్దాడు. మల్లులకు శిక్షణ ఇవ్వడం, వాళ్ళద్వారా డబ్బు సంపాదించడం, పోరాట ప్రదర్శనలు చూడాలనే పిచ్చి ఇంతమందినీ అదుపు ఆజ్ఞలలో పెట్టడం మొదలైన గొడవలన్నీ ప్రస్తుత రోమను సమాజపు సృష్టి. పూర్వం ఉన్న రాతిగోడకు మూడు గోడలు చేర్చాడు. ఆ చదరం మీద లోపలికి నాలుగువేపులా ఎనిమిది అడుగుల వెడల్పుగల కర్రచూరు దింపాడు. సమశీతోష్ణముండే కేపువాలో ఈ మాత్రం చాలు. శీతాకాలంలో మాత్రం కొంచెం చల్లగా, ఎప్పుడూ తేమగా ఉండేది. మల్లులు నేలమీద కూచొని తినేవారు. మధ్యగా పచారు చేస్తూ శిక్షకులు వీళ్ళని చూస్తూ ఉండేవారు. దీని కో పక్క వంటగది. ఆ గదిలో ఇటుకలతో, పెంకుతో కట్టిన పెద్ద పొయ్యి ఉంది. ఒక వేపు పెద్ద కర్రతలుపులున్నాయి. మల్లులు లోన ప్రవేశించిన తరువాత తలుపులు గడియవేస్తారు.

రోజూ మాదిరే ఈనాడు కూడా అంతే జరిగింది. వాళ్ళ వాళ్ళ స్థానాల్లో మల్లు లున్నారు. వంటగదిలో పనిచేసే బానిసలే వాళ్ళకు వడ్డన చేస్తున్నారు. అందులో చాలా మంది స్త్రీలే. నలుగురు శిక్షకులు చతురస్రాకారపు ఆవరణలో పచార్లు చేస్తున్నారు. కొరడాలు, కత్తులు పట్టుకున్నారు. ఇద్దరు సైనికు లొచ్చి తలుపులు బిగించి వెళ్ళారు. పైన గడియవేశారు. రమ్యమైన ఆ తోపులో చాలా దూరంగా సైనికులు విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఇదంతా స్పార్టకస్ గమనిస్తూనే ఉన్నాడు. అతడేమీ నోటబెట్టలేదు. నోరు తడి ఆరి పోయింది. అతని ఛాతీమీద హృదయం సమ్మెటతో కొడుతోంది. ఏమంత గొప్పపనేమీ జరగడం లేదు. భవిష్యత్తు గురించి ఇతరులకు తెలీనిదీ, తనకు తెలిసినదీ ఏమీలేదు. కాని కొంతమంది ఒక నిశ్చయానికి వస్తారు. "ఫలానా పని చేయలేకపోతే నే నిక బతికుండాల్సిన అవసరమూ లేదు. దాని ప్రయోజనమూ లేదు!" చాలా మంది ఈ నిశ్చయానికే వస్తే పృథ్వి కంపిస్తుంది.

ఈ రోజు సమాప్తమయ్యేసరికి, సూర్యుడస్తమించి చీకటి వ్యాపించేలోపున ఆ కంపనం జరుగుతుంది. కాని స్పార్టకస్‌కు అదేమీ తెలీదు. ముందు క్షణంలో చేయాల్సిన దేదో అదే తెలుసు అతనికి. ముందు మల్లులతో మాట్లాడాలి. క్రిక్సస్‌తో అతను చెబుతుంటే పొయ్యి దగ్గిర నిలబడి వరీనియా అతడిని చూసింది. అతని పెదిమల కదలికను చూసి భావం గ్రహిస్తున్నాడు యూదుడు. చెవి అతనివైపు పెట్టి నిలబడ్డాడు గేనికస్. ఆఫ్రికావాడు ఫ్రాక్సస్ అతనికి దగ్గరగా వచ్చాడు.

"నిలబడి మాట్లాడాలని ఉంది నాకు" స్పార్టకస్ అన్నాడు. "మనసు విప్పి మాట్లాడదా మనిఉంది నాకు. ఒకమారు మాట్లాడ్డం మొదలెడితే ఇక వెనుదీయడమనేది ఉండబోదు. అప్పుడా శిక్షకులు నన్ను ఆపడానికి ప్రయత్నిస్తారు."

"నిన్ను వాళ్ళాపలేరు" క్రిక్సస్ చెప్పాడు.

ఇద్దరు శిక్షకులు స్పార్టకస్ ఉన్న చోటికి వచ్చారు. కొరడాలు విదిలించి కత్తులు దూశారు.

"మాటా డిప్పుడు" గేనికస్ అరిచాడు.

"కుక్కలనుకున్నారా అలా కొరడాలతో బాదడానికి?" ఆఫ్రికన్ గర్జించాడు.

స్పార్టకస్ లేచి నిలబడ్డాడు. అతనితో పాటు చాలా మంది లేచారు. కొరడాలూ, కత్తులూ ఇష్టమొచ్చిన ట్లుపయోగిస్తున్నారు శిక్షకులు. మల్లులు వాళ్ళ మీద పడ్డారు. వెంటనే శిక్షకులు శిక్షింపబడ్డారు. బానిసస్త్రీలు వంటమనిషిని సఫా చేశారు. ఇంత జరిగినా పెద్ద చప్పుడేమీ కాలేదు. అప్పుడు స్పార్టకస్ మొదటిసారిగా ఆజ్ఞాపించాడు. నెమ్మదిగా, మృదువుగా, గాబరా పడకుండా జాగ్రత్తగా ఆజ్ఞాపించాడు. క్రిక్సస్, డేవిడ్, గేనికస్, ఫ్రాక్సస్‌లతో చెప్పాడు.

"వెళ్ళి ఆ ద్వారాన్ని జాగ్రత్తగా సంరక్షించండి. నేను మాట్లాడాలి."

ఈ గొడవనించి ఇంకా వాళ్ళు తేరుకోనేలేదు. కొద్ది క్షణాల్లో వాళ్ళతని ఆదేశాన్ని పాటించారు. ఆ తరువాత కూడా వాళ్ళకి నాయకత్వం వహించి నడిపించినప్పుడు అతని ప్రతిమాటా జవదాటక పాటించారు. అతన్ని ప్రేమించారు. క్రిక్సస్‌కు తెలుసు చావు అనివార్యమని. ఐనా అదేం లెక్కలేదు అతనికి. ఎప్పుడూ ఎరుగని వెచ్చదనం తనలో ప్రవహించి, సౌమ్యస్వభావుడయిన ఈ వింత థ్రేషియన్ అంటే ప్రేమ పొడసూపింది. పగిలిన ముక్కుతో అసహ్యంగా కనబడే స్పార్టకస్ అంటే యూదుడు డేవిడ్‌కు ఇష్టం కలిగింది.

# 7

"నా చుట్టూరా చేరండి" స్పార్టకస్ అన్నాడు.

ఇదంతా ఎంతో త్వరగా జరిగింది. బయటనున్నసైనికులకు ఈ గొడవేమీ తెలీదింకా. వంటగదిలోని మల్లులూ, బానిస స్త్రీలు, పురుషులూ వచ్చి వీళ్ళ చుట్టూ చేరారు. భయంతో, ఆశతో, భక్తితో అతని వైపు చూస్తూ వరీనియా అటొస్తోంది. ఆమె కోసం వాళ్ళు పక్కకు తొలిగారు. తన దగ్గరకు వచ్చి నిలబడ్డ వరీనియాను చేత్తో చుట్టి గట్టిగా అదిమి పట్టుకొని తనలో అనుకున్నాడు.

"ఇప్పటికి నేనొక స్వతంత్రుణ్ణి! నా తండ్రిగాని, తాతగాని వాళ్ళ జీవితకాలంలో ఒక్క క్షణం స్వేచ్ఛావాయువులు పీల్చిన పాపానపోలేదు. కాని నే నిప్పుడు స్వేచ్ఛాజీవిని." ఆ భావాన్ని సేవించిన అతనిలో తీయని ద్రాక్షసారా ఆహారనాళం గుండా చల్లగా జారినట్లని పించింది. కాని దానితోపాటు ఓ భయం కూడా ఉంది. స్వతంత్రం పొందడమంటే తమాషా ఏమీ కాదు, అది మాటలతో అయ్యే పనికాదు. తను వేసే ప్రతి అడుగునా నోరు తెరిచి మృత్యువు కబళింప చూస్తున్నదని అతనికి తెలుసు. వాళ్ళ కళ్ళన్నీ అతన్ని గమనిస్తున్నాయి. శాంత స్వభావంగల థ్రేషియన్ తమ హృదయారాటాన్ని తెలుసుకున్నవాడని, తమకు ఆత్మీయుడని వాళ్ళు తలపోశారు. ఆ కాలపు ప్రజలు మూఢనమ్మకాలకూ, విశ్వాసాలకూ దాసులు. ఏదో ఒక దేవత, కొద్దిగా జాలి హృదయంగల ఒక దేవత అతన్ని స్పృశించిందని మల్లులు భావించారు. అందుకని అతను భవిష్యత్తుతో మంతనాలాడి దాన్నొక వాచకం కింద గడగడా వినిపించి వాళ్ళను ముందుకి నడిపించాలి. ఒకవేళ రోడ్లు లేకపోతే వాళ్ళకు

ప్రయాణానికి అతనే కొత్తబాటలు వేయాలి. వాళ్ళ కళ్ళల్లో ఇవన్నీ అతనికి కనపడ్డాయి.

"మీరు నా వాళ్ళేనా?" దగ్గరగా నిలబడ్డ వాళ్ళ నుద్దేశించి ప్రశ్నించాడు. "ఇక ముం దెన్నటికీ నేను మల్లుణ్ణి కాను. ముందు నే చస్తా. మీరు నా ప్రజలేనా?"

కొందరి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఇంకా దగ్గరగా వచ్చి నిలబడ్డారు. కొందరు భయపడ్డారు. కాని వాళ్ళ నందరినీ అతను తేజస్సులో జలకమాడించాడు. అదీ అతనిలోని శక్తి, ప్రతిభ.

"మనలో ప్రతివాడు ఇప్పుడో వీరుడు. అందరం కలిసి ఒకే మనిషిలాగ ఉండాలి మనం. పూర్వం నా ప్రజలు చెప్పగా విన్నాను నేను. పోరాటానికి పోయే ముందు ఒక సదు ద్దేశంతో వెళ్ళేవారట. ఎవరికైనా పోరాటానికి పోవాలని లేకపోతే వాడికేసిచూడరు వాళ్లు."

"మనం ఏం చేద్దాం?" ఒక డడిగాడు.

"పోరాడుదాం; ఘనంగా పోరాడుదాం. మనకన్న పోరాడగలిగిన వాళ్ళు ఈ భువిలో లేరు కనుక పోరాడుదాం. బాగా పోరాడుదాం" అన్నాడు స్పార్టకస్. అతని కంఠం ప్రతి ధ్వనిస్తోంది. ఇతడేనా మృదువుగా మాట్లాడే స్పార్టకస్ అని ఆశ్చర్యపోయి అలాగే నిలబడ్డారు మల్లులు.

"కేపువా మల్లులను రోమ్ మరువలేని విధంగా మనం యుద్ధాలు చేద్దాం!"

మానవుడు చేయాల్సిన దానికి కాలమొకటి ఉంది. వరీనియాకు ఇది తెలుసు. పూర్వం ఎన్నడూ ఎరుగని సంతోషాన్ని నేడామె చూపింది. ఒక ఆనందాన్ని పొందింది ఆమె. ప్రపంచంలో ఎవరితోనూ సరిపోల్చదగని మేటి మగవాడు ఆమె భర్త అనే విషయం ఆమెలో గర్వాన్నీ, ఆనందాన్నీ రేకెత్తించాయి. ఆమెకు స్పార్టకస్ గురించి తెలుసు. అనతి కాలంలో ప్రపంచాని కంతకూ తెలుస్తుంది. అతనివంటివాడు మరొకడు లేడని అనుకుంది.

# 8

"మొదటా సైనికులు" స్పార్టకస్ ఆజ్ఞాపించాడు. "మనం ఐదుగురికి వాళ్ళల్లో ఒక్కడున్నాడు. వాళ్ళు పారిపోతారేమో."

"వాళ్ళు మననైనా చంపాలి, లేదా మనం వాళ్ళనైనా చంపాలి. వాళ్ళని మనం చంపినా, ఇంకా బోలెడు మంది వస్తారు. రోమన్ సైనికులకు అంతేమిటి" తనకేసి చూసిన వాళ్ళతో అతనన్నాడు. "ఐతే బానిసలకు మాత్రం అంతుందా ఏమిటి?"

అప్పుడు వాళ్లు తమ ప్రయత్నాలు శీఘ్రంగా కొనసాగించారు. చచ్చిన శిక్షకుల ఖడ్గాలు తీసుకున్నారు. ఆయుధంగా ఉపయోగించుకునేందుకు వీలైనవన్నీ వంటగదిలోంచి తీసుకువచ్చారు. మాంసం గుచ్చి కాల్చే పెద్ద పెద్ద ఇనుపఊచలూ, గొడ్డళ్ళూ, పొడుగాటి అట్లకాడలు, ముఖ్యంగా రోకళ్ళు ఒకటేమిటి, చేతికి దొరికిందల్లా కనీసం శత్రువుమీదికి విసరేందుకు ఉపయోగపడుతుంది కదా అనే ఉద్దేశంతో తీసుకువచ్చారు. కట్టెలు కూడా

వాళ్ళ ఆయుధాలే అయ్యాయి. మూకుళ్ళు, పెనాలు వాళ్ళ డాళ్ళు. ఏదో మాదిరి ఆయుధాలు ప్రతి ఒక్కరి దగ్గరా ఉన్నాయి. స్త్రీలు వెంటరాగా యుద్ధానికి పోడానికి వాళ్ళా పెద్ద కర్ర తలుపులను తెరిచారు.

వాళ్ళు తొందరగానే వెళ్ళారు. ఇద్దరు కాపలా సైనికు లీ వార్త తక్కిన వాళ్ళ దగ్గరకు మోసుకపోయారు. వెంటనే తోపులోని సైనికులంతా కవచాలు ధరించి, అస్త్రాలు పూని, నాలుగు దళాలుగా చీలి, ఏటి గట్టున నిలబడ్డారు. నలభై మంది సైనికులు. సైనికుల్లాగే కవచాలూ, ఆయుధాలూ ధరించిన శిక్షకులూ. మొత్తం ఏభై యిద్దరున్నారు. రెండు వందల మంది మల్లుల కెదురుగా వాళ్ళు నిలబడ్డారు. అదేమీ సమఉజ్జీకాదు. ఒక దళం తరువాత ఒక దళం ఈటెలనెత్తి పట్టుకుని ముందుకు వస్తున్నాయి. ప్రభాత వాయువులు దళాధిపతుల ఆజ్ఞలను మోసుకుపోతున్నాయి. వాళ్ళ మాటలు స్పష్టంగానే వినిపిస్తున్నాయి. ఈ బానిసా ధములను తుడిచిపారేయలేక పోతామా అన్నట్లు నడుస్తున్నారు వాళ్ళు. గడ్డిపూలు వాళ్ళ పాదాల కింద నలిగి పోతున్నాయి. ఆ చుట్టు పక్కలనున్న బానిసలు ఏమిటీ ఆశ్చర్యమని చూడవచ్చారు. ఎండలో ఈటెల మొనలు మెరుస్తున్నాయి. రోమన్ శక్తి ప్రదర్శించడానికి ఈ కొద్దిపాటి సైనికులూ చాలు. ఒట్టి బానిసలైతే వీళ్ళని చూసి పరిగెత్తే వాళ్ళే.

కాని ఆ సమయంలో మాత్రం రోమన్ శక్తి అగాధంలో పడిపోయింది. స్పార్టకస్ సేనానాయకుడయాడు. ప్రజల్ని నడిపించే వ్యక్తికి ప్రత్యేక స్వీరచనమంటూ ఏమీ లేదు. నాయకత్వమన్నది, అరుదైనదీ, అర్థమవనిదీ. అధికారం కీర్తి కలిస్తే ఎవడైనా ఆజ్ఞాపించవచ్చు. కాని ఇతరులు వినేలా ఆజ్ఞాపించగలగడమే విశేషం. ఆ విశేషం స్పార్టకస్‌లో ఉంది. దూర దూరంగా ఉండండని ఆజ్ఞాపించాడు. వాళ్ళు అలా దూరంగా ఉండిపోయారు. ఈ దళాలను చుట్టుముట్టడానికి వీలుగా ఒక పెద్ద వలయంగా ఉండమన్నాడు. వాళ్ళు అటువంటి వలయాన్నే ఏర్పరిచారు.

సైనికదళాల వేగం తగ్గింది. ఏం చేయాలో వాళ్ళకు తెలీడం లేదు. వాళ్ళు ఆగారు. ప్రపంచంలో ఏ సైనికుడూ మల్లులతో సమానంగా నడవలేడు. మల్లులకు వేగమే జీవితం. ఆ వేగం, చురుకుదనమూ లేకపోతే ద్వంద్వయుద్ధాలు చేయనేలేరు. పైగా వీళ్ళేమీ దుస్తులు ధరించలేదు, లంగోటాలు తప్ప. రోమన్ సైనికులు అలాగాక ఖడ్గం, డాలు, శిరస్త్రాణం, కవచం, బూట్లు వగైరా ఎంతో బరువు మోస్తున్నారు. ఆ బానిసల వలయంలో సైనికులు ఇటూ అటూ తిరుగుతూ ఈటెలు విసురుతున్నారు. ఆ ఈటెలు ఎంత విసిరినా ముప్పై నలభై గజాలు మించిపోవు. వాటి ప్రయోజనం లేదు. పైగా ఒకమాటు విసిరితే వాటిపని సరి. బానిసలంత దూరమున్నప్పుడు వాటిని ఎవరిమీద విసరడం?

ఆ పరిస్థితిలో స్పష్టంగా సూక్ష్మదృష్టితో తన వ్యూహాన్ని రచించాడు స్పార్టకస్. రాబోయే సంవత్సరాలలో కూడ అతడదే వ్యూహరచనా పద్ధతి నవలంభించాడు. వాడి అయిన రోమను ఈటెలకు ఎదురుగా మూకుమ్మడిగా పడి ప్రాణాలను బలిచ్చి నశించిన సైన్యాల గాథలు

విన్నాడు. ఆ ఎత్తుగడల్లోని తప్పులను తన మనోనేత్రంతో చూడగలిగాడు. అరుస్తూ, శపిస్తూ నిలిచిన దిగంబర మల్లుల మధ్య రోమన్ క్రమశిక్షణ, రోమన్‌శక్తి, అసహాయతతో నిలబడిపోయాయి. "విసరండి రాళ్ళు" అరిచాడు స్పార్టకస్. "అవే మన తరఫున పోట్లాడ తాయి" ఆ వలయం చుట్టూ ఠీవిగా కదులుతున్నాడు.

రోమను క్రమశిక్షణ రాళ్ళ వర్షంలో నిలబడింది. అక్కడ గాలి రాతిమయమయింది. ఎగిరే భయంకరమైనరాళ్ళు. స్త్రీలు కూడా కలిసారు. ఇళ్ళల్లో పనిచేసే బానిసలు, తోటల్లో, పొలాల్లో పనిచేసే బానిసలూ కలిసారు. సుశిక్షితులైన సైనికులు గత్యంతరం లేక పెద్దపెద్ద డాళ్ళ నడ్డు పెట్టుకుని వంగి ముడుచుకుపోయి నిలబడ్డారు. ముందుకు వచ్చి సైనిక శ్రేణులను ఖండించి ఎదుర్కొనేందుకు అదే మల్లులకు అవకాశమిచ్చింది. కొద్ది మంది సైనికులు ఈటెలు విసిరారు. ఒక్క మల్లుడు మాత్రం ఆ ఆయుధానికి గురికాక తప్పలేదు. తక్కినవారు ఆ సైనికబృందంపై పడి చీల్చి చెండాడి అందరినీ చంపారు. సైనికులు తిప్పి కొట్టడానికి ప్రయత్నించారు. తోడేళ్ళలా మల్లులు వాళ్ళ మీద పడి చంపుతున్నారు. పది మంది సైనికులు తోవ చేసుకుని ఎలాగోలాగున తప్పించుకుపోదా మనుకున్నారు. కాని ఆ పనికి పదిమంది సరిపోతారా? వాళ్ళు కూడా సంహరింపబడ్డారు. క్షమాభిక్ష వేడుకున్న శిక్షకు లిద్దరిని ఆడాళ్ళు డాళ్ళతో కొట్టి చంపారు. శిక్షణా కేంద్రం ఆవరణలో మొదలయిన ఈ చిన్న వింతయుద్ధం కేపువా రోడ్డుదాకా వ్యాపించి అక్కడున్న ప్రతి సైనికుణ్ణీ హతమార్చేవరకూ వెళ్ళింది. ఆ ప్రదేశమంతటా చచ్చినవాళ్ళు, గాయాలు తగిలినవాళ్ళూ పడి ఉన్నారు. రోమన్ సైనికులూ, శిక్షకులూ కలిపి ఏభై నలుగురు చచ్చిపోయారు.

అది నాంది మాత్రమే. విజయోత్సాహంతో రాజమార్గంలో నిలబడి స్పార్టకస్ దూరంగా ఉన్న కేపువా నగరపు గోడలు చూశాడు. రక్షణదుర్గంలో భేరీ మోగుతోంది. ఇప్పుడింక విశ్రాంతి ఉండదు; అందరికీ ఉప్పు అందింది. రక్షణదుర్గంలో చాలా మంది సైనికులున్నారు. ప్రపంచగోళం ధణేలుమని పేలినట్లయింది. మృత్యువుతో నిండిన, నెత్తుటితో తడిసిన, ఆ రాజమార్గంలో నిలబడ్డ స్పార్టకస్‌కి బ్రహ్మాండమైన కల్లోలిత ప్రవాహాలపై స్వారీ చేస్తున్నట్లని పించింది. నవ్వుతూ కనబడ్డాడు క్రిక్సస్. విజయోత్సాహంతో కనబడ్డాడు గేనికస్. కత్తిపై నెత్తురు, జీవంతో మెరిసే కళ్ళతో కనబడ్డాడు యూదుడు డేవిడ్. వాళ్ళ భాషలో యుద్ధగీతాలను పాడుకుంటూ ఆఫ్రికన్లు నిశ్చలంగా నిలబడ్డారు. అదో హడావిడి. ఆ హడావుడిలో కొందరు బానిసలు సారాసంచులు విప్పే ప్రయత్నంలో ఉన్నారు. స్పార్టకస్ వాళ్ళ వంటిమీద తెలివొచ్చేలా చేశాడు. అతనిలో మృదుత్వం పోయింది. ఏకాగ్రత రగుల్కొని అతన్ని మార్చివేసింది. తన జీవితమంతా ఈ పనికే, అతని ప్రయత్నమంతా ఈ పనికే అని ఉద్బోధించింది. శతాబ్దాల తరబడి అతడు నిరీక్షిస్తున్నాడు. మొదటి బానిసకు సంకెళ్ళు తగిలించి నీళ్ళను తోడమని కర్రతో, కొరడాలతో మోదినప్పటి నుంచీ నిరీక్షిస్తున్నాడు. అప్పుడే ఒక నిర్ణయాని కొచ్చాడు.

ఆ నిర్ణయానికి మార్పన్నది లేదు.

పూర్వం వాళ్ళని అడిగేవాడు. కాని ఇపుడు వాళ్ళని ఆజ్ఞాపిస్తున్నాడు. రోమన్ ఆయుధాలు ఎవరు ఉపయోగించగలరు? ఈటెలతో ఎవరు పోరాడగలరు? వాళ్ళందర్నీ నాలుగు దళాలుగా ఏర్పరిచాడు.

"స్త్రీలు లోపలుండండి. వాళ్ళు బయటకు కనపడకూడదు. దెబ్బలాడకూడదు" అన్నాడతను.

స్త్రీల ఆగ్రహం అతన్ని ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. మొగాళ్ళ కోపంకన్న అదెంతో తీవ్రమైనది. "మాకు దెబ్బలాడాలని ఉంది" అన్నారు వాళ్ళు. మా మాట వినకపోతే 'ఊరుకోం' అన్నారు. కత్తులు కొన్ని కావాలని వాదించారు. అవి ఇవ్వకపోవడం చూసి రాళ్ళను వళ్ళో మూటకట్టుకుని నిలబడ్డారు!

శిక్షణా కేంద్రం సమీపంలో రాతిమయమైన తోటలున్నాయి. అద్భుతమైనదేదో, జరుగుతోందని, తెలుసుకుని ఆ తోటల్లోని బానిసలు రాతిగోడల మీద కూచుని, గుంపులు గుంపులుగా చేరి నిలబడి ఇదంతా చూస్తున్నారు. వాళ్ళని చూసేసరికి ఒక్క క్షణంలో అతనికి భవిష్యత్తు సాక్షాత్కరించింది. యూదుడు డేవిడ్‌ని పిలిచి చేయవలసిన దేదో చెప్పాడు. డేవిడ్ ఆ బానిసలవైపు పరిగెత్తాడు. స్పార్టకస్ ఊహ సరైనదే. చూస్తూ నిలబడ్డ బానిసల్లో మూడొంతుల మంది డేవిడ్‌తో వచ్చేశారు. పరుగెత్తుకువచ్చి మల్లుల చేతుల్ని ముద్దెట్టు కున్నారు. వాళ్ళ వద్ద తొళ్ళికలున్నాయి. ఆ పనిముట్లు ఆయుధాలుగా మారాయి. ఆఫ్రికా వాళ్ళు తిరిగి వచ్చారు. శూలాలున్న పెట్టె బద్దలుకొట్టి ముప్పయి త్రిశూలాలు తీసుకొచ్చారు. త్రిశూలాలతో పోరాడేవాళ్ళ కా ఆయుధాలిచ్చాడు స్పార్టకస్. వారి వింత భాషలో ఏవేవో ప్రతినలు పూనారు.

ఇదంతా కొద్దిపాటి క్షణాల్లో జరిగింది. కాని ఇంకా వేగంగా జరగాలన్న విషయం స్పార్టకస్ గుర్తించాడు. శిక్షణా కేంద్రంనించి, వాళ్ళున్న ఆ ప్రదేశం నించి, కేపువా నించి బయటకు పోవాలనుకున్నాడతను. "నాతో రండి" అతనరిచాడు. "నాతో రండి" అతని పక్కనే వరీనియా నిలబడింది. రోడ్డుదాటి, తోటలుదాటి, ఏటవాలుగా ఉన్న కొండలు మీదకు వాళ్లెక్కారు. "న న్నెప్పుడూ వదిలిపెట్టకేం!" అంది వరీనియా, "నేను మొగాడిలా యుద్ధం చేయగలను."

రోడ్డు మీద కేపువానించి వస్తోన్న సైనికులు కనిపించారు. రెండొందల మంది మల్లులు కొండల్లోకి పోతున్నారన్న సంగతి తెలిసి వాళ్ళు జంటలుగా వచ్చారు. అప్పుడు సైనికాధిపతులు మల్లుల శ్రేణులను ఛేదించవలసినదిగా ఆజ్ఞాపించారు. ఎంతోమంది కేపువా పౌరులు ఖర్చులేని ద్వంద్వయుద్ధాలు అయాచితంగా ఏర్పాటవుతున్నాయి కదా అని సింహ ద్వారం వద్ద నిలబడి చూస్తున్నారు.

ఇదంతా ఏదో ఒకచోట ఆగిపోనూవచ్చు. ఇంతకు పూర్వం బానిసలు తప్పించుకు

పారిపోవడమూ కద్దు. అలా పారిపోయినవాళ్ళు తోటల్లోకీ, అడవుల్లోకీ పోయి దొరికిందేదో, దొంగిలించగలిగిందేదో తిని జంతువుల్లా కొన్నాళ్లు కాలం గడిపేవారు. ఒక్కొక్కణ్ణీ తరుము కొచ్చి సైనికులు దొరికిన ప్రతి బానిసనీ శిలువలపై దిగగొట్టేవారు. తమవైపు వస్తోన్న రక్షణ దుర్గంలోని సైనికులను చూసి స్పార్టకస్ ఇదంతా గ్రహించాడు. ఆ ప్రపంచంలో బానిసకు ఎక్కడా శరణ్యం లేదు. ప్రపంచం అలా తయారయింది. ఈ ప్రపంచం మారాలి. అంటే ప్రపంచాన్ని మార్చాలి.

పరిగెత్తడం ఆపాడు. చెప్పాడు "సైనికులతో తలపడాలి మనం."

# 9

తరువాత చాలా కాలానికి స్పార్టకస్ తనలో తాను ప్రశ్నించుకున్నాడు. "మా పోరాటా లేమిటో, మేమేం నెగ్గామో, ఏవి ఓడామో వీటి గురించి రాసేదెవరు? నిజం చెప్పేదెవరు?" బానిసలకు సత్యమైనది, వారిని కల్పించిన వర్గాలకు విరుద్ధం. అసలెప్పుడైనా నిజమనే దానికి అవకాశముండదు! ఏ పరిస్థితుల్లోనైనా సరే నిజానికి తావేలేదు. ఆయా కాలమాన పరిస్థితుల్లో ఆయా సందర్భాలలో ఇదిగో ఇదీ యథార్థం అని చెప్పి ఎవరినీ వప్పించలేం. బోధపర్చడానికి ప్రయత్నించినా ఎంతవరకు పని జరుగుతుందనేది వేరే విషయం. బానిసలకన్న సైనికులెక్కువ. ఆ సైనికులకు ఆయుధాలు కూడా ఎక్కువే ఉన్నాయి. అసలు బానిసలు యుద్ధం చేయగలరని సైనికులు అనుకోలేదు. కానీ, సైనికులు తప్పక యుద్ధం చేసి తీరతారని బానిసలకు తెలుసు. కొండలమీదకి పరుగెత్తుకు వస్తున్నారు సైనికులు. వాళ్ళకు ప్రతిదినమూ కవాతులో చెప్పిన పద్ధతిలోనే వరుసలు తప్పకుండా, క్రమశిక్షణతో పరిగెత్తుకు వస్తున్నారు. పారిపోయేది కుందేలే అని తెలిసినపుడు సహజంగా ధైర్యంతో పరిగెత్తొచ్చు. సైనికులు ఆ విధంగానే పరిగెత్తు కొచ్చారు. పరిగెడుతున్న వాళ్ల హఠాత్తుగా దెబ్బతినేశారు. వాళ్ళ కర్థం కాలేదు. ఆడవాళ్ళు విసురుతోన్న రాళ్ళధాటి కోర్వలేక డాళ్ళ వెనక దాగుతూ వాటి నడ్డుపెట్టుకొని ఎటు విసురు తున్నారో తెలీకుండా ఈటెలు విసురుతున్నారు.

ఇది మాత్రం నిజం. బానిసలు సైనికుల్ని తరిమి తరిమికొట్టారు. సునాయాసంగా కేపువాకు సగం దూరందాకా తరిమేశారు. కొందర్ని చంపి పారేశారు. మొదటి పోరాటంలో బానిసలు బాగా నష్టపడ్డారు. కాని రెండవతూరి పోరాడినపుడు మాత్రం ఏమంత నష్టం లేదు. రోమన్ సైనికులు కాళ్ళకు బుద్ధి చెప్పి రోడ్డు పట్టుకుని పలాయనం చిత్తగించారు! అసలు విషయం అలాగుండగా దాన్నే వందల రకాలుగా, మనిషికో పద్ధతిగా చెప్పుకున్నారు. కాని అధికారయుతమైన మొదటి రిపోర్టుని కేపువా రక్షణదుర్గపు సైనికాధికారి తయారు చేశాడు.

అతను ఈ విధంగా రాశాడు : "లెంటులుస్ బేటియాటస్ శిక్షణా కేంద్రంలోని కొద్ది మంది మల్లులు తిరగబడ్డారు. అందులో చాలా మంది దక్షిణంగా ఏపియన్ మార్గంగుండా

పారిపోయారు. అర్థపటాలం సైనికులను పంపించాం. కాని వాళ్ళెలాగో తప్పించుక పారి పోయారు. పల్లె ప్రాంతాల్లోని బానిసల్లో అలజడి, ఆందోళన లేవతీస్తున్నారు. వాళ్ళ నాయకు లెవరో, వాళ్ళ ఉద్దేశాలేవో తేలీడం లేదు. తక్షణం ఈ తిరుగుబాటును అణిచేందుకు ఉత్కృష్టమైన రోమన్ సెనేట్ సహాయ సేనలను పంపించాలని ఇక్కడి పౌరులు కోరుకుంటు న్నారు." ఎందుకైనా మంచిదని కాబోలు మరో వాక్యం కూడా చేర్చాడు. "అప్పుడే ఎన్నో అత్యాచారాలు జరుగుతున్నాయి. గృహదహనాలూ, దోపిడీలూ జరుగుతాయేమోనని పల్లె ప్రజలు భయభ్రాంతులవుతున్నారు."

ఏమి జరిగిందో తెలుసుకోవాలనే కుతూహలమున్న ప్రజలకు తనకు తెలిసినంత మట్టుకు చెప్పాడు బేటియాటస్. ఎన్నో సంవత్సరాలుగా అతడు చేసిన కృషి అంతా ఒక్క క్షణంలో గంగపాలయింది. అందుకే అతనికన్న వ్యధ చెందినవారు, కలత పడినవారూ లేరనే చెప్పాలి. ఈ భయంకరమైన మల్లులను చావగొట్టి శిలువలకు తగిలించేవరకూ పల్లెలు ఆందోళనకు ఆటపట్టయి అశాంతి ఏర్పడుతుందని అందరికీ తెలుసు. ఆ శిలువల వల్ల లాభం చేకూరగలదని అంతా అనుకున్నారు.

"కేపువా పెద్దబావిలో నీళ్ళు తోడుతూనే ఉన్నాను. ఇట్టే తప్పించుకపోయాడు స్పార్టకస్. నేను చూశాను. రాక్షసంత మనిషి. అమ్మనాయనో ఎంత భయమేసిందని. పసికందు పొట్టలో ఈటెతో పొడిచి పైకెత్తి పట్టుకున్నాడు. అమ్మ! వాడి రాక్షసత్వం మాడ!"

ఇలాగే కొన్ని వేల విధాల్లో స్పార్టకస్ గురించి అనుకున్నారు. అతని గుణ, గణరూప విశేష వర్ణనలు చేసుకున్నారు. వీటిమాటకేంగాని ఆ పరిస్థితుల్లో స్పార్టకస్ చూడగలిగిందే సత్యం అని చెప్పాలి. కాలం యొక్క ఉక్కు సంకెళ్ళన్ని విదుల్చుకొని కానరాని భవిష్యత్ కాలాన్ని చూడగలిగింది అతని దృష్టి. అతని నాయకత్వం కింద నడిచిన మల్లులు రెండు చిన్న పోరాటాల్లో రోమన్ సైనికుల్ని తుడిచిపెట్టారు. నగరంలో ఆ సైనికులు సుఖజీవనం సాగుస్తున్నవారే అనుకోండి. అయితే మాత్రం అణిగిపడివుండే బానిసెక్కడ, తిరస్కారం ప్రకటించగల ధైర్యమెక్కడ! అంతటితో ఆగిందీ! ఒకే రోజున బానిసలు తమ యజమానిపై రెండు పర్యాయాలు దెబ్బతీశారు. అందులోనూ ఆయుధాలతో! ఇదీ అక్కడ గమనించాల్సిన విశేషం. పైగా సైనికులు పారిపోయినంత మాత్రాన వాళ్ళ తిరుగుబాటు ప్రయత్నాలాగాయా అంటే అదీ లేదు. స్పార్టకస్ ఒక్కమారు పిలవడంతో ఆ బానిసలంతా హాజరయారు. కొద్ది గడియల్లో వాళ్ళతన్ని దేవుడుగా మార్చేశారు. విజయోల్లాసం వారిలో ప్రవేశించి ఆత్మవిశ్వాసాన్ని పురిగొల్పగా అది వారిలోని భయసందేహాలను దరిదాపుల కనపడకుండా పారదోలింది. నెమ్మదిగా, లాలనగా, మృదువుగా ఒకళ్ళనొకళ్ళు తాకుతున్నారు. ఆ స్పర్శ వారి భాషలేని భావాలను ప్రసారం చేస్తోంది. "మల్లుడా మల్లుల సహవాసం మాను" అన్న సూత్రం ఇప్పుడు ఏమైపోయింది. ఒక్క దెబ్బ నెగిరిపోయింది. తద్విరుద్ధమైనదే నిజమయి కూర్చుంది. ఒకరి ఉనికి వేరొకరికి శక్తినీ, ఉత్సాహాన్నీ ఇచ్చింది. ఇవన్నీ వాళ్ళ ఆలోచనా పర్యవసానంగా తేలిన

విషయాలా, వాళ్ళ హేతు చర్చలవల్ల బయటపడ్డ సారాంశమా అంటే అదేమీ కాదు. వాటంతటవే, వాళ్ళకే తెలీకుండా పరిస్థితుల కనుగుణంగా వచ్చిన భావాలు. వాళ్ళు అమాయకులు, మామూలు మనుషులు. ఇదివరకెన్నడూ ఒకరి ముఖంలోకి మరొకరు చూసి ఎరగరు. అవును మరి. గొర్రెవేపు బేలతనంతో జాలిగా చూసిన వాడు కసాయీ కాగలడా? అలాగే వాళ్ళంతకు పూర్వం విధిగా ఒకరినొకరు గోదాలో చంపుకోవాలి. ఆనాటి విధ్యుక్త ధర్మమది. కాని ఇపుడు విజయంవల్ల సౌహార్ధబావాన్ని సాధించిన స్వేచ్ఛాజీవులు వాళ్ళు. సిసిలీలో, తక్కిన అనేక ప్రదేశాల్లో విప్లవాలెలా జరిగాయో, వాటి అర్థమేమిటో యధార్థమేమిటో ఇప్పుడు వ్యక్తమయింది స్పార్టకస్‌కు. తన సహచరుల్లో ప్రవహించిన శక్తి, ఉత్సాహాలే అతనిలో వెల్లువలై ప్రవహించాయి అవి అతని గత జీవితపు బాధలభయాల నైచ్యాన్ని కడిగి పారేశాయి. జీవితాన్ని జాగరూకతతో చూసుకుంటాడు. జీవిత రహదారిలో మెలకువగా నడుస్తాడు స్పార్టకస్. ఇది చూసిన ప్రతీవాడూ స్పార్టకస్‌కి జీవితమంటే ఎంత జాగ్రత్త, బ్రతుకంటే ఎందుకంతగా పాకులాడుతాడనుకుంటారు. ఇక్కడే ఉంది అతని పాకులాటలోని పరమార్థం. అతని జాగ్రత్తకు ఫలితం. ఇప్పుడతనికి చావంటే భయం లేదిక. ఎందుకో ఆ భయం అనుకోకుండానే వైదొలిగింది. ఇంకేమాత్రం అదో పెద్దవిషయంగా తోచదతనికి.

కేపువాకు అయిదుమైళ్ళు దక్షిణంగా ఏపియన్ మార్గానికి పక్కగా కొద్ది దూరంలో ఒక కొండపక్క మల్లులు, వారి స్త్రీలు, తక్కిన బానిసలు అంతా గుమిగూడారు. అక్కడికి రోమన్ కామందు భవంతి ఒకటి కనిపిస్తోంది. సూర్యుడు నడినెత్తిన నిల్చిన కాలం. ఈ రెండు పోరాట సంఘటనల అనంతరం, ఆ బానిసలు ఒక సైన్యాన్ని పోలి ఉన్నారు. వాళ్ళల్లో నల్లవాళ్ళు లేకపోతే అదొక రోమన్ సైనిక విభాగమనిపించేదే. చనిపోయిన రోమన్ సైనికుల ఆయుధాలు, శిరస్త్రాణాలు, కవచాలు, డాళ్లు వగైరా యుద్ధపరికరాలను వాళ్లు పంచుకున్నారు. చూస్తుంటే ఈ సాహసులను రోమ్ తప్ప మరెవరూ ఎదిరించి పోరాడలేరని అనిపిస్తుంది. స్త్రీలు కాకుండా, తోటలలో, ఇళ్ళల్లో పనిచేసే బానిసల్ని అందరినీ కలుపుకుంటే మొత్తం రెండు వందల ఏభై మందున్నారు. గాల్‌లు, ఆఫ్రికన్లు, థ్రేషియన్లు వాళ్ళలో మూడు ప్రధాన భాగాలుగా ఉన్నారు. వాళ్ళ వాళ్ళ నాయకులనే సైనికోద్యోగులుగా భావించి, రోమన్ దళ నిర్మాణపక్కీ నవలంభించారు. రోమన్ సైనికపద్ధతులను చాలాకాలంగా చూసినవాళ్ళు కాబట్టి ఆ పద్ధతుల్నిట్టే అమలుపరిచారు. పదేసిమంది చొప్పున చిన్న చిన్న దళాలుగా చీలి, క్రమశిక్షణను పాటిస్తున్నారు. వారందరికీ స్పార్టకస్ నాయకుడు. ఆ విషయమై ఆలోచనేలేదు. సహజంగా జరగాల్సిందేదో జరిగిపోయింది. అతనంటే ప్రాణాలు సహితం లెక్కచేయరు వాళ్లు. మానవుల్లో కొందరిని దేవతలు స్పృశిస్తారు. అప్పుడు వాళ్లు మహాపురుషులవుతారు అని పురాణాల వల్ల విన్నారు. అతనికేసి వాళ్లు చూసినపుడు వాళ్ళ కళ్ళల్లో, ఆ కళ్ళ వెనుక అగాధాల్లో ఆ భావమే ద్యోతకమయ్యేది. ఆ భావంతో నిండిన చూపులే వాళ్లు చూసేవారు.

ముందుకు సాగిపోతూన్న వాళ్ళకు ముందుండేవా డతను. అతని పక్కనే నడిచేది

వరీనియా. పురుషుల్లో మహాపురుషుడనీ, బలవంతులలో ధైర్యశాలి అనీ తెలిసే ఆమె ఇతణ్ణి వరించింది. ఇప్పుడు తనకు తెలిసినట్లే అప్పుడూ తెలుసు. వాళ్ళ కళ్ళు కలిసేవి. పెదవులపై చిరునవ్వుల దొంతరలు దొర్లేవి. సైనికులతో ఆమె యుద్ధం చేసింది. ఇది అతనికి సంతోషం కలిగించిందో లేదో కాని, ఆమె కత్తి పట్టుకోవడానికి అతనెప్పుడూ అభ్యంతరం చెప్పలేదు. వాళ్లు సమానులు. మొగాళ్ళలాగానే యుద్ధాలకు పోయిన పూర్వపు అమెజాన్ యువతులు వీరగాధ లామె విన్నది. ఆ కథ లా రోజుల్లో వాడుకలో ఉండేవి. ఒకప్పుడు స్త్రీ పురుషులు సమానులని, బానిస- యజమాని అనే తేడాలు పాటింపబడని సమయం ఒకటి ఉండేదని చెప్పే కథలు స్పార్టకస్ నాటికి కూడా చెప్పుకునేవారు. అప్పటిదే స్వర్ణయుగం, అదే స్వర్ణయుగం రాబోతుందిక.

స్వర్ణసమయమే అది. అందమైన పల్లె ప్రాంతాలపై సూర్యుడిపుడు స్వర్ణమయ కాంతులను ప్రసరింపజేస్తున్నాడు. మెత్తగా ఆకుపచ్చని ముఖమల్‌లాగున్నది పసిరిక. దానిపై గడ్డి పూలు వెన్నలా తెట్టుకట్టాయి. తుమ్మెదలూ, సీతాకోక చిలుకలూ ఎగురుతున్నాయి. ఆ గాలిలో ఝుంకారశబ్ద సంగీతాన్ని ప్రసారం చేస్తున్నాయి. వాళ్ళతన్ని థ్రేషియన్ పద్ధతిలో "నాయనా!" అని సంబోధిస్తారు.

"ఇప్పుడిక మనమేం చేయాలి. ఎక్కడకు పోవాలి?"

ఆ వలయంలో కేంద్రంలా అతడునిలబడ్డాడు. ఎర్రని ముఖాలలో నీలాల కళ్ళు పొదిగిన గాల్‌లు, నల్లని జుట్టుగల బలిష్టమైన థ్రేషియన్లు, నిడుపాటి అవయవాలు పొడుగాటి శరీరాలు కలిగిన ఆఫ్రికన్లు, అంతా అక్కడ చేరారు. కొందరు పడుకున్నారు. అత నన్నాడు: "మనమందరం ఒకే తెగ, వప్పుకుంటారా?" వాళ్ళు తలలూపారు. ఎంతోకాలం కాలేదు. ఒకప్పుడంతా సమానులే. అందుకే అప్పుడు బానిసలనేవారు లేరు. అందరూ అదే అన్నారు.

"ఎవరికి మాట్లాడాలని ఉంది? మనకెవరు నాయకత్వం వహించదలుచుకున్నారు. ఇప్పుడు మనం స్వతంత్రులం. నాయకత్వం వహించదలిచిన వారెవరైనా ఉంటే లేచి నిలబడండి."

ఎవ్వరూ లేవలేదు. కత్తుల పిడులతో థ్రేషియన్లు డాళ్ళమీద మోదారు. అదో బ్రహ్మాండమైన శబ్దాన్ని కలిగించింది. చప్పట్లు చరిచి, స్పార్టకస్ పట్ల తమకున్న గౌరవాన్ని తెలియజేశారు ఆఫ్రికన్లు. వాళ్ళందరిలో అంత సంతృప్తి కలగడం ఆశ్చర్యమనిపిస్తుంది. ఆ క్షణంలో వారు ఊహల విహంగాలమీద ఎగిరి స్వాప్నిక జగత్తులో విహరిస్తున్నారు. అప్పటి వారి మనఃప్రవృత్తి అటువంటిది. గేనికస్ జయధ్వానం చేశాడు.

చావసిద్ధంగా నున్నవాడొకడు నీరసంగా లేచి నిలబడ్డాడు. అతణ్ణి గడ్డిమీద పడుకో బెట్టారు. చేయి పొడుగునా తెగివుంది. ఆ గాయానికి రక్తంతో తడిసినగుడ్డ చుట్టబెట్టారు. అతడొకగాల్. వెనుకబడటం ఇష్టం లేదతనికి. ఆ విధంగానే స్వతంత్రాన్ని చవిచూశాడు. కట్టును నిర్లక్ష్యించి కారుతోంది రక్తం. తనవేపు వస్తున్న అతన్ని స్పార్టకస్ నెమ్మదిగా పట్టుకొని

జాగ్రత్తగా నిలబెట్టాడు.

"చావంటే నాకు భయం లేదు!" మల్లుల నుద్దేశించి అతడు చెపుతున్నాడు : "మల్ల యుద్ధంలో ఒక సోదరునితో పోరాడి చచ్చేదానికన్నా ఇతన్ని అనుసరించి చావడమే మేలు. నా కదే ఇష్టం. ఇతన్నే అనుసరించి, మనల నెక్కడికి తీసుకపోతాడో చూడాలని ఉంది నాకు! కాని నేను చస్తే నన్ను జ్ఞాపకముంచుకోండి. ఎన్నడూ అతని కన్యాయం తలపెట్టకండి. అతని మాటలు వినండి. అతన్ని థ్రేషియన్లు 'నాయనా!' అంటారు. మనమంతా చిన్నపిల్లలం. మనలోని చెడును అతడు తుడిచి పారేయగలడు. ఒక గొప్పపని చేశాను కాబట్టే నాలోని చెడు నశించింది. అందుకే చావంటే జంకను. ఇంక హాయిగా నిద్రపోతా. ఆ నిద్రలో నా ప్రాణం పోయాక నా కింక కలలు రావు!"

ఇది విన్న మల్లులలో కొందరు గట్టిగా ఏడ్చారు. ఆ గాల్ స్పార్టకస్‌ను ముద్దెట్టుకున్నాడు. అతన్ని తిరిగి చుంబించినపుడు స్పార్టకస్ పెదిమలు వణికాయి. "నా పక్కనే ఉండు" అన్నాడు స్పార్టకస్. అక్కడే కూలబడ్డాడు గాల్. ఏమీ కానట్లు మృత్యువుతో అంత సులభంగా వియ్య మందగల మల్లుల్ని చూస్తే పొలాల్లో పనిచేసిన బానిసలకు ఆశ్చర్యమేసింది.

"నువ్వు చనిపోతావుకాని మేం జీవిస్తాం" అతనితో అన్నాడు స్పార్టకస్. "నీ పేరు మేం జ్ఞాపకముంచుకుంటాం. అది మా నినాదం చేసుకుంటాం. ఆ నినాదాన్ని దిక్కులు పిక్కటిల్లేలా ధ్వనిస్తాం. ఈ ప్రపంచమంతటా నీ పేరు ప్రతిధ్వనింప చేస్తాం."

"ఎప్పుడూ ఆగరా ఇంక!" అడిగాడు గాల్.

"సైనికులు మా మీద పడ్డప్పుడు ఆగామా? రెండుమార్లు ఆ సైనికులతో తలబడి నెగ్గలేదా. మనం చేయాల్సిన దేమిటో మీకు తెలుసా?" స్పార్టకస్ మల్లుల నడిగాడు.

వాళ్ళతణ్ణి చూశారు.

"మనం పారిపోగలమా?"

"ఎక్కడికి పారిపోయేది" క్రిక్సస్ అడిగాడు. "ప్రతిచోటా ఇంతే మనకి. ప్రతి చోటా ఒకడు యజమాని; ఎంతో మంది బానిసలు."

"మన మెక్కడికీ పారిపోం" అని చెప్పాడు స్పార్టకస్. అతనికెప్పుడూ ఏమీ అనుమానం లేనట్లు ప్రతిదీ ఖచ్చితంగా తెలిసినవాడిలా ఖండితంగా చెప్పాడు స్పార్టకస్. "ప్రతితోటకీ, ప్రతి ఇంటికీ పోదాం. అక్కడ బానిసలందరినీ స్వతంత్రులను చేసి మనలో కలుపుకుందాం. రోమ్ మనమీదికి సైన్యాలను పంపితే వాటితో పోరాడుదాం. ఇకమీద రోమన్ పద్ధతే కావాలో, మన పద్ధతే కావాలో భగవంతుడే నిర్ణయిస్తాడు."

"ఆయుధాలో మరి? అవెక్కడినించి వస్తాయి?" ఎవరో అడిగారు.

"సైనికుల ఆయుధాలే లాక్కుందాం. కావాలంటే వాటిని మనమే తయారు చేద్దాం. బానిసల రక్తం, చెమట, బాధ తప్ప మరింకేమిటీ రోమ్? మనం చేయలేంది ఏమైనా ఉందా?"

"అప్పుడు రోమ్ మనమీద యుద్ధం చేస్తుంది."

"అప్పుడు మనం రోమ్‌తోనే యుద్ధం చేద్దాం!" గాభరా లేకుండా, నెమ్మదిగా, బరువుగా స్పార్టకస్ అన్నాడు. "రోమ్‌ను అంతం చేద్దాం. మరో ప్రపంచాన్ని సృష్టిద్దాం. ఆ ప్రపంచంలో బానిసలు, యజమానులనే తేడా ఉండదు!"

అదొక కల. వాళ్ళలాగే కలగనే స్థితిలోనే ఉన్నారు. ఆకాశం లోతుల్లోకి వాళ్ళు చొచ్చుకు పోయారు. పగిలిన ముక్కూ, నల్లని కళ్ళూగల ఈ థ్రేషియన్ "మనం దేవతలతో యుద్ధం చేద్దాం రండి" అని పిలిస్తే ముందూ వెనుకా చూసుకోకుండా, మరో ఆలోచన లేకుండా, వాళ్లు అతన్ననుసరించి పోయేవాళ్ళే!

"మనని మనం అగౌరవపరచుకోకూడదు" ప్రతివాడితోనూ నేరుగా, సూటిగా మాట్లాడుతున్నాడా అన్నట్లు సౌమ్యంగా చెపుతున్నాడు స్పార్టకస్. "రోమన్లు చేసినట్లు చెయ్యొద్దు మనం. రోమన్ న్యాయాన్ని పాటించొద్దు మనం! కొత్తన్యాయశాస్త్రాన్ని మనం తయారు చేద్దాం."

"ఏమిటి మన న్యాయశాస్త్రం?"

"మన ధర్మం సాధారణమైనది. మనలో ఎవరేది వశపర్చుకొన్నా అది అందరికీ చెందిన సమిష్టి ఆస్తి అవుతుంది. తన బట్టలూ, ఆయుధాలూ తప్ప వేటినీ ఉంచుకోకూడదు. పూర్వం ఎలాగుండేదో అలాగే!"

"అందరం ధనవంతు లవడానికి చాలినంత ఉందిగా!" అన్నా డొక థ్రేషియన్.

"అయితే నువ్వే న్యాయసూత్రాలు తయరుచెయ్యి. నే నెందుకు చెయ్యడం?" అన్నాడు స్పార్టకస్.

అలా వాళ్ళు మాట్లాడుకున్నారు. వాళ్ళలోనూ దురాశాపరులున్నారు. రోమన్లలాగ పెద్దపెద్ద భూస్వాములవాలని ఆశపడ్డవారూ ఉన్నారు. కొందరు రోమన్లందరినీ బానిసలుగా తయారుచేద్దామన్నారు. వాళ్ళలా మాట్లాడగా మాట్లాడగా, చివరకు స్పార్టకస్ చెప్పిందే ఖాయమైంది.

"భార్యనితప్ప, మరే స్త్రీనీ ఉంచుకోగూడదు" స్పార్టకస్ అన్నాడు. "అలాగని ఏ వక్కడికీ ఎంతోమంది భార్యలుండరాదు. ఒక పురుషునికి ఒక్కర్తే భార్య. భార్యా భర్తలిద్దరూ న్యాయం దృష్టిలో సమానులే. వాళ్ళు సౌఖ్యంగా, శాంతియుతంగా జీవితం గడపలేకపోతే, విడిపోవచ్చు. కాని ఏ మనిషీ రోమను స్త్రీనైనా సరే, మరే స్త్రీనైనా సరే భార్య అయితే తప్ప, తన కామం కోసం ఉపయోగించకూడదు."

వాళ్ళ న్యాయశాస్త్రం ఎన్నో గ్రంథాలు పట్టేటంత పెద్దదిగాదు. బహు చిన్నది. దానికెన్నో భాష్యాలు లేవు. దానినందరూ అంగీకరించారు. అప్పుడు వాళ్ళు ఆయుధాలు చేబూని అల్లంత దూరాన కనపడుతున్న భూస్వామి భవంతిపైకి దాడి చేశారు. ఆ ఇంట్లో నివసించే రోమన్లు ఎప్పుడో ప్రాణాలరచేతపట్టి కేపువా చేరారు. ఆ ఇంట్లో బానిసలొక్కళ్ళే ఉన్నారు. ఆ బానిసలు

మల్లులతో కలిశారు.

# 10

కేపువా వాసులు మొదటిసారిగా, జమీందారీ భవనం తగలబడటం చూశారు. బానిసలు పెద్దమనుషులుగా బుద్ధిగా ఉండాలని వారి కోరిక. బానిసలు కొండల్లోకి పారిపోయి వంటిరిగానో, చిన్న చిన్న గుంపులుగానో ఏ గుహల్లోనో తలదాచుకోవడం మంచిదని వాళ్ళనుకొన్నారు. అలా చేయడంవల్ల ఆ బానిసలను జంతువులను వేటాడినట్లు సుళువుగా వేటాడి పారెయ్యొచ్చు. గృహదహనం చూసినపుడు కేపువా పౌరులు ఆందోళన చెందారు. ఏది కనిపిస్తే దానిని నాశనం చేస్తారని, దేని మీద పడితే దాని మీదే మల్లులు పగ తీర్చుకు తీరతారని వాళ్ళకి తెలుసు. తిరుగుబాటు గురించి సెనేటుకు తెలియచేసేందుకై ఏపియన్ మార్గంలో ఒక బండి ఉరుకులు, పరుగులు పెడుతూ పోతోంది. అనతికాలంలో పరిస్థితి అదుపులోకి వచ్చి తీరుతుందన్న మాట. అప్పుడు బానిసలకు సులభంగా మరుపురాని పాఠాన్ని బోధించాలి.

మేరియస్ ఎకనూస్ అనే పెద్ద భూస్వామి విషయాన్ని ముందుగానే తెలుసుకుని, కేపువానగరంలో రక్షణ పొందడానికని తన ఏడువందల మంది బానిసలనీ పోగుచేసుకుని తోలుకుపోతున్నాడు. దారిలో ఇతనికి మల్లులు ఎదురయ్యారు. తన బానిసల చేతిలో తానే భార్యాసమేతంగా మృత్యుసాన్నిధ్యం చేరుకొంటున్న అతనికేసి ఏమీ మాట్లాడకుండా చూస్తూ నిలబడ్డారు మల్లులు! అతని కూతురూ, ఆమె భర్త, అతని మరదలు కూడా చంపబడ్డారు. అది ఘోరమైన, జుగుప్సాకరమైన విషయమే కావచ్చు. కాని వాటినాపడం సాధ్యంకానిపని అని స్పార్టకస్‌కు తెలుసు. ప్రత్యేకించి వాటినాపాలని తొందరాలేదు అతనిలో. రోమనులు వాళ్ళ చేతులతో చల్లిన విషపువిత్తుల ఫలితాన్ని వాళ్ళే అనుభవించారు. ప్రజలు చెప్పుకుంటున్న తిరుగుబాటుదారులైన మల్లులు తమకు ఎదురయ్యారని తెలిసేసరికి, పల్లకీ మోసే బానిసలే తమ యజమానిని సకుటుంబంగా హతమార్చేశారు. అప్పుడు సాయంత్రమవుతోంది. కాని కాలంకన్నా వేగంగా వార్త వ్యాపించింది. మొదట్లో ఏదో కొద్ది వందలమందిగా ఉన్నవాళ్ళల్లా ఇప్పుడు వెయ్యిమందికిపైగా అయ్యారు. కొండవాలు మీదనుండీ, లోయలలోనుంచీ బానిసలు పరుగు పరుగున వచ్చి వీరితో కలిశారు. తోటలలో, పొలాల్లో పనిచేసేవాళ్ళు వాళ్ళ పనిముట్లతో సహా వచ్చి చేరారు. పశువుల కాపరులు గొర్రెలను, బర్రెలనూ తోలుకొని మందలతో సహా వీళ్ళతో చేరారు. ఆ జనవాహిని ఒకతీరూ, తెన్నూ లేకుండా ఒక ఇంటి వేపు పోతే వాళ్ళ రాక వార్తవిన్న వంటఇళ్ళలోని బానిసలు చిన్న చిన్న బాకులతో, గునపాలతో సహా బైటకి వచ్చి వాళ్ళ నాహ్వానించారు. ఇళ్ళల్లోని బానిసలు వాళ్ళకి సిల్కుబట్టలు, నూలుగుడ్డలు అన్నీ పంచిపెట్టేవారు. సాధారణంగా రోమనులు పారిపోయ్యేవారు. కానీ రోమన్లు, మేస్త్రీలు కలబడితే మాత్రం, ఆ ప్రదేశంలో ఏదో గొడవ జరిగినట్లు ఘోరమైన ఆనవాళ్ళు మిగిలిపోయేవి.

వాళ్ళిప్పుడు తొందరగాపోలేరు. నవ్వుతూ, పాడుతూ, కేరింతలు కొట్టే పిల్లల, స్త్రీల, పురుషుల మహాజనసందోహమది. వారందరూ ఒకే విజయోల్లాసాన్ని ఆస్వాదించి ఉన్నారు.

అదే స్వతంత్రాన్ని రుచి చూసి ఉన్నారు. కేపువాకు ఇరవైమైళ్ళ దూరంలో ఉన్నారు. చీకటి పడింది. గుసగుసలాడే ఏటి ఒడ్డున, లోయలో పెద్దపెద్ద మంటలు వేసుకుని తాజామాంసాన్ని తింటూ విడిదిచేశారు.

గొర్రెల, మేకల, గొడ్డుమాంసాన్ని ఉడకబెట్టిన రుచికరమైన వాసనతో నిండింది గాలి. ఏళ్ళతరబడి ఉల్లికాడలూ, వేళ్ళూ, దుంపలూ, బార్లీ పులుసూ తిని బతికినవాళ్ళ కిదొక విందు. మాంసాన్ని ద్రాక్షసారాలో ముంచి భోజనాన్ని పాటలతో నవ్వులతో మిళాయించి భుజించారు వాళ్ళు. ఎటువంటి జట్టువాళ్ళది! ఆ జట్టులో గాల్‌లు, యూదులు, యవనులు, ఈజిప్షియన్లు, సమారియన్లు, జర్మన్లు, స్లావులు, బుల్గార్లు, మేసిడోనియన్లు, స్పేనియార్డులు, ఏదో ఒక కారణంవల్ల తరతరాలుగా బానిసలుగా అమ్ముడుబోయిన కొంతమంది ఇటాలియన్లు, సబయినులు, అంబ్రియన్లు, టుస్కన్లు, సిసిలియన్లు, చరిత్రనుండి, భూగోళంనుండి తుడిచి పెట్టుకపోయిన అనామకులైన ఎన్నో తెగలవాళ్ళున్నారు. ఎన్నోజాతులు, వర్ణాలు కలవాళ్ళేకాని ఆ సమూహం అంతా మొదట బానిసలుగా ఒకే తెగగా, తర్వాత స్వతంత్రులుగా ఒకే తెగగా, ఎప్పుడూ ఒకే ఒక తెగగా కలుస్తూఉన్నవాళ్ళే!

పూర్వం గణాలకుటుంబాలు, తెగలజాతులు అనేవి ఉండేవి. ప్రస్తుతం ఇక్కడ ప్రపంచాని కంతకూ ఆశ్చర్యం కలిగించే అణగారిన ఆర్తులందరి యొక్క విచిత్రమైన సౌహార్దత, సహచర్యం గోచరిస్తున్నాయి. ఆరాత్రి ఏ ఒకని గొంతూ కోపాన్నికాని, అసంతృప్తిని కాని ధ్వనింపచేయలేదు. కొద్దిపాటి ఔన్నత్యం, కొంత ప్రేమ వారిని స్పృశించాయి. కొందరు స్పార్టకస్‌ను చూడలేదు. అథవా చూసినా "అడుగో స్పార్టకస్" అని దూరంనించి చూపిస్తే చూసినవాళ్ళే. అయినా, వారందరిలోనూ అంతటా ఉన్నాడు స్పార్టకస్. వాళ్ళకు అతను నాయకుడు. వాళ్ళ భగవంతుడు. అప్పుడప్పుడు దేవతలు భూమ్మీద సంచరిస్తుంటారని వాళ్ళెరుగుదురు. స్వర్గంలోని పవిత్రాగ్నిని దొంగచాటుగా తీసుకువచ్చి అమూల్యమైన కానుకగా మానవజాతికి ప్రొమీథియస్ సమర్పించలేదా? ఒకమారు అటువంటిది సాధ్యమైనపుడు మళ్ళీ జరగకూడదని ఎక్కడుంది. అప్పుడు మంటలచుట్టూరా కూచొని వాళ్ళు ఎన్నో గాధలల్లి చెప్పుకుంటున్నారు. ఇంక స్పార్టకస్‌యుగం ప్రారంభమవుతుంది. పిల్లలతో సహా వాళ్ళల్లో ప్రతి ఒకరూ బానిసలు లేని మరో ప్రపంచంగురించి కలలు కంటున్నారు.

మల్లులమధ్య కూచొని స్పార్టకస్ వాళ్ళతో మాట్లాడుతున్నాడు. వాళ్లంతా జరుగుతున్న విషయాలనుగురించి ఆలోచిస్తున్నారు. ప్రతి విషయాన్ని తూచి చూస్తున్నారు. అప్పుడా చిన్న ఏరు ఒక నదిగా పారుతోంది. ఆ నదికి వరదలు. స్పార్టకస్‌ను చూచినపుడల్లా గేనికస్ కళ్ళు మెరిసేవి: "మనమీ ప్రపంచమంతటా తిరుగుదాం. దానిని తలకిందులుగా చేద్దాం. ప్రతి రాయినీ తిరగేసి పారేద్దాం!" అన్నాడు. స్పార్టకస్‌కు మరింత స్పష్టంగా తెలుసు. అతనిలో నిప్పు రాజుకుంది. ఒక మంటయి మండుతోంది. ఆ ఇటాలియన్ నిశీధి ఆకాశంలో తెల్లని మెరిసే తారకలు కనిపించాయి. అతని మెదడులో భయంకరమైన భావాలు, పరితాపంతో కూడిన అపేక్ష మెదిలాయి. అన్నీ భయాలే. అన్నీ సందేహాలే. ఇంక చేయవలసిన దేమిటి

అనే ప్రశ్న రాతిలో అతని గుండెలపై బరువుగా కూచొని అతని మెదడును తడుతోంది. రోమ్‌ను సర్వనాశనం చేయాలి తను. ఈ ఆలోచన వల్ల అతనికి నవ్వొచ్చింది.

నువ్వు రోమ్‌ను సర్వనాశనం చేయాలి స్పార్టకస్! నువ్వు వీళ్ళకి నాయకత్వం వహించి, బలవంతులుగా తయారుచేయాలి. పోరాడడం, చంపడం నేర్పు వీళ్ళకి. వెనుకంజ పనికిరాదు అసలు. ఒక్కడుగేనా వెనక్కి పోబోకు. ఈ ప్రపంచమంతా రోమ్ స్వాధీనంలో ఉంది. అందుకే నాశనం చేసి ప్రపంచాని కీ రోమ్ అనేది చెడుకల అనిపించేలా చెయ్యి. రోమ్‌స్థానే మరో జీవితాన్ని పుష్పింపచేద్దాం. దానిలో ప్రజలకు శాంతి, సోదరత్వం, ప్రేమ వెల్లివిరుస్తాయి. ఒకడు బానిస, వేరొకడు యజమాని అనే తేడా ఉండదు. మల్లులూ, గోదా కనిపించవు. పూర్వంలాగానే అదో స్వర్ణయుగం. సౌహార్దత నిండిన నూతన నగర నిర్మాణం చేద్దాం ఇక. ఆ నగరాలచుట్టూ రాతిగోడ లుండవు!

అప్పుడు వరీనియా అతన్నడిగింది : "స్పార్టకస్! ఏమిటి కలగంటున్నావ్? ఆ నక్షత్రాల్లో మిణుకు మిణుకుమని తొంగిచూసే దేవతలు నీతో మాట్లాడుతున్నారా? ఎవరితోనూ చెప్ప కూడని రహస్యాలు నీకు చెపుతున్నారా!" ఆవిడకు దీనిలో కొంత నమ్మకం లేకపోలేదు. స్పార్టకస్ దేవతలను పూజించేవాడుకాడు. "బానిసలకు ఓ భగవంతుడంటూ ఉన్నాడా!" అతనొకసారి ఆమె నడిగాడు.

"నా జీవితమంతటిలో నీతో చెప్పకూడని రహస్యమంటూ ఏమీ లేదు నాకు" అత నామెతో అన్నాడు.

"అయితే నీవేం కలగంటున్నావ్."

"మనం సృష్టించబోయే మరో ప్రపంచంగురించి!"

అతను మృదువుగానే చెప్పాడు. కాని ఆమెకెందుకో అతనంటే భయమేసింది. "ఈ ప్రపంచం కూడా మనుషులు తయారు చేసిందేగా? దానంతటదే తయారయిందంటావా? వరీనియా, చూడు మనం నిర్మించనిది ఏముంది? ఈ పట్నాలు, గుళ్ళు గోపురాలూ, గోడలూ, ఓడలూ, రోడ్లూ ఏవీ మనం నిర్మించలేదు గనుక? అలాంటప్పుడు మరో ప్రపంచ సృష్టి మాత్రం ఏమంత కష్టం?"

"మరి రోమ్?"అందామె. ఆఒక్కమాటలో ప్రపంచాన్ని పరిపాలిస్తోన్న శక్తి ఇమిడివుంది.

"అప్పుడు మనం రోమ్‌నే సర్వనాశనం చేస్తాం" స్పార్టకస్ అన్నాడు. "ప్రపంచానికి ఈ రోమ్‌తో కడుపు నిండింది చాలు. రోమ్‌ను నాశనం చేయాలి! ఈ రోమ్ నమ్మిన ప్రతిదాన్నీ మనం నాశనం చేయాలి."

"ఎవరు? ఎవరు?" అమె అడిగింది.

"బానిసలే! పూర్వం కూడా తిరుగుబాట్లుండేవి. కాని ఇప్పటిది మరొక విధంగా ఉంటుంది. ప్రపంచంలోని బానిసలంతా వినేలా మనమొక పిలుపిద్దాం."

# అయిదవ భాగం

శరీరభారం పెరుగుతున్నకొద్దీ, తాడెక్కి మొగ్గవేయగల తన నైపుణ్యం పెరుగుతోందని చెప్పడం లెంటులుస్ గ్రాఛూస్‌కు ఎంతో సరదా. అతని యాభై ఆరుయేళ్ల జీవిత కాలంలో రాజకీయాలను ముప్పైయేడేళ్లు విజయవంతంగా నడిపాడు. రాజకీయాలలో బతకాలంటే మార్పులేని మూడే మూడు ఉపాయాలుండాలనీ, తదితర సుగుణసంపత్తి ఏదీ ఉండనవసరం లేదనీ అతను చెప్పేవాడు. మొదటిది ఎప్పుడూ నెగ్గేపక్షాన్నే ఎంచుకోగలగడం. అది సాధ్యం కాకపోతే సర్వనాశనం కాక పూర్వమే ఓడిపోయే పక్షాన్ని వదిలిపెట్టగలగడం ద్వితీయ ఉపాయం. పై రెండూ చేయకపోతే మానె ఎవరితోనూ శత్రుత్వం కలిగి ఉండకపోవడం ఆఖరి ఉపాయం. ఇవన్నీ అవకాశవాదుల లక్షణాలని ఎవరైనా అంటే అది వాళ్ళ ఖర్మ.

ఈ ఆశయాలను - అస లే ఆశయాలనై నా సరే - నూటికి నూరుపాళ్ళు ఆచరణలో పెట్టడమన్నది అసంభవం. కాని తన మటుకు తాను జాగ్రత్తగానే పని కానిచ్చేవాడు. చెప్పులు కుట్టేవాడి కొడుకుగా జన్మించిన గ్రాఛూస్, కష్టపడి పందొమ్మిదవ ఏటనే ఓట్లు కొనడం, అమ్మడం వగైరా చేస్తూ, లంచాలూ గట్రా ఇచ్చి ఉద్యోగాలు వేయిస్తూ, ఇరవై అయిదవయేటనే అనవసరమనుకున్నవాళ్ళని తోవనుండి తొలగించడానికి అప్పుడప్పుడు చిన్న చిన్న ఖూనీలు చేయిస్తూ, తన ఇరవై ఎనిమిదవఏటనే మంచి బలమైన రాజకీయ ముఠా నొకదాన్ని సృష్టించుకొని, ముప్తై ఎనిమిదేళ్ళు దాటకుండానే ప్రసిద్ధిగాంచిన కేలియన్‌వార్డునుంచి పోటీ అనేది లేకుండా ఎన్నుకోబడ్డ ప్రజానాయకుడయ్యాడు. తరువాత ఐదు సంవత్సరాలకు మేజిస్ట్రేటై నలభై యోపడి ప్రవేశించేసరికి సెనేట్ భవనంలో ప్రవేశించాడు. ఆ నగరంలో పదివేల మందిని పేరు పేరునా పిలిచి, వాళ్ళకే జ్ఞప్తికి లేని వాళ్ళ కుటుంబ వ్యవహారాలు, వాళ్ళ తాతముత్తాతల పేర్లు, గోత్రాలతో సహా చెప్పగలిగి, మరో ఇరవైవేల మందితో ఓహో, అంటే ఓహో అనుకునే ముఖపరిచయం కలిగి ఉండేవాడు. తన ఉపకారం పొందినవాళ్ళ లిస్టులో తనకు బద్ధవైరులుగా ఉండే శత్రువులను కూడా చేర్చేవాడు. తన సహచరులంతా, శ్రేయోభిలాషుల్లా కనిపించే వాళ్ళంతా నిజాయితీపరులే అనే దురభిప్రాయం మాత్రం అతనికెప్పుడూ కలుగలేదు. అలాగని నువ్వు నిజాయితీలేనివాడివని నాకు తెలుసులే అన్నట్లు అవతలవాడు తన భావాన్ని గుర్తించేట్లు అతనెప్పుడూ ప్రవర్తించలేదు. అలా తప్పించుకు తిరగగలగడమే అతని ప్రజ్ఞ.

అతనెన్నడూ స్త్రీలను నమ్మలేదు. తన మిత్రుల కా నమ్మకం ఏమీ లాభించలేదన్నది కూడా గుర్తించాడు. అతనికి ఒకే ఒక దురలవాటు ఉంది. అది తిండి. అతనెంతో తిని కొవ్వు మేటలు వేసుకున్నాడు. దాంతో అతని శరీరం అటూ, ఇటూ తెగపెరిగి చూడగానే

వీడురా నమ్మకస్తుడైన పెద్దమనిషి అనే భావం ఇతరులలో కలిగితీరుతుంది. టోగా మడతలలో కాని రోడ్డు మీద కనిపించని ఉన్నతవర్గ రోమను వ్యక్తులలాగనే అతను కూడా టోగా ధరిస్తేనే కాని ప్రజల కంటబడేవాడు కాడు. చొక్కా తొడిగితే గ్రాఛూస్ చూసినవాడి నాకర్షింపగలిగే వాడు కాదు. టోగా ధరించినప్పుడు మాత్రం రోమను భావమూ, రోమను సుగుణసంపత్తీ మూర్తీభవించిన అవతారంలా కనబడేవాడు. మూడువందల పౌన్ల బరువుగల అతని శరీరం పెద్ద బట్టతలనొకదాన్ని మోస్తోంది. మెడ దగ్గర కొవ్వెక్కిన కండలు ముడతలుగా పడి పెద్ద చుట్టకుదురు మీద పెట్టిన కుండలా కనిపించేది అతని తల. నాభినుంచీ, ఎంతో లోతునుంచి వస్తున్నట్లు తోచే బొంగురు గొంతు, అవతల వాడిని వలలో వెయ్యగల చిరునవ్వు, సంతోషంతో మెరిసే చిన్న నీలంకళ్లు ఇదీ అతని వర్ణన. చంటిపిల్లల శరీరంలా లేతగులాబీరంగుగల శరీరఛాయ అతనిది.

అందరూ అతనికి మానవవిద్వేషం ఉందనుకునేవారు. కాని అతనిలో అంతగా ఆ మానవద్వేషం లేదు. రోమన్లే సర్వశక్తివంతులనే సిద్ధాంతం అతనిది. ఆంటోనియస్ కైయస్‌తో అతను చాలా మంచిగా ఉంటూ వచ్చాడు. ఏ కులీనుడితో అయినా అత నా విధంగానే ఉంటాడు. అతనికి కులీనులంటే ఇష్టం. వాళ్ళయందు అసూయ, కొంత అసహ్యమూ కూడా లేకపోలేదు. అలాగని వాళ్ళతోమాత్రం స్నేహం చెయ్యడంలో ఏ విధమైన లోపం చేసేవాడుకాదు. సలేరియా భవనానికి తన నాహ్వానించినట్లే, ఈ కులీనులెవరైనా తనను తమ రమణీయమైన తోటలకు ఆహ్వానిస్తే అతనెంతో సంతోషించేవాడు. గొప్పవాడిలా కనిపిద్దామనిగాని, కులీను డిలా ప్రవర్తిద్దామనిగాని అతనెన్నడూ ప్రయత్నించలేదు. అతనికి ప్రతివిషయం గురించీ ఎంతోకొంత తెలుసు. మంచి లౌకికుడు. అతనిలోని ఈ విశేషాలనే కులీనులు మెచ్చుకునే వారు. అందుకే ఆంటోనియస్ కైయస్‌కు గ్రాఛూస్ అంటే బాగా ఇష్టం. నిజాయితీగల మనిషి ఎవరు అన్న ప్రశ్న ఉదయించినపుడు ఆంటోనియస్ కైయస్ పెదిమలపై గ్రాఛూస్ పేరే దొర్లేది.

ఆ సాయంత్రం ఆ భవనంలో జరిగిన విషయాలను గ్రాఛూస్ గ్రహించకపోలేదు. ప్రతి విషయాన్నీ శాంతంగా పరిశీలించి, తూచి, ఇదీ దీని విలువ అని లెక్కకడతాడు. కైయస్ అంటే అతనికి అసహ్యం. ధనవంతుడు క్రాసస్ సేనాని అతనికి గమ్మత్తయినవాడిలా కనిపించాడు. సిసిరో గురించి ఆంటోనియస్ కైయస్‌తో "అతనిలో అన్నీ ఉన్నాయి. గొప్పతనం తప్ప. తన ఉద్యమానికి లాభం అనితోస్తే తల్లికుత్తుకనైనా ఉత్తరించ వెనుదీయనివాడని నా ఉద్దేశం'' అన్నాడు.

ఆనాటి రాత్రి అంతా నిద్రపోతున్నా అతనుమాత్రం మెలకువగానే ఉన్నాడు. సాధారణంగా నిద్ర పట్టదతనికి. పట్టినా కాస్తసేపే పడుతుంది. చంద్రకాంతి ఆరవేసినట్లున్న ఆ తోటలలో కాస్సేపు తిరిగివద్దామని బయలుదేరాడు. ఎవరైనా అడిగితే, ఆరాత్రి ఎవరు ఎవరితో కలిసి ఖుషీగా కాలం గడుపుతున్నారో వివరంగా చెప్పగలడు. అలాగని గ్రాఛూస్

ఇతరుల విషయాలు దొంగచాటుగా తెలుసుకునే స్వభావం కలవాడు కాదు. పైగా ఇతనటు వంటి గూఢచారి తత్వాన్ని అసహ్యించుకునేవాడు కూడా. ఇది రోమ్. ఎవరుబడితే వారు, ఎవరితోబడితే వాళ్ళతో ఇష్టం వచ్చినట్లు అనుభవించడమేనా అనే ప్రశ్నకు ఇక్కడ ఏ మాత్రం తావులేదు.

అలా వెళుతూ శిలావేదిక మీద కూర్చున్న జూలియాను చూసాడు గ్రాఛూస్. ఆమె ఆకృతి విచారాన్నీ, వ్యాకులపాటునూ, భయాన్నీ, తనంటే తనకే ఉన్న అసంతృప్తి భావాన్నీ సూచిస్తోంది. అతనామె కేసి తిరిగాడు.

అతనామె భర్త స్నేహితుడు. అతిథి. "రోమ్ ఎంత సౌందర్యాన్ని తన అధీనం చేసుకో గలిగింది" అత నభిప్రాయపడ్డాడు.

"నాతో ఉన్నపుడు తప్ప మరెప్పుడూ నువ్వీ అతి సామాన్యమైన విషయాల ప్రసక్తి తేనేతేవు" జూలియా నెమ్మదిగా అంది.

"నిజమే?"

"నిజమే. వరీనియా గురించి నువ్వేమైనా విన్నావేమో చెప్పు."

"వరీనియా?"

"లోపల పదిమాట్లు జపంచేస్తేకాని ఏ విషయాన్ని నువ్వు పైకి తేల్చవు కదూ? నా మటుకు నేనేమీ తెలివైన దానిలా ప్రవర్తించడానికి ప్రయత్నం చెయ్యను." ఆమె తన చేతిని అతని చేతిలో ఉంచింది. "నేనలా ప్రవర్తించలేను, వరీనియా అంటే స్పార్టకస్ భార్య."

"భార్యా?"

"అవును. నేనూ ఆమె గురించి విన్నాను. నిజం చెప్పాలంటే మీరంతా ఆ స్పార్టకస్ ముట్టడిలో పడి గాభరాపడిపోయారు. ఆ గొడవతప్ప ఇంకేదీ మాట్లాడుకోగా వినలేదు."

"ఆ శిక్షాచిహ్నాలే మన కృతజ్ఞతా చిహ్నాలని నా అభిప్రాయం. ఆ మార్గంలో ఏముందో నేనింకా చూడలేదు. అవి చాలా భయంకరంగా ఉన్నాయా?"

"భయంకరమా? వాటిని గురించి నేనేమీ పెద్దగా ఆలోచించా ననుకోను. అవి అక్కడున్నాయి, అంతే. మన జీవితాలే చవకై పోయాయి. అటువంటప్పుడు బానిసల జీవితాలో లెక్కా? ఈ వరీనియాను గురించి అడుగుతావేమిటి?"

"ఆమె అంటే నా కసూయ."

"నిజమా. జూలియా! అదో బర్బరజాతికి చెందిన ఆడపిల్ల. బానిస. అలాంటి వాళ్ళనో డజను మందిని మార్కెట్టులో కొని నీకు ఊడిగం చెయ్యడం కోసం పంపమంటావా?"

"గ్రాఛూస్! నువ్వెప్పుడూ ఏ విషయం గురించీ తీవ్రంగా ఆలోచించవు కదూ?"

"తీవ్రంగా ఆలోచించడాని కిందులో ఏముంది? ఆమె అంటే అసూయ ఎందుకు?"

"నేనంటే నాకే అసహ్యం కనుక."

"చంపావు. ఇది అసలే అర్థం కాదు." దూరంనుంచి పడే ఉరుములా మాట్లాడు తున్నాడు గ్రాఛూస్. "చీదుతూ, ముక్కు గోక్కుంటూ, ఉమ్ముతూ, అసహ్యమైన గోళ్ళతో, వేళ్ళతో, మురికితో, పొక్కులున్న ముఖంతో ఉండే ఆమెను నువ్వసలు చూడగలవా అని. అలాగే ఉంటుంది నీ బానిస మహారాణి. అటువంటి దానియందసూయ ఏమిటి?"

"ఆమె అలాగే ఉంటుందా?"

గ్రాఛూస్ నవ్వాడు. "ఎవరెరుగుదురు జూలియా? రాజకీయాలు శుద్ధ అబద్ధం. చరిత్ర ఆ అబద్ధాలనే గ్రంథస్తం చేస్తుంది. నువ్వా రోడ్డుమీదకు వెళ్ళి తోవ పొడుగునా పడి మూల్గు తున్న శిలువలను చూస్తే నీకే తెలుస్తుంది. స్పార్టకస్ గురించి ఇంకేం లేదు. ఇంతకు మించి ఎవరేం చెప్పినా అదంతా కల్పితమే."

"నేను నా బానిసలను చూస్తుంటాను....."

"వాళ్ళలో నీకు స్పార్టకస్ కనపడలేదా? నీకు సలహా ఇచ్చే అధికారం నాకివ్వు. నీ బానిసలలో మంచి నక్కలాంటి కుర్రాడ్నొకడ్ని ఏరి....."

"గ్రాఛూస్! ఆ గొడవాపుదూ."

".....అతనే స్పార్టకస్ కాగలడు."

ఆమె కొద్దిగా ఏడవడం మొదలెట్టింది. తన వర్గపు స్త్రీ లీ విధంగా ఏడవడం అతనెప్పుడూ చూడలేదు. అలా అనడం తప్పా అని ఆమె నడిగాడతను.

"కాదు. నీ తప్పుకాదు గ్రాఛూస్. నాకు కొద్దిమందే స్నేహితులున్నారు. వాళ్ళల్లో నువ్వొకడివి. ఈ తెలివితక్కువ దద్దమ్మతో స్నేహం ఏమిటని మానెయ్యకేం?" అని ఆమె కళ్ళు తుడుచుకుని, క్షమాపణ వేడుకొని, అతన్నక్కడ వదలి వెళ్ళింది. "నాకు చాలా బడలికగా ఉంది. నా వెనకాలే రాకేం బాబూ" అందామె.

## 2

సిసిరోకి మాదిరే గ్రాఛూస్‌కీ చరిత్ర అంటే ఆసక్తి ఉంది. కాని వీళ్ళద్దరి మధ్యా ముఖ్యమయిన తేడా ఉంది. తన స్థానమేదో, పాత్ర ఏదో గాభరాపడకుండా, గందరగోళం చెయ్యకుండా తెలుసుకోగలిగేవాడు గ్రాఛూస్. అందుచేతనే సిసిరోకన్న చాలా విషయాలతను స్పష్టంగా వివరంగా చూడగలిగేవాడు. రాత్రి కూర్చుని ఆలోచించసాగాడు. రోమను గృహిణి, పెద్దింటి ఇల్లాలు జూలియా ఎక్కడ? అనాగరిక, బానిస స్త్రీ వరీనియా ఎక్కడ? కాని అటువంటి జూలియా ఒక బానిస స్త్రీ పట్ల అసూయ చెందడమేమిటా అని ఆశ్చర్యపోయాడు. అసలు జూలియా చెప్పింది నిజమేనా అని ఆలోచించాడు. జూలియా అసంతృప్తి, ఆమె విషాదం ఈ వరీనియావల్ల బైటపడింది.

అవగాహన తళుక్కున మెరిసింది. దీనంతటికీ సమాధానం ఆ మెరుపులో ఉంది. అది చూసి ఇతను భయకంపితుడయ్యాడు. ఆ విధంగా భయంతో కంపించడం అతని కిదే మొదటిసారి. చావు మనిషిని భయపెడుతుంది. మెరుపులా మెరిసిన ఆ అవగాహన కూడా

ఇతన్నంతగానూ భయపెట్టింది. కొందరు విద్వేషంవల్ల బలపడతారు. విద్వేషం వల్లనే కొన్ని నిశ్చయాలకు రాగలుగుతారు. గ్రాఛూస్ కూడా అంతే. అతన్ని నిలబెడుతూ, బలపరుస్తూ ఉన్న విద్వేషాన్నీ, తత్సంబంధమైన నిశ్చయాన్నీ ఆ మృత్యువనే సమాధానం ఊపిపారేసింది; పెకలించి పారేసింది.

ఇదంతా అతను స్పష్టంగా చూసాడు. బానిసల ఎముకల పునాదులపై లేచి, బానిసల మూపులపై నిర్మించబడ్డ ఒక సంఘం ప్రపంచంలో అడుగుపెట్టింది. కొరడా విసిరిన కొస గాలుల సంగీతం, కొరడా దెబ్బల మూర్ఛనల గీతం ఆ సంఘం ఆలపిస్తోంది.

గ్రాఛూస్ వివాహం చేసుకోలేదు. అతని అవగాహన పురుగై మెదడులో ప్రవేశించి పెళ్ళి చేసుకోకు అని తొలిచింది. కావలసి వచ్చినప్పుడు ఉపయోగించుకొనేందుకతను స్త్రీలను కొన్నాడు. ఉంపుడుకత్తె లున్నారు. ఆంటోనియస్ కైయస్ కూడా వ్యభిచారిణుల కోసం ఒక భవనం కట్టించాడు. అందరు పెద్దమనుషుల లాగానే అతను కూడా ఎంతోమంది స్త్రీలను కొన్నాడు. గుర్రాలను, కుక్కలను కొన్నట్టే అది కూడా. ఆ పెద్దమనుషుల భార్యల కిదంతా తెలుసు. దీనికి వాళ్ళభ్యంతరం కూడా చెప్పరు. మొగుడు పరాయిస్త్రీతో పోతాడనే బాధకూడా వాళ్ళకి ఉండదు. వాళ్ళమటుకు వాళ్ళు మగబానిసలతో కూడి భర్తలకు చెల్లించవలసినదంతా చెల్లించి ఎప్పటికప్పుడు జమా ఖర్చుల లెక్కలు తేల్చి పారేస్తారు. ఒక రాత్రి గడిపేందుకు సలేరియాభవనంలో కూడిన వీళ్ళంతా స్పార్టకస్ అంటే అసహ్యించుకున్నారు. ఎందుకు? స్పార్టకస్ వీళ్ళలా లేడు కాబట్టి. వీళ్ళకు భిన్నంగా, విరుద్ధంగా ఉన్నాడు కాబట్టి. స్పార్టకస్ వీళ్ళ అవినీతిలో భాగస్వామి కాలేదు కనుక, స్పార్టకస్ వీళ్ళ దుశ్చర్యలు, లోపాలు పంచుకోడు కనుక. వీళ్ళకూ అతనికీ ఏ విధమైన సామ్యమూ, అణుమాత్రం సారూప్యమూ గోచరించదు కనుక. అసలీ స్పార్టకస్ అనేవాడు ఎక్కడనించి, ఎలా వచ్చాడు? అన్నది సిసిరో ఎంత ఆలోచించినా బోధపడలేదు. కాని ఇదంతా గ్రాఛూస్ అర్థం చేసుకోగలడు. గృహం, కుటుంబం, గౌరవం, సుగుణం, మంచిదీ, ఉత్తమమైనది, ఉన్నతమైనది ప్రతీదీ బానిసల సొత్తు. వాళ్ళు దానికి అధినాధులు. వాళ్ళు ఉత్తములు కనుకా, ఉన్నతమైన వాళ్ళు కనుకా ఇదంతా వారి సొత్తు కాలేదు. వాళ్ళ యజమానులైన కులీను లీ విషయాలన్నీ నిర్లక్ష్యంతో తృణీకరించి బానిసల వద్దకు తోసేసారు. కనుకనే వాళ్ళు వీటి నన్నిటినీ సంరక్షించవలసి వచ్చింది.

స్పార్టకస్ మాదిరే గ్రాఛూస్కూడా భవిష్యత్తు దర్శనమిచ్చింది. అతనికి కనిపించిన ఆ రాబోయే విషయం అతన్ని భయపెట్టింది. బాధపెట్టింది. లేచి బరువైన తన కాళ్ళనూ, శరీరభారాన్నీ ఈడ్చుకుంటూ తన గదివైపు, మంచంవైపు నడిచాడు.

అతనికి సులభంగా నిద్రపట్టలేదు. జూలియా అసూయ, దాని వెనుక నున్న వాంఛ ఏమై ఉంటుందా అని ఆలోచించసాగాడు. బాలునిలా ఏడ్వసాగాడు. ఒంటరితనపు బాధనుంచి తనను బైట పడవేయగల సహచరిణి దొరకలేదు కదా అని బాధపడ్డాడు. కుర్రాడిలా బానిస పిల్ల వరీనియాతో పొందు ననుభవిస్తున్నట్లు కలలు కన్నాడు.

స్మృతులతో, ఆలోచనలతో, జ్ఞాపకాలతో అతను పోరాడిన కొద్దీ వాటికి రూపం, రంగు, వాస్తవికత లభించాయి. సెనేట్‌లో అతనెలా కూర్చున్నదీ జ్ఞాపకమొచ్చింది. అప్పు కేపువానుంచి కొంప మునిగినట్లు ఒక వార్త వచ్చి పడింది. లెంటులుస్ బేటియాటస్ యొ శిక్షణా కేంద్రంలోని మల్లులు తిరుగుబాటు చేశారట. ఆ తిరుగుబాటు పల్లె ప్రాంతాలల కూడా వ్యాపిస్తోందట. సెనేట్‌లో కెరటాలుగా భయం వ్యాపించి ప్రతివాడినీ ఆ భయ సముద్రంలో ముంచెత్తిన సంగతి అతనికి జ్ఞాపకముంది. వాళ్ళంతా బాతుల గుంపుల ఒకచోట గుమిగూడి ఎలా కేకలేసారో, భయంతో వాళ్ళంతా ఆందోళనచెంది ఎలా మాట్లాడడం ప్రారంభించారో అతనికి కళ్ళకు కట్టినట్లు జ్ఞాపకమున్నాయి. తన అలవాటు ప్రకారం టోగా సవరించుకుని ఒక్క ఊపుతో వల్లెవాటు వేసుకుని మహనీయులైన తన సహచరులవైపెలా ఉరిమాడో అంతా జ్ఞాపకమొచ్చింది.

"మహాశయులారా! మిమ్మల్ని మీరు మరచిపోతున్నారు!"

మతిపోయిన వాళ్ళల్లా కేకలు వేస్తున్న వాళ్ళంతా కేకలెయ్యడం మాని అతని వైపు తిరిగారు. "మహాశయులారా! ఏ కొద్దిమంది బానిసలనేరమో మనముందుంది. మన నెదుర్కొంది. అంతేకాని మన నెదుర్కొన్నవి బర్బరుల దండయాత్రలేవీ కావు. అటువంటి పరిస్థితులోనయినా సరే మహాశయులారా! సెనేట్ మరోవిధంగా ప్రవర్తించి ఉండాల్సిందంటాను నేను. మననుంచి ఒక విధమైన అంతస్తు, హోదా వాంఛించబడ్డాయనుకుంటాను నేను."

దాంతో వాళ్ళకి కోపం వచ్చింది. తనకూ వాళ్ళమీద కోపం వచ్చింది. తక్కువజాతిలో సామాన్యమయిన పుట్టుక పుట్టిన తను, మహనీయులైన వ్యక్తులను నిందించాడు. తక్కువగా చూసాడు. "చావండి మీరంతా!" అతనిలో అతనే అనుకుని ఆ హాలులోంచి వెళ్ళిపోయాడు.

రోమ్ అంటే తనకెంతో ఇష్టం. తనెంతో ప్రేమించిన రోమ్. ఆ రోమ్ వీధులలో సందులలో తిరిగేస్తున్నాడు. సరుకులతో నిండిన తోపుడుబళ్ళ మధ్య, ఆ సన్నని వీధులలో ఎంత తిరిగినా తిరగాలనే అనిపించేది. నగరంలోని సగంమంది గ్రాఛూస్ నెరుగుదురు. కొట్లవాళ్ళూ, జోళ్ళవాళ్ళూ, అడుక్కునేవాళ్ళూ ఎందుకూ కొరగాకుండా తిరిగేవాళ్ళూ, బళ్ళవాళ్ళూ, మేస్త్రీలూ, వడ్రంగులూ- ఒకళ్ళేమిటి అంతా అతన్నెరుగుదురు. ఒకప్పుడు వాళ్ళందరి మధ్యా బతికి పెద్దవాడయినవాడు కాబట్టి అతనికంత పేరు. అందరికీ అతనంటే ఇష్టమే. ఓట్లు కొనేప్పుడు ఇతను తక్కిన వాళ్ళందరికన్న హెచ్చుధర పెట్టేవాడు. పైగా పెద్దవాడిననే డాబులేదతనికి. తను నీచంగా బతికినప్పుడు తన నెరిగినవాళ్ళను సైతం ఆప్యాయంగా పలకరించి మాట్లాడేవాడు. ఇప్పుడు తనకు సంఘంలో ఉన్నతస్థానమే ఉంది. మంచి హోదా ఉంది. కాని అతనెప్పుడూ గర్వం ప్రదర్శించలేదు. పల్లకీలో తిరగడానికి తగ్గ హోదా, అవకాశం ఉన్నా, తన ప్రజలమధ్య కాలినడకనే తిరిగేవాడు. ఆవిధంగా తనకు ప్రజానీకంతో ఉన్న పరిచయాన్ని వృద్ధి చేసుకునేవాడు. ఇతనిలోని ఈ గుణవిశేషాలు చూసి ప్రజ లితనంటే మరింత ఇష్టం చూపించేవారు. పనులు చేయడానికి చవకగా కొన్న బానిసలను

రోమన్లు ఉపయోగించారు. ఒకమారు కొన్నాక ఏ పని చేయించినా, ఎంత పని ఎంతసేపు చేయించినా బానిసకు కూలి ఇవ్వనవసరం లేదు. ఒకమాటు కొనుక్కుంటే చాలు, అతని చేత ఎంత వెట్టి చాకిరీయైనా చేయించవచ్చు. కాని రోమను పనివాళ్ళ సంగతి అలాకాదు. వాళ్ళ కెప్పటికప్పుడు పనిచేసాక డబ్బు చెల్లించాలి. అందుకు అధికంగా డబ్బు ఖర్చవుతోందని తెలుసుకున్న రోమన్ ధనాధిపతులు క్రమేపీ బానిసల చేతనే సమస్త పనులూ చేయించడం ప్రారంభించారు. ఆవిధంగా శ్రామికరంగంలో ప్రవేశించిన బానిసలు రోమన్ పనివాళ్ళకు పనులు లేకుండా చేసారు. రోమన్ శ్రామికులు నిరుద్యోగులై ఎందుకూ కొరగానివారిగా యాచకులుగా తయారయారు. నిరాశ్రయులై నిరాశతో దుర్భర జీవన పరిస్థితులకు తల ఒగ్గి సతమతమవుతున్నారు. ఇతను వాళ్ళనా దౌర్భాగ్యాన్నుండి కాపాడగల నివారణోపాయం సూచించలేక పోయినా, వీళ్ళ తరుపున సెనేట్‌లో వాదించకపోయినా వాళ్ళితనియందు చూపే గౌరవంలో ఏ విధమైన లోపమూ రానివ్వలేదు. నివారణోపాయ మొకటి ఉందని వాళ్ళెప్పుడూ అనుకోలేదు. అతను వాళ్ళనీ, వాళ్ళ ప్రపంచాన్నీ ప్రేమించాడు. ఆ నిరాశా తమస్సులో, అంతస్తులపై అంతస్తులుగా లేచిన అద్దె కొంపలు, శిధిలావస్థలోనున్న ఆ అద్దె కొంపలను పడకుండా నిలబెట్టిన చెట్లు, ఆ సన్నని గొందులు, పట్టణంలోని గొడవ, గొడవతో నిండిన వీధులు, చెత్తా చెదారం నిండిన కూలిపేటలు, ఇన్ని లోపాలుండి కూడా ప్రపంచ మహా నగరాలలో ప్రథమ శ్రేణికి చెందిన రోమ్; వీటినన్నిటినీ ప్రేమించాడు గ్రాఛూస్.

కాని అతనికంతా స్పష్టంగా జ్ఞాపకమున్న ఆ రోజున మాత్రం ఇవేవీ అతని కంట బడలేదు. వీటి నతను చూడనేలేదు. దణ్ణం పెట్టినవారికేసి చూడకుండా, పలకరించినవారిని వినిపించుకోకుండా, వీధులలో నడిచిపోతున్నాడు. అతనా కొట్లలో ఏమీ కొనలేదు. ఎప్పుడీ రోడ్డుమీద తిరిగినా మిఠాయిలను కొనకుండా ఉండేవాడుకాడు. కాని ఆ రోజున మాత్రం వీటికేసి చూడలేదు. ఇవేవీ అతని దృష్టి నాకర్షించలేకపోయాయి. ఎంతో వ్యధలో ఈదుతూ ఇంటికి చేరాడు.

ధనవంతుడే అయినా గ్రాఛూస్ మాత్రం అత నే వార్డు నుంచి ఎన్నుకోబడ్డాడో ఆ వార్డులో ఒక అద్దె కొంపలో, కింద అంతస్తులో కాపురముంటున్నాడు. అతన్ని చూడ్డానికి వచ్చిన వాళ్ళకోసం తలుపులెప్పుడు తెరుచుకునే ఉండేవి. బాగా జరుగుబాటున్న కుటుంబాలు ఆ కాలంలో కింది అంతస్తులలోనే కాపరం చేసేవి. కదిలే కర్రమెట్లెక్కుకుంటూపోయి, ఎంత ఎత్తుగా నివసిస్తే అద్దె అంత తక్కువ. ఇది విలోమనిష్పత్తి. అంతస్తులు కిందైన కొద్దీ అద్దె పెరుగుతుంది. సాధారణంగా కింది రెండంతస్తులలోనే నీటి వసతి, స్నానాలగదుల సదుపాయాలు అన్నీ ఉండేవి. పైకి పోయిన కొద్దీ సదుపాయాల, సౌకర్యాల సంఖ్య కిందికి దిగుతుంది. ధనవంతులకూ, బీదలకూ కంచుగోడలున్నట్లు కనిపించడంలేదు. ఈ ధనవంతుల నెత్తిమీద ఆరేడంతస్తల వరకు పేదరికం గుట్టలుగా పడి ఉండేది.

ఎవరినీ పలకరించకుండా, ఎవరికీ దండం పెట్టకుండా, తిరిగి తిరిగి అతను ఇంటికి

చేరుకున్నాడు. ఆఫీసుగదిలో అడుగుపెడుతూనే ఎప్పుడూ లేనిది, బానిసలందరినీ ఇంట్లోంచి బయటకు పొమ్మన్నాడు. వాళ్ళముఖం తనకు కనబడనియ్యొద్దని కేకలేసాడు. ఇదంతా అతనికి జ్ఞాపకం ఉంది. అతని బానిసలంతా స్త్రీలే. అతని అవసరాలన్నీ తీర్చడానికి పద్నాలుగురు స్త్రీలనతడు ఉంచుకున్నాడు. ఆ పద్నాలుగురిలోనూ ఆనాటికి తనకు నచ్చిన బానిస స్త్రీనే తన వాంఛలకు ఉపయోగించుకునేవాడు. బానిసస్త్రీ గర్భం దాల్చడం అతనికి అయిష్టం, అతని కనవసరం. అందుకే బానిసస్త్రీ కర్మం చాలక గర్భంధరిస్తే అతనాస్త్రీని ఏ భూస్వామికో అమ్మేసి ఆ గొడవకో తిలాంజలి సమర్పించేవాడు. పల్లెప్రాంతాలలో పెరిగిన పిల్లలే బాగుంటారనీ, తను చేసేదానిలో అవినీతి, కాఠిన్యమూ ఏమీలేదనీ అతని అభిప్రాయం.

ఆ పద్నాలుగుమందిలోనూ అతని కే ఒక్కరియందూ ఎక్కువ మక్కువ లేదు. తాత్కాలికమైన కామప్రకోపనంవల్ల స్త్రీతో సంపర్కం పెట్టుకునేవాడేకాని మరేవిధంగానూ స్త్రీతో అతనికి సంబంధం లేదు. చాలామంది గృహాలకన్న తన ఇల్లే సజావుగా శాంతియుతంగా గొడవలు లేకుండా ఉందని అతనంటాడు. సలేరియా భవనంలో ఒక గదిలో పడుకుని ఆనాటి సంఘటనలు నెమరువేస్తున్న గ్రాఛూస్‌కి తన ఇంట్లో కూడా తనకానాడు మనశ్శాంతి లభించలేదని జ్ఞప్తికొచ్చింది. ఏదో ఒక నీతి సూత్రం అతన్ని ఆవహించింది. తను జీవించే పద్ధతి, పరిస్థితి తనకే చిరాకు పుట్టిస్తున్నాయేమిటి అనుకున్నాడు. ఆనాటి సంఘటనల నతడు వెన్నంటి పోతున్నాడు. దూరంగా నిలబడి తనను తాను చూసుకున్నాడు. ఏ సామాన్లూ, ఏ ఆడంబరం లేని ఆఫీసు గదిలో టోగా ధరించి పెద్ద కొవ్వు కొండ, మాంసపుముద్ద కూచుని ఉంది. తనకి తను ఆ విధంగా కనిపించాడు. ఎవరూ పిలవకుండా, మరో గొడవేం లేకుండా ఒంటరిగా అతనావిధంగా ఒక అరగంటసేపు కూచున్నాడు. అప్పుడెవరో తలుపుతట్టిన శబ్దం వినవచ్చింది.

"ఎవరది?" అతనడిగాడు.

"మీ కోసం కొందరు పెదబాబు లొచ్చారు" బానిస సమాధానం.

"నా కెవరినీ చూడాలని లేదు."

"పెద్దబాబులండి. సెనేటు బాబులు."

అయితే వాళ్ళొచ్చారన్నమాట. తను వాళ్లనుంచి ఇంకా విడిపోలేదన్నమాట. తనను వాళ్ళప్పుడే మరచిపోలేదన్నమాట. నిర్లక్ష్యం చెయ్యలేదు. పునర్జన్మ లభించిన వాడిలా, చచ్చి బతికిన వాడిలా భావించుకున్నాడు. 'అహం' తిరిగి అతని మీద వాలింది. లేచి వెళ్లి తలుపు తెరిచాడు. నవ్వుతూ, నమ్మకంగా, సమర్థుడిలా కనిపించే ఎప్పటి గ్రాఛూసే.

"మహాశయులారా! సుస్వాగతం." సెనేట్ సభ్యులతో పార్లమెంటు భాషే మాట్లాడాలి మరి.

కమిటీలో ఐదుగురు సభ్యులున్నారు. అందులో ఇద్దరు గౌరవనీయులైన సలహా దారులు. మిగతా ముగ్గురూ మంచి హోదాలోనున్న వ్యక్తులు. ఉన్నత కుటుంబాలకు చెందిన

వాళ్ళు. ప్రస్తుత విపరీత, విపత్కర, అత్యవసర పరిస్థితులెలా ఉన్నా, ఈ గ్రాఛూస్ ఏ రాజకీయ విభేదాలు తెచ్చిపెట్టి, మరో ముఠాను తయారుచేసి, గొడవ లేవతీస్తాడో అనే భయం చేత, విభేదాలను పూడ్చిపెట్టి, అతనితో సమాధానం కుదుర్చుకుందు కా కమిటీయే అతని వద్దకు కదిలివచ్చింది.

"ఏం? గ్రాఛూస్! మమ్మల్ని విమర్శించే అవకాశం కోసమే సంవత్సరం పొడుగునా అలా కాచుక్కూర్చుంటావా ఏమిటి?"

"మిమ్మల్నెలా క్షమాపణ వేడుకోవాలో తెలియడం లేదు. ఆ తెలివీ లేక పోతోంది" అన్నాడు క్షమాపూర్వకంగా.

గ్రాఛూస్ కుర్చీలు తెప్పించి వేయించాడు. ద్రాక్షసారాయమూ, మిఠాయిలూ అతను తెప్పించాడు.

"చూసారూ, ఈ కేపువాలోని తిరుగుబాటు రాబోయే బ్రహ్మాండమైన అపాయాన్ని సూచిస్తోంది" సలహాదారుడు కాస్సియస్ అన్నాడు.

"నా కలా అనిపించడంలేదు" గ్రాఛూస్ చెప్పాడు.

"అంటే ఈ బానిస విప్లవాలవల్ల వాటిల్లిన నష్టాలను దృష్టిలో ఉంచుకునేనా..."

"మీ కీ తిరుగుబాటు గురించి తెలిసిన దేమిటి?" ఇంతకు ముందుకన్న మెత్తపడ్డాడు గ్రాఛూస్. "ఎంత మంది బానిసలు తిరగబడ్డారు? వాళ్ళంతా ఎక్కడికి పారిపోయారు? మీ బాధ నిజమైనదేనా, లేక ఇదుగో తోక అంటే అదుగో పులి అని బెంబేలుపడుతున్నారా?"

ఒక్కొక్క ప్రశ్నకే కాస్సియస్ సమాధానమిచ్చాడు. "ఎప్పటికప్పుడు మనకు వార్తలు చేరుతూనే ఉన్నాయి. మొదట మల్లులొక్కళ్ళే ప్రారంభించారు. ఒక రిపోర్టు ప్రకారం డెబ్బై మంది పారిపోయారు. ఆ తరువాత పారిపోయిన మల్లుల సంఖ్య రెండువందలనీ, వాళ్ళలో గాల్, థ్రేషియన్ జాతులవాళ్ళూ, హెచ్చుమంది ఆఫ్రికన్లూ ఉన్నారనీ తెలిసింది. ఆ తరువాత వార్తల ప్రకారం చూస్తే తిరుగుబాటుదార్ల సంఖ్య పెరుగుతున్నట్లు తెలుస్తోంది. మార్కెట్లో కూడా కొంత గలాటా జరిగినట్లుంది. వాళ్ళెంతో నష్టం కలిగించినట్లు కూడా తెలుస్తోంది. కాని పూర్తి వివరాలింతవరకూ చేరలేదు. వాళ్ళెక్కడకు పారిపోయారని కదూ మీరడుగుత? వెసూవియస్ పర్వతంవైపు పోయినట్లు కనిపిస్తోంది."

"కేపువాలో సైనికదుర్గముందిగా, వాళ్ళీ గొడవలను వెంటనే ఎందుకు అణచిపారెయ్యలేదు?"

కాస్సియస్ అతనివైపు ప్రశాంతంగా చూసి "కేపువాలో ఉన్నది ఒక్కదళమేగా" అన్నాడు.

"దాచడానికేముంది గాని మహానుభావా! మన సైనికులను ఆ మల్లులు చావగొట్టారు. అసలు సంగతి అది. అందుకే ఈ గాభరా అంతా. పట్టణంలోని పటాలాలు కొన్నిటినక్కడకు పంపుదామని మా ఉద్దేశ్యం."

"ఎన్ని?"

"అధమం ఆరుపటాలాలు, అంటే మూడు వేలమందన్నమాట."

"ఎప్పుడు!"

"వెంటనే."

గ్రాఛూస్ తల ఊగింది "అలా చేయకండి. ఎందుకంటే, ఈ పట్టణాలలోని పటాలాలు నమ్మతగ్గవికావు. బానిసలను కొంతకాలందాకా ఏమీ చెయ్యకండి. వాళ్ళమానాన వాళ్ళని వదలండి. వాళ్ళల్లో వాళ్ళు తన్నుకు చావడం మొదలెట్టేవరకు ఆగండి. పటాలాలూ వద్దు. గిటాలాలూ వద్దు."

"మరింకెవరిని పంపుదాం?"

"సైన్యాన్ని పిలిపించండి."

"స్పెయిన్ నుంచీ పాంపీని పిలిపించమంటారా?"

"సిస్ఆల్పైన్‌గాల్ నుండి మూడోదళాన్ని రప్పించండి. తొందరగా పరిగెట్టించకండి. వాళ్ళు బానిసలు. కొద్దిమంది బానిసలు. మీరు చేస్తే తప్ప అదేం పెద్ద గొడవకాదు."

అలా వాళ్ళు వాదించుకున్నారు. అతని స్మృతిపథంలో ఆ వాదన కనిపిస్తూ, మాయమౌ తోంది. నమ్మశక్యంగాని భయాందోళనలలో మునిగి ఆ సెనేటర్లు ఆ విధంగా వాదించుకుని చివరకో నిర్ణయానికి వచ్చారు. పట్టణంలో ఆరుపటాలాలను పంపాలని నిశ్చయించుకున్నారు.

## 3

మానవునిలోని భయాన్నీ, ఆందోళననీ తగ్గిస్తుంది ఉదయం. ప్రభాతం అమృతాంజనం లాంటిది. అదో ఆశీస్సు. గొప్ప వాళ్ళు ప్రతి ఉదయమూ గొప్పతనాల ముసుగు తగిలించు కుంటూ ఉంటారు. రాత్రిళ్ళు వాళ్ళు కూడా అతిసామాన్య మానవులలాగానే ప్రవర్తిస్తారు గనుక, ఉదయాన్నే ఆ పని చెయ్యాల్సిన అవసరం వాళ్ళకు ఉంది. ఇంత గొప్పవాళ్ళూ రాత్రి పడ్డాక ఎన్నో లుచ్ఛాపనులు చేస్తారు. కొందరెందుకో చీకట్లో ఏడుస్తారు. మృత్యుదేవత తన పొడుగాటి హస్తాలను సాచి తీసుకుపోబోతోందని భ్రమించి మంచం మీద ఒక మూలకు ముడుచుకు పడుకుంటారు మరికొందరు. ఉన్న చీకటికన్నా మరింత చీకటి నూహించుకుని, తమ చేతి కదలికనో, కాలి కదలికనో చూసి హడలి చస్తారు మరికొందరు. కాని తెల్లారేసరికి మాత్రం అటువంటి వాళ్ళంతా రాత్రి ఇటువంటివేం జరగనట్లు యధాప్రకారంగా గొప్పవాళ్ళు గానే వ్యవహరిస్తుంటారు.

మరునాడు ఉదయం సలేరియా భవనంలోని అతిథులంతా, గృహయజమాని ఆంటోనియస్ కైయస్‌తో సహా గ్రాఛూస్ చుట్టూ చేరారు. ఆరాత్రి అక్కడ ఉన్న స్త్రీ పురుష బృందంలోని ప్రతివారికీ అసాధారణ వ్యక్తిత్వం ఉంది. మేమెంత అనన్యసామాన్య ప్రతిభా విలసితులమో నన్న భావం అక్కడున్న ప్రతివారిలోనూ ఉంది. ఆ భావం వాళ్ళకి సంతోషం కలిగించింది. ఆంటోనియస్ కైయస్ ఆషామాషీ మనుషులను చేర్చడనీ, అక్కడికి వచ్చారు

కాబట్టి వాళ్ళు కూడా గొప్పవాళ్ళేననీ వాళ్ళు భావించారు. ఎప్పుడూ గొప్పవాళ్ళనే చేర్చగల ఆంటోనియస్ యందు వాళ్ళకు నమ్మకం పెరిగింది.

ఈ ఉదయం వాళ్ళంతా గ్రాఛూస్ చుట్టూ కూచున్నారు. అతనొక్కడే వాళ్ళలో టోగా ధరించినవాడు. ఆపిల్‌పండు పై తొక్క చెక్కుతూ కూచున్నాడు అతడు. మధ్యమధ్య ఒకటో, అరో మాట వదులుతున్నాడు. మంచి దుస్తులు ధరించి, ఎంతోసేపు అవస్థపడి బాగా తలదువ్వుకుని, పెదిమలకు ఏవేవో రంగులు పట్టించి అక్కడకు వచ్చి కూచున్న యువతీయువకులను చూసి 'వీళ్ళు మంచి తమాషాగా తయారవగలరు' అనుకున్నాడు. ఇదీ, అదీ ఏదేదో వాళ్ళు మాట్లాడుకున్నారు. ప్రతీదీ లోపల ముందుగానే అనుకుని, బాగా ఆలోచించుకుని, జాగ్రత్తగా మాట్లాడ్డం వాళ్ళ అలవాటు. శిల్పం గురించి మాటలు వచ్చాయి.

"నాకు గ్రీకు శిల్పం అంటే యిష్టం" ఆంటోనియస్ కైయస్ చెప్పాడు. "అది చవక. రంగుపోయాక చూడ్డానికి చాలా బాగుంటుంది. ఏ రంగూలేని పాత చెత్తకిందే కనబడతాయను కోండి. కాని, ఈ తోటల్లో అవే నయం అనిపిస్తోంది నాకు."

"అలాంటప్పుడు స్పార్టకస్ నిర్మించిన స్మృతిచిహ్నాలనే కొని ఉండాల్సింది, మన మిత్రుడు క్రాసస్ వాటిని నాశనం చేయక పూర్వం" చిరునవ్వు నవ్వాడు సిసిరో.

"స్మృతిచిహ్నాలా?" హెలీనా అడిగింది.

"వాటిని నాశనం చెయ్యాల్సొచ్చింది మరి" క్రాసస్ ఏమీ కానట్లు చెప్పాడు.

"నే విన్నది నిజమయితే వాటిని ధ్వంసం చేయాలన్న ప్రభుత్వాజ్ఞపై గ్రాఛూస్ సంతకం చేశాడు" అంది హెలీనా.

"నువ్విన్నది నిజమేలే" అని హెలీనాతో అన్నాడు గ్రాఛూస్, "వెసూవియస్ పర్వతం యొక్క తూర్పుభాగంలో అగ్నిపర్వత శిలతో బ్రహ్మాండమైన స్మృతి చిహ్నాలను చెక్కించి పెట్టాడు స్పార్టకస్. వాటిని నేను చూడలేదు కాని, వాటిని ధ్వంసం చెయ్యమని మాత్రం ఆజ్ఞాపించా!"

"అవెలాగుండేవి?"

గ్రాఛూస్ నవ్వుతుంటే అతని తల ఊగుతోంది. సంభాషణ ఎక్కడ దేని గురించి ప్రారంభించినా చివరికీ బానిస పిశాచాల గురించీ, వాళ్ళ నాయకుడి గురించీ మాట్లాడుకోడం తప్పదేమో అన్న విచారం కూడా కలిసిన నవ్వు నవ్వాడు. "నేనెప్పుడూ వాటిని చూడలేదమ్మా, క్రాసస్ చూసాడు" అన్నాడు.

"కళావేత్తలా చెప్పమంటే నాతరం కాదు" క్రాసస్ చెపుతున్నాడు. "ఒకటి బానిస విగ్రహం, అంటే చిన్నదనుకునేరు. యాభై అడుగుల ఎత్తయిన విగ్రహం. ఎడంగా కాళ్లు పెట్టి, శృంఖలాలు ఛేదించుతున్నట్లుందా విగ్రహం. గొలుసులు తెగి వేలాడుతున్నాయి. ఒక చేత్తో పసిపాపను హృదయానికి హత్తుకున్నాడు. మరొక చేత్తో స్పానిష్ ఖడ్గం పట్టుకున్నాడు. చిన్న చిన్న వివరాలు గురించి కూడా ఎంతో జాగ్రత్తగా ఆలోచించి చేసినట్లనిపించింది.

గొలుసులు శరీరానికి కట్టిన స్థలాలలో, దాని మచ్చలు గుర్తులు కూడా బాగా కనబడేలా చేసారు. సూక్ష్మ విషయాలు కూడా వాళ్ళెంత నిశితంగా పరిశీలించారో తెలుసుకోవాలంటే ఈ ఒక్క ఉదాహరణే చాలు. గైయస్ తనేరియా నా కా విగ్రహం యొక్క భుజంలోని పనితనాన్ని చూపించాడు. రైతుల చేతులలాగే ఆ చేతులు కూడా ఉన్నాయి. చేతుల మీద నరాలుబ్బినట్లు కనిపించాయి. స్పార్టకస్ వెనక చాలా మంది గ్రీకులు ఉండేవారు. వాళ్లు శిల్పంలో మంచి నైపుణ్యం కలవాళ్లు. దానికి వాళ్ళేమీ రంగులు పూయలేదు. బహుశా వాళ్ళకి రంగులేమీ దొరకలేదేమో. మొత్తం మీద అవి ఏథెన్సులో కనిపించే రంగులుపోయిన పూర్వపు శిల్పంలాగే ఉన్నాయి. రంగులు పోయాక వాటిని చూడ్డానికి ముచ్చటగానే ఉంటుందని ఆంటోనియస్ కైయస్ చెప్పినదానితో నేనేకీభవిస్తున్నా. తక్కినవి అంత పెద్దవికావు. మహా అయితే యిరవై అడుగుల పొడుగుంటాయి. అవి కూడా బాగానే ఉన్నాయి. ముగ్గురు మల్లుల విగ్రహాలవి - థ్రేషియన్, గాల్, ఆఫ్రికన్. ఆఫ్రికావాడి విగ్రహం మాత్రం నల్లరాతితో చెక్కినది. ముగ్గురి మధ్యన రెండుచేతులలోనూ నిటారుగా త్రిశూలాన్ని పట్టుకుని నిలబడ్డ ఆఫ్రికన్ తక్కిన ఇద్దరి కన్న పొడుగైన వాడిగా కనిపించాడు. ఒకవైపున వంపుతిరిగిన చిన్న కత్తిని పట్టుకుని థ్రేషియన్, మరోవైపున నిడుపాటి ఖడ్గాన్ని పట్టుకుని గాల్ నిలబడ్డారు. చేతుల మీదా, కాళ్ళమీదా ఉన్న కత్తినాట్లనుబట్టి చూస్తే వాళ్ళప్పుడే ప్రదర్శన ఇచ్చిన మల్లులు లాగ కనిపించారు. ఆ నాట్లు కూడా బాగానే చెక్కబడ్డాయి. వాళ్ళ వెనుకగా ఠీవిగా నిలబడ్డ స్త్రీ విగ్రహ మొకటుందీ. వరీనియా పోలికలో, చెక్కారేమో ఆ విగ్రహాన్ని. ఒకచేతిలో తాపీ, మరొక చేతిలో ఒకతొళ్ళికా ఉన్నాయి. వాటి భావమేమిటో నాకు బోధపడలేదు!"

"వరీనియా?" గ్రాఛూస్ అన్నాడు.

"వాటిని మీరెందుకు పాడు చేసారు?" హెలీనా అడిగింది.

"అందరూ వాటిని చూసి ఇవిగోనండోయ్! వీటినే బానిసలు తయారుచేసారు అని చెప్పుకొనేందుకు వాటినలాగే ఉంచాలా?"

"వాటినలాగే ఉండనివ్వగల బలం రోమ్‌కుంది. వాటికేసి చూపించనూవచ్చు, చెప్పుకోనూవచ్చు!" హెలీనా చెప్పింది.

"భేష్! బలేగా చెప్పావు!" సిసిరో అన్నాడు.

యధాలాపంగా అడుగుతున్నవాడిలా కనిపించడానికి ప్రయత్నిస్తూ "వరీనియా విగ్రహం ఎలాగుంటుంది?" అని అడిగాడు గ్రాఛూస్.

"నాకదేం బాగా జ్ఞాపకం లేదు. గాల్ జాతికో, జర్మన్ జాతికో చెందినదానిలాగుంది. పొడుగాటి జుట్టు, వదులైన గౌన్. జర్మన్, గాల్ స్త్రీలు ముడివేసుకొనేటట్లే ఆమె కూడా జుట్టు ముడివేసుకుంది. మంచి బలమైన స్త్రీ విగ్రహం. ఈమధ్య బజారులో చాలామంది ఇష్టపడి కొనుక్కుంటూన్న జర్మను ముండలాగానే ఉంటుంది. ఆమె వరీనియా ఔనో కాదో ఎవరికి సరిగా తెలియదనుకోండి. స్పార్టకస్‌కు సంబంధించిన తక్కిన గొడవల్లాగానే ఇది

కూడా మనకు బాగా తెలియదు. బేటియాటస్ చెప్పిన దాన్ని బట్టి ఆమె అందంగానే ఉంటుందనాలి."

"అవి కూడా ధ్వంసం చేసారా" హెలీనా అంది.

క్రాసస్ తలూపాడు. "నే నో సైనికుడిని. సెనేట్ ఆజ్ఞలను నేను పాటించాను. అంతే. బానిసయుద్ధం ఏదో చిన్న విషయం అని కొందరనగా నువ్వు విని ఉండొచ్చు. అలా చెప్పడం సహజమై పోయింది. బానిసలు మమ్మల్ని చిత్తుచేసి పారేసారు, మేం ఎంత కష్టపడవలసి వచ్చిందో తెలుసా అని ప్రపంచానికి చెపితే మన కష్టం మాట దేవుడెరుగు. ఓస్ ఇంతేనా వీళ్ళ బలం, బానిసల చేతిలో నుసైపోయారు అనుకుంటారంతా. నిజం చెప్పాలంటే ఇంతకు పూర్వమెవరూ రోమ్‌ను సర్వనాశనం చేయడానికి, స్పార్టకస్ పూనుకున్నంతగా పూనుకోలేదు. అంతబలంగా ఎవరూ దెబ్బతీయలేదు. ఏదో నన్ను సమర్థించుకుందుకు నేను మాట్లాడటంలేదు. శిలువల మీద వేలాడే బానిసలను చూడడానికే అదోలాగుంటుందికద. అలాంటిది ప్రపంచంలోకెల్లా గొప్పదైన రోమను సైన్యం కాళ్ళుతెగి, చేతుల తెగి, తలలు రక్తంలో దొర్లుతూ రణరంగంలో పడి ఉండటం చూసిననాకు ఎలాగనిపిస్తుందో మీరే ఊహించండి. అందుచేతనే బానిసలు సృష్టించిన ఈ శిల్పాలను ధ్వంసం చెయ్యడానికి నేను వెనుదియ్యలేదు. ఆ పని చేసాక నాకు చాలా సంతృప్తి కలిగిందికూడా. ఒక్క పిసరు కూడా కనబడకుండా ఆ విగ్రహాలను ముక్కముక్కలు చేయించి, పిండి చేయించి పారేశాను. అలాగే స్పార్టకస్‌ని, అతని సైన్యాన్ని కూడా నాశనం చేశాం. అనతి కాలంలో ఈ స్పార్టకస్ గురించి, అతని అనుచరులను గురించి ఎవరికీ, ఏమీ జ్ఞాపకం లేకుండా చేస్తాం. అది చాలా అవసరం కూడా. నేను చాలా సూటైన మనిషిని. పెద్ద తెలివితేటలు నాకు లేకపోవచ్చు. కాని ఇది మాత్రం నాకు తెలుసు. ప్రపంచంలోని సక్రమపద్ధతి ఏదయ్యా అంటే కొందరు పాలించాలి, మరి కొందరు పాలింపబడాలి. అది భగవదేచ్ఛ. అలాగే ఉండాలి, ఉండి తీరుతుంది!"

సెనేట్ హాలు విడిచి తను బైటకు పోయినప్పుడు సెనేటు కమిటీ తన వద్దకు వచ్చిన సంగతి గ్రాఛూస్‌కి జ్ఞాపకమొచ్చింది. అప్పుడే ఆరుపటాలాలు పంపబడ్డాయి. కథా ప్రారంభం మరిచిపోతారు. క్రాసస్ చెప్పినట్లు అంతంకూడా మరిచిపోతారేమో. ఐనా ఆ అంతం అన్నది ఇంకా రావాలిగా, ముందుందది.

## 4

కేపువాకు ఆరు పటాలాలు పంపి అక్కడలేచిన బానిసల తిరుగుబాటును అణచి పారెయ్యాలని సెనేట్ నిర్ణయించింది. పంపబడ్డ ప్రతి పోలీసు పటాలంలోనూ ఐదువందల అరవై మంది ఉంటారు. వీళ్ళకీ, మామూలు సిపాయిలకీ అట్టే తేడాలేదు. పైగా వీళ్ళకిచ్చే దుస్తులు, ఆయుధాలు చాలా మంచివి. దీనికి తోడు పట్టణాలలో వీరి నివాసం. వీళ్ళు దేశంలో పండే పంట నంతనూ తెగమేస్తారు. సారా, స్త్రీ క్రీడలు వీటికి అంతేలేదు. పట్టణంలోని

పటాలాలకు చెందిన ప్రతివ్యక్తీ రాజకీయవేత్తే, ఏదో కొంత రాజకీయ ప్రాముఖ్యత కలవాడే. ఎప్పుడూ లంచండబ్బులు చేతిలో పడుతూనే ఉంటాయి. వీళ్ళల్లో చాలామందికి పట్టణంలో పెద్దపెద్ద ఇళ్ళు కూడా ఉండేవి. అందులో కొందరు బానిసస్త్రీలను కొనుక్కొని వాళ్ళతో తెగ కులికేవారు.

పోలీసు పటాలాలు మంచి అందమైన దుస్తులు ధరిస్తాయి. ప్రతి పటాలానికి పెద్ద పెద్ద కుటుంబాలలోని యువకులు నాయకత్వం వహించి నడిపిస్తారు. ఉన్నతస్థానాలు అందుకుందుకు, సంఘంలో హోదా సంపాదించేటందుకు ఈ పటాలాలు నిచ్చెనలుగా ఉపయోగపడుతూ ఉంటాయి. జాతీయోత్సవ సందర్భాలలో ఈ పటాలాలే ఠీవిగా, దర్జాగా, కవాతు చేస్తూ, బ్యాండు వాయిస్తూ, సైనిక వందనం చేసేవి. అందుకే చాలామంది ఈ పటాలాలకు ఆధిపత్యం వహించడం కోసం పెనుగులాడేవారు. ఒక్కొక్క పటాలం ఒక్కొక్క రంగు దుస్తులు ధరించేది. పక్షుల ఫింఛాలు శిరస్త్రాణాలు ధరించే గౌరవం వాళ్ళ కొక్కళ్ళకే దక్కింది. ఒక్కొక్క దళం పూర్తిగా కంచుకవచాలు ధరించేది. ప్రతీ పటాలానికీ ఒక్కొక్క రకం బూట్లుండేవి. ఆ బూట్లకు చిరుగంటలుండేవి. మోకాళ్ళ వరకు ఉండే ఆ బూట్లు, ఆ చిరుగంటలూ చూడముచ్చటగా నుండేవి. ఈ బరువు చాలనట్లు చేతులకు పొడుగాటి కంచుతొడుగులు తగిలించుకునేవారు. ఒక్కొక్కపటాలం ఒక్కొక్కరకం డాలు ధరించేది. ఇటలీ అంతటికీ ప్రశస్తమైన ఆయుధాలు వాళ్ళు ధరించేవారు.

వాళ్ళకు శిక్షణలోను లోటులేదు. నూరు క్లారినెట్లు సంగీతం ఆలపిస్తుంటే వీళ్ళు ప్రతి ఉదయాన్నే లయబద్ధంగా అడుగు వేసుకుంటూ కవాతు చేసేవారు. ఆ చుట్టుపక్కల కొండగుట్టల మీద చిన్నపిల్లలుచేరి ఈ ముచ్చట చూసేవాళ్ళు.

ఏదో కొద్దిమంది, వేళ్ళ మీద లెక్క పెట్టగలిగినంత మంది బానిసలను అణిచి వేయటం ఏమంత కష్టంకాదు. ఎంత అధ్వాన్నమయినా ఈ ఆరుపటాలాల్లోనూ మూడువేల ఐదువందల మందికి పైగా ఉన్నారాయె. నేరుగా సెనేట్‌కు జవాబుదారీగా ఉండేలా అధికారం యిచ్చి వరీనియస్ గ్లాబ్రూస్ అనే యువకుడిని పటాలాలకు అధిపతిగా చేసారు. ఇటువంటి యువకుడికి సైనికాధిపత్యం ఇవ్వడానికి కారణం అనుభవజ్ఞులైన పెద్దలు లేక కాదు. అంతః కలహాలతో సతమతమవుతున్న రోమ్ రాజకీయంగా బాగా నమ్మతగ్గవాడైన గ్లాబ్రూస్‌ని ఎంచుకుంది.

అతనికి ముప్పైతొమ్మిదేళ్ళుంటాయి. తల్లి ద్వారా ఉన్నతకుటుంబాలతో సంబంధాలు కలవాడు. ఇతన్ని నియమించడం వల్ల ఎన్నో ఉన్నతవర్గాల సహకారమూ, ఎంతమందో కులీనుల సానుభూతీ లభించాయి సెనేట్‌కు. అస లేపని చేసినా దాని వెనుక రాజకీయంగా సాధింపబడేది ఎంతో ఉంటే కాని చెయ్యదు సెనేట్. సైనిక నాయకుడిగా అతను చేయవలసిన పనులు గురించి వివరంగా స్పష్టంగా అన్ని ఉత్తరువులూ సెనేట్ ఇచ్చింది. ఆ పటాలాలు రోజుకు ఇరవై మైళ్ళ చొప్పున ప్రయాణం చేసి కేపువా చేరుకోవాలి. ప్రయాణానికి అనువైన

ఏపియన్ రాజమార్గంలో వీళ్లు వెళ్తారు కాబట్టి ఆహారం నీరు వగైరా వస్తువులు బళ్ళ మీద వచ్చే అవకాశం ఉంది. ఒక్కరాత్రి కేపువా ప్రహరీగోడచుట్టూ మాటు వేసి, శత్రు సన్నాహాల గురించి గూఢచారులద్వారా రహస్యాలు సేకరించి, తిరుగుబాటు నణచడానికి ఏ వ్యూహం, ఎత్తుగడ అవలంభించనున్నాడో, అతని పథకాలేమిటో అన్నీ ముందుగా సెనేట్‌కు పంపాలి. సెనేట్ సమ్మతి వచ్చేదాకా పోరాటం ఆపి దిక్కులు చూడక పోరాటం కానివ్వాలి. ఎలా వీలయితే అలా బానిసల నణచిపారెయ్యాలి. వీలైనంత మంది తిరుగుబాటుదార్లను పట్టుకొని, ముఖ్యంగా వాళ్ళ నాయకులను బహిరంగంగా విచారించి శిక్షించడం కోసం రోమ్‌కు పంపాలి. శిక్షా చిహ్నాల కోసం మాకు కొంతమంది పట్టుబడ్డ వాళ్ళు కావాలని కేపువా పురపాలకసంఘం అభ్యర్థిస్తే పది మందిని శిలువ వెయ్యడానికి అంగీకరించమనికూడా చెప్పారు.

ఎవరెవరు ఏ ఏ స్థానాలలో సైనికోద్యోగులుగా పనిచెయ్యాలి అన్న విషయంపై కొంత రభస జరగడం వల్ల, ముందు అనుకున్నట్లుగా ఉదయమే వెళ్ళాల్సిన పటాలాలు బాగా ఎండెక్కిన పిమ్మటగాని బయలుదేరలేకపోయాయి. బ్యాండు, క్లారినెట్లు సంగీతాన్ని వినిపిస్తున్నాయి. సైనికుల బూట్ల ధ్వని వినిపిస్తోంది. పట్టణ సింహద్వారం దగ్గర చాలా మంది జనం ఈ ముచ్చట చూడ్డానికి పోగయ్యారు.

అదంతా గ్రాఛూస్‌కు బాగా జ్ఞాపకముంది. బ్యాండు మోగుతూ జెండాలు గాల్లో రెపరెపలాడుతూ, కదం తొక్కే సైనికుల శిరస్త్రాణాలకు తగిలించిన పించాలు ఆడుతుంటే, ఆ పటాలాల ముందు శ్వేతాశ్వాన్ని అధిరోహించి వరీనియస్ ఠీవిగా పోతుంటే బానిసమూకల్ని ఓడించిరండి అని ప్రజలు వాళ్ళని దీవించారు. రుమాళ్ళు ఊపారు. జయ జయ ధ్వానాలు చేసారు. ఈ ప్రపంచంలో సుశిక్షితులైన సైనికులు చేసే లయబద్ధమైన కవాతుకన్న అందమైన దేముంది. ఇదంతా తనూ మరో ఇద్దరు సెనేట్ సభ్యులూ నగర సింహద్వారం వద్ద నిలబడి చూసారు.

# 5

వెళ్ళిన వెంటనే తన రిపోర్టు పంపించాడు వరీనియస్. ఆ రిపోర్టులో డాంబికం లేదు. ఏ ఒక్క విషయానికి ప్రాముఖ్యత ఇవ్వలేదు. మామూలు రిపోర్టులాగానే ఉంది. "సెనేట్ దివ్యసముఖానికి" అంటూ ప్రారంభమై ఏపియన్ మార్గంలో జరిగిన చిన్న చిన్న సంఘటనలూ, కేపువాలో వాళ్ళు సేకరించిన రహస్య సమాచారం మొదలైన విషయాల నతడు రాసాడు. పటాలాల సైనికులు చేతులకూ, కాళ్ళకు తగిలించుకున్న కంచుతొడుగులవల్ల పుళ్ళుపడి, వాళ్లు నడవలేకపోతున్నారన్న దొక్కటే ఆ రిపోర్టులో ప్రధానమైన విషయం. వాళ్ళా తొడుగులు తీసివేసి ఆ సామానంతా ఒక బండిలో ఎక్కించి రోమ్‌కు పంపివేయాలని వరీనియస్ అన్నాడు. ఇది వారి దళ గౌరవాన్నీ, ప్రతిష్ఠనూ మంటగలపడమేననీ, దళాలను నిందించడం తప్ప వేరు కాదనీ అభిప్రాయపడ్డ ఆయా దళాధిపతులు పుళ్ళకు కొద్దిగా నూనె పట్టించితే

సరిపోతుందన్నారు. వరీనియస్ తన అభిప్రాయం మార్చుకుని దాని కంగీకరించాడు. బాగా పుళ్ళుపడి బాధపడుతున్నారని నూరుమందిని కేపువాలో వదిలేసారు. ఇంకా ఎంతోమంది పుళ్ళతో కుంటుతున్న కారణంగా బానిసల మీద దండయాత్రకు వీళ్ళు పనికిరారని భావించారు.

తిరుగుబాటు గురించి ఎన్నో వివరాలు పంపుదామన్న కుతూహలం పెరిగింది వరీనియస్‌కు. అటువంటివి అట్టే లభ్యం కాకపోయినా అలా పంపడంవల్ల స్వీయాభివృద్ధికి బాట వేసుకున్న వాడినౌతానుకదా అని అతని అభిప్రాయం. తిరుగుబాటుకు వెనుకనున్న గాధనంతటినీ బేటియాటస్ చెప్పగా విని దాన్ని కూడా సెనేట్‌కు పంపాడు. "స్పార్టకస్ అనే థ్రేషియన్, క్రిక్సస్ అనే గాల్ దాన్ని నడుపుతున్నట్లు కనిపిస్తోంది" అని రాసాడు. వీళ్ళిద్దరూ మల్లులే కాని మొత్తం ఎంతమంది మల్లులు తిరుగుబాటులో పాల్గొన్నారో చెప్పడం కష్టం. మూడు తోటలను వాళ్ళే విధంగా తగులబెట్టారో పూర్తి వివరాలు కూడా పొందుపరచాడు. ఆ తోటలలో పనిచేసే బానిసలు, తమ యజమానులయందు భక్తిప్రపత్తులు కలిగినవాళ్ళే కాని, తిరుగుబాటుదార్లు కత్తిచూపి చంపుతామని బెదిరించి బలవంతంగా తమలో కలుపు కోవడం వల్ల అటు చేరారని, దానిని వ్యతిరేకించిన వారిని అక్కడే నరికేసారని తెలియజేసాడు.

ఇద్దరు భూస్వాములు కేపువాలో తలదాచుకుందుకు వస్తుండగా వారిని తోవలోనే అడ్డగించి చంపి వారి బానిసలను అన్యాయంగా తమలో కలుపుకొన్నారు తిరుగుబాటుదార్లు. అసలా తిరుగుబాటులో తమకుతాము చేరిన వాళ్ళు స్వామిద్రోహపరాయణులైన బానిసలు, సోమరిపోతులై దుర్మార్గానికి ఒడికట్టిన బానిసలు. విప్లవకారులు చేసారన్న దౌర్జన్య చర్యల జాబితా తయారుచేసి, మరో మూడు కాగితాలపై వాళ్ళు చేసిన మరికొన్ని అత్యాచారాలు పేర్కొని నివేదిక పంపాడు వరీనియస్.

తనకు తెలిసినంతవరకూ వాళ్ళు వెసూవియస్ కొండకోనలలో దాగి ఉన్నారనీ, వెంటనే తానక్కడకు పోయి సెనేట్ నిర్ణయాన్ని వాళ్ళమీద అమలు చేసి తీరుతాననీ అతను రాసాడు.

ఈ రిపోర్టు సెనేట్ అందుకుని అంగీకరించింది. మరో తీర్మానం కూడా ప్రతిపాదించ బడింది. "పట్టణవాసాలలోని బానిసాధములు చూసి గుణపాఠాల నేర్చుకుందుకుగాను, గనులకు పంపడానికని ఇంతకు పూర్వం కేటాయించిన యెనభై మంది బానిసలను శిక్షా చిహ్నాలుగా శిలువవేయడానికి ఈ సభవారు నిర్ణయిస్తున్నారు." ఈ తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడింది. ఆ మరునాడే ఈ ఎనభైమంది దౌర్భాగ్యులూ క్రీడావిరామకాలంలో శిలువల నలంకరించారు.

ఆరు రోజుల వరకూ పోలీసు పటాలాల గురించికాని, వరీనియస్ గురించికాని ఏమీ తెలియలేదు. ఆ తరువాత ఒక రోజున చిన్న రిపోర్టొకటి చేరుకుంది. పటాలాలు బానిసల చేతిలో ధ్వంసమైపోయాయి. దీన్ని వివరిస్తూ ఆ రిపోర్టులో మరే విషయమూ రాయలేదు. ఇరవైనాలుగు గంటలసేపు రాబోయే ప్రమాదాన్నూహించుకుంటూ రోమ్ నిశ్శేష్టంగా ఉండిపోయింది. ఈ బానిస విప్లవం గురించి ప్రతివాడు మాటాడేవాడే కాని

ఎవరికి ఏమీ తెలియదు. మొత్తం మీద భయం మాత్రం పట్నమంతటా సంచరిస్తోంది.

## 6

సెనేట్ రహస్య సమావేశంలో ఉంది. సభ్యులంతా హాజరయారు. ఒకటి రెండు కుర్చీలు మాత్రం సభ్యులరాక కెదురు చూస్తున్నాయి. గ్రాఛూస్‌కు ఆ సమావేశం బాగా జ్ఞాపకముంది. అద్వితీయమైన సెనేట్ ఇటువంటి విషమ పరిస్థితుల్లో కూడా, ఇటువంటి దుర్వార్త విన్నప్పుడు కూడా ఎంతో ఘనంగా ప్రవర్తించి తీరుతుందని అతనికి తెలుసు. వక్రమార్గాలలో ఓట్లుకొని, దొంగఓట్లు వేయించి, రాజకీయ కపటనాటకమాడి, అవకాశవాదాన్ని చేబట్టి వీళ్ళు సెనేట్ సభ్యులు అయిన విధం అంతా అతనికి తెలుసు. ఇక్కడ కూచున్న ప్రతివాడిలోనూ ఉన్న అవినీతి సముద్రాల లోతులతనికి తెలుసు. అయినా వారిమధ్య కూచున్నానన్న సంగతి అతనిలో గర్వాన్ని కలిగించి, ఒడలు పులకరించేలా చేసింది.

అతన్ని సెనేట్ 'పృచ్ఛకుని'గా నియమించింది. వాళ్ళముందున్న రోమన్ సైనికుని వైపు తిరిగి నిలబడ్డాడు. అతనిది పల్చని ముఖం. కళ్ళు భయంతో, గాభరాగా చూస్తున్నాయి. నాలికతో ఎప్పుడూ పెదవులను నాకుతున్నాడు. కవచం ఉందిగాని, ఆయుధాలేమీ లేవు. ఒక చేతికి రక్తంతో బాగా తడిసిన గుడ్డకట్టు ఉంది. బాగా అలసిపోయినట్లు కనిపిస్తున్నాడు. గ్రాఛూస్ ప్రశ్నలడిగే ముందు ఒకడిచేత ద్రాక్షసారా తెప్పించి ఆ సైనికుని పక్కనున్న బల్ల మీద పెట్టించాడు. ఆ సైనికుడు స్పృహ తప్పిపోవడం గ్రాఛూస్‌కు ఇష్టంలేదు. దాని వల్ల పని కూడా జరగదు. దళాధిపతి కిచ్చిన అధికారదండం ఆ సైనికుడి చేతిలో ఉంది.

అప్పు డతను సైనికుడిని అడిగాడు "నీ పేరు?"

"అరలస్ పోర్థన్."

"ద్రాక్షసారా తీసుకో."

అక్కడున్న వాళ్ళందరి మొహాలకేసీ చూసాడు సైనికుడు. పాత్రలో సారా తాగి తన పెదవులు నాక్కున్నాడు.

"నీ వయస్సెంతోయ్?" గ్రాఛూస్ ప్రశ్నించాడు.

"ఇరవై ఐదేళ్ళు."

"నీ జన్మస్థలం?"

"ఇక్కడే రోమ్‌లో."

"నీ వృత్తి ఏమిటి?"

"ఏమీ లేదు, యుద్ధమే నా వృత్తి."

"నువ్వెన్నో పటాలానికి చెందినవాడివి?"

"మూడో పటాలానికి."

"ఎంతకాలం నుంచి మూడో పటాలంలో పనిచేస్తున్నావు నువ్వు?"

"రెండేళ్ళ రెండు నెలలనుంచి."

"మూడో పటాలానికి అధిపతి ఎవరు?"

"సిల్వియస్ క్రైయస్ స్వలేరియస్."

"మీ వందమంది దళానికి ఎవరు?"

"మేరియస్ గ్రాఛూస్ అల్వియో."

"సరే. నాకూ, ఇక్కడ కూర్చున్న గౌరవనీయులయిన సెనేట్ సభ్యులకూ కేపువా వదలి వెళ్ళాక, మీ ఆరుపటాలాలకూ జరిగిందేమిటో ప్రతిదీ స్పష్టంగా, ఖచ్చితంగా చెప్పాలి; అనుమానించకుండా, దాచకుండా జరిగిందంతా చెప్పు. చెప్పడానికి ఏమీ భయపడనక్కర్లేదు. పవిత్రమైన ఈ సెనేట్‌లో నీ కే విధమైన అపకారం జరగదు."

ఆ సైనికుని మాటలకన్న, తనలో నాడు అవి రచించిన చిత్రాలే మరింత స్పష్టంగా కళ్ళముందు కట్టినట్లుగా జ్ఞాపకమున్నాయి. వరీనియస్ గ్లాబ్రూస్ నాయకత్వాన నడిచి వెళ్ళిన పటాలాలకు సంతోషంకాని, సంతృప్తికాని కలిగేటట్లు దారిలో ఆహ్వానపత్రాలు చదవలేదు. తాపం ఎన్నడూ లేనంత అధికమైంది. ఈ పట్టణవాసపు పటాలాలకు దూరప్రయాణాలు అలవాటు లేదు. అందులోనూ కాలినడకను చేయవలసిన ఈ ప్రయాణం వారికెంతో కష్టంగా పరిణమించింది. ఈ శిరస్త్రాణం, ఖడ్గం, పెద్ద డాలూ, పొడుగాటి ఈటె ప్రయాణ వేగానికి ప్రతిబంధకాలుగా తయారయ్యాయి. ఈ లోహపు వస్తువులు శరీరాన్ని రాపాడేచోట పుళ్ళు పడ్డాయి. మైదానంలో గర్వంగా కవాతుచేసిన మెత్తని బూట్లు ఈ రోడ్ల మీద, పొలాలలో ఎందుకూ పనికిరాకుండా పోయాయి. మధ్యాహ్నం వేళ వర్షపు జల్లులు ముఖాన్ని మొత్తేవి; పూర్తిగా తడిపి పారేసేవి. ఉదయపుటెండలలో వేగిపోయేవారు. దాంతో సాయంత్రానికి వాళ్ళ ముఖాలలో దైన్యం దేవులాడేది. విచారం విచ్చలవిడిగా విహరించేది.

శక్తిలేని పటాలాలు అలాపోతూ తోటలలో పని చేసే నలుగురు బానిసలను చంపారు. ముగ్గురు పురుషులు, ఒక స్త్రీ.

"మీరు వాళ్ళనెందుకు చంపవలసి వచ్చింది?" గ్రాఛూస్ ప్రశ్నించాడు.

"ఆ ప్రాంతాలలోని ప్రతిబానిసా మన శత్రువని అనుకున్నాం మేం."

"మీ శత్రువులు ఎక్కడో కొండలలో దాక్కున్నారు. మీరు కవాతు చేసుకుంటూ పోతుంటే చూడ్డానికని రోడ్డుమీద కెందుకు వస్తారు?"

"ఇదంతా ఆ రెండవ పటాలంవాళ్ళు చేసారు. శ్రేణులు వదలివెళ్ళి ఆ ఆడదాన్ని పట్టుకున్నారు. మగవాళ్ళు ఆమెను కాపాడ్డానికి ప్రయత్నించారు. కోపం వచ్చి సైనికులు ఆ మగబానిసల్ని ఈటెలతో పొడిచేసారు. ఇదంతా ఒక్క నిముషంలో జరిగింది. నే నక్కిడి కెళ్ళే సరికి...."

"మీ పటాలంలో వాళ్ళు కూడా శ్రేణి వదిలి వెళ్లారంటావు?" గ్రాఛూస్ అడిగాడు.

"అవునండి. సైన్యం అంతా, దగ్గరగా ఉన్నవాళ్ళమంతా చుట్టూ మూగాం. దాని ఒంటిమీద బట్ట ఊడదీసి ఒకడి తరువాత ఒకడు బలవంతంగా...."

"ఆ వివరాల్లోకి పోనక్కర్లేదు" ఆటంకం చెప్పాడు గ్రాఛూస్. "మీ అధికారులు కలగ చేసుకోలేదా?"

సైనికుడు సమాధానం చెప్పకుండా నిలబడిపోయాడు.

"నువ్వు నిజం చెప్పాలి, తెలిసిందా? నిజం చెప్పడానికి భయపడొద్దని నే చెప్పలేదూ?"

"జోక్యం చేసుకోలేదు."

"ఆ ఆడదెల్లా చచ్చింది?"

"వాళ్ళు చేసినదాంతో ఆమె చచ్చిందండి" సైనికుడు మెల్లిగా చెప్పాడు.

"రక్షణ శ్రేణిని నిర్మించడానికి మీ సేనాని ప్రయత్నించలేదా? పోనీ ప్రయత్నించాడో, లేదో నీకు తెలుసా?"

"వరీనియస్ గ్లాబ్రూస్ దుర్గం నిర్మించాలన్నా, కొందరు దళాధిపతులు వ్యతిరేకించారని అంతా అనుకున్నారు. అంతా ఒప్పుకుంటే మాత్రం అయేదా? మనలో ఇంజనీర్లు లేరు. ఇదంతా బుర్రా, బుద్ధి లేకుండా చేసిందన్నారు. అయ్యా! క్షమించండి...."

"చెప్పు ఫరవాలేదు. వాళ్ళేమనుకున్నారో నిర్భయంగా చెప్పు."

"అయ్యా! ఇదేం ఆలోచించి చేసినది కాదన్నారండి. ఏదో కొద్దిమంది బానిసముండా కొడుకులికి భయపడ్డమేమిటి అన్నారా అధికారులు. అప్పుడే చీకటిపడుతోంది. రక్షణశ్రేణి నిర్మించాలని అనుకున్న వరీనియస్ గ్లాబ్రూస్ చీకటిపడిపోయేదాకా ప్రయాణం ఎందుకు చేయించాడు అన్నారండి దళాధిపతులు. ఆ నడక ఎంతో ఇబ్బందైపోయింది. దుమ్మూ, ధూళి నిండిన రోడ్లు, గాలి వీచేసరికి ముక్కునిండా, ముఖంనిండా అదే ధూళి. కుండపోతగా వర్షంపడేది. ఆఫీసర్లకేం గుర్రాలమీద కూచున్నారు ఠీవిగా. వాళ్ళ సొమ్మేంపోయింది. ఎటొచ్చీ నడుస్తున్న మనకే ఈ బాధంతా అని కూడా అన్నారండి. బళ్ళలో సామాను ఎంత దూరం రాగలిగితే అంత దూరం ప్రయాణం చేయడమే మంచిదన్నారు."

"అప్పుడు మీరెక్కడున్నారు?"

"కొండదగ్గర."

ఆ దృశ్యాలే గ్రాఛూస్‌కు మరింత బాగా జ్ఞాపకమున్నాయి. బురదతో నిండిన రోడ్డు పోను పోను ఒకే బండిపట్టేటంత సన్నమైపోయింది. హోయిని గొర్రె తోటలూ, పసరికబయళ్ళూ, ఆఖరుకు అగ్నిపర్వత శిలాప్రాంతాలకు, కొండలలోకి దారితీసాయి. ఒక మైలు పొడుగున బారులు తీరిన సైనికులూ, సామాను బళ్ళూ. చిరాకుతో, అలసటకు దాసులైన సైనికులు. వాళ్ళకు కొంతదూరంలో చిన్న కొండంత ఉన్న ఎత్తయిన పెద్ద రాయి. ఆ రాతికి కొద్దిగా దిగువన ఒక బయలు. ఆ బయలులో ఒక ఏరు పారుతుంటుంది.

అక్కడ వాళ్ళా రాత్రికి మకాం వేసారు. తన కింద ఉద్యోగుల మాటలకు లొంగాడు వరీనియస్ గ్లాబ్రూస్. రోమన్ ఆయుధాలు ధరించిన మూడువేల సైనికులు మనకుండగా, మనమీద కా బానిసలు దాడిచేసే అవకాశమెక్కడుంది? ఆ అపాయమేమీలేదే? అస లా

తిరుగుబాటు లేవదీసిందే రెండువందలమంది మల్లులు. అందులో చాలా మంది చచ్చారు కూడా. అటువంటప్పుడు భయపడాల్సిందేమిటి? అన్నారు దళాధిపతులు. కొందరు ఆ గడ్డిమీద నడుం వాల్చినదే తడవు నిద్రపోయారు. ఒకటి రెండు పటాలాలు డేరా వెయ్యడమనీ, వీధులేర్పాటు చెయ్యడమనీ క్రమశిక్షణతో చేసారు. చాలా పటాలాలు వంటకని మంటలేసారు. బళ్ళల్లో వండిన వంట సిద్ధంగా ఉంది కాబట్టి, వంటకు ప్రయత్నాలెందుకు అన్నారు మరి కొందరు. సరిగ్గా మధ్యన వరీనియస్ గ్లాబ్రూస్ డేరా వేయబడింది. అక్కడే పతాకచిహ్నాలు ప్రతిష్టించబడ్డాయి. కేపువా ప్రజలు తమ సైన్యాలకు ఎన్నో రుచికరమైన వంటకాలు తయారు చేసి ఇచ్చారు. రక్షణదుర్గం కట్టవలసిన భారం తగ్గిందికదా అన్న సంతోషంతో ఆఫీసర్లతో కలిసి వరీనియస్ గ్లాబ్రూస్ విందారగించాడు. కష్టంగా ఉన్నా ఆ ప్రయాణంలో ఏమీ అపాయాలు మాత్రం కలగలేదు.

"చీకటి ఎలాపడిందో నాకు జ్ఞాపకముంది. నక్షత్రాలు ఆకాశంలో మెరుస్తున్నాయి" వింటున్న వాళ్ళతో చెప్పాడు సైనికుడు.

మూర్ఖుని మాటలలో కూడా అణుమాత్రం అందం ఉంటుంది. చీకటి పడింది. వరీనియస్ గ్లాబ్రూస్ తన సహచరులతోపాటు మధువును సేవిస్తూ, తేనె వేసిన తీపి పదార్థాలు తింటూ తన పెద్ద డేరాలో కూచున్నాడు. మంచి సంభాషణే జరిగిఉండవచ్చు ఆ డేరాలో. ద్రాక్షసారా సేవించిన వాళ్ళ గొంతులు మల్లెపువ్వులు విడినట్లు విడి ఉండొచ్చు. డేరాలలో కూచుని పాటలు కూడా పాడుకున్నారేమో? రెపరెపలాడుతూ ఆ పాటలు మకాం అంతటా విహరించాయేమో! ఈ పాటలు విని అలసట మకాం వదలి పారిపోయింది. డేరాలు వేసుకోని సైనికులు గడ్డిలో వెల్లకిలా పడుకుని చుక్కలు చూస్తున్నారు. బానిసలెప్పుడూ తమ యజమాని మీద చెయ్యెత్తకూడదని బానిసలకు పాఠం నేర్పడానికని వచ్చిన ఆమూడువేల సైనికులకూ నిద్రపట్టింది. తీయని మృదువైన నిద్ర.....

గ్రాఛూస్ పృచ్ఛకుడైన సెనేటరు. అతని పని ప్రశ్నలు వేయడం, సమాధానాలు రాబట్టడం. సైనికుడు జవాబు ఇచ్చేలోపున ఆ హాలులో నిశ్శబ్దం తిరుగుతోంది. ఈగ వాలిన చప్పుడు కూడా వాళ్ళకు వినిపించే ఉండును.

"నువ్వూ నిద్రపోయావా?" అడిగాడు గ్రాఛూస్.

"నేనూ నిద్రపోయానండి" చూసినదంతా చెప్పడానికి ఎలాగో ప్రాణాలు దక్కించుకుని వచ్చిన ఆ సైనికుడు చెప్పాడు.

"నీకు మెలకువెలా వచ్చింది?"

ఇక్కడే ఆ సైనికుడు మాటలకోసం తడుముకున్నాడు. అతని ముఖం పాలిపోయింది. అతను స్పృహ తప్పి పడిపోతాడేమోనన్న భయం కలిగింది గ్రాఛూస్‌కు.

"నేను నిద్రపోయాను. ఎవరో అరవడంవల్ల నిద్ర లేచాను. ఎవరో ఒక్కరే అరిచి ఉంటారని నే ననుకున్నాను. కాని, తీరా లేచి చూస్తే ఒక్కడు కాక ఎంతో మంది అరుస్తున్నట్లు

తెలుసుకున్నాను. ఆ ప్రదేశమంతా కేకలతో, పెడబొబ్బలతో నిండింది. నేను మేల్కొని పక్కకు తిరిగాను. నా పక్కన కేలియస్ పడుకున్నాడు. అతను అనాథుడు. ఇంటి పేరేం లేదతనకి. నా బాల్యస్నేహితుడు. నాకు కుడిచెయ్యి లాంటివాడు. నేను పక్కకు ఒత్తిగిలే సరికి నా చెయ్యి తడిగా, వెచ్చగా, మెత్తగా ఉన్న దేనిమీదో పడింది. తీరా ఏమిటిరా అని చూసేసరికి నా స్నేహితుడి పీక తెగిపోయి ఉంది. పూర్తిగా తెగిపోయింది. ఆ కేక లలాగే ఉన్నాయి. నేను రక్తపుమడుగులో కూచుని ఉన్నాను. ఆ రక్తం నాదో మరొకళ్ళదో నాకు తెలియనేలేదు. వెన్నెలలో నా చుట్టూ శవాలు కనిపించాయి. ఎక్కడ నిద్ర పోయారో అక్కడే చచ్చి పడి ఉన్నారు. కిందకీ, పైకీ ఆడుతున్న కత్తులు వెన్నెట్లో తళతళ మెరిసాయి. ఎక్కడబడితే అక్కడే తయారయా రీ బానిసలు. ఆ విధంగా వాళ్ళు మమ్మల్ని చంపారు. సగంమందిని నిద్రపోతుండగానే చంపేసారు. లేచి నిలబడిన వాడినల్లా చంపేసారు. ఇక్కడా అక్కడా కొద్ది మంది సైనికులు గుంపులు గూడేవారు. కాని వాళ్ళెంతోసేపు దెబ్బలాడ లేకపోయారు. ఇంత భయంకరమైనది నా జీవితంలో నే నెప్పుడు చూడలేదు. వాళ్ళు చంపడం మానలేదు. నాకు మతిపోయింది. నేనూ కేకలెయ్యడం మొదలెట్టాను. బయటకు నేనొచ్చేసరికి చుట్టూ ఈటెలు కాపలా కాస్తున్నాయి. అవి మకాం చుట్టూ ఉన్నాయి. ఆ బల్లేలు పుచ్చుకుని నిలబడ్డ వాళ్ళల్లో చాలామంది స్త్రీలే. నేనెప్పుడూ అటువంటి స్త్రీలను చూడలేదు. ఆడవాళ్ళలా కనబడలేదు వాళ్ళు. గాలికి వాళ్ళ పొడుగాటి విరబోసుకున్న జుట్టు ఎగురుతోంది. నోళ్ళు తెరిచి అరుస్తూ నిలబడ్డారు. మొత్తం రణగొణధ్వనిని వాళ్ళ కేకలు మరింత గొడవగా తయారు చేస్తున్నాయి. వీళ్ళేం చేస్తారులే అనుకున్న ఒక సైనికుడు వాళ్ళను తోసుకుపోవడానికి ప్రయత్నించాడు. వాళ్ళతన్ని నిర్దాక్షిణ్యంగా పొడిచి చంపేసారు. ఎవడూ తప్పించుకుని పారి పోలేకపోయాడు. దెబ్బలు తిన్న సైనికులు పాకుతూ, దేకుతూ వస్తే వాళ్ళను కూడా పొడిచి చంపారు ఈ స్త్రీలు. నేనూ అక్కడకి పరుగెత్తుకుని వెళ్ళాను. నా భుజంలో ఒక బల్లెం దూసుకుపోయింది. అదెలాగో ఊడబెరుక్కుని ఈ రాక్షసుల బారినుంచి తప్పించుకుందుకు తిరగి మకాంలోకి పరిగెత్తుకు వెళ్ళాను. రక్తం కాలువలు కడుతుంటే అక్కడ పడిపోయా. అలా ఎంతసేపున్నానో నాకే తెలియదు. ఎంతో సేపనుకోను. లేచి పోరాడి చద్దామనుకున్నాను. కాని ఆగాను. కేకలు, హాహాకారాలూ కొంచెం తగ్గి ఎవరో నన్ను పట్టుకుని నిలబెట్టారు. ఒక కత్తి నాకుత్తుకదాకా వచ్చింది. నా పనయిపోయిందనుకున్నాను. నేను కూడా చస్తాననుకున్నా. కాని ఎవరో అరిచారు 'ఆగండి' అని. అప్పు డా కత్తి ఆగింది. నా గొంతుకు సరిగ్గా అంగుళం దూరంలో ఆ కత్తి ఆగిందంటే నమ్మండి. ఒక బానిస అక్కడకు వచ్చాడు. అతని చేతిలో థ్రేషియన్ కత్తి వుంది. అతనే ఆగండి అని అరిచాడు. ఎర్రని జుట్టుకల బానిసొకడు వచ్చాడు. ఏదో మాట్లాడుకున్నారు. మిగిలినవాడిని నే నొక్కడినే కనుక వాళ్ళు నన్ను చంపలేదు. తక్కిన మన సైనికులందరూ చచ్చిపోయారు. ఎక్కడ పడుకున్న వాళ్ళక్కడే చచ్చిపోయారు. వరీనియస్ గ్లాబ్రూస్ తాలూకు పెద్ద డేరాలోకి నన్ను తీసుకెళ్ళారు. అతనూ చచ్చిపోయాడు. అతని

శవం మంచం మీద పడి ఉంది. కొందరు దళాధిపతులున్నా రక్కడ. వాళ్ళు సంహరింపబడ్డారు. నా గాయానికి కట్టుకట్టి, కొందరు బానిసలను నాకు కాపలాగా ఉంచారు. అప్పటికి తెల్లారు తోంది. పటాలాలన్నీ చచ్చిపోయాయి."

ఉన్నదున్నట్లు ఆవేశం లేకుండా, చెప్పుకుపోయాడు. ఇది చెప్తున్నంతసేపూ అతని కంటిరెప్పలు త్వరత్వరగా మూసుకొనేవి. శిలాప్రతిమలా కూచున్న సెనేట్ సభ్యుల ముఖాలకేసి అత నెప్పుడు చూడలేదు.

"వాళ్ళంతా చచ్చిపోయారని నీ కెలా తెలుసు?" గ్రాఛూస్ అడిగాడు.

"తెల్లారేదాకా నన్ను డేరాలో అట్టేపెట్టారు. డేరా తెరలు పైకి చుట్టి పెట్టేసారు. రాత్రి జరిగిందంతా నాకు స్పష్టంగా కనిపించింది. అరుపులూ, కేకలూ, హాహాకారాలూ, పెడబొబ్బలూ ఏమీ వినబడటం లేదప్పుడు. కాని నా చెవులలో మాత్రం అవింకా గింగురుమంటూనే ఉన్నాయి. ఎంతోమంది చచ్చి చాపచుట్టల్లా పడిఉన్నారు. గాలిలో రక్తంవాసన వ్యాపించింది. రాత్రి మైదానం చుట్టూ కాపలా కాసిన ఆడవాళ్ళు కనిపించలేదు. ఆ వాసనను తోసుకుని మాంసం వండుతున్న వాసన వచ్చింది. పొద్దున్నే భోజనానికని ఆ స్త్రీలే మాంసం ఉడకబెడుతున్నారేమో. ఇటువంటప్పుడు ఎవరైనా ఎలా తినగలరా అనిపించింది. వెగటుబుట్టి వాంతి చేసుకున్నాను. వాంతులు కట్టే వరకూ నన్ను పైన కూచోపెట్టారు. ఎండవస్తోంది. మకాంలో తిరుగుతున్న బానిసలను చూసాను. చచ్చినవాళ్ళ కవచాలూ, ఆయుధాలూ అన్నీ వాళ్ళు తీసుకుంటున్నారు. మన డేరా గుడ్డలు నేలమీద పరచి ఆయుధాలూ, శిరస్త్రాణాలూ అన్నీ గుట్టలుగా వేసారు. పక్కగా పారుతున్న ఏటిలో కత్తులూ, ఈటెలూ, కవచాలూ అన్నీ కడిగి తీసుకొచ్చారు. రక్తంతోనిండిన వీటినన్నిటినీ కడగడంతో ఆ ఏటిలోనినీళ్ళన్నీ తుప్పురంగులా తయారయాయి. మేం పట్టుకెళ్ళిన కొవ్వుడబ్బాలు తీసిఆయుధాలన్నిటికీ ఆ కొవ్వూ, చమురూ పట్టించారు. డేరాకు దగ్గరగా పరచిన గుడ్డమీద కత్తులన్నీ మేటలేసారు. వెయ్యిపైగా ఉన్నాయవి."

"బానిస లెంతమంది ఉన్నారు?" గ్రాఛూస్ ప్రశ్నించాడు.

"ఏడు, ఎనిమిదివందలు, ఓ వెయ్యిమంది ఉన్నారు. నాకు సరిగ్గా తెలియదు. పదేసి మంది ఒక బృందంగా పనిచేస్తున్నారు వాళ్ళు. ఒళ్ళు వంచి పని చేస్తున్నారు. దోచుకున్న ఆయుధాలువగైరా మేం తీసుకువెళ్ళిన బళ్ళల్లో కెక్కించి ఎక్కడికో తోలుకుపోయారా బానిసలలో కొందరు. ఉడకబెట్టిన మాంసం బుట్టలనిండా పెట్టి ఆడాళ్ళు పట్టుకొచ్చారు. ఒక్కొక్క బృందం ఒక్కొక్క మాటు తినేది. మన రొట్టెలు కూడా తినేసారు."

"చచ్చిపోయినవాళ్ళ నేం చేశారు వాళ్ళు?"

"ఏమీ చెయ్యలేదు. ఎక్కడున్న వాళ్ళ నక్కడే వదిలేసారు. వస్తువలన్నీ దొచుకున్నాక, అక్కడ శవాలున్నట్లే వాళ్ళనుకోలేదనిపించింది నా మటుకు. రక్తం నేలమీద డాగులు కట్టింది. చూడ్డానికి నాకు చాలా అసహ్యమేసింది. ఒకచోట ఆరుగురుజేరి నిలబడి జరుగుతున్నదంతా

చూస్తున్నారు. అందులో ఒక ఆఫ్రికన్ కూడా ఉన్నాడు. వాళ్ళు మల్లులు."

"నీ కెలా తెలుసు?"

"డేరాలోకి వచ్చినప్పుడు వాళ్ళు మల్లులని నాకు తెలిసింది. జుట్టు అంట కత్తెర వేసి ఉంది వాళ్ళకి. ఒంటిమీద ఎక్కడబడితే అక్కడ గాయాల మచ్చలున్నాయి. దాన్నిబట్టి నే ననుకున్నాను. అదీకాక మల్లు లెక్కడున్నా తెలిసిపోతారు. ఒకడి కో చెవిలేదు. ఒకడికి ఎర్రని జుట్టుంది. వాళ్ళ నాయకు డొక థ్రేషియన్. కళ్ళు మిటకరించకుండా, కదపకుండా చూస్తాడతను. అతని ముక్కు పగిలింది...."

సెనేట్ సభ్యులలో ఒక మార్పు వచ్చింది. వినడంలో మరింత ఆసక్తి, ద్వేషం కనిపిస్తున్నాయి. బిగుసుకుపోయి కూచున్నారు. ఆ క్షణం గ్రాఛూస్‌కు మరుపురాదు. ఆ క్షణమే స్పార్టకస్‌ను వాళ్ళకి పరిచయం చేసింది. ఎక్కడివా డీ స్పార్టకస్? చాలామంది కో మూలం అంటూ ఏడుస్తుంది. ఒక చరిత్ర ఉంటుంది. ఒక ప్రారంభం ఉంటుంది. ఒక స్థలం, ఒక దేశం, ఏదో ఒకటుంటుంది. కాని స్పార్టకస్‌కివేం లేవు. చావగా మిగిలిన ఒక సైనికుడి పెదవులపై పుట్టాడీ స్పార్టకస్. ఆ సైనికుడిని చావకుండా చేసింది కూడా ఆ స్పార్టకస్సే. అతనో బ్రహ్మరాక్షసి కాడు. మహోదగ్ర భయంకర స్వరూపుడుకాడు. మామూలు బానిస. కాని అతను చూసినది సవిస్తరంగా చెప్పాలి.

"ఆ ముఖం నాకో గొర్రె ముఖాన్ని జ్ఞప్తికి తెచ్చింది. ఒక చొక్కా తొడుక్కున్నాడతను. బరువైన ఇత్తడి బెల్టూ, ఎత్తయిన బూట్లూ ఉన్నాయి. కవచం, శిరస్త్రాణం లేవు. అతని చొక్కా మీద రక్తం మచ్చలున్నాయి. ఒకసారి చూస్తే అతని ముఖం మరిచిపోలేం. నా కతన్ని చూస్తే భయమేసింది. తక్కినవాళ్ళని చూస్తే భయంలేదు కాని ఇతనంటేనే నాకు భయం."

"అత నో థ్రేషియన్ అని నీ కెలా తెలుసు?"

"అతని మాటలను బట్టి అనుకున్నా, థ్రేషియన్లు మట్లాడుకోగా నేను పూర్వం చాలా మాట్లు విన్నాను. అతను ల్యాటిను సరిగ్గా మాట్లాడలేదు. ఆ ఆరుగురిలోనూ మరో థ్రేషియన్ కూడా ఉన్నాడు. మిగతా వాళ్ళు గాల్‌లు. డేరాలో శవాల్ని బైటపారేసారు. వరీనియస్ గ్లాబ్రూస్ తాలూకు కవచం వగైరా అన్నీ తీసి మంచం మీద పెట్టారు. అంధులో ఈ అధికార దండం కూడా ఉంది. పగిలిన ముక్కున్న మనిషి ఈ దండాన్ని పట్టుకుని నాకు చూపిస్తూ నన్నడిగాడు: "రోమన్, ఇదేమిటో నీకు తెలుసా?" అది సర్వోత్కృష్టమైన రోమన్ సెనేట్ తాలూకు హస్తం అన్నాన్నేను. అప్పుడతను తన పేరు చెప్పాడు. "నా పేరు స్పార్టకస్. రోమన్! జ్ఞాపకముంచుకో. నా పేరు స్పార్టకస్." అతనింకా అన్నాడు: "నిన్న మీ రా ముగ్గురు బానిసలనూ ఎందుకు చంపారు రోమన్? ఆ బానిసలు మీ కేం హానిచెయ్యలేదే. కవాతు చేస్తున్న సైనికుల్ని చూడ్డానికి వచ్చారంతే. అదేనా వాళ్ళు చేసిన తప్పు." ఏం జరిగిందో చెప్పడానికి ప్రయత్నించాను.

రెండో పటాలంలోని వాళ్ళే ఆమెను చెరిచి, ఆ ముగ్గుర్నీ చంపారని చెప్పాను. నేను మూడో పటాలంవాడిననీ, నాకేమీ తెలియదనీ కూడా చెప్పాను. ఆ ముగ్గురు బానిసలనూ చంపినప్పుడు మేం తప్ప ఆ చుట్టుపక్కల మరెవరూ లేరు. కాని వీళ్ళకెల్లా తెలిసిందో నాకు బోధపడలేదు. మేం చేసిన ప్రతిపనీ వాళ్ళకు తెలుసు. మేం కేపువాకు ఎప్పుడు వచ్చామో, అక్కడి నుండి ఎప్పుడు బయలుదేరామో అన్నీ వాళ్ళకు తెలుసు. ఇదంతా అతని పాము కళ్ళల్లో ఉంది. ఇదంతా అతని గొంతులో ఉంది. అత నా గొంతునెప్పుడూ హెచ్చించడు. ఒక కుర్రాడితో మాట్లాడినట్లు మాట్లాడ్డం మొదలెట్టాడు నాతో. నే నలాటివాటికి మోసపోను. అత నో హంతుకుడు. అదీ అతని కళ్ళల్లో కనిపిస్తుంది. ఆ రాత్రి వాళ్ళు చంపిన ఫక్కీలో, అంత దారుణంగా మల్లులు తప్ప మరెవరు చంపగరు? నాకు తెలుసు కొందరు మల్లులు...."

గ్రాఛూస్ గొంతు అభ్యంతరం చెప్పింది. సైనికుడు తన మాటల ప్రవాహంలో పడి తానే కొట్టుకుపోతున్నాడు. గ్రాఛూస్ కొంచెం నిశితంగానే అన్నాడు.

"నీ కేమేం తెలుసో వాటన్నిటిలో మాకు ఆసక్తి లేదు. నీకూ, ఆ బానిసలకూ మధ్య జరిగిందేదో అదే మాక్కావాలి."

"జరిగిందిది" మొదలుపెట్టిన వెంటనే ఆగాడు సైనికుడు. నిద్రపోతూ అప్పుడే కళ్ళు తెరిచినవాడిలా చూసాడు. వణికాడు. చెప్పుకొనిపోయాడు.

"ఈ దండం స్పార్టకస్ చేతిలో ఉంది. దాని పొడువునా వేళ్ళతో రాస్తున్నాడు. ఇంతలో దాన్ని నా మీదక విసిరిపారేశాడు. సైనికుడా తీసుకో. రోమన్, తీసుకో- నేను తీసుకున్నాను. ఇప్పుడు నువ్వు ఉత్కృష్టమైన సెనేట్ తాలూకు హస్తానివి- అన్నాడతను. ఏమీ కోపంగా లేడు. ఎప్పుడూ బిగ్గరగా మాట్లాడనూలేదు. ఇదంతా ఏదో మామూలు విషయంలా తోచిందతనికి. అందుకే యధాలాపంగా మాట్లాడేసాడు. నే నా పరిస్థితుల్లో అసహాయుడిని. లేకపోతే, ఈ పవిత్రమైన రాజదండాన్ని తాకిన నేను చావనూ?"

"అది ముట్టుకున్నందుకు ని న్నెవరూ శిక్షించరులే" గ్రాఛూస్ హామీ ఇచ్చాడు.

"ఇప్పుడు నువ్వు ఉత్కృష్టమైన రోమన్ సెనేట్ హస్తానివి, మళ్ళీ అన్నాడు స్పార్టకస్. ఈ ఘనమైన రోమన్ సెనేట్‌కు చాలా పొడుగాటి హస్తమే ఉంది. ఆ హస్తానికి చివర మిగిలిందల్లా నువ్వు. అక్కడ కూచుని అతను నాకేసి అలాగే చూస్తున్నాడు. "నువ్వో పౌరుడవేనా రోమన్?" ఔనన్నాను నేను. తల ఊపి కొద్దిగా నవ్వాడు. "నీకో సందేశం ఇస్తా, ప్రతి మాటా నేనెలా చెప్తే అలా చెప్పు వాళ్ళకి" అన్నాడతను. సైనికుడు చెప్పడం ఆపాడు. ఒక బానిస ఇచ్చిన సందేశం ఏమిటని అడగడం అతనికిష్టం లేదు. కాని వినాలి. కొంతసేపయ్యాక గ్రాఛూస్ సైనికుడిని మాట్లాడమన్నాడు.

"మాట్లాడలేను."

"నిన్ను మాట్లాడమని సెనేట్ ఆజ్ఞాపిస్తోంది."

"అవి ఒక బానిస మాట్లాడిన మాటలు. నాకు నోరెలా తిరుగుతుంది....."

"చాలోయ్, చాలు" గ్రాఛూస్ అన్నాడు. "ఆ బానిస మాతో ఏం చెప్పమని చెప్పాడో చెప్పు."

స్పార్టకస్ చెప్పిన మాట లాసైనికుడు చెప్పాడు. అన్ని సంవత్సరాలు గడిచిన పిమ్మట గ్రాఛూస్ జ్ఞాపకముంచుకున్నంతమటుకు అతను చెప్పిన మాటలివి. ఆ మాటలు జ్ఞప్తికి తెచ్చుకున్నప్పుడల్లా గ్రాఛూస్‌కో దృశ్యం అగుపించేది. నీలం చారలూ, పసుపు పచ్చని చారలూ ఉన్న పెద్దడేరా, అది రోమన్ సేనానిది. సేనాని మంచంమీద స్పార్టకస్ కూచుని ఉంటాడు. అతని చుట్టూ సైనికోద్యోగులైన మల్లులుంటారు. అతని కెదురుగా, భయకంపితుడై, క్షతగాత్రుడై, అంతా చావగా మిగిలిన ఒకే ఒక్క రోమన్ సైనికుడు సెనేట్ హస్తాన్ని, అంటే అధికారదండాన్ని పట్టుకొని నిస్సహాయుడై నిలబడి ఉంటాడు.

"సెనేట్ వద్దకు తిరిగివెళ్ళు (స్పార్టకస్ చెప్పాడు). ఈ దంతపు దండాన్ని వాళ్ళకియ్యి. నేను నిన్ను రాయబారిని చేస్తున్నా; ఇక్కడ చూసిందంతా చెప్పు. వాళ్ళు మా మీదకు పటాలాలు పంపారనీ, వాటిని మేం నాశనం చేసామనీ చెప్పు. వాళ్ళకి మేం బానిసలమని; మాట్లాడగల పనిముట్లని; గొంతుగల పరికరాలమని చెప్పు. మా కంఠస్వరాన్ని వాళ్ళకు వినిపించు. ఈ ఛండాలపు రోమ్, ఈ సెనేట్‌తో ప్రపంచం విసిగి పోయిందని మే మన్నామనీ చెప్పు. కొరడా దెబ్బల సంగీతం విని ఈ ప్రపంచం విసిగిపోయిందని కూడా చెప్పు. ఉన్నతమైన రోమన్‌లకు ఆ పాట ఒక్కటే తెలుసు. ఆ పాట ఇక మే మెప్పుడూ వినదలుచుకోలేదు. వినం. ఆదిమానవు లందరూ ఒకేలాగే ఉండేవారు. వాళ్లు శాంతియుతంగా జీవించేవారు. వాళ్ళకున్న ఆస్తి నంతటినీ సమిష్టి ఆస్తిగా పరిగణించేవారు. కాని ఇప్పుడు రెండు వర్గాలున్నాయి. రెండురకాల ప్రజలు న్నారు. ఒకరు బానిసలు, వేరొకరు యజమానులు. మీ యజమానుల సంఖ్యకన్న మేం వెయ్యివేల రెట్లధికం. మేం మీకన్నా బలవంతులం. మానవులలోని మంచి అంతా మా సొత్తు. మా స్త్రీలను మేం గౌరవిస్తాం. వారిసరసన నిలిచి దుర్మార్గాన్ని ప్రతిఘటిస్తాం. కాని మీరో? మీ స్త్రీలను మీరు కులటలుగా తయారుచేస్తారు. మా స్త్రీలను జంతువులుగా చూస్తారు. మా పసిపాపలను మీ రపహరించినపుడు మేం దుఃఖంతో కుంగిపోతాం. ఏడుస్తాం. వాళ్ళని గొర్రెలమందలలో దాస్తాం. కాని మీరు మీ పిల్లల్ని జంతువులను పెంచినట్లు పెంచుతారు. మా బానిస స్త్రీల వల్ల మీకు కలిగిన పిల్లలను మీరు బజారులో ఎవ డెక్కువ ధర ఇస్తే వాడికి విక్రయిస్తారు. మీరు మనుషులను కుక్కల్ని చూసినట్లు చూస్తారు. మీ నీచమైన ఆనందం కోసం గోదాలో ఒకరినొకరు పొడుచుకునేలా చేస్తారు. మీ స్త్రీలు మేం చంపుకొంటుంటే, మేం దిశమొలలతో నిలబడితే వింత చూస్తారు. కుక్కపిల్లల్ని తొడ మీద పడుకోబెట్టుకుని తినుబండారాలూ తినిపిస్తూ మానవ మారణహోమాన్ని చూస్తారు మీ కులకాంతలు. ఎంత నీచులు మీరు. ఎంత ఏహ్యమైనవాళ్ళు మీరు. మానవ జీవితాన్ని ఎంత కలుషితం చేసేసారు మీరు. కలలుకనే మానవుడిని, నిర్మాణాత్మక కృషినిసల్పే మానవహస్తాలను, వారి నుదుటి చెమటను, వారి జీవనస్రవంతి అయిన రక్తాన్ని మీరు వేళాకోళంగా, వెక్కిరింతగా తయారు

చేసారు. జీవితం విలువను నాశనం చేసారు మీరు. చంపడం కోసమే చంపేస్వభావం మీది. చంటిపిల్లలచేత గనుల్లో పనిచేయించి ఆ పసికందుల్ని చిన్నతనంలోనే చంపుతారు. ప్రపంచాన్ని దోపిడిచేసే గజదొంగలై మీరీ వైభవాన్ని సమకూర్చుకున్నారు. ఇది వాగగల పనిముట్టు చెప్పిన మాటలని చెప్పు. వాళ్ళ సైన్యాలను మా మీదకు పంపమనీ, ఆ పంపిన సైన్యాలను మేం ధ్వంసం చేసి పారేస్తామనీ, ఆ సైన్యాల ఆయుధాలే మేం తీసుకొని, మీ ఆయుధాలతో మిమ్మల్నే చంపుతామనీ చెప్పు మీ సెనేటుతో. మేమో పిలుపు ఇస్తాం. బానిసలంతా లేవండి! లేచి మీ గొలుసులను తెంచుకోండి! ఇటలీ అంతా తిరుగుతాం. మే మెక్కడికి వెడితే అక్కడ బానిసలు మాతో చేరతారు. అప్పుడొక రోజున మీ ఆద్యంతరహితమైన పట్టణం మీద పడతాం. అప్పు డది ఆద్యంతరహితం కాకుండా పోతుంది. ఆ సంగతి కూడా సెనేటుకు చెప్పు. అప్పుడు మేం రోమ్ గోడలు బద్దలు చేస్తాం. అప్పుడు మీ సెనేట్ సమావేశాలు జరిగే భవనానికి వస్తాం. అక్కడ ఉన్నతస్థానాలలో కూచునే గౌరవనీయులైన సెనేట్ సభ్యుల్ని ఈడ్చి పారేస్తాం. వాళ్ళ దుస్తులూడతీస్తాం. విచారణ చేసేటప్పుడు మల్లుల్ని ఎలా దిగంబరులుగా నిలబెట్టి విచారణ చేసేవారో అలాగే చేస్తాం. వాళ్ళకు ముట్టవలసిన న్యాయాల్ని, మాకు వాళ్ళిచ్చిన న్యాయానికి ప్రతిఫలాన్ని వాళ్ళకు ముట్టచెబుతాం. వాళ్ళు చేసిన ప్రతినేరానికీ వాళ్ళు సమాధానం చెప్పుకోవాలి. ఇవన్నీ వాళ్ళకు ముందుగానే చెబితే, వాళ్ళు దీనంతకూ సంసిద్ధులౌతారు. వాళ్ళొకమారు ఆత్మపరీక్ష చేసుకొంటారు. న్యాయం జరిగిన పిమ్మట, మేం ఇంతకన్న మంచి నగరాలను నిర్మిస్తాం. అందమైన, శుభ్రమైన పట్టణాలను నిర్మిస్తాం. ఆ పట్టణాల చుట్టూ గోడలుండవు. మానవులు హాయిగా, శాంతియుతంగా జీవించే చోట ప్రహరీ గోడ లనవసరం. ఇదే మా సందేశం. ఇది వాళ్ళతో చెప్పు. ఇదంతా స్పార్టకస్ అనే ఒక బానిస చెప్పాడని కూడా చెప్పు....."

అలాగే చెప్పాడా సైనికుడు. ఇది చెప్పి ఎంతో కాలమయింది అనుకున్నాడు గ్రాఛూస్. సెనేట్ ఇదంతా విన్నది. శిలాప్రతిమలలా కూచుని ఇదంతా విన్నారు వాళ్ళు. దాన్లో చాలా మటుకు అంతా మరచిపోయారు. స్పార్టకస్ మాట్లాడిన మాటలు రాసినవా డెవడూ లేడు. ఏ కొద్ది మంది స్మృతిపథంలోనో ఉన్నాయవి. సెనేట్ రికార్డుల్లోంచి ఆ మాటలు తుడిచివేసారు. బానిసలు ప్రతిష్టించిన స్మృతిచిహ్నాలను ధ్వంసం చెయ్యడం ఎంత న్యాయమో, వాళ్ళ నాయకుడు స్పార్టకస్ మాటల్ని రికార్డుల్లోంచి తుడిచిపారేయడం కూడా అంతే. కాని స్పార్టకస్ నాలుగేళ్ళపాటు రోమను సైన్యాల నెలా నాశనం చేయగలిగాడు?

# 7

గ్రాఛూస్ ఈ లోకంలో లేనివాడిలా కూచున్నా, చేతిలోని పాత్రను మాత్రం జాగ్రత్తగా పట్టుకున్నాడు. అందులోని ఒక చుక్కనీరు కూడా తొణికి కిందపడలేదు. కళ్ళు మిటకరిస్తూ లేచాడు గ్రాఛూస్. "నేను నిద్రపోతున్నానా?" ఏం మాట్లాడినా అతను జూలియాకేసి తిరిగి

ఆమెకోసమే అన్నట్లు మాట్లాడతాడు. "జూలియా, నన్ను క్షమించాలి. పగటికలలు కంటు న్నాన్నేను."

"పోనీ ఆ కలలు మంచివేనా?"

"జ్ఞాపకశక్తి మనిషి కీయబడ్డ వరం అని ఎవరైనా అంటే నేను ఒప్పుకోను. నా ఉద్దేశంలో అదొక శాపం. పైగా నాకు బోలెడు జ్ఞాపకాలు."

"అందరికంటే నీ కేమీ ఎక్కువ జ్ఞాపకాలు లేవులే అందులోనూ విచారకరంగా ఉండేవి మరీ జ్ఞాపకముంటాయి" క్రాసస్ అన్నాడు.

"అయితే అవెప్పుడూ సంతోషంగా ఉండవా!" క్లాడియా ప్రశ్నించింది.

"నువ్వు కునికిపాట్లు పడుతుంటే మీ స్పా....." క్రాసస్ చెపుతున్నాడు.

"ఈ స్పార్టకస్ గొడవ తప్ప ఇంకేమీ మాటాడుకోలేమా?" జూలియా గట్టిగా అంది.

"నా కది అసహ్యం....."

"జూలియా!" మధ్యలోనే ఆమె వాగ్ధోరణి నాపాడు ఆంటోనియస్ కైయస్. భర్తకేసి చూసింది. చిన్న పిల్లల్ని కేకవేసినట్లు తనతో మాట్లాడాడు.

ఆమె ముఖం, కళ్లు ఎర్రబడ్డాయి. లజ్జాభిమానాలు పొంగులువారాయి. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తలవంచుకు కూచుంది. క్రాసస్ మాత్రం క్షమాపణ వేడడంలో జాగ్రత్తపడ్డాడు. "నీకు బాగా విసుగుపుట్టిస్తుంది జూలియా, నన్ను క్షమించాలి."

జూలియా మీదకు మరింత విమర్శ రాకుండా చేయడానికి ఆంటోనియస్ కైయస్‌వైపు తిరిగి గ్రాఛూస్ "మానవ జీవితం మీద గౌరవం అణుమాత్రమైనా లేనందునే బానిసలు ఏవో కొన్ని యుద్ధాలు గెలిచారని ఈయన వాదన. బానిసమూకలు అసంఖ్యాకంగా వచ్చి మనపీడ పడబట్టి మనం మొదట్లో ఓడిపోయామని కూడా ఈయన అభిప్రాయం. ఔనా?" అన్నాడు.

"కాని," అందుకున్నాడు సిసిరో "స్పార్టకస్ అయిదు యుద్ధాలలో గెలిచాడే. మన పట్టణం పటాలాలను ఓడించిన సంఘటన ఒక్కటే కాదు. బ్రహ్మాండమైన కాన్సలర్ సైన్యాలను అతడు నాశనంచేసి, వాటి ఆయుధాలను లాక్కుని చేసిన ఐదు పెద్ద యుద్ధాల గురించి నే మాట్లాడుతున్నాను. స్పార్టకస్ ఏదో ఒక ముఠాకు అదృష్టం కొద్దీ నాయకుడైన వాడేగాని, వాడికి వ్యూహ రచనా నైపుణ్యమనేది లేదని క్రాసస్ అనవచ్చు."

జూలియా కేసి తిరిగి చిరునవ్వు నవ్వాడు "జూలియా! నువ్వనుమతిస్తే ఆసక్తి కలిగించే ఒక చిన్న దృష్టాంతం చెప్తా. కొంత యుద్ధం, కొంత రాజకీయాలు, కొంత వరీనియా గురించి. ఆమె స్పార్టకస్ తాలూకు మనిషి; నీకు తెలుసుగా."

"తెలుసు" జూలియా మృదువుగా అంది.

"వరీనియా గురించి ఎవడో కోసేస్తున్నాడని నా నమ్మకం" క్లాడియా అలా అంటుందని ఎవరూ అనుకోలేదు.

"ఏం? ఎందుచేత అలా అనుకుంటున్నావు?"

"అటువంటి స్త్రీ ఎక్కడా ఉండదు కాబట్టి." "ఏది నిజమో, ఏ దబద్ధమో చెప్పడం

చాలా కష్టం. నే నొక దాడిలో పాల్గొన్నాను. ఆ తరువాత కొంత కాలానికి ఆ దాడిగురించే రాసిన దాన్ని చూసాను. జరిగినదానికీ, రాసినదానికీ ఏ కోశానా పొందిక లేదంటే నమ్మండి. నేను పాల్గొన్న దాడి అదేనా అని ఆశ్చర్యపోయా. అన్నీ అలాగే ఉంటాయి. దీన్లో కూడా నిజం ఉందని హామీ ఇవ్వను కాని, నమ్మడానికి తగ్గ కారణాలు లేకపోలేదు. నేను నమ్మాను కూడా" క్రాసస్ చెప్పాడు. "సేనాధిపత్యం నా కంటగట్టేసరికి చాలా సంవత్సరాలనుంచి యుద్ధం కొనసాగుతోంది. మరొక వైద్యుడు మందిచ్చి పెదవి విరిచిన రోగికి చికిత్స చేయడం ఎలాగో ఒకడి నాయకత్వంలో ఓడిపోతున్న సైన్యాలకు మరొకడు వచ్చి నాయకత్వం వహించి నడపడం అంత కష్టం. దానికితోడు ఈ బానిస యుద్ధాలలో పాల్గొనడం వల్ల కీర్తి రాదు సరికదా ఓటమి కనుక సంభవిస్తే తలమీద వెంట్రుకలుంచరు. స్పార్టకస్ చేతిలో ఐదు బ్రహ్మాండమైన సేనలు సర్వనాశనమయాయి."

"అసంఖ్యాకులైన బానిసమూకలు నాకు కనిపించలేదు. నిజం చెప్పమంటారా? మన మెప్పుడూ సంఖ్యలో వాళ్ళకన్నా హెచ్చుగానే ఉన్నాము. వాళ్లే తక్కువ. మొదట్లోనూ, ఆఖరు యుద్ధంలో కూడా అంతే. అంతా అనుకున్నట్లే స్పార్టకస్ కింద ముప్పై లక్షల మంది బానిసలే ఉన్నట్లయితే ఈ రోజున మనం చక్కగా ఈ తోటలలో వెచ్చని ఎండలో కూచుని కులాసాగా కబుర్లు చెప్పుకొనే పరిస్థితి కలుగకనే పోవును. స్పార్టకస్ రోమ్‌ను జయించి ఉండేవాడు. రోమ్ ఒక్కటే అన్న మాటేమిటి? సమస్త ప్రపంచాన్నీ జయించేవాడు. ఈ విషయం కొందరు నమ్మకపోవచ్చు. నాకు తెలుసు అతని బలాబలాలు. అసలు సంగతేమంటే ఇటలీలోని బానిసలంతా అతనితో చేతులు కలపలేదు. వాళ్ళంతా స్పార్టకస్ తయారయిన మూసలోనే తయారయి ఉంటే, మనకన్నా వందల, వేల రెట్లధికంగా ఉన్న బానిసలతో నిండిన ఈ తోటలలో, పొలాల మధ్య ఇంత నిర్విచారంగా కూచోగలమా? అతని సైన్యం ఎప్పుడూ నలభై ఐదువేలకు మించలేదు. హానిబాల్ కున్నట్లు అతనికి అశ్వికదళాలు లేవు. కాని ఏ రోమ్ ఐతే హానిబాల్‌ని ఒక్క దెబ్బతో ఓడించగలిగిందో అదే రోమ్‌ను స్పార్టకస్ ముప్పుతిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించాడు. రోమ్‌ను మోకరిల్లేలా చేసాడు. అబ్బో! ఎంత గట్టివాళ్ళూ, ఉక్కుతునకల్లాంటివాళ్ళూ, ఎంత భయంకరమైన వాళ్ళూ, సాహసులూ స్పార్టకస్‌తో చేరారని."

"బానిసలు కల్పించిన ఈ భయభ్రాంతులలో రోమ్ భీతావహ సముద్రంలో మునిగి పోయింది. నాకు యథార్థం కావాలి. నే నే శక్తితో, ఏ సైన్యంతో, ఏ మనిషితో పోరాడుతున్నదీ నా క్కావాలి. జర్మన్లను, స్పానియార్డులను, యూదులను ఒకరేమిటి ఎన్నెన్నో జాతులను ఓడించి సర్వనాశనం చేసిన రోమన్‌బలాలు అవే జాతులకు చెందిన బానిసలను చూసేసరికి ఈటెలు కిందపారేసి ఎందుకు కాళ్ళకు బుద్ధి చెప్పేవారో కావాలి నాకు. సిస్ ఆల్పైన్ గాల్ అనేచోట మకాం వేసాను. ఒకటికి పదిసార్లు ఆలోచిస్తేనే కాని స్పార్టకస్ ఈ మకాం మీద దాడి చెయ్యలేదు. సరే విషయపరిశీలన కుపక్ర మించా. ఈ స్పార్టకస్ గురించి తెలుసుకునేందుకు ఓ వందమందితో మాట్లాడాను. వెయ్యికి పైగా రికార్డులు తిరగేసాను.

నేను మాట్లాడిన వాళ్ళల్లో మల్లులనమ్మే బేటియాటస్ ఒకడు. స్పార్టకస్‌తో పోరాడిన ఎంతోమంది సైనికులతో, సైనికోద్యోగులతో మాట్లాడాను. అందులో ఎవరో ఈ కథ నాకు చెప్పారు. దాన్ని నేను నమ్మాను."

"కథ కూడా ఈ ఉపోద్ఘాతంలాగానే చాలా పెద్దదైన పక్షంలో మన ఫలహారాలిక్కడికే తెప్పిస్తా" ఆంటోనియస్ కైయస్ అన్నాడు. అప్పటి కప్పుడే బానిసలు ఈజిప్షియన్ కర్బూజా పళ్ళూ, ద్రాక్షగుత్తులూ, చల్లని ద్రాక్షరసమూ, ఏవేవో తెస్తున్నారు.

"కథ పెద్దదే. ఇది రెండవసారి రోమను సైన్యాన్ని స్పార్టకస్ నాశనం చేసిన సందర్భం. పట్టణంలోని పటాలాల పని పూర్తి అయ్యాక సెనేటు పూబ్లియస్‌ను స్పార్టకస్ మీదకు పంపింది. పూర్తిగా ఒక అక్షోహిణి సైన్యం అనుకుంటా. గ్రాఛూస్ అది మన మూడవ అక్షోహిణి కదూ? ఏడువేల మంది అశ్వికులున్న ఒక అశ్వికదళం కూడా పట్టణం నుండి వెళ్ళిందని నాకు జ్ఞాపకం. డబ్బు గడించాలన్నా, ఒక గజం గుడ్డ నెయ్యాలన్నా సేనానాయకుడి కుండవలసిన తెలివికన్న హెచ్చు తెలివితేటలే కావాలి. యుద్ధమే పనిగా పెట్టుకున్న సేనాను లనేకమంది ఉన్నారు. వాళ్ళేమంత పెద్ద తెలివైనవాళ్లుకారు. కాని స్పార్టకస్ మాత్రం చాలా తెలివైనవాడు. అతను యుద్ధశాస్త్ర సూత్రాలను జీర్ణించుకున్నాడు. మనకు అనేక మంది శత్రువులున్నారు. ఉండేవారు. కాని చాలా తక్కువ మంది ఈ విషయాలను తెలుసుకోగలిగేవారు. హానిబాల్‌కు కూడా తెలుసు ననుకోండి."

"ఆ సూత్రాలేమిటో" సిసిరో అడిగాడు.

"మొదటి సూత్రం : దెబ్బ తప్పించుకొనేటప్పుడు తప్ప మరెప్పుడూ సైన్యాలను చీల్చకపోవడం. రెండవది : పోరాడాలనుకున్నప్పుడు ఎదుటివాడికన్న ముందుగానే దెబ్బ తీయాలన్నది, పోరాడాలని లేనప్పుడు ఎప్పుడూ స్వీయరక్షణలో పడకూడదు. పోరాటాన్ని తప్పించుకోవాలి. మూడోది : మనకు నచ్చిన సమయం, అనువైన స్థలం చూసుకొని హఠాత్తుగా దాడి ప్రారంభించడం. శత్రువుకి ఈ అవకాశం కల్పించి అతనే దాడిచేసే పరిస్థితి రాకుండా చూసుకోవాలి. నాలుగోది : చక్రబంధవ్యూహంలో పడిపోకుండా చూసుకోడం. ఆఖరుది : శత్రువు బలహీనతను గుర్తించి ఆ బలహీనమైన స్థానంమీదనే దెబ్బదీసి శత్రువును నాశనం చేయడం."

"ఒకరకంగా ఇదొక పెద్దబాలశిక్ష" సిసిరో వ్యాఖ్యానించాడు. "ఏ సైనిక పుస్తకంలో చూసినా ఉంటాయివి."

"క్రాసస్, రోమనుసైన్యాల బలమూ, బలహీనతా అన్నావే, ఏమిటవి?" గ్రాఛూస్ అన్నాడు.

"మన సైన్యాల బలమూ, బలహీనతా కూడాఒక్క దానిలో ఇమిడి ఉన్నాయని చెప్పొచ్చు. అది వాటి క్రమశిక్షణ, ప్రపంచంలోకల్లా గొప్పగా క్రమశిక్షణ పొందిన సైన్యం మనకుంది. రోజూ ఐదు గంటలు చొప్పున కవాతు చేయిస్తాం. ఆ కవాతులో ఎన్నో రకాల పోరాట పద్ధతులు నేర్పుతాం. కాని అందరికీ అన్నీ నేర్పరుకద. ఆ క్రమశిక్షణ అన్నది

చాలామటుకు యంత్రతుల్యంగా ఉంటుంది. వీళ్ళు నేర్చుకోని ఏదయినా కొత్తపద్ధతిలో శత్రువు దాడిచేస్తే వీళ్ళ క్రమశిక్షణ గట్టిచిక్కులో పడిపోతుంది. మెరుపుదాడులు జరపగల సైన్యాలు కూడా మనకున్నాయి. ఆ దాడులకు వీలుగా ఉపయోగపడే ఆయుధాలూ ఉన్నాయి. అందుకే రాత్రిపూట ఎప్పుడు మకాంచేసినా దళాలు రక్షణశ్రేణి నిర్మిస్తాయి. అవతల వాడు దాడిచేయకుండా ముందుగా మనమే దాడిచేయగలగడమన్న దొక్కటే మన సైన్యాలకు వెన్నెముకవంటిది. రోమను వ్యూహంలో మొదటి ఎత్తుగడ నేలమీదనే యుద్ధంచెయ్యడం. నేలమీద యుద్ధం జరక్కుండా చూసేవాడు స్పార్టకస్. పైన చెప్పినవాటి నన్నిటినీ పూబ్లియస్ ఉల్లంఘించాడు. అవన్నీ సర్వసామాన్యమైన సాధారణ విషయాలే కావచ్చు. కాని వాటి నతిక్రమించడమే కొంపముంచింది. పైగా అతనికి స్పార్టకస్ అంటే వట్టి ద్వేషమే తప్ప అతని గురించి జాగ్రత్తగా ఆలోచిద్దామనే జ్ఞానమే లేకపోయింది."

దీర్ఘాలోచనలో నున్నవాడిలా కూచుని ఆపిల్‌తొక్క చెక్కుతున్నాడు గ్రాఛూస్. కళ్ళు చిన్నవిచేసి క్రాసస్‌ను పరిశీలనగా చూస్తున్నాడు. జూలియా అంది : "వరీనియా కథ ఏమైంది క్రాసస్?"

"ఇదిగో దానికే వస్తున్నా. ఆ రోజుల్లో స్పార్టకస్ ఇంకా వెసూవియస్ అగ్నిపర్వతాల దగ్గర ఉండేవాడు. స్పార్టకస్‌ను పట్టుకుంటానని బయలుదేరిన పూబ్లియస్ ఆ పర్వతం యావత్తు చుట్టు ముట్టడానికని తన సైన్యాన్ని మూడు భాగాలుగా చీల్చాడు. ఒక్కొక్క భాగంలో రెండు వేలమంది ఉంటారు. ఈ మూడు భాగాలనూ మూడుచోట్ల తారసిల్లి చావగొట్టి వదిలాడు స్పార్టకస్. ఎలాగో ఒకలాగా ఒక అశ్విక పటాలం తప్పించుకుని బైటపడింది. కొందరు సిపాయిలు దౌడు తీస్తున్న గుర్రాలను పట్టుకు వేలాడారు. నురుగులు కక్కుకుంటూ వాయువేగంతో దౌడుతీసాయి అవి. బానిసలు యుద్ధంచేసిన పద్ధతులను బాగా పరీక్షగా చూస్తే మనకో విషయం బోధ పడుతుంది. యుద్ధంలో వాళ్ళు దృష్టిని అనవసరంగా ఒకదాని మీద నుంచి మరో దానిమీదకు మరల్చరు. వాళ్ళ కెదురుగా ఉన్న దానినే పట్టుకుంటారు. ఈ లోపులో పక్కనేదో జరుగుతున్నదని దానిమీదకు పోయి, మళ్ళీ మరొకటి జరుగుతోందని దానివైపు వాళ్ళు గాభరాపడిపోరు. తప్పించుకున్న ఏ డెనిమిది వందలమంది అశ్వికులు, సిపాయిలు దారి తప్పి అరణ్యాలలో చిక్కుపడి అనుకోకుండానే బానిసలు మకాంవైపు పోయారు. అక్కడ బానిస స్త్రీలూ, పిల్లలూ ఉన్నారు. మకాం అన్నానే కాని అదొక చిన్న పల్లెకన్న పెద్దదిగానే వుంది. చుట్టూ కందకం, మట్టిగోడ, తీర్చిదిద్దిన రోడ్లూ, వాటి పక్కన గుడిసెలూ. ఇదంతా చూస్తే మన దళాలను వదలి పారిపోయిన సైనికులెవరో బానిసలతో చేరినట్లు తెలిసిపోతోంది. లేకపోతే రోమన్ సైన్యాలు మకాం చేసినట్లు బానిసలెలా చెయ్య గులుగుతారు? సింహద్వారం తెరిచి ఉంది. అక్కడ చిన్నపిల్ల లాడుకుంటున్నారు. కొందరు స్త్రీలు కూచుని ఉన్నారు. దెబ్బతిని యుద్ధరంగం నుండిపారిపోయిన సైనికులకు మతి ఉండదు. ఆ సైనికులు ద్వేషంతో నిండి ఉన్నారేమో, ఆ స్త్రీల మీదా, పిల్లలమీదా పడ్డారు. మంచి దూకుడుగా పడ్డారు. అశ్వికులు ఈటెలతోకుందేలు

పిల్లల్ని పొడిచినట్లు పొడిచి పైకెత్తారు. మొదట్లో స్త్రీలను కూడా పొడిచి చంపారు. కాని ఇంతలో అక్కడి స్త్రీలంతా కత్తులూ, కఠారులూ, ఈటెలూ పుచ్చుకొని సింహద్వారం ఈనుతోందా అన్నట్లు బైటికొచ్చారు. ఆ సైనికులలో కసి, ద్వేషం తప్ప మరింకేం లేదనుకుంటా. ఆ బానిస స్త్రీలను కొందరిని చెరిచి, చంపి ఉండొచ్చుకూడా. ఆ రోజుల్లో బానిసలంటే ప్రజలెల్లా మండిపడేవారో మీకు జ్ఞాపకం లేదూ? స్పార్టకస్‌కి ముందు బానిస స్త్రీని చంపినవా డెవడైనా నలుగురి ముందు బజారులో తలెత్తుకు తిరగలేకపోయేవాడు. అదొక నీచమైన పనికింద జమకట్టే వారం. అనవసరంగా, అకారణంగా చంపినట్లు రుజువైతే జుల్మానా కూడా విధించేవారం. ఆ శాసనం మూడేళ్ల క్రితమే మారింది కదూ గ్రాఛూస్?"

"అవును" అయిష్టంగా జవాబిచ్చాడు గ్రాఛూస్. "ఐనా ఇదంతా ఎందుకు? నీ కథ చెప్పుకుపోదూ. వరీనియా గురించికాదూ?"

"అయితే ఆ స్త్రీలు సైనికులతో పోరాడారంటారా?" అడిగింది క్లాడియా.

"అంతే. అదీ విషయం" క్రాసస్ తలూపిఅంగీకారం తెలిపాడు. "సింహద్వారం ముందు మహాయుద్ధం జరిగింది. ఆ సిపాయిలకు మతి పోయింది. ఆడాళ్ళతో దెబ్బలాడుతున్నామన్న సంగతి కూడా మర్చిపోయారు వాళ్ళు. ఇలా ఒక గంటసేపు అయిందనుకుంటా. మరి వాళ్ళు చెప్పినదాని ప్రకారం ఆ స్త్రీలకు ఒకర్తె నాయకత్వం వహించిందంట. ఆమె పొడుగ్గా దృఢంగా ఉందట. ఆమె వరీనియాయే అంటారు. ఎక్కడబడితే అక్కడే ఆమె కనబడేదట. ఆమె బట్టలు పూర్తిగా చిరిగిపోయినా ఈటె పుచ్చుకుని భయంకరంగా యుద్ధం చేసిందట. ఆమె మహోగ్ర స్వరూపిణియై...."

"దీన్లో ఏదీ నే నమ్మను" గ్రాఛూస్ అడ్డుతగిలాడు.

"మీకు నమ్మాలని లేకపోతే నమ్మకపోవడమే మంచిది" తన కథ వాళ్ళ మీద ప్రభావం కలిగించలేదని గుర్తించిన క్రాసస్ "అది జూలియా కోసమే చెప్పా" అని ఊరుకొన్నాడు.

"నా కోసం ఎందుకు?" ఆమె తెలుసుకోగోరింది.

"కథ ముగిద్దూ" హెలీనా అడిగింది.

"అన్నింటిలాగే ఇదీ ముగిసింది. అన్ని యుద్ధాలూ ఒకలాగే ముగుస్తాయి. గెలవన్నైనా గెలుస్తాం; లేకపోతే ఓడిపోతాం. దీన్లో మాత్రం ఓడిపోయాం. కొందరు బానిసలు రావడంతో ఆ ఆడాళ్ళమధ్య, ఈ బానిసల మధ్య పడి మనవాళ్ళు హతమారి పోయారు. కొద్ది మంది అశ్వికులు మాత్రం చావుతప్పి కన్నులొట్టపోయి తిరిగి వచ్చారు. వాళ్లే ఇదంతా చెప్పారు".

"అయితే వరీనియా చావలేదన్న మాటేనా?"

"ఆమె వరీనియా గనక అయితే చావలేదనే చెప్పాలి."

"అదింకా బతికేవుందా?" అడిగింది క్లాడియా.

"ఆమె బతికే ఉందా?" క్రాసస్ అదే మాటన్నాడు. "అది కాదు కావలసింది."

గ్రాఛూస్ లేచాడు. అలవాటు ప్రకారం ఒక్క ఊపున టోగా భుజమ్మీద వల్లెవాటుగా వేసుకుని ఎత్తెత్తి, అడుగులు వేస్తూ నడిపించాడు శరీరాన్ని. ఇతడు వెళ్ళడంతో అక్కడకు నిశ్శబ్దం వచ్చింది.

# ఆరవ భాగం

సిసిరో, గ్రాఛూస్ లిద్దరూ సెలవుతీసుకుని రోమ్‌కి బయలుదేరారు. తెల్లవారే బయల్దేరి వెళ్ళడంవల్ల ప్రయాణం తేలిక అవుతుంది కాబట్టి, ఆ మర్నాడు ఉదయమే తమను వెళ్ళనిచ్చే ఒప్పందం మీద కైయస్, ఆ స్త్రీ లిర్ద్వురూ, సేనాని క్రాసస్ ఆ రోజు అక్కడే ఉండిపోయారు. మనమంతా, కలిపి వెళ్దాం అని కైయస్‌తో ఇదివరకే క్రాసస్ చెప్పాడు. గొప్ప రోమన్ సైన్యాధిపతితో కలిసి ప్రయాణంచేసే భాగ్యం తమకు లభించింది కదా అని క్లాడియా, హెలీనా లిర్ద్వురూ సంతోషించారు.

సూర్యోదయం అయేసరికి వాళ్ళు బయల్దేరారు. నాలుగు పల్లకీలు, నౌకర్లూ చాకర్లూ, సామాన్లుమోసే బానిసలతో ప్రయాణీకుల బృందం ఒక పెద్ద ఊరేగింపులా సాగిపోతోంది. సైనికవందనంకోసమని ఓ పది పటాలాల సైనికుల్ని రప్పించాడు క్రాసస్. బానిసలపై సాధించిన విజయం సందర్భంగా జరిపిస్తున్న ఉత్సవాలను దర్శించవలసిందిగా విప్లవం ప్రారంభయిన కేపువాకు క్రాసస్‌ని ఆహ్వానించారు. స్పార్టకస్ ఓడించబడి, చంపబడిన పిమ్మట తమకు పట్టుబడ్డ బానిసఖైదీలనుండి నూరుగురు మల్లుల్ని ఏరి, వాళ్ళచేత వారాలతరబడి మల్లయుద్ధ ప్రదర్శనలు చేయించారు. ఇరువురు మల్లులు పోరాడితే అందులో ఒకడు చావాల్సిందే. అలా రెండు జంటలు పోరాడితే ఇద్దరు చచ్చిపోతారు. ఆ మిగిలిన ఇద్దర్నీ మళ్ళీ పోట్లాడిస్తారు. అందులో మిగిలినవాణ్ణి మరో బతికినవాడితో ఉజ్జీకట్టి ఈ విధంగా వందమంది పోరాడితే చివరకు ఒక్కడు మాత్రమే మిగులుతాడు. దీన్ని 'ఏరివేత' పద్ధతి అంటారు. మృత్యునృత్యానికి అంతముందా అనిపిస్తుంది!

"ఎలాగైనా మల్లయుద్ధాల్లో చివర కొకడు మిగులుతాడుగా" అంది క్లాడియా.

"మిగలాలని ఎక్కడుంది? ఆఖరికి మిగిలిన ఇద్దరూ బాగా దెబ్బలు తిని చస్తే? కాని ఒకడు మిగిలితే మాత్రం వాణ్ణి ఏదో ద్వారంముందు శిలువెయ్యడం తప్పదనుకుంటా. అదో చిహ్నం. ఈ నగరానికి ఏడు ద్వారాలున్నాయి. ఈ శిక్షా చిహ్నాలు ప్రారంభమయినపుడు ఏడు సంఖ్యతోనే ప్రారంభించాం. అంటే ఒక్కొక్క ద్వారంముందు ఒక్కొక్క శిలువన్న మాట. ఎవడు మిగిలితే వాడు ఏపియన్ ద్వారం ముందున్న శవం స్థానాన్ని ఆక్రమిస్తాడన్న మాట. నువ్వెప్పుడైనా కేపువా వెళ్ళావా?" క్లాడియా నడిగాడు.

"లేదు. వెళ్ళలేదు."

"అయితే నీ కళ్ళకొకవిందే. అంత అందమయిన పట్టణం అది. ప్రపంచ నగరాలన్నిటిలోకి అందమయినదని నా నమ్మకం. నాకక్కడ ఓ చిన్న ఇల్లు కూడా ఉంది లెండి. మీరు నా అతిథులుగా ఉంటే నాకెంతో ఆనందం."

మా తాత చూస్తుంటాడని, అక్కడకు వెళ్ళడం తప్పదని కై యస్ చెప్పాడు.

క్రాసస్ చెప్పుకుంటూ పోయాడు. "ఈ కేపువా అంటే చెడ్డ సరదా. దాన్ని ప్రేమిస్తా అటువంటి నగరం మనకుంది గదా అని గర్విస్తా. ఓ ఇతిహాసముంది మీకు తెలుసా? వెయ్యేళ్ళ క్రితం ఇటలీలో ఈ ప్రాంతంలో ఎట్రూస్ ఖనులు పన్నెండు మహానగరాలు నిర్మించారట. వాటినే హేమమయ కంఠహారంలోని ద్వాదశ రత్నాలు అని పిలిచేవారట. వాటిలో ఒక నగరం పేరు వోల్టర్నం - అదే నేటి కేపువా అంటారు. అది వఠి ఇతిహాసమే గావచ్చు. 350 సంవత్సరాల క్రితం ఎట్రూస్‌ఖన్‌ల నుండి సామ్నయిట్‌లు ఆ నగరాన్ని స్వాధీనపర్చుకుని పునర్నిర్మాణం చేశారు. నూట ఏభై సంవత్సరాల క్రితం సామ్నయిట్‌ల చేతినుండి మనం లాక్కుని ఈ ప్రహరీలు, విశాలమైన రోడ్లు నిర్మించాం. నిజానికి రోమ్‌కన్నా ఇదే బావుటుంది."

ఆ విధంగా వాళ్ళు ఏపియన్ మార్గంలో ప్రయాణం చేశారు. ఆ శిక్షా చిహ్నాలను వాళ్ళు చూశారా లేదా అంటే చెప్పడం కష్టమే. అవి అక్కడ లేనట్లే పోతున్నారు వాళ్ళు. గాలి వీచి కుళ్ళినమాంసం కంపుకొడితే తక్షణం గాలిలో అత్తరువులు చిమ్మేవారు. చెప్పుకోదగ్గ సంఘటన లేవీ ప్రయాణకాలంలో జరగలేదు. మజిలీలమీద ప్రయాణం చేసి హాయిగా సునాయాసంగా కేపువా చేరుకున్నారు.

## 2

మంచి వైభవమూ, గొప్ప ప్రాభవమూ గల కేపువానగరం సంబరాలు చేసుకుంటోంది. బానిస విప్లవంవల్ల వచ్చిన మచ్చను తుడిచి పారేసుకుని ఉల్లాసంగా ఉత్సవాల్లో ఉంది. ఆ నగరపు తెల్లని గోడలపై ఒకటికాదు, రెండుకాదు, పన్నెండువందల జెండాలు రెపరెపలాడుతున్నాయి. కల్లోలం కనబడకుండాపోయి శాంతి భద్రతలు నెలకొల్పబడ్డాయి. వినుతికెక్కిన ఆ నగర సప్తద్వారాలూ తిరిగి తెరువబడ్డాయి. సేనాని రాక ముందుగానే తెలిసి ఎంతోమంది అధికారులు పెద్ద పెద్దవాళ్ళు ఎదురేగి ఆహ్వానించేందుకై వచ్చారు. బాజాలు, భజంత్రీలు, ఒకటేమిటి నూరురకాల వాద్యవిశేషాలు ధ్వనిస్తున్నాయి. కవచాలు ధరించి పట్టణ పటాలం ఒకటి అధికారులతో సహా ఏపియన్ ద్వారంగుండా బయటకొచ్చింది. ఇది అంతాచూసి హెలీనా, క్లాడియాలు సంతోష పారవశ్యత్వంలో మునిగిపోయారు. ఇదోలెఖ్ఖా అన్నట్లు నిర్లక్ష్యం నటించదలిచాడు కైయస్. కాని ప్రఖ్యాతిచెందిన సేనానితోపాటు తనక్కూడా బ్రహ్మాండమైన ఆహ్వానమీయబడింది. పట్నం లోపలికి వాళ్ళు వెళ్ళగానే సెలవుతీసుకుని కైయస్, ఆ ఇద్దరు వనితలూ తమ బంధువుల ఇంటికి వెళ్ళిపోయారు.

వీళ్ళు ఇంటికి వెళ్ళిన కొద్దిసేపటిలోనే క్రాసస్‌వచ్చి తన గౌరవార్థం ఆ సాయంత్రం ఇవ్వబడుతున్న విందుకు రావలసిందిగా ఆహ్వానించాడు. వీళ్ళ బంధువులను పిలవడంలో కూడ లోటు చేయలేదు. క్రాసస్‌వంటి గొప్ప సేనాని తనని అంతగా ఆదరించినందుకు

కైయస్‌లో స్వాతిశయం పొడచూపింది. విందు పూర్తయ్యే పర్యంతం ఏదో అవకాశం కల్పించుకుని వాళ్ళయందు ఆర్ద్రభావాన్ని వ్యక్తం చేస్తూనే వచ్చాడు క్రాసస్.

సేనానికి గౌరవ సూచకంగా ఏభైఐదు రకాల వంటలను వడ్డించారు. క్లాడియా, హెలీనా అందులో ఏ కొద్దింటినో రుచి చూసారు. ఎంతబాగా వండిన వాటినైనా సరే కైయస్ తినలేక పోయాడు. ఆనాటి సాయంత్రం క్రాసస్ గౌరవార్థం ప్రత్యేకంగా నాట్య ప్రదర్శన ఏర్పాటు చేశారు. పవిత్రమైన రోమన్ కన్యల్ని రక్త పిపాస గల నరరూప రాక్షసులయిన బానిసలు బలవంతంగా చెరచడానికి ప్రయత్న ఘట్టం ప్రదర్శింపబడింది. బానిసలు నీచాత్ములన్న విధంగా ఒక అరగంటసేపు ప్రదర్శించారు. దీనిలో యథావిధిగా చివరకు బానిసలు సంహరింపబడ్డారు. పూలు అప్పుడు ఆ భవనపు కప్పు నుండి వర్షిస్తాయి.

చీకటి పడుతోంది. మరింతరాత్రి కావస్తున్నది. అతిథులంతా మరింతగా తాగుతున్నారు. క్రాసస్ మాత్రం చాలా తక్కువగా తాగుతున్నాడు. ఈ సంగతి హెలీనా కనిపెట్టింది. కేపువాలోని బట్టీలలో అత్తరువులు తయారుచేసినట్లే బాగా మత్తెక్కించగల సారాయి కూడా తయారుచేస్తారు. క్రాసస్ అటువంటి మద్యాన్ని సేవించక కొద్దికొద్దిగా ద్రాక్షరసాన్ని మాత్రం చవిసూస్తున్నాడు. అతనిలో నిష్ఠనియమాలూ, ఇంద్రియలోలత్వం రెండూ ఉన్నవి. అతని కళ్ళలో ఈ రెండూ కనిపించాయి. వారిద్దరూ ఒకరి నొకరు చూసుకున్నారు.

విందు ముగిసేసరికి చాలా ఆలస్యమయింది. ఎంత రాత్రయినా సరే హెలీనాకు మాత్రం బానిస విప్లవం ప్రారంభమైన లెంటులుస్ బేటియాటస్ తాలూకు మల్లశిక్షణా కేంద్రాన్ని చూడాలనే కుతూహలం కలిగింది. తమకు దర్శకుడుగా ఉండి స్థలవిశేషాల్ని చెప్పమని క్రాసస్‌ని అర్థించింది. అది మనస్సుకూ, శరీరానికి కూడా ఎంతో చల్లదనమిస్తోన్న రాత్రి.

న్యాయస్థలంవద్ద ఒక విశాలమైన భవనంలో వాళ్ళున్నారు. సేనానిచుట్టూ ఎంతో మంది జనమున్నారు. ఉపాయంగా, నేర్పుగా హెలీనా, క్లాడియాల నిద్దరినీ వాళ్ళ బంధువుల నించి విడదీయాలన్న సమస్య ఒకటుంది. హెలీనామాత్రం కైయస్‌ను తోడు రమ్మని బలవంతం చేసింది. కైయస్ తప్పతాగి ఉన్నాడు. వెంట రమ్మన్న వెంటనే అంగీకరించాడు. వేలాడుతున్న చేతులతో తూలుతూ నిలబడలేక క్రాసస్‌వేపు అదోవిధంగా విపరీతమైన భక్తిప్రపత్తులతో చూశాడు. జరగవలసిన ఏర్పాట్లన్నీ సేనాని చూసుకున్నాడు. కొద్దిసేపటికి పల్లకీలు రానేవచ్చాయి. వీళ్ళనెక్కించుకొని ఏపియన్ ద్వారంవైపు పోతున్నాయి. ద్వారపాలకులు ఈతనికి నమస్కరించారు. వాళ్ళకి కొన్ని వెండినాణేలు ఇచ్చి తోవచెప్పమన్నాడు క్రాసస్.

"ఐతే నువ్వెపుడూ అక్కడికి వెళ్ళలేదన్నమాట!" హెలీనా అంది.

"అబ్బే, ఎప్పుడూ వెళ్ళనూ లేదు; చూడనూలేదు."

"నీ జీవితం, స్పార్టకస్ జీవితం పెనవేసుకపోయిన ప్రదేశం ఇదేగా" అంది హెలీనా.

"నా జీవితం, స్పార్టకస్ చావూ" క్రాసస్ తప్పుదిద్దాడు.

"ఇప్పుడక్కడేంలేదు" ద్వారపాలకుడన్నాడు. "బేటియాటస్‌కు అదో పెద్ద పెట్టుబడే. నిజంగా అతడెన్నో లక్షలు గడించే పరిస్థితి కూడా ఏర్పడింది. తిరుగుబాటుతోబాటు దురదృష్టం ప్రారంభమయిందతనికి. అతనా గ్రీకు బానిసచేతిలో చచ్చేసరికి ఆ శిక్షణాకేంద్రం కోర్టు గొడవల్లో ఇరుక్కుపోయింది. తక్కిన శిక్షణా కేంద్రాలు ఊరిబయట ఉండక ఊరిలోనికి వచ్చేశాయి. ఇప్పుడు అద్దె కొంపలలో రెండు కేంద్రాలు పెట్టారు."

క్లాడియా ఆవులించింది. పల్లకీలో నిద్రపోయాడు కైయస్.

"ఆ ఏటిపక్కనే ఉన్న కాలిబాట వెంబడే పోతే బేటియాటస్ శిక్షణా కేంద్రానికి పోవడం అతిసులభం. అలాపోతే మీరు తప్పక శిక్షణాకేంద్రానికే వెళతారు. ఎంతో ఎత్తున క్రమంటపం ఉంటుంది."

వాళ్ళు మాట్లాడుతుండగా కొందరు బానిసలు పారలూ, గునపాలూ పట్టుకుని ద్వారంలోంచి వచ్చారు. వాళ్ళదగ్గర ఒక నిచ్చెనా, మేదరితట్టలూ ఉన్నాయి. ద్వారానికెదురుగా ఉన్న పెద్ద శిలువ దగ్గరకు వెళ్ళారు. శిక్షచిహ్నాలన్నిటిలోకి మొదటది అది.

"వాళ్ళేం చేస్తున్నారు?" క్లాడియా అడిగింది.

"ఒక కుక్క నీడ్చేసి మరోకుక్క నా స్థానంలో వేలాడతీస్తారు" ద్వారపాలకుడు చెప్పాడు. "ఏరివేత పద్ధతి నేర్పాటు చేసిన మల్లయుద్ధాలలో ఆఖరుకు మిగిలిన మల్లునకు ఇక్కడ జరగాల్సిన లాంఛనాలన్నీ జరుగుతాయి. స్పార్టకస్‌తో పాటు ఉన్న బానిసల్లో ఆఖరివాడు ఇక్కడే చస్తాడు."

క్లాడియా వణికింది. "నాకు మీతో రావాలని లేదు" అని క్రాసస్‌తో చెప్పింది.

"నీ కింటికి పోవాలనుంటే పోవచ్చు. ఇద్దరు మనుషుల్ని పంపుతావూ? వీళ్ళని దిగబెడతారు" అని కెప్టెన్‌ని అడిగాడు క్రాసస్.

హాయిగా గుర్రుపెట్టి నిద్రపోతున్న కైయస్ క్లాడియాతోపాటు వెళ్ళిపోయాడు. హెలీనాకు నడవాలనే ఉంది. వాళ్ళు శిలువ దగ్గరగా వెళ్ళారు. ఎండకు ఎండి నల్లబడి, పక్షులు పీక్కుతినగా మిగిలిన కళేబర అవశేషాన్ని బానిసలు కిందికి దింపారు. అది దుర్గంధం వెదజల్లుతోంది. శిలువ ఇటూ అటూ కదలకుండా నిటారుగా నిలబడడంకోసం శిలువ మొదట్లో గునపాలతో తవ్వి రాళ్ళు దిగగొడుతున్నారు బానిసలు.

"నీ కలాటి వేమీ గాభరా కలిగించవుకదూ?" క్రాసస్ హెలీనాని అడిగాడు.

"ఇలాటి వెందుకు గాభరాకలిగించాలి నాకు!"

వాళ్ళు నడుస్తూనే ఉన్నారు. అక్కడికి శిక్షణాకేంద్రం ఎంతో దూరంలో లేదు. రమణీయమైన ఆ ప్రదేశం నిజంగా దేవలోకంలా కనిపించింది. దగ్గరగా గోదా గోడ కనపడింది. ఆ ప్రదేశం చిన్నదికాదు. ఆడంబరంగా కూడా ఉంది. తాలింఖానాచుట్టూ ఉన్న ఇనుపకంచెలో చాలా భాగం దొంగల వశమైంది.

గోదా చుట్టూరాఉన్న గోడ సగంమట్టుకు కూలిపోయింది. ఇసుకలో వారిద్దరూ

ఎత్తుగాఉన్న కర్రమంటపంవేపు చూస్తూ నిలబడ్డారు. గోదా చిన్నదిగా, అసహ్యంగా కనబడింది. కాని అక్కడ ఇసుకమాత్రం వెన్నెలలో వెండిపూత పూయబడినట్లు మెరిసిపోయింది.

"దీన్నిగురించి మా అన్న ఎంతో గొప్పగా చెప్పేవాడు. తీరా చూస్తే ఇంత చిన్నదిగా ఉందేమిటి చెప్మా?" హెలీనా అంది.

ఈ చంపుకునే ప్రదేశాల గురించి, ఈ శిక్షణాకేంద్రంలో జరిగే ఘోరమైన ద్వంద్వయుద్ధాల గురించి ఏదో ఒకటి చెపుదామని క్రాసస్ అనుకున్నాడుగాని అతనేమీ సరిగా చెప్పలేకపోయాడు.

"మంటపంమీదికి వెళ్ళాలని ఉంది" హెలీనా చెప్పింది.

"చాలా జాగ్రత్తగా వెళ్ళాలి. ఆ కర్ర చివికిపోతోంది."

ఈ ప్రేక్షకుల మంటపాన్ని బేటియాటస్ చాలా గర్వంగా చూసుకుని సంతోషించేవాడు. దానిమీదకు వాళ్ళు వెళ్ళారు. చారల వితానం పేలికలు పేలికలుగా చిరిగి వేలాడుతోంది. మిగిలిన తలగడాలనించి చిట్టెలుకలు పారిపోయాయి. ఓ సోఫాలో హెలీనా కూచుంది. పక్కనే క్రాసస్ ఉపవిష్టుడయాడు. అప్పుడు హెలీనా అడిగింది.

"నువ్వు నా గురించి ఏమీ అనుకోవా?"

"అనుకోకేం! నువ్వు అందమైన దానివనీ, తెలివైనదానివనీ తలపోస్తూనే ఉన్నాను."

నెమ్మదిగా హెలీనా అంది; "సేనానీ, మరి నేను నువ్వొక పందివనుకుంటున్నాను." ఆమె ఖాండ్రించి అతని ముఖంమీద ఉమ్మింది. పాలిపోయిన వెన్నెలకాంతిలోగూడ అతని కళ్ళల్లో తొణికిసలాడే క్రోధాన్ని ఆమె చూడగలిగింది. ఇతనూ సేనాని అంటే! మాట్లాడేటపుడు ఆవేశం కనపరచడు. కాని ఇప్పుడతడు పూర్తిగా ఆవేశపూరితుడయాడు. అతడామెను ఒక్క దెబ్బకొట్టాడు. ఆ దెబ్బతో ఆమె సోఫానించి పడి, మంటపం చుట్టూఉన్న కర్రలమీద పడింది. సగం శరీరం అవతలకీ మిగిలిన సగం ఇవతలా ఉండి అటో ఇటో పడేటట్లుంది. అటైతే ఇరవై అడుగులు కింద పడాల్సిందే. కాని ఇంతలో తేరుకుని ముందుకొచ్చి క్రాసస్ మీదపడి పీకుతూ, గిచ్చుతూ రక్కుతోంది. సేనాని కదలకుండానే ఆమె రెండు చేతులూ పట్టుకుని తనక్కొంత దూరంలో నిలబెట్టి కరకుగా ఏమీ కానట్టు నవ్వాడు. ఇలా అన్నాడు:

"అసలు విషయం వేరు. హెలీనా నాకు తెలుసు."

ఆమెలో పొంగులువారిన కోపమూ, శక్తీ అణగిపోయాయి. ఏడ్వడం మొదలెట్టింది. అల్లరిచేసిన పెంకెపిల్లలా ఏడ్వసాగింది. అలా ఏడుస్తుండగానే అతని పనేదో అతను కానిచ్చాడు. అతని పనిని ఆమె వ్యతిరేకించనూ లేదు, ఆహ్వానించనూలేదు.

ఆమె బట్టలు సరిచేసుకుంది. జుట్టు సరిచూసుకుంది. కంట్లో మెదలిన కన్నీటి చుక్కలను తుడిచేసుకుంది. బుగ్గలమీదకు కారిన కన్నీటిని తుడిచేసింది. మాట్లాడకుండా వెళ్ళి పల్లకీలో కూచుంది. క్రాసస్ నడుస్తున్నాడు. కాలిబాటలో బోయీలు కేపువావైపు పోతున్నారు. రాత్రి గడచింది. చంద్రకాంతిలోని తెల్లదనం పోతోంది. "ఈమెను ఇంటిదాకా

సురక్షితంగా దిగబెట్టడానికి ఒకణ్ణి పంపించు" అన్నాడు.

తిరిగి హెలీనా ముఖంకేసి చూడలేదతను. ద్వారం నీడలో నిలబడి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు క్రాసస్. కాపలా కాస్తున్న సైనికులూ, వారి నాయకుడూ అతనివంక వింతగా చూస్తున్నారు. అప్పుడు క్రాసస్ అడిగాడు.

"ఇప్పుడెంతైంది?"

"ఆఖరుఝాము కావస్తోంది. ఇంకో గంటలో పొద్దుపొడుస్తుంది. అయ్యా! తమకి బడలికగా లేదండీ?"

"లేదులే" అతని కంఠస్వరం మెత్తబడింది. "ఇలా కాపలాకాయడం చూసి నాకెంతో కాలమయింది."

"ఈ రాత్రిళ్ళు ఎంతకీ గడవ్వంటే నమ్మండి" కాపలా కాస్తూ రాత్రిళ్ళు గడపటం ఎంత విసుగైనపనో కెప్టెన్ వివరించాడు. "ఇంకో అరగంటలో ఇదంతా మారిపోతుంది. రాత్రంతా కాపలాకాసినచోటు ఇదేనా అనిపిస్తుంది. కావిళ్ళతో, గంపలతో కూరలవాళ్ళు, ఆవుల్ని తోలుకుంటూ కాపరులూ, ఏవేవో బరువులు మోసుకొచ్చేవాళ్ళు, చేపలవాళ్ళు, ఒకళ్ళేమిటి, ఈ దోవన ఎంతో మందివస్తారు. ఇక్కడ రద్దీ మహా ఎక్కువ. దేవుడు మేలుచేస్తే ఇవాళ పొద్దున్నే ఆఖరి మల్లుణ్ణి శిలువ నెక్కిస్తార్లెండి!" పూర్తిగా తెల్లారలేదు. ఉదయపు మసకవెలుతురులో అతడు చూసిన శిలువ స్పష్టంగా కనబడలేదు.

"చూట్టానికి చాలామందొస్తారా?" క్రాసస్ అడిగాడు.

"అయ్యా, రాకేమండి. ఇప్పుడప్పుడే ఇంతమంది రారనుకోండి. కాని పొద్దెక్కినకొద్దీ వచ్చి పడతారు. ఇంత మందెక్కడున్నారా అనిపిస్తుంది. మనిషిని శిలువెయ్యడంలో కూడ ఒక గమ్మత్తు ఉందని వప్పుకోవాలి బాబయ్యా. సూర్యుడు నడినెత్తికొచ్చేసరికి ఈ గుమ్మందగ్గరా, గోడలమీదా, రోడ్లమీదా ఇసుకేస్తే రాలనంతమంది తయారవుతారు. ఒకమాటు చూస్తే చాలదా అనుకుంటారేమో తమరు, అబ్బే! చాలదండి!"

ఆ ఆఖరిగంటకూడా గడచింది. పొద్దుపొడవటంతోబాటు మర్నాటి మొదటి గంట ప్రారంభమయింది. విరిగిన పాలలాగుంది ఆకాశం. అంతటా మంచు బాగా కురిసింది. ఉత్తరంగా కంటికి కనిపించేవరకు రోడ్డుఅంచులు నల్లని గీతలా కనిపిస్తున్నాయి. సన్నగా, నిటారుగా, గట్టిగాఉన్న ఆ శిలువ తెల్లని ఆకాశంముందు నిలబడి ఉంది. తూర్పున ఉదయభానుని కిరణాలు, లేత వంగపండురంగులో సూర్యోదయానికి అగ్రదూతలై వస్తున్నాయి. మెలకువగా ఉండాలని నిశ్చయించుకున్నాడు క్రాసస్. ఆశ నిరాశల మిశ్రమంలా ఉదయం కనిపిస్తోంది. ఆ ప్రభాతాన్నే అతడు ఆహ్వానించాడు.

దూరంనించి భేరీ శబ్దం వినపడింది. కెప్టెన్ ద్వారపాలకుల నాజ్ఞాపిస్తున్నాడు. గుమ్మానికిరువైపులా రెండు వరుసలుగా నిలబడ్డారు కాపలా సైనికులు. వాళ్ళ డాలులు భూమికి తగులుతున్నాయి. ఈటెలు నిలువునా లేచి నిలబడ్డాయి. వాటినలా పట్టుకుని

కదలకుండా, మెదలకుండా నిలబడటం కష్టమే. చూస్తున్న క్రాసస్‌కే చిరాకేసింది. ఈ ప్రదర్శనమంతా తనగురించే ననుకున్నాడు. బాజాల శబ్దం బిగ్గరగా, దగ్గరగా వినపడుతోంది. బారులు తీరిన చెట్ల మధ్యనున్న ఆ విశాలమైన రోడ్డుమీద బాజాలు వాయించుకుంటూ వచ్చే సైనికులు కనబడ్డారు. సూర్యుడు ఎత్తయిన భవనాలని తాకుతున్నాడు. మానవసంచారం కూడా అప్పుడప్పుడే కనపడుతోంది.

ఆరు భేరీలున్నాయి. నాలుగు బాకాలున్నాయి. ఆరుగురు సైనికులున్నారు. వెనకాల మల్లుడు. ఆ మల్లుని వెనుక దగ్గరగా మరో డజను సైనికులు నడుస్తున్నారు. ఆ మల్లుడు దిగంబరుడై ఉన్నాడు. అతని చేతులు వెనక్కు విరిచి కట్టారు. ఒక్కడి కోసం ఇంతమందా అని చూస్తే, వీళ్ళు చాలామందే ఉన్నట్లు తోచక మానదు. పైగా ఈ మనిషి బలవంతుడుగా కూడా కనబడడు. అపాయకరమైన మనిషిగా కూడా తోచడు. వాళ్ళు దగ్గరకు వచ్చాక, మల్లుని ముఖం స్పష్టంగా కనబడ్డాక క్రాసస్ తన పూర్వపు అభిప్రాయాన్ని మార్చుకున్నాడు. అబ్బో! ఇటువంటివాళ్ళే చాలా అపాయకరమైనవాళ్ళు. గెడ్డముఖం, వంపుతిరిగిన ముక్కు, ఎత్తయిన దవడెముకలు, వాటికి దగ్గరగా, పలుచగా బిగువుగా నున్న చర్మం, సన్నపాటి పెదవులు, పచ్చగా అసహ్యంగాఉన్న కళ్ళు. ఇదీ అతనితీరు. అతనిలో ద్వేషముంది. కాని జంతువులాగానే ఇతడు ద్వేషాన్ని కక్కడు. శరీరం పెద్దదేమీ కాదు. కాని కండలు రాళ్ళలా ఉన్నట్లనిపిస్తాయి. శరీరంమీద గాయాల గుర్తులు రెండవుపిస్తున్నాయి. ఒకటి ఛాతీమీద మరొకటి మెడవేపున, రెండూ పెద్దదెబ్బలేమీ కావు. ఈ మధ్యనే తగిలిన ఆ గాయాల చుట్టూ రక్తం గడ్డకట్టి ఉంది. ఒకచేతికో వేలులేదు. ఒకచెవి తెగిపోయింది.

ఆ దళాన్ని నడిపించుకొస్తున్న ఉద్యోగి, క్రాసస్‌ని చూడగానే తనవెంట వచ్చే సైనికుల్ని ఆగాల్సిందిగా సంజ్ఞచేసి క్రాసస్ దగ్గరకు వెళ్ళాడు. సేనానికి నమస్కరించాడు.

బానిస సైన్యాల్లో ఆఖరువాడైన ఈ మల్లుడు, తనూ అనుకోకుండా ఈ విధంగా తటస్థపడటం అతని కాశ్చర్యం కలిగించకమానలేదు. "అతన్నెప్పుడు శిలువెక్కించ దలుచుకున్నారు?"

"ఇప్పుడే."

"వా డెవడు? ఆ మల్లుడు గోదాకి బాగా అలవాటుపడ్డరకంలా కనిపిస్తున్నాడే. కత్తిగాట్లు శరీరమంతటా ఉన్నాయి. వాడెవడో నీకు తెలుసా?"

"వీడి గురించి మాకు చాలా తక్కువగా తెలుసు. ఆ బానిస సైన్యంలో ఏదో పదవి వెలగబెట్టేవాడట. ఒక పటాలానికో, మరెన్నింటికో నాయకత్వం వహించాడని విన్నాం. యూదుడిలా ఉన్నాడు. థ్రేషియన్లకన్నా బాగా బాకు యుద్ధం చేయగలిగే యూదుణ్ణి బేటియాటస్ కొనేవాడు. స్పార్టకస్‌తో పాటు డేవిడ్ అనే యూదుడుండేవాడని బేటియాటస్ వాఙ్మూలంలో తెలియచేశాడు. ఆ తిరుగుబాటుకు ప్రధానకారకుల్లో ఇతనొకడు. అతనే ఇతనై ఉండవచ్చు; కాకపోనూవచ్చు. బందీగా తీసుకొచ్చాక వాడేమీ ఉలకలేదు; పలకలేదు.

అదేం మంకుతనమోగాని ఒక్క మాటైనా మాటాడలేదు. బాగా పోరాడాడు. వీణ్ణి తగలెయ్యి. కత్తినెంత నేర్పుగా, చాకచక్యంగా, మెలకువతో ఉపయోగించేవాడని! నే నెప్పుడూ అటువంటి బాకు యుద్ధం చూడలేదు. ఐదు ద్వంద్వయుద్ధాల్లో పాల్గొన్నా ఆ రెండు చిన్న దెబ్బలూ తప్ప మరేమీ తగల్లేదు. చివరకు శిలువేస్తారన్న సంగతి తెలిసి కూడా పోరాడి జయిస్తే విజయంతోబాటు స్వాతంత్ర్యం లభిస్తుందని అనుకున్నాడేమో."

"వాడేకనుక డేవిడ్ అయితే" ఆలోచనాపూర్వకంగా అన్నాడు క్రాసస్. "అదో కర్మ పరిహాసమంటాను. వాడితో మాట్లాడొచ్చా?"

"ఓ! మాట్లాడొచ్చు. అభ్యంతరమేమిటి. కాని వాడొక మూర్ఖ జంతువు. నోరు మెదపడు."

వాళ్ళిద్దరూ మల్లుడున్నచోటు కెళ్ళారు. అప్పుడే జనసమూహం అతన్ని చుట్టి వేసింది. సైనికులు ప్రజల్ని దూరంగా తోసేస్తున్నారు. ఆ ఉద్యోగి డాంబికంగా చెప్పాడు:

"మల్లుడా! నీకు ప్రత్యేకమైన గౌరవం లభించింది. సర్వసేనాని మార్కస్ లిసినియస్ క్రాసస్ నీతో మాట్లాడ సంకల్పించారు." ఆ పేరు వినగానే అక్కడి ప్రజలు హర్షధ్వానాలు చేశారు. ఈ బానిసకు చెవుడా ఏమిటి చెప్మా. ఇదంతా విన్నా అతని ముఖంలో మార్పేమీ గోచరించలేదు. చలనంలేకుండానే అలా ఎక్కడికో చూస్తూ నిలబడిపోయాడు. అతనికళ్ళు పచ్చల్లా మెరుస్తున్నాయి. ముఖంలో ఏమీ కనపడలేదు. ఏ కదలికాలేదు.

"నువ్వు నన్నెరుగుదువు. మల్లుడా నావేపు చూడు" అన్నాడు క్రాసస్.

అప్పటికీ మాట్లాడలేదు ఆ దిగంబరుడు.

"అసలు మాటలు రావేమో, తోటి మల్లులతో మాట్లాడ్డం చూడలేదండీ మేము."

"దానికేముందిలే" అనేశాడు క్రాసస్.

క్రాసస్ చూస్తూ నిలబడ్డాడు. ద్వారంనుంచి ఎడతెరిపిలేకుండా జనం వస్తున్నారు. రోడ్డుమీద నిలబడి జరుగుతున్నదంతా చూస్తున్నారు. ఆ జనంలోంచి క్రాసస్ శిలువ దగ్గరగా వెళ్ళాడు. శిలువ వేసేటప్పుడు వాడేంచేస్తాడో చూడాలనిపించిదతనికి. శిలావిగ్రహాన్ని తలదన్నగల, మరిపంచగల ఆ బానిసమౌనం అతనికో సవాలు విసిరినట్లు భావించాడు. శిలువదగ్గంకు అంత మౌనంగా, నిర్లక్ష్యంగా నడిచి వెళ్ళిన మనిషిని జీవితంలో తానెన్నడూ చూడలేదు.

శిలువెయ్యడంలో ఆ సైనికు లారితేరారు. నేర్పుగా వాళ్ళపని వాళ్ళు చేసుకు పోతున్నారు. మల్లుని చంకల కిందినించి తాడొకటి పోనిచ్చి కొసలు రెండూ సమానదూరంలో ఉండేటట్లు చూసారు. గతరాత్రి బానిసలక్కడ వదలివెళ్ళిన నిచ్చెనను శిలువకు చేరవేసారు. అడ్డుబల్లమీద రెండువేపులా తాడుకొనలు రెండూవేసి ఆ కొనలు కిందికి లాగుతున్నారు. ఇద్దరు సైనికులలా చేసే సరికి బానిస శిలువపైకి ఎత్తుగా వెళ్ళాడు. కళ్ళుమూసి తెరిచేంతలో లాఘవంగా అతన్ని లాగేశారు. పైకి లాగుతూఉంటే బానిస అడ్డదిడ్డంగా తిరక్కుండా మరో

సైనికుడు నిచ్చెనపైకెక్కి పట్టుకున్నాడు. నిలువు అడ్డ దూలాలు కలిసేచోటుకు కొద్దిగా కిందగా బానిస వేలాడుతున్నాడు. నిచ్చెనమీదనున్న సైనికుడు అడ్డదూలం ఎక్కాడు. మరో సైనికుడు బలమైన సుత్తీ, పెద్దపెద్ద మేకులూ పట్టుకుని వచ్చి నిచ్చెన ఎక్కి అడ్డదూలం మీద మరోవేపు కూచున్నాడు. దిట్టమైన ఇనుప ఊచలను ఒకవైపు వాడిగాచేసి తయారుచేసిన మేకులవి. అవి పొడుగ్గా, బలంగా ఉన్నాయి.

ఆసక్తితో క్రాసస్ మల్లుణ్ణి పరిశీలిస్తున్నాడు. గరుకుగా ఉన్న దూలంమీద తన శరీరాన్ని తాళ్ళతోకట్టి పైకి లాగుతోన్నప్పుడు కూడా అతని ముఖంలో నిర్లక్ష్యం; తనకేం సంబంధం లేదన్నట్లు కనిపించే నిర్నిమిత్తం, నిర్విచారం గోచరిస్తున్నాయి. సుఖదుఃఖాది ద్వంద్వాతీతుడైన మహావేదాంతి కాదుగదా! అనిపిస్తాడు. మరొకతాడుని చంకలకిందికి పోనిచ్చి ఛాతీచుట్టూ తిప్పి అడ్డ దూలానికి పై ముడివేస్తుండగా కూడా అతనలాగే కొయ్యబొమ్మలా వేలాడుతున్నాడు. పైకి లాగడానికి ఉపయోగించిన తాడునిప్పుడు తొలగించి వెనక్కు విరిచికట్టిన అతని చేతికట్లను తెగ్గోశారు. ఇద్దరు సైనికులూ తలోచేతినీ తలోవైపుకూ లాగారు. అడ్డ దూలానికి ముంజేతులను తాళ్ళతో కట్టారు. అతని గుప్పిటను విప్పి అరచేతిలో ఒక మేకు నిలబెట్టి దూలానికి దిగ్గొట్టారు. అప్పటిదాకా అతడు బాధను తెలియచేయనేలేదు. అప్పుడైనా అతనినోట మాట రానేలేదు. అరవలేదు. భరించలేని బాధవల్ల అతని ముఖం ముడుచుకుపోయి వికృతమైంది. బాధతో శరీరం గిలగిలా కొట్టుకుంది. చేతిపట్టు జారకుండేందుకు మరో నాలుగు దెబ్బలుకొట్టి మేకును దూలంలోకి ఐదంగుళాల వరకు పోనిచ్చారు. రెండో చేతిక్కూడా ఈ పద్ధతినే అమలు జరిపారు. తన చేతిమాంసాన్ని, నరాలను, నాళాలను ఛేదించుకొని ఎముకలను రాపాడి దూలానికి దిగ్గొట్టబడే మేకుపై వేసిన ప్రతిదెబ్బా అతని మెడమీద, హృదయం మీద సమ్మెట పోటుల్లా అనిపించి గిలగిలా తన్నుకునేవాడు. అతని పెదవులు, కళ్ళు, బుగ్గలు అన్నీ ముడుచుకపోయి వక్రమై బాధను వ్యక్తంచేశాయి. అయినప్పటికీ అతను ఏడ్వలేదు. అరవలేదు; కళ్ళవెంబడి జలజలా కన్నీళ్ళు కారుతున్నా, నోటినుండి లాలాజలం నురుగులుకట్టి కారుతున్నా అతనేడ్వలేదు. బాధవల్ల అరవలేదు.

అతన్ని దూలానికి కట్టిన తాటినీ తెగకోసారు. మేకులు దిగకొట్టిన అతని చేతులే ఆధారంగా అతని యావత్తు శరీరభారమూ వేలాడుతోంది. మేకులుమీదనే శరీరం బరువంతా పనిచేస్తే మేకు లూడిపోతాయేమోనని భయపడి అతని చేతులను దూలానికి కట్టిన తాళ్ళనలాగే ఉండనిచ్చారు. నిచ్చెన తీసేసారు. కొద్ది నిముషాలలో శిలువేయడం పూర్తయిపోయింది. అంతత్వరగా పని పూర్తిచేయగల సైనికుల చురుకుదనాన్నీ, పనితనాన్నీ ప్రజలు ప్రశంసించారు.

అప్పుడా మల్లుడు స్పృహ తప్పాడు.

ఉద్యోగి చెపుతున్నాడు క్రాసస్‌తో: "ఆ మేకులే వాళ్ళనలాచేస్తాయి. కాని వాళ్ళకి తిరిగి ఒంటిమీద తెలివివస్తుంది. మళ్ళీ తెలివిలేకుండా పోడానికి రోజు, రోజున్నర పట్టవచ్చు; ఒకనాడో గాల్‌ని శిలువేశాం. వంటిమీద తెలివితో వాడు నాలుగురోజులపాటు అలాగే

వేళ్ళాడాడు. అరిచి అరిచి గొంతు బొంగురై పోయింది. ఇక అరవలేకపోయాడు; కాని స్పృహ మాత్రం ఉంది. అటువంటిది నేనెప్పుడూ చూడలేదు. అసలు మేకులు దిగగొట్టినప్పుడే తెగ అరిచాడు. అన్నాళ్ళు చావకుండా శిలువమీద వేలాడి చెవులు బద్దలయేలా అరిచినవాడిని నే నెపుడూ చూడలేదు."

జనం తండోపతండాలుగా వస్తున్నారు. వాళ్ళను చూపించి క్రాసస్ అడిగాడు: "పొద్దస్తమానూ వాళ్ళంతా అలా చూస్తూ నిలబడిపోతారా ఏం?"

"చాలామంది వాడికి తెలివి వచ్చేదాకా ఉంటారు. ఒంటిమీద తెలివొచ్చాక ఆ బానిస ఏమి చేస్తాడా అని చూస్తారు. ఈ బానిసలు శిలువలమీద ఎన్ని తమాషాలు చేస్తారనీ. చాలామంది వాళ్ళ అమ్మకోసం ఏడుస్తారు. బానిసలు కూడా మనలాగే తల్లిని తలుస్తారని మనం అనుకోం." రోడ్డుమీద జనం ఇంకా ఎక్కువవుతున్నారు. రోడ్డుమీద అడ్డుగా నిలబడ్డ జనాన్ని పక్కకు పంపవలసిందిగా ఇద్దరు సైనికుల్ని నియోగించాడు.

ఈ మారణహోమం ఎప్పుడు ప్రారంభమయింది? అంతు ఎప్పుడు? ఎక్కడ? మానసికంగా, శారీరకంగా చిత్తుగా ఓడిపోయిన రోమన్ సైన్యాలకు తను నాయకత్వం వహించిన తొలి రోజులవి. ఆనాటి ఒక సంఘటన జ్ఞాపకమొచ్చింది. పిలికో మమ్మియస్ తన బాల్యస్నేహితుడు; తన అనుచరుడు. అతనికో మూడు దళాలిచ్చి స్పార్టకస్ సైన్యాలను కల్లోలపరిచి, గాభరాపెట్టి, వీలైతే వాటికి గండికొట్టి రమ్మని పంపించాడు. స్పార్టకస్‌ని గాభరాపెట్టడం సంగతి దేవుడెరుగు. ఇతనే వాళ్ళ వలలో పడ్డాడు. ఎవడిష్టం వచ్చినట్లు వాడు పరిగెత్తే సరికి ఇదే బాగుందనుకొని బానిసలు వీళ్ళని తెగనరికారు. నరికీ, నరికీ చేతులు నొప్పిపుట్టేసరికి పోనీ అని కొద్దిమందిని వదిలేసారు. మమ్మియస్ తన ఎదుటపడేసరికి "పిరికిపందా! వాడిచేతిలోనే చావలేకపోయావా? పీడాపోను. మళ్ళీ ఎందుకు ముఖం చూపించావ్?" అన్నాడు. "నన్ను చంపెయ్యి" అన్నాడు మమ్మియస్.

అదంతా ఇతనికి కళ్ళకు కట్టినట్లు జ్ఞాపకం వచ్చింది. అతనిలో బానిసలంటే విపరీతమైన ద్వేషాగ్నిని రగుల్కొల్పినవారు మమ్మియస్, మాజీ రాజసలహాదారుడు మార్కస్ సెర్వియస్‌లే. ఆ కథ కూడా అతని స్మృతిపథంలో నిలిచింది. బానిసల గురించి ఎన్నో కథలు చెప్పుకుంటారు. వాటిలాగే దీనిలోకూడా నిజాన్నీ, అబద్ధాన్నీ విడదీయలేం. స్పార్టకస్ యొక్క ప్రాణస్నేహితుడు, అనుచరుడు బానిస సైన్యంలో ముఖ్యుడు అయిన క్రిక్సస్ అనే గాల్‌ని చంపడంలో మార్కస్ సెర్వియస్ ప్రధానపాత్ర వహించాడు. క్రిక్సస్ ఒక్కడ్నీ బానిస సైన్యంనుంచి విడదీసి అతన్నీ, అతనితోపాటున్న కొద్దిమంది సైనికుల్నీ హతమార్చడంలో సెర్వియస్‌దే కీలకపాత్ర. అందుకే చాలాకాలం అయాక ఈ మమ్మియస్, సెర్వియస్ లిద్దరూ బానిసలకు పట్టుబడినప్పుడు వాళ్ళ కోర్టులో విచారణ చేయించాడు స్పార్టకస్. ఖైదీలకు మరణశిక్ష ఏ విధంగా విధించాలి అన్న ప్రశ్న వచ్చినప్పుడు డేవిడ్ అనే యూదుడే ఏదో వాదించాడంటారు. మల్లులలాగే ద్వంద్వయుద్ధంచేసి మమ్మియస్ సర్వియస్ లిద్దరూ

చావాల్సొచ్చిందని అంతా అంటారు. వాళ్ళిద్దరికీ బట్టలూడదీసారు. రోమన్ సైనికాధికారుల గతి అలాగయింది. ఇద్దరిచేతిలోనూ కత్తి పెట్టారు. అప్పటికప్పుడే వీళ్ళకోసం ఒక గోదా ఏర్పాటయింది. ఇద్దర్నీ ఒకరినొకరు పొడుచుకు చావాల్సిందిగా ఆజ్ఞాపించారు. ఆ ఒక్క సందర్భంలోనే స్పార్టకస్ క్రూరంగా ప్రవర్తించాడు. క్రాసస్ దాన్ని మరచిపోలేదు, మన్నించనూలేదు.

క్రాసస్ అలసి ఉన్నాడు. అందుకే ఇంటికిపోయి విశ్రాంతి తీసుకుంటానన్నాడు.

## 3

చివరకు మిగిలిన ఈ మల్లుడ్ని శిలువేయడంలో న్యాయం ఏపాలుంది? అన్న విషయం గురించి క్రాసస్ అసలాలోచించలేదు. ఇతను బాల్యంలో యోధుల వీరగాథలు తెగవిన్నాడు. అన్ని జాతులకంటే రోమన్లు ఉత్కృష్టులు, మానవాతీతులు, దైవాంశసంభూతులు అన్న వాదాన్ని పూర్తిగా బలపరిచేవాడు. హృదయపూర్వకంగా నమ్మేవాడు. ప్రభుత్వమూ, రాజ్యాంగమూ, రోమను న్యాయశాస్త్రమూ ప్రజలందరికీ మేలు చేకూర్చుతాయన్నది ఇతని గట్టి నమ్మకం. కాని ఈ నమ్మకం మెల్లిమెల్లిగా జారుకుంటోంది, సడులుతోంది. పదేళ్ళక్రితం తన తండ్రినీ, వృద్ధిలోకి రావాల్సిన తన అన్ననూ, ప్రతిపక్ష నాయకులు నిర్దాక్షిణ్యంగా హత్యచేయించారు. అయినా ఈ రోమన్ న్యాయమన్నది దారుణమైన ఆ రాజకీయహత్యకు ఏమి శిక్ష విధించింది? ఏది న్యాయం? అన్యాయమేది అన్నది అయోమయమైపోయింది. ఆ అయోమయావస్థ నానాటికి హెచ్చుతోందే కాని తగ్గేసూచన లేవీ కనబడవు. ఏ విధంగా, ఏ కోణంనుంచి పరిశీలించినా, ఏ కారణం వెతికినా చివరకు ఒకేఒక్క సత్యం కనిపిస్తోంది. అధికారాన్నీ, ధనాన్నీ ఏవీ, ఎవరూ, ఏమీ చెయ్యలేరన్నదే ఆ సత్యం. ఈ కారణాలన్నిటి వల్లనే కడపటి మల్లుడ్ని శిలువెయ్యడం గురించి అతను ఆలోచించనే లేదు.

ఆ మల్లుడి మనస్సులో కూడా, న్యాయాన్యాయాల గురించిన ప్రశ్నలు బొమ్మజెముడు డొంకలై లేచినై. బాధవల్ల, భయంవల్ల, బడలికవల్ల అతను జాగ్రదావస్థలో లేకుండా పోయాడు. మానసికంగా, శారీరకంగా అతను నిశ్చేష్టుడై ఉన్న పరిస్థితుల్లో ఈ ప్రశ్న లుదయించినై. గజిబిజిగా అల్లుకుపోయిన స్మృతులలో ఈ ప్రశ్న లిరుక్కుపోయాయి. క్రాసస్ ఆలోచించిన సంఘటనే, అతని స్మృతిపథంలో మెరిసింది.

క్రాసస్ కే విధంగా అది న్యాయాన్యాయ నిర్ణయం గురించిన ప్రశ్నగా తోచిందో మల్లులకు కూడా న్యాయమేది; అన్యాయమేది అనేది ప్రశ్నగానే తోచింది. కాలం గడిచింది. బానిసలను అమితంగా అసహ్యించుకొనేవాళ్ళచే, బానిసలు ఏంచేశారో సత్యాసత్యాల నెరుగని వారిచే ఒక చరిత్ర తయారుచేయబడింది. ఆ చరిత్రలో, బానిసలు తమకు పట్టుబడ్డ ఖైదీలను బలప్రయోగంచేసి నగ్నంగా ద్వంద్వయుద్ధం చేయించి ఒకరి నొకరు పొడుచుకచచ్చేలా చేసారని, విచిత్ర చిత్రవధ విధానాలు ప్రవేశపర్చారని, దారుణ మానవ మారణహోమ

మహోత్సవం చేసారని ఎన్నో విశేషణాలు చేర్చి రాసుకున్నారు. పీడితులకు అధికారం హస్తగతమయినపుడు వాళ్ళు కూడా పీడకులవలెనే దాన్నుపయోగిస్తా రన్నది పాలకుల అంగీకారాన్ని పొందింది. సాధారణంగా పాలితుల్ని గురించి ఇటువంటివేవి చెప్పినా, నిజానిజాల ప్రసక్తి లేకుండా పాలకులు ఆమోదించి పారేస్తారు.

శిలువమీద వేలాడుతున్న మనిషికి జ్ఞాపకం వచ్చిన విషయం ఇది. వాళ్ళనుకున్నట్లుగా బానిసలు ఖైదీలచే బలవంతంగా ద్వంద్వయుద్ధం చేయించి మానవహత్యా మహోత్సవాన్ని జరిపించలేదు. ఒక్క ఉదాహరణ ఉన్నమాట నిజమే. విపరీతమైన కోపంలో, ద్వేషంలో ఆ ఇద్దరు కులీనులను చూపించి స్పార్టకస్ "మేం ఎలా చచ్చామో మీరూ అలానే చావండి! ఆ ఇసుక మీద దిసమొలతో నిలబడి ద్వంద్వయుద్ధంచేసి మరీ చావండి తెలుస్తుంది. రోమ్ వినోదం కోసం, రోమన్ పౌరుల సరదాకోసం మేం ఎలా ఒకర్నొకరు పొడుచుకు చావాల్సొచ్చేదో మీకే అర్థమవుతుంది."

అప్పుడా యూదు డక్కడే కూచున్నాడు. ఏమీ అనకుండా అంతా వింటున్నాడు. రోమన్లను ద్వంద్వయుద్ధం చేయించడానికి తీసుకపోయారు. స్పార్టకస్ అతని వేపు తిరిగాడు. ఆ యూదుడేమీ మాట్లాడలేదు. వాళ్ళిద్దరి మధ్యా అవినాభావసంబంధ మేర్పడి వేళ్ళు నాటుకుంది. కాలం గడుస్తున్నకొద్దీ, ఎన్నో పోరాటాలు జరుగుతున్నకొద్దీ కేపువానించి తప్పించుకొచ్చిన మల్లుల సంఖ్య తగ్గిపోతోంది. ఒక్కొక్కరే యుద్ధానికి ఆహుతైపోతున్నారు. ఇక మిగిలిన కొద్దిమందీ బానిససైన్యానికి నాయకత్వం వహించారు.

స్పార్టకస్ యూదునికేసి చూసి ప్రశ్నించాడు: "నేను చేసింది తప్పా, ఒప్పా?" ఆ ప్రశ్నలో హృదయారాటం ధ్వనించింది.

"వాళ్ళకి ఒప్పైనది మనకి ఒప్పుకాదు."

"వాళ్ళు దెబ్బలాడితే ఏం?"

"నీ కెలాఉంటే అలాగేకానీ. వాళ్ళని ఒకళ్ళనొకళ్ళు పొడుచుకచావనీ, కానీ అది మననే మరింత బాధిస్తుంది. మన శరీరంలో వేరుపురుగై తొలుస్తుంది. నువ్వూ నేనూ మల్లులం. నికృష్టమైన ఈ మల్లయుద్ధాలనూ, ఏ ఒకడి స్మృతిపథంలోనూ లేకుండా తుడిచిపారేస్తాం అని మనం చెప్పి ఎంతకాలం అయిందంటావు?"

"అపుడు చెప్పాం; తుడిచిపారేస్తాం కూడా. అందులో అనుమానం ఏదీ లేదు. కాని వీళ్ళుమాత్రం దెబ్బలాడి తీరాలి."

శిలువ వేసిన మనిషికి జ్ఞాపకం వచ్చిన విషయమది. అతని కళ్ళలోకి చూసాడు క్రాసస్. అతన్ని శిలువెయ్యడం కూడా చూసాడు క్రాసస్. ఒక మహావలయం పూర్తయింది. బానిసల తిరుగుబాటు కేంద్రంగా గీయబడ్డ తిరుగుబాటుదార్ల మహావలయమది. ఆఖరుమల్లుని చావుతో ఆ వలయం పూర్తయింది. అలసట చెందిన క్రాసస్ విశ్రాంతి కోసం ఇంటికి పోయాడు. మేకులు దిగ్గొట్టిన మల్లుడు శిలువపై వేలాడుతున్నాడు.

# 4

మల్లుడికి తెలివొచ్చేసరికి ఒక గంట పట్టింది. బాధ అన్న దో బాట. బాధలబాటపై స్మృతి పయనిస్తుంది. బ్రహ్మాండమైన ఢంకా నూహించు, అతని ఆవేదనా, ఇంద్రియజ్ఞానమూ బాగా సాగదీస్తే, సారిస్తే ఆ ఢంకామీద కప్పిన తోలులా తయారవుతుందనుకో. ఇప్పుడు దానిమీదనే బ్రహ్మాండమైన వాద్యం సాగుతోంది. ఆ వాద్యం, ఆ సంగీతం కర్ణకఠోరమైనది, సహించరానిది; బాధగా ఉంది, నొప్పెడుతోంది అని అతడనుకోవడమే అతనికి వంటిమీద తెలివొచ్చిందనడానికి తార్కాణం. బాధకి పర్యాయపదం ప్రపంచం. ఆ బాధ అనే ప్రపంచంలో అతని కింకేమీ తెలీదు. ఆరువేలమంది సహచరుల్లో అతడు కట్టకడపటివాడు. వాళ్ళందరి బాధా ఇతనిదే. ఇతడే వాళ్ళబాధలన్నిటినీ పుణికిపుచ్చుకున్నాడు. కాని తనబాధ అన్నిటినీ మించిన బాధ, బాధలనే బాధించగల బాధ. తనతర్వాత దాన్ని తననించి పుచ్చుకోడానికీ దానిలో భాగాన్ని స్వీకరించడానికీ ఎవరూ ఇక మిగల్లేదు. అతని కళ్లు తెరుచుకున్నాయి.

అతనికి ఒకేమారు స్పృహ రాలేదు. కెరటాలు కెరటాలుగా, ఆగి ఆగి వచ్చింది. అతనికి బాగా తెలిసిన బండి, గుర్రపుబగ్గీ, కొండలమయమయిన ఒక దేశం. ఆ దేశంలో అప్పుడు తనొక కుర్రవాడు. దూరదేశాల్లో నివసించే గొప్ప గొప్ప జమీందారులు, నాగరికులు, శుభ్రం ఎరిగినవాళ్ళు అప్పుడప్పుడు ఆ కొండదారుల వెంబడి గుర్రపుబగ్గీలపై ప్రయాణం చేసేవారు. "నన్నొకమాటు ఎక్కనీయరూ" అని బతిమాలుకుంటూ ఆ బళ్ళ వెనకాలే పడేవాడతను. గొప్పవాళ్ళెంత ఉదారస్వభావులో: అప్పుడప్పుడు మిఠాయిముక్క లిచ్చేవారు. వాళ్ళెవ్వరూ అతని భాష మాట్లాడరు. నల్లని జుట్టువున్న ఈ పిల్లలు బండివెనుక బల్లచెక్కనుపట్టుక వేలాడుతుంటే వాళ్ళు చూసి అందంగా నవ్వేవారు. కుర్రాళ్ళు ఎక్కగా చూసి ఒక్కమారు ఆ గుర్రాల్ని అదిలించేవారు. ఆ గుర్రాలు బండి నొక కుదుపు కుదిపి శరవేగంతో పరిగెత్తేవి. ఆ కుదుపుకీ, వేగానికీ వెనకాల కూచున్న పిల్లలు కిందపడేవారు. కిందపడ్డాక దెబ్బతగిలేది మనకే.

అప్పు డతనికి గుర్తుకొచ్చింది. తను గెలీలీ కొండల్లోని బాలుడు కాడింక. శిలువపై వేలాడే వయస్సొచ్చినవాడే. అన్ని విషయాలూ ఒకే పర్యాయం తెలుసుకోగల స్థితి రాలేదింకా. తన శరీరం తన అధీనంలో లేదని, ఆ చేతులలో ఏదో జరుగుతున్నట్లు గ్రహించాడు. చేతులలోని నరాలు ఎర్రగా, చివరికి తెల్లబడేదాకా కాలిన ఇనుపతీగల్లాగున్నాయి. వాటిలో వెచ్చని కాగే నెత్తురు ప్రవహిస్తోంది. అటువంటి ప్రవాహం శరీరంలో ఎక్కడెక్కడికి ఎంతెంతదూరం వెళుతోందో తెలిసిపోతుంది. అదుగో; వంచిన తలకింద మెడ, భుజాలు రెండూ కలిసే భాగం వరకు ఆ రక్తం ప్రవహిస్తోంది. ఇంతలో అతని కడుపులో కండలు బిర్రబిగుసుకపోయి బాధ అక్కడే ఉన్నట్లు అనుకున్నాడతను. అతని జీర్ణకోశపు పేగులు, మూత్రకోశపు నరాలు బిగుసుకపోయి, పెనవేసుకుని, ముడివేసుకుని నొప్పి కలిగిస్తున్నట్లు

తెలుసుకోగలిగాడు.

అతనికి తనని చూస్తున్న ఆ ప్రజలు, పడుతూ లేస్తున్న తరంగాలు ఒక్కొక్కప్పుడు కనపడేవి. ఒక్కొక్కప్పుడు తరంగాలూ లేవు, ఏవీ లేవు. అతను సరిగ్గా చూడలేకపోతున్నాడు. ఏ వస్తువునీ దృష్టిసారించి, కేంద్రీకరించి చూడగలస్థితిలో లేడతను. అతను చూసిన మనుషులు ముడతలుపడుతూ సాగుతున్నారేమిటి చెప్మా. ఇతని పరిస్థితి ఈ విధంగా ఉండగా, మల్లుడికి వంటిమీద తెలివొస్తోందని గ్రహించి, ఏంచేస్తాడో చూద్దామనే కుతూహలంతో, ఆతృతతో చూస్తున్నారు జనం.

మరొకర్ని శిలువవేస్తే ఇంతమంది రాకపోదురు. కాని ఇప్పుడిక్కడో బానిసవీరుడు చావబోతున్నాడు. మృత్యువు తన అనంతమైన హస్తాలను చాచి ఒక గొప్ప మల్లుడిని స్వీకరించబోతోంది. బానిస విప్లవకారుడు స్పార్టకస్ యొక్క సహచరుడు, అతనికింద పనిచేసిన సైనికాధికారి, మల్లయుద్ధాలలో ఎంతోమంది నోడించి: చివరకు మిగిలిన ఒక్కగానొక్క జగజ్జెట్టి ఇక్కడే చస్తాడు. అటువంటివాని చావు వాళ్ళకో చోద్యం. ఆ చోద్యం వాళ్ళు చూడొద్దామరి.

చావు మనిషికి అర్థంకాని మాయ. ఆ మాయలోపడి ఈ మల్లుడెలా మాయమౌతాడో చూద్దామనే కుతూహలంతో వచ్చారు వాళ్ళు. మేకులు దిగగొట్టినపుడైనా నోరుమెదపడా? చూద్దాం, ఏం చేస్తాడో అని వచ్చారు. అంత బాధతోనూ, నొప్పితోనూ మౌనంగా ఉండగలగడం ఎంత వింత! మేకులు చేతుల్లో దిగి, వార్త మెదడు కందినప్పుడైనా, ఏదో ఒకటి చెయ్యకపోతాడా అని నిరీక్షించారు. కాని వాళ్ళ నిరీక్షణవల్ల ఫలితం లేకపోయింది. అతనేమీ అరవలేదు. అతను కళ్ళు తెరచి ప్రపంచాన్ని చూడగల జాగ్రదావస్థలోకి వచ్చినపుడైనా అరవకపోతాడా అని అలాగే నిలబడ్డారు.

వాళ్ళ మనోరథం ఈడేరింది. అరిచాడు మల్లుడు. ఎంతోసేపటికి వాళ్ళకేసి అతను చూసాక, కళ్ళముందున్న వస్తువులన్నీ కొంచం స్పష్టంగా కనిపించాక అరిచాడు. నొప్పితో, వేదనతో, బాధతో దిక్కులు పిక్కటిల్లేలా, రోదసీకుహరం బద్దలయ్యేలా, కువలయం కంపించేలా బ్రహ్మాండమైన అరుపొకటి అరిచాడు.

అతనన్న దేమిటో వాళ్లెవరికీ బోధపడలేదు. బాధ బద్దలై అతని నోటివెంట మాటలై పెగిలింది. ఆ మాటలేమిటా అన తెగ ఆలోచించారు. అతను మాట్లాడాడని కొందరూ, మాట్లాడలేదని కొందరూ పందాలు వేసారు. కొందరతనేమీ మాట్లాడలేదనీ, గట్టిగా మూలిగాడనీ, తామే నెగ్గామనీ అన్నారు. కొందరు అతను మరో భాషేదో మాట్లాడాడనీ ఏ భాష మాట్లాడినా అవీ మాటలే అనీ, కాబట్టి పందెం తమదే అనీ కూచున్నారు.

అతను భగవంతుణ్ణి స్మరించాడని కొందరూ, వాళ్ళ అమ్మకోసం మూలిగాడని మరి కొందరూ అభిప్రాయపడ్డారు.

నిజానికి అదేమీ కాదు. అతను గట్టిగా అరిచాడు. దాన్లో ఉన్న మాటలివి: "స్పార్టకస్!

స్పార్టకస్! మనం ఎందుకు ఓడిపోయాం?"

చరిత్ర ఇనుపపాదాల కింద స్పార్టకస్ లేవదీసిన తిరుగుబాటు మట్టికొట్టుకు పోయింది. ఆరువేలమంది తిరుగుబాటుదార్లు పట్టుబడ్డారు. ఈ ఆరువేల జీవిత చిత్రాలనూ లిఖిస్తే అవి ఒకేలాగున్నట్లు తేటతెల్లమౌతుంది. బహుశా వాళ్ళ అంత్యదశలో, ప్రాణావసాన కాలంలోకూడా వాళ్ళల్లో తేడాలేదు. సాధారణంగా వాళ్ళంతా ఒకేరకమైన బాధల ననుభవించేవారు. ఒకేలా వ్యధచెందేవారు. ఆ బాధలన్నీ, వ్యధలన్నీ కలిసి నిలిచాయి. దేవతలే కనుక ఉంటే ఈ వర్షాలు ఆ దేవతల కన్నీటి చుక్కలే అయితే, రోజుల తరబడి, నెలలతరబడి, సంవత్సరాల తరబడి, శతాబ్దాల తరబడి ఆ కన్నీటి వర్షం భోరున పడుతూనేఉండును. కాని అటువంటిదేదీ లేదు. వీళ్ళను దౌర్భాగ్యంలో వేసేవాడు సూర్యుడు. రక్తాలుకారే మాంసపు ముద్దల్ని పీక్కుతినేవి పక్షులు.

ఆ ఆరువేలమంది చచ్చేవాళ్ళ జాబితాలో ఇతని పేరు ఆఖరున ఉంది. ఆరువేల మందినీ కూడితే ఆ కూడిక ఫలితమే ఇతను. మానవ జీవిత సర్వస్వం అతని మనస్సులో నిండిఉంది. కాని అటువంటి బాధలో మనిషి ఆలోచించలేడు. స్మృతులు పీడకలలుగా అతన్ని భయపెట్టాయి. ఆ స్మృతులన్నీ తక్కిన వాళ్ళందరి బాధల జీవితరూపాల నుండి వేరుకాదు.

అతని జీవితం నాలుగు దశలుగా గడిచింది. మొదటిది : అజ్ఞానపు బాల్యదశ. రెండవది : జ్ఞానం వచ్చిన దశ. ద్వేషం అతని కా దశలోనే అలవడింది. మూడవదశలో ఆశ; అప్పుడే అతనిలో ద్వేషం మాయమై సహచరుల ఎడ ప్రేమ, సౌహార్ద్రభావాలూ ఏర్పడ్డాయి. నాలుగోదశలో నిరాశ.

అజ్ఞానపుదశలో అతనో బాలుడు. అతని కా దశలోనే ఏదో అనిర్వచనీయమైన ఆనందం, ఎందుకో తెలియని ఆనందం కలిగేది. అప్పుడే అతని జీవితం వెలుగు బాటలో నడిచేది. నొప్పియొక్క కరాళదంష్ట్రలనుండి తప్పించుకుందుకై చల్లదనంకోసం అతను ప్రయత్నిస్తే అతనికా చల్లదనం తన బాల్యావస్థలోనే కనబడింది. బాల్యదశలో అతను చూసిన ఆకుపచ్చని కొండలన్నీ చల్లగా, హాయిగా, అందంగా ఉన్నాయి. తళతళ మెరుస్తూ కుబుసం విడిచిన పాములా జలజలా పారేవి సెలయేళ్ళు. నల్లని మేకలు కొండవారలమ్మట నిగనిగలాడే పచ్చగడ్డిమేసేవి. పంటభూములను ప్రాణాస్పదంగా చూసుకునే ప్రేమాస్పదమైనచేతుల్లా కొండపక్క బార్లీ వగైరా పంటలు పండే భూములను జాగ్రత్తగా సాగుకు లాయకయ్యేటట్లు చూసేవి. ముత్యాలపంటలాగుండేది బార్లీ. కెంపుల్లా మెరిసేవి ద్రాక్షపళ్ళు. ఆ కొండలదగ్గరే అత నాడుకునేవాడు. ఆ సెలయేళ్ళ గానాన్ని వింటూ, వాటిలో జలకమాడేవాడు. గెలీలీలో అందమైన పెద్ద చెరువొకటుంది కూడా. ఆ చెరువు నీలాలనీళ్ళల్లో ఈదులాడేవాడు. ఆరోగ్యంగా సంతోషంగా చెంగుచెంగున గెంతే లేగదూడలాగుండే వాడతడు. అన్నలు, చెల్లెళ్ళూ, అక్కలతో అతను హాయిగా, సరదాగా ఆడుకునేవాడు.

ఆ కాలంలో అతనికీ ఒక దేవుడుండేవాడు. ఆ దేవుడు ఫలానివిధంగా, ఫలాని రూపంతో ఉంటాడని తన హృదయఫలకంపై స్పష్టంగా చిత్రించుకున్నాడు. అతను కొండజాతికి చెందినవాడు. కొండజాతుల ప్రజలు తమ దేవతలను మహోన్నత పర్వత శిఖరాగ్రాలమీద ప్రతిష్ఠించుకునేవారు. భగవంతుని నివాసమదేనన్నది వారి దృఢనమ్మకం. భగవంతుడనే వాడొకడే. కరుణ జూపిస్తాడు, కాని మానవుడు చేసిన తప్పులకూ, పాపాలకూ కసితీర్చుకునే స్వభావం కూడా కలవాడు. పగలు, రాత్రి ఎప్పుడూ తను చేసే ప్రతీదీ భగవంతుడు చూస్తూనే ఉంటాడు. ఆఖరికి అతని బుర్రలో ఏ ఆలోచన మెదిలినా భగవంతుడు ఇట్టే పసిగట్టేస్తాడు.

మతం బాగా తలకెక్కిన ప్రజల్లోంచి వచ్చాడతను. వాళ్లు నిత్యజీవితంలో చేసే, చూసే ప్రతిదానిలో అన్నివైపులా అల్లుకుపోయిన దారంలా ఉండేవాడు భగవంతుడు. వాళ్ళు పశువుల్ని మేపేటప్పుడు చారల కంబళీ నొకదానిని కప్పుకునేవారు. ఆ కంబళీలోని ప్రతిచారా; ఆ చారలోని ప్రతీదారం వాళ్ళకి భగవంతుడంటే ఉండే నమ్మకాలను, భయాలను, భక్తిప్రపత్తులను సూచిస్తాయి. అన్నం తినడానికి కూర్చున్నప్పుడు మొదటి ముద్ద నోట్లోకి వెళ్ళకపూర్వం వాళ్ళాదేవుడిని ప్రార్థించేవారు. ఒక గ్లాసుడు ద్రాక్షరసం తాగితే దానిని తమకు లభింపచేసినందుకు దయామయుడైన సర్వేశ్వరునకు కృతజ్ఞత తెలియజేసేవారు. దురదృష్టం లాగి లెంపకాయకొట్టినా, భగవంతుడా మాకు ముట్టాల్సిన ప్రతిఫలం ముట్టింది, ఈ పాపిని రక్షించు అని ప్రార్థనలు చేసేవారు.

శిలువపై వేలాడడానికి తగ్గయుక్తవయసొచ్చిన ఆ మల్లుడు ఆ విధంగా తన చిన్నతనంలో ధ్యానమంతా భగవంతునిపై నిలిపి సర్వమూ ఆ దేవుడేననే భావంతో ఉండేవాడు. ఆ కుర్రాడు భగవంతుడంటే భయపడేవాడు. వాళ్ళ భగవంతుడు భయపెట్టే స్వభావం కలవాడే. కాని ఆ భయం సర్వవ్యాపిత మైన ఈ భానుకాంతిలో, పచ్చని కొండల, సెలయేళ్ళ, గుబురుగా పెరిగిన చెట్ల చల్లదనంలో, ఏదో ఒకమూల పొరపాటున జారిపడ్డ అపస్వరంలాగుండేది. పసివాడు పరుగులెత్తేవాడు. గెంతేవాడు. ఆరోగ్యమైన, నిష్కల్మషమైన తెల్లనినవ్వు నవ్వేవాడు. చల్లనిపాటలు పాడేవాడు. మేకల్ని, గొర్రెలని కాచేవాడు. గెలీలీ ప్రజలుపయోగించే చాబో అనే కత్తిపట్టుకుని తనకన్న పెద్దకుర్రాళ్ళు సాము చేస్తోంటే చూసేవాడు. ఆ కత్తి పట్టుకుని తిరగడమంటే ఆ ప్రజలకు కొంత గర్వముండేది. తనూ ఒక కత్తి సంపాదించాడు. అది కర్రకత్తి - ఆ కత్తి పుచ్చుకొని తన ఈడువాళ్ళతో సరదాగా యుద్ధం చేసేవాడు.

అతను కత్తి బాగా తిప్పితే అతనికన్న పెద్దవాళ్ళు బాగా చేసేవురోయ్ అని తన నైపుణ్యాన్ని మెచ్చుకుందుకు ఇష్టపడేవారు కారు. అక్కడికీ థ్రేషియన్లాగున్నావురోయ్ "కుర్రాకుంకా" అనేవారు. వారి దృష్టిలో థ్రేషియన్ అంటే దుర్మార్గానికి అపరావ తారమన్నమాట. థ్రేషియన్ అంటే యుద్ధాల్లో ఆరితేరిన రణకోవిదుడన్నమాట. ఎంతో కాలం

క్రితం తనదేశంమీదకు, కిరాయి సైనికులు దాడిచేశారు. వాళ్ళను తరిమేసే సరికి ఎన్నో సంవత్సరాలు పట్టింది. ఎంతో యుద్ధం చేయాల్సొచ్చింది. ఈ కిరాయి సైనికుల్నే థ్రేషియన్లనేవారు. వాళ్ళను తానెన్నడూ చూడలేదు.

తన మొలలో ఎప్పుడు కత్తి వేలాడదీసుకుని తిరుగుతానా అన్నదే అతని ఆలోచనంతా. అప్పుడు కత్తి చేతబట్టి తా నీ థ్రేషియన్లందరి కంటే బాగా పోరాడగలడో లేడో అందరూ తెలుసుకోగలరు.

అది అజ్ఞానపు బాల్యదశ.

ఇక ద్వితీయదశ ప్రారంభం. అది అతని జ్ఞానావస్థ. ఇంకేమాత్రం అతను కుర్రాడు గాదు. రమణీయమైన సూర్యకాంతి పోయింది. దానిస్థానే మంచులా చల్లగా ఉండే శీతలవాయువు విసిరింది. కమనీయమైన సెలయేటిగానం లేదు. దాని స్థానంలో చర్మాన్ని కోసిపారేసే హేమంతతుషారం ప్రవేశించింది. కాలం మించి పోకుండా అతడు జాగ్రత్తపడాలి. అందుకే స్వీయరక్షణార్థం అతడు ద్వేషమనే దట్టమైన కంబళి కప్పుకున్నాడు. ఆ దశే, ఆ కాలమే, శిలువపై వేలాడే అతని హృదయాన్ని తళతళ మెరిసే ఖడ్గమై దూసుకుపోయి ఎర్రని బాధను కలిగించింది. ఆ కాలాన్ని గురించిన అతని ఆలోచనలు, అతని స్మృతులు మెలికలు తిరిగి భయపెడతాయి. ఆ ఆలోచనల రంపపు పళ్లు అర్థంకాకుండా అయోమయంగా ఉన్నాయి. ఇసకేస్తేరాలని జనం తనని చూస్తున్నారు. వాళ్ళ కళ్ళల్లో, వాళ్ళ అరుపుల్లో, వాళ్ళుచేసే ప్రతి శబ్దంలో, ఉచ్ఛ్వాసనిశ్వాసంలో అతనికి తన జీవితపు రెండోదశ అయిన జ్ఞానావస్థ కనిపించింది. అతని ఆవేశానికి సహనముంది. ఆ విధంగా సహించినపుడల్లా స్మృతిపథం వెంట ఆ రెండోదశలోనికి, విజ్ఞానాన్ని సంపాదించిన ఆ కాలంలోకి అతను నెట్టి వేయబడ్డాడు.

ఆ కాలంలో అతనెన్నో విషయాలు తెలుసుకునేవాడు. చిన్నప్పటికన్నా ఇప్పుడు తనతండ్రి గురించి మరింత తెలిసింది. ఎండలో పనిచేయడంవల్ల కమిలిపోయిన శరీరం, కాయకష్టం చేయడంవల్ల రాయిలా గట్టిపడ్డ శరీరం. రాత్రింబవళ్ళు విశ్రాంతి లేకుండా శ్రమపడేవాడు. ఆ శ్రమకు అంతులేదు. అతనికి విచారం గురించి తెలిసింది. తన తల్లి చచ్చిపోయింది. అందుకు వాళ్ళు విలపించారు. పన్నుల గురించి తెలుసుకోగలిగాడు. రాక్షసినోటిలోని పళ్ళల్లాంటివి ఈ పన్నులు. తన తండ్రి రెక్కలు ముక్కలు చేసుకొని చెమటోడ్చి పనిచేసినా కుటుంబానికి కడుపు నిండేది కాదు. పోనీ భూమి సారవంతమైనదికాదా అంటే ఆ విషయంలో మరేభూమితోనూ తీసిపోదు. బాగా పండేది. అప్పుడు అతనికి తెలిసింది ధనవంతులకూ, బీదలకూ మధ్య అఖాతమొక టుందని.

ఇప్పుడతడు విన్న ప్రతి శబ్దమూ చిన్ననాడు తను విన్నదే. కాని ఆ శబ్దాల యొక్క అర్థం ఇప్పుడే తెలుసుకోగలిగాడు. పెద్దవాళ్ళు మాట్లాడుకునేటప్పుడు పూర్వంలాకాకుండా ఇప్పుడితన్ని కొంచెం దూరంలో నిలబడి విననిచ్చేవారు.

అతనికొక కత్తి ఇచ్చారు. కాని ఆ కత్తితోబాటు సంతోషం మాత్రం రాలేదు. కొండలుదాటి అయిదుమైళ్ళు కాలినడకన తనూ, తనతండ్రీ మరో ఊరెళ్ళారు. అక్కడే ఇనుప సామాన్లు తయారుచేసే కమ్మరి ఒకడున్నాడు. వీళ్ళక్కడ మూడుగంటలపాటు నిలబడ్డాక అతడొక కత్తి తయారుచేసి ఇచ్చాడు. ఆ మూడుగంటలసేపూ తన తండ్రీ, ఆ కమ్మరీ దేశంలో వ్యాపించిన సంక్షోభం గురించి తమబోటి సామాన్యజనం ఎలా పీడింపబడుతున్నదీ మాట్లాడుకున్నారు. ఎవరెక్కువ పీడింపబడుతున్నదీ చెప్పుకోవడంలో తన తండ్రీ, ఆ కమ్మరి పోటీపడ్డట్టుంది. "ఈ కత్తి తీసుకో!" కమ్మరి చెప్పాడు "దీనికి నాలుగు దినారాలియ్యి. ఆ నాలుగుదినారాల్లోనూ ఒక దీనారం బకాయి పడిపోయిన గుడిపన్ను చెల్లించడానికి పన్నులవాళ్ళు చంపేస్తున్నారు. మరో దీనారం ప్రభుత్వపు పన్ను, ఇక రెండు దీనారాలు మిగులుతాయి. కత్తి చెయ్యాలంటే ఇనుం కావాలికదా? ఆ ఇనుపముక్కకయ్యే ఖర్చు రెండు దీనారాలు. మరినాకు మిగిలేదేమిటి మన్ను. వళ్ళు హూనమయ్యేటట్లు పనిచేశాను. ఆ పనికి కూలీ అక్కర్లేదా? అదీకాక ఈ కత్తిపిడికోసం కొమ్ము కొనాలిగా? దానికి డబ్బెక్కణ్ణించి వస్తుంది? ఇన్నిటికీ సరిపోయాక నా కుటుంబం పోషింపబడాలంటే ఎలాగ? దీని ధర ఐదు దీనారాలు చేస్తే అంతా బాగానే ఉంటుంది. కాని మరోచోట నాలుగు దీనారాలకు దొరుకుతున్నపుడు మీరీ నాలుగు దీనారాలే అతికష్టంమీద ఇస్తోన్నపుడు ధర పెంచితే అడుక్కుతినాల్సిందే. భగవంతుడికీ నీ యందే దయ. మట్టిలో ఏదో ఒకటి పండించి వేళకింత తింటారు."

కుర్రాడి తండ్రికీ బాధలగాధ ఉంది. "అప్పుడప్పుడు నీ దగ్గర ఎంతో కొంత రొక్కమైనా ఏడుస్తుంది. నా గొడవ చూశావా? బార్లీ పంటకోసి కళ్ళంవేస్తా. ముత్యాల్లా మెరుస్తుంది బార్లీ. దయచూపించావు నాయనా అని పంటలవేల్పుకు దణ్ణం పెడతాం. మా బార్లీ బాగా పండిందిగా. గోదాంలో బార్లీ రాసులుగా పడివుంటే ఇంక బాధపడడం దేనికీ? కాని ఇంతలో యమభటుడిలా తయారవుతాడు గుడి పన్నువాడు. పంటలో నాలుగోవంతు వాడి కాష్టంలో పోస్తాం. వీడయాక ప్రభుత్వపు పన్నంటూ మరొక యముడు తయారు. ఈ ప్రభుత్వం ఎక్కడుందో ఏమిటో; వేళ మించిపోకుండా పన్నుకోసం మాత్రం ఒకణ్ణి పంపుతూ ఉంటుంది. నాలుగోవంతు వాడు లాక్కెడతాడు. వాణ్ణి నేను బతిమాలుకుంటా. నా పశువులకే చాలినంత బార్లీ లేదు; వస్తున్నది చలికాలమని వేడుకుంటా. నీ పశువులు తినడానికి లేకపోతే చలికాలంలో ఆ పశువుల్నే నువ్వుతిను అంటాడు వాడు. ఆఖరికి ఆ దౌర్భాగ్యపుపనే చేయాల్సిన దుర్గతి పడుతుంది."

కమ్మరి అన్నాడు : "చివరకు నీకేం లేకుండాపోతుంది. ఎప్పుడూ మనకి మిగిలేదంతే. లేనివాడు మరింత లేకుండాపోతాడు; డబ్బున్నవాళ్ళు మరింత కూడబెడతారు."

వాళ్లున్నది చిన్న ఇల్లు. ఆ ఇల్లంతా కలిపి ఒకటే గది. ఆ గదిలో అంతా కూరుకుపోయి ఉండేవారు. ఇంట్లో సాయంత్రపువేళ ఇరుగు పొరుగు వాళ్ళంతా వచ్చి కూచుని కష్టం సుఖం

మాట్లాడుకునేవారు. వాళ్ళనెలా పిండి పీల్చి పిప్పిచేసి పీడిస్తున్నారో, బతకడం ఎంత దుర్భరమైపోయిందో మాట్లాడుకునేవారు. ఈ పీల్చేయడం ఎంతకాలం కొనసాగుతుంది. రాళ్ళనించి రక్తాన్ని పిండగలరా?

శిలువమీద మనిషి ఆ విధంగా ఆలోచించాడు. ఇవి మనస్సును పొడిచి, బాధించే స్మృతులు. తన కష్టాలను జ్ఞప్తికితెచ్చే చేదైన స్మృతులు. అతనంత బాధపడిపోతున్నా సహించలేనంత నెప్పి కెరటాలు కెరటాలుగా లేస్తున్నా ఆ కెరటాలు కొంత తగ్గినపుడు మాత్రం ఇంకా బతకాలనే వాంఛించాడు. శిలువకు బలియై మృత్యుగహ్వరంలోనున్నా ఇంకా బతకాలనే కోరుకున్నాడు. జీవితం! అది ఎటువంటి శక్తి. జీవితం! అది ఎటువంటి ఊపు. మనుగడ కోసం మనషులెటువంటి పనులు చేస్తారు.

ఆ గాథలో అతడు భగవంతుణ్ణి పిలవలేదు. దీనంతకూ భగవంతుడిలో ఏ సమాధానమూ దొరకదు. దీని వివరణా కనపడదు. భగవంతుడన్నా, తదితర చిల్లరదేవుళ్ళన్నా అతనికింకేమాత్రం నమ్మకం లేదు. తన జీవితపు రెండోదశలో తనకు భగవంతుడితోనున్న సంబంధం కాస్తా తెగి ఊరుకుంది. ధనవంతుల ప్రార్థనలనే వింటాడు భగవంతుడు.

అందుకని భగవంతుణ్ణి స్మరించడం మానేశాడు. ధనవంతులు శిలువలపై వేలాడరుగదా. కాని తన జీవితమంతా శిలువమీదనే గడిపాడు. చేతులలో మేకులతో శాశ్వతంగా ఆ శిలువమీదనే ఉన్నాడు. ఉన్నది తనా, మరొకరా? తన తండ్రి కాదుగదా? బుర్రసరిగ్గా పనిచేయడంలేదిప్పుడు. అతని మెదడులో ఆలోచనలన్నీ చెదిరిపోయాయి. తన తండ్రిని శిలువవేసిన సంగతి జ్ఞప్తికొచ్చినప్పుడు తనతండ్రికి బదులు తననే శిలువవేసినట్లుగా గాభరాపడ్డాడు. ఆందోళనగా ఉన్న అతని మెదడులోని స్మృతులన్నిటినీ తిరగేశాడు. అప్పుడా శిలువ ఎందుకని వేశారో అతనికి కొద్దికొద్దిగా జ్ఞాపకమొచ్చింది. పన్ను వసూలుచేసే వాళ్ళొచ్చారు. వట్టి చేతులతో తిరిగిపోయారు. గుడిపన్ను కోసం మరొకళ్ళు తయారయ్యారు. ఉత్తి చేతులతోనే పోయారు. వీళ్ళందరినీ తన్ని తగిలేసారు.

అది జరిగిన కొద్దికాలం వరకు మనంకదా ఇంతపని చేశాం అన్న గర్వం ప్రజల్లో ఉండేది. పన్నుల వసూలుకోసం వెళ్ళినవాళ్ళని అవమానపరిచిన ఈ ప్రజలమీదికి మొదటిసారిగా మతగురువు సైన్యాల్ని పంపాడు. కొండల్లోని రైతులు బాణాలూ, కత్తులూ పుచ్చుకుని ఆ సైన్యాల్ని ధ్వంసం చేశారు. తండ్రితోబాటు కత్తిచేతబట్టి శత్రువుని టకటక లాడించేశాడు. విజయాన్ని చవిచూశాడు.

కాని ఆ రుచి చాలాకాలం ఉండలేదు. గెలీలీ తిరుగుబాటుదార్ల నణచడానికి కవచాలు ధరించిన సైనికులు పంపబడ్డారు. కిరాయి సైనికదళాలు వచ్చాయి. దేవాలయ ఖజానాల డబ్బుపాతర్లకు అంతులేదు. అందుకనే మతగురువులు కావలసినంతమంది కిరాయి సైనికుల్ని కొనగలరు. ఒంటిమీద గుడ్డలేని రైతులెక్కడ! కవచధారులైన మహాసైన్యమెక్కడ! అక్కడికీ కత్తులు చేతబూని రైతులు ప్రతిఘటించారు. కాని వాళ్ళ తిరుగుబాటు అణచివేయబడింది.

రెండువేలమందిని ఖైదీలుగా పట్టుకున్నారు. ఆ రెండు వేలమందిలో తొమ్మిదివందలమంది శిలువలకోసం ప్రత్యేకించ బడ్డారు. ఇదీ నాగరికుల పద్ధతి, ఇదీ పాశ్చాత్యప్రభువుల పరిపాలనా విధానం. కొండల పక్క శిలువలు వేలాడుతుంటే మతగురువులు చూడ్డంకోసం వచ్చేవారు. వాళ్ళతోబాటు రోమను సలహాదార్లు కూడా వచ్చేవారు. ఆ కుర్రాడు, డేవిడ్, తన తండ్రిని మేకులు దిగ్గొట్టి శిలువవేస్తుంటే చూశాడు. శిలువేసిన తన తండ్రి శరీరాన్ని, తనను లాలించి ప్రేమించిన తన తండ్రి శరీరాన్ని పక్షులు పీక్కుతింటూంటే అలాగే చూశాడు.

ఇప్పుడు తనే శిలువనలంకరించాడు. కథ ఎలా ప్రారంభమయిందో అలాగే ముగిసింది. అతనెంతగానో అలసిపోయాడు. బాధతో, విచారంతో నిండిపోయింది తన ప్రాణం! మనిషికి తెలిసిన కాలపు కొలమానాలతో సంబంధంలేనిది శిలువమీద వేలాడేకాలం. అతనా కాలాన్ని గడుపుతున్నప్పుడు, ఒక తెగని ప్రశ్నకు సమాధానంకోసం తెగవెతికాడు. శూన్యంలోనికే పోయే ఈ జీవితార్థం ఏమిటి? ఏమిటి దీని పరమార్థం? అన్నదే ఆ ప్రశ్న. అతన్నింతకాలం ప్రాణాలతో నిలిపిన జీవితం మీద పట్టు సడలిందిప్పుడు, మొదటిసారిగా చావాలనుకున్నాడు.

మళ్ళీడా జీవితాన్ని ప్రేమించు అని స్పార్టకస్ తనకు చెప్పాడు. అన్ని ప్రశ్నలకూ అదే సమాధానం. కాని స్పార్టకస్ జీవించిలేడే.

అలసిపోయాడతను. బడలిక బాధతో పందెం వేసింది. అతని స్మృతుల పేలికలు బడలికమయమైపోయాయి. ఆ తిరుగుబాటు విఫలమయ్యాక తనూ మరో ఏడువందలమంది కుర్రాళ్ళూ మెడకూ మెడకూ గొలుసులు తగిలింపబడి తీసుకుపోబడ్డారు. వాళ్ళెంతకాలం నడిచారో! కొండలు, ఎడార్లు, మైదానాలు దాటి నడిచారు. గెలీలీలోని పచ్చని కొండలు స్వర్గలోకం గురించి కలల్లా మిగిలిపోయాయి. యజమానులు మారేవారు. కాని వాళ్ళ మూపులను ముద్దిడే కొరడామాత్రం అదే. కర్ర, ఆ కర్ర చివర తోలు తాడు అదే.

ఆ దేశంలో తనను రాగి తవ్వి తెమ్మని భూగర్భంలోకి పంపించారు. రెండేళ్ళీ రాగిగనుల్లో పనిచేశాడు. తనతోబాటే పనిచేసిన తన సోదరులిద్దరూ ఈ రాగిగనులకు ఆహుతైపోయారు. అతడుమాత్రం బతికాడు. రాయిలాటి, ఉక్కులాటి శరీరమతనిది. కొందరికి జబ్బుచేసేది. మరికొందరి కదేమిటో పళ్ళూడిపోయేవి. ప్రాణంపోయేవరకు వాంతులు చేసుకునేవారు కొందరు. కానీ ఇతను బతికాడు. ఆ విధంగా రెండేళ్ళు రాగిగనులలో కండలు కరిగించాడు.

అప్పుడతను తప్పించుకు పారిపోయాడు. బానిసలకుండే కంటెలాటి మెడపట్టి ఉండనేఉంది. దాంతోనే ఆ కొండల్లోకి పారిపోయాడు. అక్కడ అమాయకులైన కొండజాతి ప్రజలు నివసించేవారు. వాళ్ళితన్ని చేరదీసి రక్షణయిచ్చి మెడపట్టీ ఊడతీసేశారు. శీతాకాలమంతా వాళ్లతో గడిపాడు. వాళ్ళు పేదప్రజలు. ఆ ప్రజల హృదయాల్లో దయమాత్రముంది. వలలుపన్ని జంతువులను వేటాడి దొరికిందేదో తిని కాలక్షేపం చేసేవారు.

ఇంచుమించూ ఏమీ పండించరు. వాళ్ళ భాష ఇతను నేర్చుకున్నాడు. తమ తెగలోని పిల్లను పెండ్లాడి తమతోబాటే కొండల్లో ఉండిపొమ్మని ఆ భాషలోనే ఇతన్నడిగారు. కాని అతని మనస్సు మాతృభూమి గెలీలీపైకి మళ్ళింది. వసంతాగమనంతో అతను దక్షిణంగా ప్రయాణమయ్యాడు. కాని మధ్యలో పెర్షియా వర్తకులితన్ని పట్టుకున్నారు. పశ్చిమంగా తీసుకుపోబడుతూన్న బానిసలతో ఇతన్ని పంపేశారు. టైర్ అనే పట్టణంలో నడిబజారులో ఇతన్ని వేలం వేశారు. అక్కడికి తన మాతృభూమి కళ్ళక్కనబడే టంతటి దూరంలో ఉంది. అతని హృదయ మెంత తరుక్కుపోయిందో; తనను ప్రేమించే స్వజనానికి, తనను కనిపెంచిన స్వస్థలానికి అంత దగ్గరగా ఉండి కూడా చేజిక్కినదనుకొని సంతోషించిన స్వేచ్ఛ హఠాత్తుగా మాయమవడం చూసి అతడెంత వెచ్చటి కన్నీటిని కార్చాడో. పోయినీషియా వర్తకుడొకడు డతణ్ణి కొన్నాడు. సిసిలీరేవుతో వర్తకవ్యాపారాలుచేసే ఓడలో ఒక సంవత్సరకాలం ఆ నీటిమయమయిన చీకటిలో, తడిసిన చెత్తలో కూచుని తెడ్డు లాగుతూ దౌర్భాగ్యపుజీవితం గడిపాడు.

ఒకనా డా ఓడను గ్రీకు దోపిడీదొంగలు వశపరుచుకున్నారు. అతని కిదేం అర్థం కాలేదు. కళ్ళు మిటకరిస్తూ నిలబడ్డాడు. వాళ్ళితణ్ణి బాగా పరిశీలించారు. ఆ భయంకరులయిన గ్రీకుదొంగలు ఇతని నేవో ప్రశ్నలడిగారు. పోయినీషియా వర్తకుణ్ణి, ఓడ నడిపేవాణ్ణి చంపి పచ్చగడ్డి మోపుల్లా విసరిపారేసినా, తననూ, తనతోటి బానిసల్ని మాత్రం వాళ్ళు బాగా పరిశీలించి, ప్రతివాణ్ణీ ఒక ప్రశ్న అడిగారు. "నువ్వు దెబ్బలాడగలవా? లేకపోతే ఈ తెడ్డు లాగడమేనా?"

పిశాచాన్ని చూస్తే ఎంత భయమో అలాగే రాత్రింబవళ్ళు ఈ చల్లని నీటిలో తెడ్డులాగడమంటే అతనికంతే భయం. ఆ ప్రశ్నకతను సమాధానమిచ్చాడు : "అవకాశం కల్పిస్తేనేను దెబ్బలాడగలను." ఆ పరిస్థితిలో అత నో సైన్యాన్నే ఎదుర్కొని పోట్లాడగలుగును. ఎక్కువ కొట్టకుండా వాళ్ళతనికి ఓడ నడపడంలో మెలకువలన్నీ నేర్పారు. తెరచాపలెలా ఎత్తాలో, తాళ్ళు ఏ విధంగా విసరాలో, 30 అడుగుల పొడవుండే చుక్కాని ఎలా తిప్పాలో, పురివేసి తాళ్ళను ఎలా కలపాలో పడవనడిపే పనితనమంతా నేర్పారు. అతన్ని ఓ రోమను దగాకోరుతో పోరాడమన్నపుడు మంచి చురుకుదనం, చాకచక్యం ప్రదర్శించాడు. ఆ భయంకరమైన దోపిడీ ముఠాలలో ఇతన్ని ఆ నిడుపైన కత్తే రక్షించింది. అతని మనస్సులో సంతోషం లేదు. హత్యాకాండకు, క్రౌర్యానికి, మృత్యువుకూ ప్రాణస్నేహితులనదగిన ఈ దోపిడీదార్లంటే విపరీతమైన ద్వేషం జనించింది. పగటికీ, రాత్రికీ ఎంత తేడా ఉంటుందో తను చిన్నపుడు పుట్టి పెరిగిన అమాయకపు రైతులకూ, వీరికీ మధ్య అంత తేడా ఉంది. వాళ్ళకు దేవుడంటే నమ్మకం లేదు. సముద్రుడన్నా నమ్మకం లేదు. అతన్లో కూడా రానురాను నమ్మకం సడలుతున్నా, అతని సంతోష సమయమంతా భగవద్భక్తిగల వాళ్ళ మధ్యే గడిచింది. వాళ్ళెపుడైనా తీరాన్ని సమీపిస్తే చంపడానికి, మంటపెట్టడానికి, చెరచడానికి తప్ప ఒడ్డెక్కరు.

ఇదిగో ఈ కాలంలోనే తనచుట్టూ రాతిగోడను నిర్మించుకొని ఆ గోడలమధ్య ఉండి పోయేవాడు. అతని ముఖంలో యువక లక్షణాలు నశించాయి. పచ్చని కళ్ళు, గెద్దముక్కులాంటి ముక్కు అతని స్వరూపాన్ని మార్చేశాయి. వాళ్ళతో కలిసినపుడు అతనికింతాజేసి పద్దెనిమిదేళ్ళే. కాని అతని ముఖం చూడగానే అనాదినుంచీ ఇతను బతుక్కొస్తున్నాడా అనిపిస్తుంది. అతని జుట్టప్పుడే తెల్లబడుతోంది. అతన్లో అతనే అయి ఒక్కొక్కప్పుడు వారాలతరబడి ఎవరితోనూ ఒక్కమాటకూడా మాట్లాడేవాడు కాదు. అతన్ని వాళ్ళేమీ చెయ్యలేదు. దెబ్బలాడ్డంలో అతని శక్తిసామర్థ్యాలు వాళ్ళకు తెలుసు; అతనంటే భయపడేవాళ్ళుకూడా.

కలలే అతని ప్రాణం. వాటిమీదనే అతను జీవించేవాడు. ఏదో ఒకరోజున ఈ పడవ పాలస్తీనా తీరం చేరకపోతుందా? అప్పుడతను నీటిలో దూకి ఈదుకుని వడ్డుచేరి, గెలీలీ కొండల్లోకి పారిపోలేకపోతానా అని కలలుకనేవాడు. మూడేళ్ళు గడచినా ఆ రోజు రాలేదు. వాళ్ళు ఏదో ఆఫ్రికారేవును దోచుకున్నారు. అప్పుడు ఇటలీ సమీపంలో మధ్యధరా సముద్రంగుండా ప్రయాణంచేశారు. స్పెయిన్ తీరంలో పోట్లాడారు. రోమన్ల భవనాలు తగలబెట్టారు. అక్కడున్న డబ్బు దోచుకుని ఆ ఇళ్ళల్లోని స్త్రీల నపహరించారు. మళ్ళీ ప్రయాణం సాగించారు. చుట్టూ ప్రహరీగోడలున్న దొంగల పట్నమొకటుంది. అక్కడ శీతాకాలమంతా గడిపారు. జిబ్రాల్టర్ జలసంధి దాటి బ్రిటన్ చేరుకున్నారు. అక్కడ పడవ మరమ్మతులు చేశారు. అక్కణ్ణించి ఐర్లండు వెళ్ళారు. అక్కడ వస్త్రాలు, చవకబారు వజ్రాలు అవీ ఇచ్చి ఐరిష్ అడవిజాతుల ప్రజలు ధరించే బంగారపు నగలు కొనుక్కున్నారు. అప్పుడు గాల్, ఫ్రెంచి సముద్రతీరమంతా తిరిగారు. చివరికి ఆఫ్రికాకి తిరిగొచ్చారు. ఆ విధంగా మూడేళ్ళు గడచినా ఎప్పుడూ ఆ పడవ తన స్వస్థలంవేపు పోలేదు. కాని ఆ కల, ఆ ఆశ అతనితోనే ఉన్నాయి. ఈ సమయంలోనే ఒక్కమనిషి ఎంత గట్టిపడగలడో అంతగానూ గట్టిపడ్డాడు. బాగా రాటుదేరాడు.

ఆ కాలంలోనే అతను చాలా విషయాలు తెలుసుకొన్నాడు. ఈ ప్రపంచానికి అంతులేదని, ఇది చాలా విశాలమయినదని తెలుసుకున్నాడు. ఎక్కడికి వెళితే అక్కడ సామాన్య ప్రజలు తన ప్రజలవలెనే పేదరిక మనుభవిస్తున్నారని తెలుసుకున్నాడు. భూమితో ఏదో అవస్థపడి ఏమాత్రం పండించినా కుటుంబ పోషణ సంగతి ఎలాగున్నా పండించిందంతా తెగ నాయకుడో, రాజో, దోపిడీ దొంగో కాజేసేవారు.

ఆఖరికి పాపం పండింది. రోమను యుద్ధనౌక తటస్థపడింది. చావగా మిగిలిన తనూ, మరో పధ్నాలుగుమంది ఓడ నడిపేవాళ్ళూ ఉరికంబా లెక్కడానికి ఆస్టియా పంపబడ్డారు. అతని జీవయాత్ర అంతటితో సరి. కాని ఆఖరుక్షణంలో కూడ అతన్ని అదృష్టం వరించింది. కేపువా శిక్షణాకేంద్రానికంటూ లెంటులున్ బేటియాటస్ ఏజంటొకడు ఇతన్ని కొనుక్కుపోయాడు.

అతని రెండోదశ ఆ విధంగా గడుస్తున్నది. రోమ్‌లోని సోమరిపోతులు తమాషా చూసి ఆనందించడానికి ఒక లావుపాటి కుత్సితుడైన, దుర్మార్గుడైన వర్తకుడు మరింత ధనార్జనకోసం మనుషులు ఒకళ్ళనొకళ్ళు పొడుచుకచంపుకునే శిక్షణ ఇస్తాడు. అతనొక మల్లుడయ్యాడు. అతని జుట్టు అంటకత్తెర వేశారు. చేతికో కత్తి ఇచ్చి బరిలోకి పంపారు. అక్కడతను చంపేది తన శత్రువులను కాదు. తనవంటి బానిసలనే, తనవంటి దౌర్భాగ్యులనే చంపవలసి వచ్చింది.

ఇక్కడే అతని జ్ఞానంతోబాటు ద్వేషం మరింతగా వృద్ధిగాజొచ్చింది. అతనొక గాదె మాదిరిగా తయారయ్యాడు. ఆ గాదెలో ఎంత ద్వేషమైనా పడుతుంది. రోజురోజుకీ అది నిండుతోంది. భయంకరమైన ఒంటరితనంలో, ఒక గదిలో నిరాశలో అతను బతికేవాడు. ఎప్పుడూ తనలోతానై ఆ గది చీకటిలో అతనుండే వాడు. భగవంతుడంటే ఇక ఏమాత్రం నమ్మకం లేదు. తన తాత తండ్రులు కొలిచిన దేవుణ్ణి గురించి ఎప్పుడు ఆలోచించినా అసహ్యం, ద్వేషం అతనిలో రగుల్కొనేవి.

ఒకమాటు అతని కొక కలొచ్చింది. ఆ కలలో అతను భగవంతుని సింహాసనం దగ్గరగా నిలబడిఉన్నాడు. కాని భయపడలేదు. నువ్వేంచేస్తావోయ్ నన్ను అని వెక్కిరించినట్లు నిర్లక్ష్యంతో గట్టిగా అడిగాడు. "నేను ఇరవైయొక్కేళ్ళు గడిపాను. నువ్వు సృష్టించిన భూలోకంలో నేనుపడ్డ యమయాతన్లనుమించి నువ్వు చేయగలిగిందేమిటి? నా తండ్రిని శిలువెయ్యడం చూశాను. గనుల్లో గొడ్డులా రెండేళ్ళు పనిచేశా. ఓ ఏడాదిపాటు ఓడ అట్టడుగున చెత్తలో, కుళ్ళునీళ్ళల్లో ఎలకలు కాళ్ళమీంచి దాటిపోతుంటే తెడ్డులాగుతూ గడిపాను. మరో మూడేళ్ళు మాతృభూమికోసం కలలుకంటూ దోపిడీ ముఠాలతో వెళ్ళబుచ్చాను. ఇప్పుడు నాలాంటి మనుషులనే చంపడానికి నన్ను అద్దెకు తీసుకుంటున్నారు. ఇంకా నువ్వు చేయగలిగిందేమిటోయ్ నన్ను?"

ఆ కాలంలోనే కేపువా మల్ల శిక్షణకేంద్రానికి ఒక థ్రేషియన్ బానిసను తీసుకొచ్చారు. అతను బహువింతమనిషి. మృదువుగా మాట్లాడే స్వభావం కలవాడు. పగిలిన ముక్కూ, నల్లని కళ్ళు కలవాడు. ఆ విధంగా స్పార్టకస్ అనే మల్లుడి ముఖంతో ఇతనికి పరిచయం కలిగింది.

## 6

ఆ విచిత్రమైన, బాధామయమైన అనంతంలో మల్లుని మనస్సు స్థానంతప్పి, ఏ మూలో పడిపోయింది. క్రమబద్ధంగా, హేతుబద్ధంగా ఆలోచించగల అతనిశక్తి క్రమేపీ నశిస్తోంది. ఉండి ఉండి చీకటిలోంచి ఎగిరివచ్చి మళ్ళీ చీకటిలోనికే మాయమయే గబ్బిలంలా ఎగురుతోంది అతని జ్ఞాపకశక్తి. తన గత జీవితాన్ని బాగా జ్ఞాపకం చేసుకున్నాడు. జీవితాన్ని ప్రత్యక్షంగా తిరిగి జీవిస్తున్నాడు. తన ఆలోచనల్లో తిరిగి ఎంతో

సంభాషిస్తున్నాడు. తన జీవితం నిరర్థకమైనది; పాడుపడ్డది. ఆ జీవితంలో తాను దేన్ని సంరక్షించదలచుకున్నాడో ఆలోచిస్తున్నాడు. కాలం అనేదో చండప్రచండ ఝంఝామారుతం. ఆ పెనుగాలిలో, భూమిమీదనున్న సకల చరాచర జీవకోటినీ తుడిచిపారవేయగల ఆ ఝంఝామారుతంలో అతనొక ఊరూ, పేరూలేని అల్పజీవి. ఒక బానిస.

అతను స్పార్టకస్ వైపు చూసాడు. అతన్ని పరిశీలించాడు. తనో పిల్లిలాగున్నాడు. ఆకుపచ్చని తన కళ్ళే తననో పిల్లిలా కనిపించేటట్లు చేస్తాయి. ఏ మనిషినీ తాను తిన్నగా చూడలేడు. తన కంటి కొలకుల్లోంచి ఓరచూపు చూస్తాడు. ఆ విధంగానే ప్రతిరోజూ స్పార్టకస్‌ను పరిశీలనగా చూస్తున్నాడు. స్పార్టకస్‌లోని ఏ విశేషం తనని ఆకర్షించిందో అతనికే తెలియదు. కాని అదేమీ కనికట్టో, మంత్రమహిమో కాదు. ఇతనెంత బిగుసుకుపోయి, తనలో తనే అయి ఎవడితోనూ మాట్లాడకుండా కూచుంటాడో, స్పార్టకస్ అంత ధారాళంగా, అంత స్వేచ్ఛగా, ప్రతివాడితో మాట్లాడుతూ కలిసి కట్టుగా ఉంటాడు. అందరూ స్పార్టకస్‌తో మాట్లాడతారు. తమ కష్టసుఖాలతనివద్ద వెళ్ళబోసుకుంటారు. ఈ మల్ల శిక్షణా కేంద్రంలోకి స్పార్టకస్ ఏదో ఎక్కిస్తున్నాడు. ఈ కేంద్రాన్ని స్పార్టకస్ నాశనం చేస్తున్నాడు.

ఈ యూదుడు తప్ప తతిమ్మా వాళ్ళంతా స్పార్టకస్ దగ్గరకు వస్తారు. ఇతనెందుకు రాడో అని స్పార్టకస్ ఆశ్చర్యపోతాడు. కసరత్తు విరామ సమయంలో ఒక రోజున అతనే యూదుని వద్దకు వచ్చి మాట్లాడాడు.

"గ్రీకుభాష మాట్లాడగలవయ్యా నువ్వు?" స్పార్టకస్ అడిగాడు.

ఆ ఆకుపచ్చని కళ్ళు కదలకుండా, మెదలకుండా, రెప్పపాటు పడకుండా అతనికేసి అదేపనిగా చూస్తాయి. యూదుడు స్పార్టకస్ ప్రశ్నను విన్నాడు. ఆ ప్రశ్న తనలో తనే ఒకమారనుకున్నాడు. నేను గ్రీకుభాష మాట్లాడగలనా? అన్ని భాషలూ మాట్లాడగలననుకుంటా. హెబ్రూ, గ్రీక్, లాటిన్ ఇవే కాక ప్రపంచంలోని మరెన్నో భాషలు కూడా నేను మాట్లాడగలను. కాని ఏ భాషలోనైనా నే నెందుకు మాట్లాడాలి?

చాలా సౌమ్యంగా స్పార్టకస్ అతన్ని అర్థించాడు: " నే నో మాట, నువ్వో మాట; అంతే. మనం మనుషులం. పైగా ఒంటరిగాలేం. ఒంటరితనం భయంకరమైనది. దుర్భరమైనది. కాని మనం ఇక్కడ ఒకంటరిగా లేం. మన ప్రస్తుత పరిస్థితికి, ఈ దుర్గతికి మనం ఎందుకు సిగ్గుపడాలి? మన మీ విధంగా తయారుకావడం మన స్వయంకృతాపరాధం కాదు. మనం ఈ విధంగా తయారు చేయబడ్డాం. వాళ్ళ వినోదంకోసం మన చేతిలో కత్తులుపెట్టి ఒకళ్ళ నొకళ్ళు పొడుచుకుచావగా చూసి సంతోషించే రోమన్లే విపరీతమైన ఘోరాలు చేసారు. అందువల్ల మనని చూసి మనమే సిగ్గు పడవలసిన అవసరమేముంది? మనను మనం అసహ్యించుకోకూడదు. మనిషిలో కొంచెం శక్తి, కొద్ది ఆశ, కొద్దిగా ప్రేమ ఉంటాయి. అవి ప్రతి మానవునిలోనూ ఉండే పిత్తనాలు. కాని మనిషి వాటిని తనలోనే ...ంటే ఆ ప్రేమను, ఆ శక్తిని, ఆ ఆశను మరొకనికి ఉపయోగించేలా చేయలేకపోతే

ఆ విత్తనాలు మాడిపోయి చచ్చిపోతాయి. అతని కింకేమీ ఉండదు. అతను జీవించి ప్రయోజనం కూడా ఉండదు. అటువంటివాణ్ణి భగవంతుడే రక్షించాలి. మానవమాత్రుడేమీ చేయలేడు. అలా కాకుండా తనశక్తిని, ఆశను, ప్రేమను, ఇతరులకోసం వినియోగిస్తే ఇతరులు కూడా ఇతని కోసం వాటిని విపరీతంగా నిలవచేసి ఉంచారన్న యథార్థాన్ని గ్రహించిన వాడవుతాడు. అప్పుడవి అతనిలో వాడిపోవు, మాడిపోవు. జీవించి ప్రయోజనం ఉంటుంది. ప్రపంచంలో జీవితమే అమూల్యమైనదంటే నమ్ము. అది మనకు తెలుసు. మనం బానిసలం. మనకున్న ఆస్తి అంతా మన జీవితమే. అందుకే జీవితపు విలువ మనకు బాగా తెలుసు. రోమన్లకి రకరకాల చరస్థిరాస్తులున్నాయి. వాటిముందు వాళ్ళకి జీవితం ఓ లెక్కలోనిది కాదు. జీవితపు విలువ శూన్యంగా కనిపిస్తుంది. దానితో వాళ్ళు వినోదం చేస్తారు. ఆటలాడతారు. కాని మనం జీవితాన్ని చాల తీవ్రంగా గ్రహిస్తాం. అందుకే మనం వంటరిగ ఉండకూడదు. నువ్వు చాలా వంటరిగా ఉంటున్నావు. నాతో కొంచెం మాట్లాడు."

అయినా యూదుడేమీ మాట్లాడలేదు. అతని ముఖంలో, కళ్ళలో ఏ విధమైన మార్పూ కన్పించదు. స్పార్టకస్ చెప్పిందంతా విన్నాడు. సావధానంగా, నిశ్శబ్దంగా, జాగ్రత్తగా విన్నాడు. విని వెనక్కుతిరిగి వెళ్ళిపోయాడు. కొన్ని అడుగులువేసి ఆగాడు. తల కొంచెం వెనక్కి తిప్పాడు. ఆ కళ్ళ కొలకుల్లోనించి పరిశీలనగా స్పార్టకస్‌ని చూశాడు. పూర్వం అతనిలో లేనిదేదో, అంతలో కలిగినట్లు భావించాడు స్పార్టకస్. ఒక అగ్నికణం రగుల్కొంది. ఒక భావావేశం పనిచేయసాగింది. ఆశ ఒక కాంతిరేఖలా మెరిసింది.

నాలుగుదశలుగా విభజించబడ్డ అతని జీవితంలో తృతీయదశ ప్రారంభమవుతోంది. ద్వేషం నశించి తోటి మల్లులయందు ప్రేమ, సౌహార్దభావాలు పొడచూపిన ఆశలదశ ఇది. ఇది హఠాత్తుగా ఒకేమారు సంభవించిన మార్పుగాదు. మానవునిలో ఇతనికి నమ్మకం ఒక్కొక్కటై వచ్చి చేరింది. ఆ విధంగా మానవుణ్ణి నమ్మడంవల్ల మానవజీవితాన్ని ప్రేమించగలిగాడు. స్పార్టకస్‌లోని ఆ విశేషమే ఇతన్ని మొదటినించీ ఇంతగా ఆకర్షించింది. ఆ థ్రేషియన్ జీవితాన్ని ఎంతో ప్రేమిస్తాడు. జీవితానికి రక్షకుని వంటివాడు.

స్పార్టకస్‌ని పరిశీలించడంతో ప్రారంభమై అతన్ని అనుసరించేవరకు పోయింది వ్యవహారం. దీన్నతను వెంటనే బాహాటం చేయలేదు. ఎంతో నిగూఢంగా, పై వాళ్ళకు తెలీకుండా ఈ అనుసరణ కానిచ్చేవాడు. కాస్త అవకాశం లభిస్తేచాలు; అతను స్పార్టకస్ పక్కన నిలబడేవాడు. స్పార్టకస్ చెప్పిన మాటలన్నీ వినేవాడు. ఆ మాటలను తనతో కూడా తీసుకు పోయేవాడు. ఒకచోట కూచుని ఆ మాటలను తనలోతాను అనుకుంటాడు. ఆ మాటల్లోని అర్థమేమిటా అని ఆలోచిస్తాడు. ఈ కాలమంతా అతనిలో ఏదో మార్పువస్తోంది. అతను మారుతున్నాడు. పెరుగుతున్నాడు. ‌ ఉమించు ఈ విధంగానే ప్రతి మల్లునిలోనూ ఏదో ఒక మార్పు, ఎంతో కొంత అభివృద్ధి కనిపిస్తాయి. కాని, డేవిడ్ విషయంలో మాత్రం ఆ మార్పు ప్రత్యేకమైనది. అనన్య సామాన్యమైనది. అతనాభగవంతుని వదిలేశాక జీవితంలో

ఒకలోటు పడ్డట్టు బాధపడ్డాడు. ఈ లోటునతడు మానవత్వంతో భర్తీ చేస్తున్నాడు. మానవుణ్ణి ప్రేమించడానికి ప్రయత్నించాడు. మానవుని గొప్పతనాన్ని తెలుసుకున్నాడు. ఇదంతా అతనాలోచిస్తూ కూచోలేదు. అది అతన్లో జరుగుతూ వచ్చింది. ఇలాగే కొంతవరకు తతిమ్మా మల్లుల్లో కూడా జరిగింది.

రోమన్ సెనేటర్లకుకాని, వ్యాపారి బేటియాటస్‌కుగాని ఇవేమీ అర్థమయే విషయాలు కావు. అర్థంలేకుండా, ఆలోచన లేకుండా తిరుగుబాటు బద్దలైందని వారి అభిప్రాయం. వాళ్ళకు తెలిసినంతమట్టుకు ఈ విప్లవానికి జరిగిన ప్రయత్నాలూ లేవు, దానికో చరిత్రా లేదు. అందుకే వాళ్ళు ప్రభుత్వ రికార్డుల్లో ఆ విధంగానే రాసుకున్నారు.

దీనికి చరిత్ర, పూర్వగాథ ఉన్నాయి. సులభగ్రాహ్యం కాని సూక్ష్మ విషయాలతో కూడి వింతగా, విపరీతంగా అభివృద్ధి చెందుతోన్న కారణాలెన్నో ఉన్నాయి. ఒడెస్సీ మహాగ్రంథంలోని గీతాలు స్పార్టకస్ చదవగా మొదటిసారిగా డేవిడ్ విన్నాడు. తన్మయత పొందించగల, మైమరిపించగల సంగీతం దాన్లో ఎంతగా ఉందో! ఎన్నో కష్టాలు సహించి ఎన్నడూ ఓటమిని ఎరుగని ధీశాలి గురించిన కథ అది. ఆ గీతాల్లో చాలా భాగం అతనికిట్టే అర్థమయింది. తన మాతృదేశాన్నించి తీసుకుపోబడి నిర్బంధించబడ్డ జీవియొక్క నిరాశా పూరితమైన బాధ అతనికి తెలుసు. తను విన్న ఈ గీతాల్లోని సంగీతం సూర్యకాంతిలా ఎంతో స్వచ్ఛమైనది. బానిసకు కొడుకై పుట్టిన బానిస ఈ గేయాలన్నిటినీ కంఠస్థం చేసి అప్పచెప్పగలగడం ఎంత ఆశ్చర్యం! పూర్వమెప్పుడైనా ఈ స్పార్టకస్ లాంటి వాడు మరొక డుండేవాడా! అంత సౌమ్యంగా, అంత సహనంతో అంత మృదువుగా ఉండేవాడు మున్నెన్నడైనా ఉన్నాడా?

ఒడెస్సెస్సే స్పార్టకస్ అని అతని మనసులో అనుకున్నాడు. ఓర్మి, తెలివితేటలూ కల ఒడెస్సెస్. అతనికి సంబంధించినంతమటుకు, అతనికి అవగాహనయి నంతమటుకు వాళ్ళిద్దరూ ఒక్కరే. తన జీవితంలో ఆదర్శపురుషుడుగా అనుసరించతగ్గవాడు ఒక్కడే కనపడ్డాడు. అతనే స్పార్టకస్. మొదట్లో తనలో కొత్తగా బయలుదేరుతున్న ఈ భావాన్ని తనే శంకించేవాడు. నువ్వెవ్వడినీ నమ్మకపోతే నిన్నెవడూ మోసం చేయలేడన్నది ప్రారంభంలో ఇతని నమ్మకం. స్పార్టకస్ ఎప్పుడైనా స్పార్టకస్ కాకుండా పోతాడేమోనని చూసేవాడు. స్పార్టకస్ ఎన్నడూ స్పార్టకస్ కాకుండా పోడని క్రమేపీ గుర్తించాడు. అవకాశమొస్తే అంతకన్న హెచ్చుగానే నిలుస్తాడు.

ఇద్దరు రోమన్ పెద్దల వినోదం కోసం తనూ, మరో ముగ్గురు మల్లులూ పోరాట ప్రదర్శనలివ్వాలని బేటియాటస్ ఆజ్ఞాపించాడు. పూర్వమెన్నడూ తననుభవించి ఎరుగని మానసికవ్యథ, వైరుధ్యం అతనిలో ప్రవేశించాయి. అదో కొత్తవ్యథ. ఆ వ్యథనతడు జయించాడు. జయించిన పిమ్మటనే తనచుట్టూ నిర్మించుకున్న ఎత్తయిన గోడలు మెల్లిమెల్లిగా పడిపోవడం ప్రారంభించాయి. ఆ పరిస్థితిని కూడా అతనా శిలువమీద ఆలోచించసాగాడు.

ఆలోచించడమే కాదు. తిరిగి తా నా పరిస్థితుల్లో జీవిస్తున్నట్లు భావించాడు. నాలుగు సంవత్సరాల క్రితం తనలో తాననుకున్న మాటలు బాధల మూటలుగా శిలువపై వేలాడే అతని పొడి ఆరిపోయిన పెదవులనుండి పైకొచ్చాయి.

ప్రపంచంలోకల్లా పరమ దౌర్భాగ్యుణ్ణి నేను. కాకపోతే నే నెంతో ప్రేమించిన సోదరుణ్ణి పొడిచి చంపమని నన్నే ఎందుకు నియోగించారు. ఎంత దారుణమై దురదృష్ట మిది. కాని వాళ్ళను నేను సంతృప్తిపరచను. ఇక వాళ్ళకోసం ఈ ప్రదర్శనలివ్వబోను. నన్ను వాళ్ళు చంపేస్తారు. ఎప్పుడో అప్పుడు నన్ను వాళ్ళు చంపడం తథ్యం. మిన్ను విరిగి మన్ను మీదపడ్డా నేను నా సోదరుని నా చేతులతో చంపుతానా?

వ్యధతో కుంగి, బాధతో బద్దలైన అతని మనసు పూర్వం జరిగినదంతా ఏరి, ప్రతిముక్కనూ అతికి తిరిగి అత నా కాలంలో జీవిస్తున్నట్లు భావించేలా చేసింది. మల్లుల శిక్షకులను భోజనశాలలో కడతేర్చారు. కత్తులతో, ఒట్టి చేతులతో వాళ్ళు పటాలాలతో పోట్లాడారు. పల్లెప్రాంతాలలో పర్యటించారు. తోటలలోని బానిసలు వాళ్ళతో కలిశారు. అర్ధరాత్రి హఠాత్తుగ పట్టణ పటాలాలపై పడి అందరినీ నిర్మూలించారు. వాళ్ళ ఆయుధాలనూ, కవచాలనూ తీసుకున్నారు. ఎర్రగా మండేమంటలను బంతిగాచేసి ఆ బంతిని కాలంలోకి విసిరేసినట్లున్నాయి అతని ఆలోచనలు. అవి క్రమబద్ధంగాకాని, హేతుబద్ధంగాకాని లేని ఆలోచనలు. ఆలోచనలలో అతను తన గత జీవితాన్ని మరోమారు జీవిస్తున్నాడు.

వాళ్ళ రెండో పోరాటం జరుగుతోంది. బానిసలు మహాసైన్యంలా కనిపిస్తున్నారు. పదివేల రోమన్ల ఆయుధాలను, కవచాలనూ వాళ్ళు స్వాధీనపర్చుకుని ధరించారు. వందమంది ఒక విభాగంగా, అయిదు వందలమంది ఒక భాగంగా విభజింపబడ్డారు. రాత్రిళ్ళు వాళ్ళు బసచేసేమకాం చుట్టూ కందకం ఉంటుంది. రోమను సైన్యాలు ఏర్పాటు చేసుకునే మకాం లాగానే ఉంటాయి అవి. రోమన్లలా ఈటెలు విసరడం, వాటి నుపయోగించడం గంటలతరబడి సాధనచేసి అలవర్చుకుంటున్నారు. తాము చేసింది ప్రపంచంలో నలుమూలలా తెలిసింది, ప్రపంచాన్ని భయాందోళనలతో నింపింది. ప్రతి బానిస గుడిసెలోనూ, ప్రతి బానిస బారకాసులోనూ ఎవరో ఒకరి పెదవులపై స్పార్టకస్ అనేమాట వినిపిస్తూనే ఉంటుంది. అతనే ప్రపంచానికి నిప్పు ముట్టించాడు. అతనికో బ్రహ్మాండమైన సేన ఒకటి ఉంది. త్వరలో అతడు రోమ్ మీద దండెత్తుతాడు. క్రోధోద్దీపిత మనస్కుడై రోమ్ నిర్మించిన ప్రహరీగోడలు బద్దలుచేస్తాడు. అతనెక్కడికి వెళితే అక్కడ బానిసలకు దాస్యబంధవిముక్తి కలుగ చేస్తాడు. ఆ విముక్తి బానిసలకు జీవితంలో రక్తి కలిగిస్తుంది. దోపిడీచేసేవాళ్ళ దగ్గరనుంచి కొల్లగొట్టిన వస్తువులూ, ధనమూ అంతా సమిష్టి ఆస్తిగా పరిగణించబడుతుంది. అందరికీ చెందేలా సమిష్టి ధనాగారాల్లో ఉంచబడుతుంది. పూర్వం ఒకప్పుడు ఏవిధంగా ఆస్తిపాస్తులన్నీ ఏ ఒకడికోకాక తెగ అంతటికీ చెంది ఉండేవో ఇకముందుకూడా అలాగే ఉండబోతోంది. ఏ ఒక్కడూ ధనవంతుడుకాడు. అతని సైనికులకు ఆయుధాలు, తొడుక్కున్న బట్టలు, జోళ్ళు

తప్ప మరే ఆస్తీ లేదు. అదీ స్పార్టకస్ అంటే.

తనిప్పుడు బానిసల నాయకునితో మాట్లాడుతున్నాడు.

"స్పార్టకస్. నేను బాగా దెబ్బలాడగలను కదూ?"

"బాగా! చాలా బాగా దెబ్బలాడగలవు నువ్వు."

"నేనెప్పుడేనా వెన్నిచ్చి పారిపోయానా?"

"లేదు."

"నా చెవి తెగిపోయినపుడు కూడా పళ్ళు బిగపట్టి బాధ నణుచుకున్నానే కాని నొప్పితో అరిచానా?"

"నొప్పి పెట్టి ఏడవడమన్నది అవమానకరమైన విషయమేమీకాదు" స్పార్టకస్ అంటున్నాడు : "బలవంతులైన వాళ్ళు కూడా నొప్పితో ఏడవగా చూశాను. కోపంవల్ల కూడా ఏడుస్తారువాళ్ళు. అదేమీ అవమానంకాదు."

"ఎప్పటికో అప్పటికి నేనూ నీలాగే అవుతా." "నువ్వు నాకన్నా బాగా అవుతావు. నాకన్నా బాగా దెబ్బలాడగలవు నువ్వు."

"నిన్నొక విషయం అడగదలుచుకున్నా. నన్ను నువ్వెపుడూ నీ పక్కనే ఉంచుకోవాలి. యుద్ధభూమిలో ఎప్పుడూ నీ పక్కనే ఉండాలని ఉంది నాకు. నిన్ను మేం పోగొట్టుకుంటే ఉద్యమం అంతా పోగొట్టుకున్నట్లే. మా ఒకళ్ళకోసమే మేం యుద్ధం చేయటం లేదు. ఈ ప్రపంచమంతటికోసం పోరాడుతున్నాం. అందుకే మనమెప్పుడు పోరాటానికి కెళ్ళినా నీ పక్కనే నన్నుండనియ్యి."

"నా పక్కన నిలబడ్డంకన్నా ముఖ్యమైన పనులున్నాయి చేయడానికి. సైన్యానికి నాయకత్వం వహించగల వాళ్ళు కావాలి మనకి."

"అందరికీ నువ్వు కావాలి. నే నడిగేది ఏమంత పెద్దవిషయమా?"

స్పార్టకస్ తలూపాడు.

"ఇంక నీకే అపాయమూ జరుగకుండా రాత్రింబవళ్ళూ నీ క్కాపలా కాస్తా."

ఆ విధంగా అతను బానిసల నాయకుడికి కుడిభుజమయాడు. తన జీవిత మంతటిలోనూ రక్తపాతం, శరీరశ్రమ, దౌర్జన్యమూ తప్ప మరేమీ తెలియని డేవిడ్ ఇప్పుడే అరుణ ప్రభాత స్వర్ణమయకాంతులతో ఆకాశం తెరుచుకున్నట్లు భావించాడు. వాళ్ళ తిరుగుబాటు ఫలితంగా రాబోయేదేదో అతని కిప్పుడిప్పుడే తెలుస్తోంది. ఈ ప్రపంచంలో చాలామంది బానిసలే. కాబట్టి వాళ్ళంతా అనతికాలంలో ఒక మహాశక్తిగా విజృంభించొచ్చు. అప్పుడు జాతివిచక్షణలూ, ప్రపంచాన్ని పాలించే మహానగరాలూ కనిపించకుండా పోతాయి. తిరిగి మళ్ళీ స్వర్ణయుగం ఉదయిస్తుంది. ఆ యుగంలో మనుషులు పాపాలు చేయరు. ఒకరినొకరు ద్వేషించుకోరు. దాస్యబంధం తెగిపోయి ప్రేమబంధాలలో శాంతియుతంగా, ఐక్యతతో, హాయిగా బతకగలరు. స్పార్టకస్, అతని అనుచరులూ ఈ ప్రపంచాన్ని

జయించినపుడు తిరిగి ఆ స్వర్ణయుగం నిర్మాణమవుతుంది. శిలువలు నేలకేసి విరగ్గొట్టగా పుట్టిన శబ్దంతో, విజయ ధ్వనులతో ఉత్కంఠులై, కోటానుకోట్ల ప్రజలు గొంతులు కలిపి పాడుతున్న గీతికా సంగీతతరంగాలలో నూతనయుగా గమనం, వినూత్న శకారంభం జరుగుతుంది; జరిగితీరుతుంది.

ఆ విధంగా, అంత బాధలోనూ, ఒక్కొక్కప్పుడా మల్లుడు జరిగిన ప్రతి అంశాన్ని స్పష్టంగా చూడగలిగేవాడు. తదితర సమయాల్లో అతని ఆలోచనలు అతి ఘోరంగా భయావహంగా ఉండేవి. యుద్ధాన్ని గురించి ఎప్పుడాలోచించినా అదో పీడకలలా తోచేది. రక్తపాతం, బాధల పెడబొబ్బలూ, హాహాకారం, భయోత్పాతంవల్ల ప్రళయరుద్రులైన జనసందోహం పట్టలేని మహా సంచలనంలో ఉన్నట్లు కనిపించేది. మొదటి రెండు సంవత్సరాల కాలంలో వాళ్ళొక విషయం గుర్తించారు. రోము ప్రపంచంలో అసంఖ్యాకమైన బానిసలతోనిండిఉన్నా, వాళ్ళందరూ విప్లవంలో చేరరన్న విషయం వాళ్ళు గ్రహించారు. సాధ్యమైనంత బలాన్ని వాళ్ళు సమీకరించుకున్నారు. కాని రోమ్ బలాలకు అంతెక్కడ. ఆ కాలంలో జరిగిన ఒక యుద్ధం జ్ఞాపకం వచ్చిందతనికి. అది సంకులసమరం; భీకరయుద్ధం. ఆ యుద్ధంలో ఎన్నో వేలమంది పాల్గొన్నారు. ఈ యుద్ధం ఏ విధంగా పరిణమిస్తుందా అని ఆలోచిస్తూ స్పార్టకస్, తక్కిన సైనికాధికారులు ఒకచోట కూచున్నారు. ఇత నిలా ఆలోచనల్లో, స్మృతుల్లో పడితేలుతూంటే, కేపువా పౌరులు శిలువమీద నున్న మల్లుణ్ని పరిశీలిస్తున్నారు. అతని శరీరం మెలికలు తిరిగి కొట్టుకొంటూ ఉంది. నోటినుండి తెల్లని నురుగులాంటి చొంగ కారుతోంది. ప్రతి అవయవమూ బాధతో గిలగిల కొట్టుకుంటోంది.

వాళ్ళల్లో వాళ్ళనుకున్నారు : "ఇంక అట్టేకాలం పట్టేట్టులేదు. చావు దగ్గిరబడింది."

పొడుగాటి కొండపై వాళ్ళు మకాం చేశారు. ఆ కొండకి ఇరువేపులా వంపు తిరిగి వాలుగాఉంది. కొండ నడిభాగాన వాళ్ళ కాల్బలాలున్నాయి. ఒక మైలు పొడుగన్నా ఉన్నాయి ఆ దళాలు. రోమను సైన్యాలు కొంతదూరంలో ఉన్నాయి. సేనలమధ్య స్పార్టకస్ శిబిరముంది. ఒక ఎత్తయిన మిట్టమీద ఉన్న తెల్లని గుడారంలో అక్కడినుంచి చూస్తే చుట్టూరాఉన్న ప్రదేశమంతా కనిపిస్తుంది. సేనానిశిబిరంలో ఉండవలసిన హంగులన్నీ అక్కడుంటాయి. అక్కడ జరగవలసిన దినచర్య అంతా అమల్లో ఉంటుంది. కాగితాలు, రాతసామాగ్రి పుచ్చుకుని కార్యదర్శి ఒకడు సిద్ధంగా ఉంటాడు. ఏభైమంది వార్తాహరులు అక్కడ సిద్ధంగా ఉంటారు. రణరంగంలో ఏ మూలకు వార్త పంపాల్సివచ్చినా ఆ యుద్ధాన్ని దూసుకపోయి వార్తలు చేరవేయగల సాహసులు వాళ్లు. శిబిరం పక్క ఒక ధ్వజం పాతబడి ఉంది. రంగు రంగుల జెండాలు పుచ్చుకుని సంజ్ఞలతో విషయాలను తెలియజేసేవా డొకడున్నాడు. ఆ పెద్ద శిబిరం మధ్య పొడుగాటి మేజాపై ఒక పటముంది. ఆ మేజా చుట్టూ సేనానాయకులు నిలబడి శత్రుసేనల బలాన్ని అంచనా వేస్తారు. సమాచారాలు సేకరిస్తారు. ఆ మేజాచుట్టూ ఎనమండుగురుంటారు. ఒక చివర స్పార్టకస్ నిలబడిఉన్నాడు. అతని పక్కనే డేవిడ్ ఉంటాడు.

స్పార్టకస్ ముఖం చూసిన వాళ్ళకి అతను నలభైఏళ్ళ వాడనిపిస్తోంది. అతని ఉంగరాలజుట్టు అక్కడక్కడా తెల్లబడింది. పూర్వంకన్న చిక్కిపోయాడు. నిద్ర తక్కువవడం వల్ల కళ్ళు లోతుకుపోయాయి. ఆ కళ్ల కిందిభాగం గుండ్రంగా నల్లబడి ఉంటుంది.

చూసినవాళ్లెవరైనా కాలం అతన్నందుకుంటోంది అంటారు. సరిగ్గా చెప్పాలంటే అతని భుజాలమీద కూచుని కాలం స్వారీచేస్తోంది. ఎందుకంటారేమో! ఎన్నో శతాబ్దాలు గడచి పోనీ, ప్రపంచం ఎంతో దూరం, ఎన్నో మెలికలు తిరిగి సాగిపోనీ, ఆ వ్యక్తిని మాత్రం మరిచిపోదు. కొద్దికాలం క్రితం అతనొక బానిస. కాని ఈ రోజున అతని పేరు తెలీనివాడు లేడు. తానే విధంగా తయారయ్యాడన్న విషయం కూచుని కాస్సేపాలోచించడానిక్కూడా అతనికి తీరుబడిలేదు. రెండు సంవత్సరాల క్రితం ఉన్నట్లు లేడు ఈ రోజున. ప్రస్తుతం అతను 50 వేల సైనికులకు సర్వసేనాని. ఆ సైన్యం కొన్ని విషయాల్లో చూస్తే ప్రపంచంలో సైన్యాలన్నిటికన్నా ఉత్తమమైనది.

స్వతంత్ర సాధనకోసం పోరాడే సైన్యమది. ఈ సైన్యం మానవస్వాతంత్రం కోసం మానవుల హక్కులకోసం, మానమర్యాదలకోసం పోరాడుతోంది. ఈ సైన్యానికో దేశం లేదు. ఒక నగరం లేదు. ప్రతి నగరమూ వాళ్ళదే, ప్రతిదేశమూ వాళ్ళదే. ఇక్కడి ప్రతిసైనికుడికీ బానిసత్వం వారసత్వంగా లభించింది. మానవుణ్ణి బానిసగామార్చే దానవస్వభావంగల నరపశువులంటే ఇక్కడి ప్రతివాడికీ ద్వేషం ఉంది. ఈ సైన్యం తప్పక విజయం పొందాల్సిన సైన్యం. ఓడి పోయిన పక్షంలో వాళ్లకు వెనక్కుతిరిగిపోడానికి వంతెనలు, రహదారులు సిద్ధంగా ఉండవు. పైగా వెనక్కుపోడానికి వాళ్ళకో దేశం, ఒక నగరం అంటూ ఏదీ లేదు. ఏ దేశానికి పోయినా ఎవరో వాళ్ళకు రక్షణ ఇచ్చి కాపాడారు. అది చరిత్రలో మార్పుతెచ్చిన క్షణం. అదో ప్రారంభం. ఒక నూతన చైతన్యం. ఒక ఉత్పాతం. ఒక ఉల్కాపాతం. పిడుగులతో ధ్వనించి ప్రపంచాన్ని ఊపిపారేసింది. కళ్ళు మిరుమిట్లుగొల్పే సహస్ర సూర్యకాంతిని మించిన తన విజయం ఈ ప్రపంచాన్నే మార్చే దుష్టశక్తుల ఘోరపరాజయమని గ్రహించిన సైన్యమది. అందుకే అది ఈ ప్రపంచాన్ని మార్చాలి. లేదా దానికి విజయం లభించడం దుర్లభం.

పటాన్ని చూస్తూ నిలబడ్డ స్పార్టకస్ బహుశా ఈ సైన్యం ఎలా వచ్చిందా అని ఆలోచిస్తూ ఉండవచ్చు. ఈ బానిసలను సుశిక్షితులైన సైనికులుగా తయారుచేయడానికీ, వాళ్ళందరినీ ఒకరితో ఒకరు కలిసి పనిచేసేటట్లు చేయడానికీ, అందరూకలిసి ఆలోచించే పరిస్థితి తీసుకురావడానికీ ఎంత అవస్థ అయిందా అని ఆలోచించాడు. ఎర్రని జుట్టు గల క్రిక్సస్‌ని చూసాడు. అతనొక గాల్. మచ్చలున్న అతని ఎర్రనిముఖంలో నీలపుకళ్లు పొదగబడి ఉన్నాయి. గెడ్డందాకా, ఇంకా కిందుగా కూడా పచ్చని మీసం వంపుతిరిగి వేలాడుతోంది. తన బాల్య స్నేహితుడు గేనికస్ కూడా ఉన్నాడు. అక్కడే కాస్టస్, ఫ్రాక్సస్‌లూ, ఉన్నతమైన భుజాలు కలిగిన ఆఫ్రికావాడు నార్డో, మంచి తెలివితేటలు కలిగి సున్నితంగా కనబడే మొజార్, యూదుడైన డేవిడ్ ఉన్నారు.

"మనం చెయ్యాల్సిందేదో చూడాలి కాని ఇక్కడ నిలబడి రోజస్తమానూ లోయ కవతల శత్రుసైన్యం ఎంతుందా అని మీనమేషాలు లెక్కెడితే వచ్చే లాభమేమిటి?"

"అబ్బో! ఇది చాలా పెద్దసైన్యం" గేనికస్ అన్నాడు. "మనం ఇదివరకు చూసినవాటి అన్నిటికన్న, పోరాడినవాటన్నిటికన్నా అది చాలా పెద్దసైన్యం. లెక్క పెట్టనవసరం లేకుండగానే తెలుస్తోంది. అదో పది అక్షోహిణీల సేన. గాల్ నుండి ఏడో దళాన్నీ, ఎనిమిదో దళాన్నీ తెప్పించారు వాళ్ళు. ఆఫ్రికానుంచి మూడూ, స్పెయిన్నుండి రెండూ దిగుమతి అయాయి. నేను పుట్టాక అంత సైన్యాన్ని ఎప్పుడూ చూడలేదు. అద్దరిని డెబ్బై వేల మందికి తక్కువ ఉండరు."

క్రిక్సస్ని అభిప్రాయమడిగితే "ఆఁ ఏముంది? ఈ ప్రపంచాన్నే జయించి పారేస్తాం" అంటాడు. అతనికి ఉన్నదల్లా ఒకే ఒక నినాదం: రోమ్ ఛలో. "ప్రతి ఒక్క ఎలుకను పట్టుకు చంపుతూ కూచోడంకన్న ఈ ఎలుక కన్నాల్నే ఎందుకు తవ్విపారెయ్య కూడదూ" అదీ అతని ప్రశ్న.

అప్పుడు ఈజిప్టు దేశస్థుడు మొజార్ అన్నాడు: "క్రిక్సస్ చెప్పినదానితో మొట్టమొదటిసారిగా నే నేకీభవిస్తున్నాను. అవతలో మహాసైన్యం ఉంది. దాన్ని ఎప్పుడో ఒకప్పుడు ఎదుర్కొని తీరాలి. ఇప్పుడే అయితే మంచిది. మనం ఇలాగే కూచున్నామే అనుకోండి; వాళ్ళు మనకన్న చాలాబాగా కూచోగలరు. కూచున్నా వాళ్ళకి తిండీ అన్నీ సరఫరా అవుతాయి. కాని మనం కూర్చున్నామంటే మాత్రం దగ్గరున్న కాస్త తిండీ నిండు కుంటుంది. తరువాత మాడి చావాల్సివస్తుంది. మనం ఈ ప్రదేశం వదలి వెనక్కి తగ్గేమా వాళ్ళకంతకన్న కావల్సిందేముంది?"

"వాళ్ళెంతమందని నీ అభిప్రాయం?" స్పార్టకస్ ప్రశ్నించాడు.

"డెబ్బైవేలు."

స్పార్టకస్ ఆలోచనా పూర్వకంగా తల ఊపాడు. "నువ్వన్నదే రైటు. వాళ్ళను మనం ఎదుర్కోవల్సిందే."

మూడు గంటలలో రోమన్ సైన్యాలను ఎదుర్కొందామని వాళ్ళనుకున్నారు కాని యుద్ధం అంతకన్న ముందే ప్రారంభమైంది. ఈ సేనాధిపతులు వాళ్ళ వాళ్ళ దళాలు చేరుకొన్నారో లేదో అప్పుడే రోమన్లు బానిసల మధ్య శ్రేణిని ఢీకొన్నారు. పెద్ద వ్యూహాలూ, ఎత్తుగడలూ ఏవీ లేవు. బాణంలావచ్చి ఒక రోమను దళం వీళ్ళను తాకింది. దాని వెనుకనే మహాశక్తి వంతమైన రోమను దళాలనేకం వచ్చి యుద్ధానికి ప్రాణంపోసాయి. స్పార్టకస్ పక్కనే డేవిడ్ ఉన్నాడు. అతడు తన సైన్యాలను అదుపులోనికి తెచ్చుకోడానికే ఒకగంట పట్టింది. అంతదాకా అంతా గందరగోళమే. అప్పుడే యుద్ధం పీకలదాకా వచ్చేసింది. ఇంటి నడికొప్పు అంటుకుంది. పీడకల ప్రారంభమైంది. సేనాని శిబిరం తుత్తునియలైపోయింది. ఒక మహాసముద్రంలో తేలుతున్నట్లున్నారు వాళ్ళు. స్పార్టకస్ చుట్టూ పెనుతుఫాను రేగింది.

అది సమరం. తానిప్పు డా సమరంలోనే ఉన్నట్లు తెలుసుకున్నాడు డేవిడ్. ఎవడిమటుకు వాడు, శత్రుసైన్యంలో ఎవడినో ఒకడిని ఎంచుకుని యుద్ధం చేస్తున్నాడు. అందుకే ఇదొక సంకులసమరం. స్పార్టకస్ నాయకుడుగా కాక సామాన్య సైనికుడు పట్టుకునే ఒక చతురస్రాకారపు డాలూ, కత్తీ పుచ్చుకుని పోరాడే మామూలు సిపాయి. మతిపోయిన వాడిలా పోరాడేస్తున్నాడు. అతని కీ యుద్ధం అంటే ఎంతో ఇష్టమని డేవిడ్‌కి తెలుసు. బానిస విముక్తికోసం సాగే యుద్ధాన్ని అతనెంతగా ప్రేమిస్తాడు! బెబ్బులిలా పోరాడుతున్నాడతను. అతను పాడేపాటలలోని వీరయోధుడిలా పోరాడుతున్నాడు.

తనుకూడా అంతే భయంకరంగా పోరాడుతున్నాడని అత నెరుగడు. బల్లెం స్పార్టకస్‌కు తగలాలంటే ముందు తను చావాలి. అలసట ఎరుగని పులిలాగున్నాడు. అతని చేతిలో కత్తి పులిపంజాలాగుంది. స్పార్టకస్ ఇక్కడే ఉన్నాడని రోమన్లకు కూడా తెలుసు. అందుకే మూకఉమ్మడిగా అతని సైన్యాలమీద పడ్డారు. బానిససైన్యాలను చీల్చి చెండాడి స్పార్టకస్ మహారాక్షసుని కుత్తుకనుత్తరించి పీడ వదుల్చుకుందామన్న పట్టుదలతో సమరం సాగిస్తున్నారు. బానిసలు నేల ఈనినట్లు వచ్చిపడుతున్నారు; రణరంగం మీదకు చొచ్చుకొస్తున్నారు. శత్రుశ్రేణులలోకి జొరబడుతున్నారు. స్పార్టకస్ పేరును బానిసలొక పతాకంలా ఎగరేస్తున్నారు గాలిలో. అది రెపరెపలాడుతూ ఆ వాతావరణం అంతటా తన ప్రభావాన్ని కనబరుస్తోంది. స్పార్టకస్! ఆమాట మైళ్ళదూరం వినిపిస్తోంది.

యుద్ధం మరింత భీకరస్వరూపం దాల్చింది. రెండుమైళ్ళ పొడుగున ఎటుచూచినా ఈ యుద్ధమేననీ, అంతటా ఇది వ్యాపించిందనీ డేవిడ్‌కి తెలియదు. రెండు రోమన్ దళాలను క్రిక్సస్ చావగొట్టి తరిమి పారేసిన సంగతికూడా అతనికి తెలియదు. తన చేతిలోని కత్తీ, పక్కన స్పార్టకస్ సురక్షితంగా ఉన్నాడా లేదా అన్న సంగతి మటుకే అతనికి తెలుసు. మోకాలంత ఎత్తున ఒత్తుగా పెరిగిన మెత్తని గడ్డిలో తను నడిచేవరకూ ఆ కొండదిగువదాకా తమ సైన్యం రోమన్లను తరుముకొచ్చిన సంగతి అతనికి తెలియనేతెలియదు. వాళ్ళాలోయలో ఉన్నారు. అక్కడ నదిలో ఇరుపక్షాలవారూ ఉన్నారు. మోకాలు లోతు నీళ్ళలో వాళ్ళు నిలబడి పోరాడుతున్నారు. నదిలో నీరు ఎర్రని రక్తంలా ప్రవహిస్తోంది. సూర్యుడు అస్తమించాడు. ఆకసమంతా ఎర్రవారింది. చీకటిపడి పోరాటం కొద్దిగా తగ్గినట్టు అనిపించినా యుద్ధం మాత్రం ఆగలేదు.

తెల్లవారింది. రోమన్లదాడి విఫలమైంది. ఇంతకుపూర్వం ఎవరైనా ఈ బానిసలవంటి యుద్ధ ప్రియుల నెదిరించారా! ఎంతమందిని చంపినాసరే కేకలతో, పెడబొబ్బలతో మరో ఇంతమంది తయారు. వాళ్ళు మనుషులుకారు. కత్తితో పొడిచి పొట్టలోని పేగులను పైకితీసి చంపినా, కిందపడి కూడా కాళ్ళు పట్టుకు యమయాతన పెడతారు. వాళ్ళనొదుల్చుకోవాలంటే కిందపడ్డవాడినైనాసరే చేతులు పీకేవరకూ పొడిచి మరీ చంపాలి. మామూలుగా మరొక మనిషే అయితే ఆమాత్రం ఈమాత్రం దెబ్బతగిలితే కిందపడి పాకుకుంటూ యుద్ధ

రంగంనుంచి దూరంగా పోతాడు. కాని ఈ బానిసలు ప్రతి చుక్కరక్తమూ పోయేవరకూ, శరీరంలోని ప్రతిఅణువు శక్తీ నశించేవరకూ పోరాడుతూనే ఉంటారు. మరొకరెవ్వరైనా అయితే చీకటిపడ్డాక యుద్ధానికో దండం పెట్టిపోతారు. కాని ఈ బానిసలకు పగలూలేదు, రాత్రి లేదు. విరామం లేకుండా అదేపనిగా పోట్లాడడమే వాళ్ళపని.

ఈ విధంగా ఆలోచించగా రోమన్లలో భయం వ్యాపించింది, ఈ భయానికి విత్తులు పూర్వమెన్నడో చల్లబడి ఉన్నాయి. ఇప్పుడవి మొలకలెత్తుతున్నాయి. బానిసలంటే భయం. బానిసలతోపాటే జీవిస్తారు. కాని బానిసలను నమ్మరు. వాళ్లుకూడా ఈ సంఘంలోనే ఉన్నారు. కాని అదే సంఘానికి బైటనున్నారు. ప్రతిరోజూ వాళ్లు చిరునవ్వు నవ్వుతూనే ఉంటారు. కాని ఆ నవ్వువెనుక విపరీతమైన ద్వేషం ఉంది. వాళ్ళెప్పుడూ నిన్ను చంపడానికి ఆలోచిస్తూ ఉంటారు. వాళ్ళకు ద్వేషం పుట్టిల్లు. ఆ ద్వేషంలోనే పుట్టి, పెరిగి వృద్ధిచెందుతారు. దేనికోసమో వాళ్ళు నిరీక్షిస్తారు. వాళ్ళది అనంతమైన ఓరిమి. అపారమైన జ్ఞాపకశక్తి. యుద్ధం జరుగుతుండగా ఆలోచించడమే కష్టం. కాని ఆలోచించడానికి అవకాశం వచ్చినపుడు ముందుగా రోమన్ల మెదడులో మెదిలిన ఆలోచన లివే.

వాళ్ళు అలసిపోయారు. డాళ్లు పట్టుకోడానికి, కత్తులు మోయడానికి కావలసిన కనీస శక్తి కూడా వాళ్ళల్లోలేదు. కాని ఈ బానిసలకు మాత్రం బడలిక అనేది లేదు. ఇక్కడొక పదిమంది బానిసలు తయారౌతారు. అక్కడో వంద. వంద వెయ్యిగా మారుతుంది. వెయ్యి పదివేలవుతుంది. అక్కడి కొండల్లోనుంచీ, ప్రతి రాతినుంచీ, ప్రతి చెట్టు కొమ్మలోంచీ, మనుషులు పుట్టుకొస్తున్నారా అన్నట్లుంది. రోమన్ సైన్యాలు భయాందోళనలకు దాస్యం వహించాయి. ఆ భీతిలో వాళ్లు కాళ్ళకు బుద్ధిచెప్పి లంకించుకున్నారు. పారిపోయే సైనికుల్ని పట్టుకుని వీరత్వం నూరబోయారు కొందరు సైనికోద్యోగులు. సైనికులా ఛాందసపు ఉద్యోగులను చంపిపారేశారు. భయంతో అరుస్తూ, రొప్పుతూ, రోజుతూ, పడుతూలేస్తూ బానిసల బారినుండి తప్పించుకు పారిపోతున్నారు. వాళ్ళను వెన్నంటి తరుముకొస్తున్నారు బానిసలు. నడుం విరిగి వీపులమీద గాయాలతో వేలకొద్దీ రోమన్ సైనికులు చాపచుట్టలులా పడిఉన్నారు. కొంత దూరం వరకూ నేల కనబడదు. ఎటుచూసినా ఈ సైనికుల కళేబరాలే!

క్రిక్సస్, తదితరులూ స్పార్టకస్‌ని చూడ్డానికొచ్చేసరికి అతనిపక్కనే యూదుడు కూడా ఉన్నాడు. చచ్చి పడిఉన్న శవాలమధ్య పడుకుని స్పార్టకస్ నిద్రపోతున్నాడు. కత్తి చేతబట్టిన యూదుడా పక్కనే నిలబడి ఉన్నాడు. "అతన్ని పడుకోనివ్వండి" అంటాడు యూదుడు. "ఇదో ఘనవిజయం. పాపం అతన్ని పడుకో నివ్వండి."

అదే ఘనవిజయంకోసం పదివేలమంది బానిస వీరులను బలిదానం చెయ్యాల్సి వచ్చింది. కాక రోమన్ సైన్యాలకు అంతెక్కడ. ఇది పోతే మరికొన్ని సైనికదళాలు సిద్ధం - ఇంతకన్న పెద్దవే.

# 7

తనకు ప్రాణంపోయే కాలం సమీపిస్తోందని తెలిసినపిమ్మట మల్లునికి దేనిలోనూ ఆసక్తిలేకుండా పోయింది. శిలువ వేయడమన్నది ఎంతో గొప్ప పద్ధతి, చాలా మంచిది అని గట్టిగా నమ్మిన ఒక పదిమందీ, కూడూ గూడూలేక బేవార్సుగా తిరిగే ముష్టివాళ్ళు కొందరూ తప్ప అక్కడ ఇంక ప్రేక్షకు లెవరూ లేరు. కేపువాలో ప్రజలకోసం ఎన్నో వినోదప్రదర్శనా లివ్వబడతాయి; కాని ఈ ముష్టివాళ్ళను అక్కడికి చేరనిచ్చే దెవరు? ప్రస్తుతం కేపువాలో గుఱ్ఱపు పందాలు జరగడం లేదు కాని అక్కడి రెండు గోదాలలో ఏదో ఒక కార్యక్రమం ఉంటూనే ఉంటుంది. సంవత్సరానికి కనీసం మూడువందల రోజులయినా మల్లయుద్ధ ప్రదర్శనాలు ఏర్పాటు చేయగలమని గర్విస్తారు. పైగా కేపువా యాత్రాస్థలం. అక్కడ ఎప్పుడూ చాలామంది యాత్రీకులుంటారు. మంచి నాటకశాల ఒకటుందక్కడ. వేశ్యావృత్తి అక్కడ పెద్దఎత్తున జరుగుతుంది. ప్రపంచంలో ఎన్ని దేశాలు, ఎన్ని జాతులు ఉన్నాయో అన్నింటికీ సంబంధించిన వేశ్యలున్నారక్కడ. కేపువా పట్టణంయొక్క పేరుప్రతిష్ఠలు కాపాడడానికీ, పెంచడానికీ, ఈ వేశ్యలకు పడుపువృత్తిలో ఆధునిక పద్ధుతులలో చక్కని తర్ఫీదు ఇస్తారు. అత్తరు బజార్లూ, స్నానశాలలూ, భోగ్యవస్తువులు లభ్యమయ్యే అంగళ్లూ, జలక్రీడాస్థలాలూ ఒకటేమిటి; ఎన్నెన్నో ఉన్నాయక్కడ.

అందువల్లనే చావడానికి సిద్ధంగాఉన్న ఒక బానిస వాళ్ళల్లో ఆసక్తిని రేకెత్తించలేక పోయాడు. అదికూడా ఒక వింతే. ఐనా ఇంతకన్న వింత మరొకచోట ఉండగా దీన్ని చూస్తూ కాలం వృథాచెయ్యడానికి ఎవరికి మనస్కరిస్తుంది? ఏరివేత పద్ధతిని ఏర్పాటు చేయబడ్డ మల్లయుద్ధాలలో ఎంతోమంది మల్లులను జయించిన జగజ్జెట్టిని ఇక్కడ శిలువవేశారు కనుక చూడవచ్చారు కాని, మరొక సాధారణ బానిసనే కనుక శిలువేస్తే వీళ్ళు ఒక్కమారు కూడా కన్నెత్తి చూద్దురా? మల్లుడా శిలువ మీద అవమానంతో, విషాదంతో, బాధతో అవసాన దశలో ఉన్నాడు. అక్కడున్న సైనికులకుగాని, కొద్దిమందిగా ఉన్న ప్రేక్షకులకుగాని అతనేమంత ఆసక్తిజనకంగా కనిపించలేదు. ఒక ముసలిది మాత్రం చేతులు మోకాళ్ళ చుట్టూ వేసుకుని ఆ శిలువవైపే తదేక దీక్షతో చూస్తూ కూచుంది. ఉబుసుపోక సైనికులామెను ఏడిపించడం ప్రారంభించారు.

ఈ సమయానికే క్రాసస్ ఏపియన్ ద్వారంవద్దకు తిరిగి వచ్చాడు. రాత్రి పోవాల్సిన నిద్ర పొద్దునకు వాయిదా వేసిన వాళ్ళకి నిద్ర బాగా పట్టదు. క్రాసస్ నిద్ర కలత నిద్ర అయింది. ఎందుకయ్యా మళ్ళీ ఈ శిలువవద్దకు వచ్చావు అని ఎవరైనా అడిగి ఉంటే ఏమీ తెలియదన్నట్లు భుజాలెగరేసేవాడు. అది అతని కలవాటు. కాని ఆ చోటుకి ఎందుకు తిరిగివచ్చాడో అతనికే తెలుసు. క్రాసస్ జీవితంలోని ఒక గొప్ప శకం ఈ కడపటి మల్లుని చావుతో అంతం కాబోతోంది. క్రాసస్‌ని జనం ఒట్టి ధనవంతుడుగానే కాక బానిసల తిరుగుబాటు నణచిన సేనానిగా జ్ఞాపకం ఉంచుకుంటారు.

తన బొందిలో ప్రాణం ఉన్నంతవరకూ ఈ బానిస విప్లవం గురించి, స్మృతులనుంచి విడివడి తనను తా నూహించుకోలేడు. ఆ స్మృతులలోనే జీవిస్తాడు. ఆ స్మృతుల అలలే అతన్ని జోకొట్టి నిద్ర పుచ్చుతాయి. క్రాసస్ ఈ ప్రపంచం వదలి వెళ్ళేదాకా స్పార్టకస్‌కు వీడ్కోలివ్వలేడు. అందుకే చావబోతున్న ఈ విరోధిని మరొక్కమారు చూసుకుపోదామని వచ్చాడతను.

షిప్టు మారింది. మరొక కెప్టెన్ ద్వారంముందు పహరాకాస్తున్న సైనికులపై అధికారం చెలాయిస్తున్నాడు. అతనికి కూడా క్రాసస్ తెలుసు. నిజానికి అతన్ని కేపువాలో చాలామంది ఎరుగుదురు. రెట్టించిన వినయవిధేయతలతో కెప్టెన్ సేనానితో మాట్లాడుతున్నాడు.

"అతని ప్రాణం చాలా త్వరగాపోతోంది" అతనంటున్నాడు. "అదే ఆశ్చర్యంగా ఉంది. మొండిఘటం అనుకున్నా. మూడురోజులైనా బతక్కపోతాడా అనుకున్నాం మొదట. తీరాచూస్తే రేపుదయంలోపుగా చచ్చేలాగున్నాడు."

"నీ కెలాతెలుసు?" క్రాసస్ అడిగాడు.

"తెలియడానికేముంది? శిలువెయ్యడం నేనెన్నోమార్లు చూసాను. అన్నీ ఒకేలా గుంటాయి. పెద్ద పెద్ద రక్తనాళాల గుండా మేకులుపోయి అవి తెగితే మాత్రం త్వరగా చస్తారు. ఇతనికి అట్టే రక్తం కారడం లేదు. అతనికి బతకాలని లేనట్లుంది. బతకాలని లేకపోతే మాత్రం త్వరగా చస్తారు. అల్లా వీలౌతుందని మీరనుకోరు కదూ?"

"నాకేం ఆశ్చర్యం కలగలేదు" క్రాసస్ అన్నాడు.

ఆ సమయంలో సైనికులా ముసలిదాని మీద చెయ్యి చేసుకున్నారు. ఆమె కేకలు సేనానికి వినపడ్డాయి. క్రాసస్ అక్కడికి వెళ్ళాడు. ఒక్క క్షణంలో విషయమంతా గ్రహించాడు. కోపంగా సైనికులతో అన్నాడు :

"అబ్బ ఎంతటి మహావీరులు! వదలండోయ్ ముసలిదాన్ని."

అతని మాటలతీరుకు వాళ్ళు జడిసారు. ఆమెను వదలిపెట్టారు. అందులో ఒకడు క్రాసస్‌ను గుర్తుపట్టి తక్కినవాళ్ళ చెవులో ఊదాడు. అప్పుడా కెప్టెన్ కూడా వచ్చి వాళ్ళ నదిలించాడు.

ముసలిది కళ్ళుదోలా పెట్టి చూసింది.

"సరీ; మహాసేనానే నాకు రక్షకుడయాడన్నమాట" అంది.

"నువ్వెవరువు ముసలమ్మా?" క్రాసస్ అడిగాడు.

"గొప్పవాడివి నాయనా; నీ పాదాలమీద సాష్టాంగం వెయ్యమంటావా? ముఖం మీద ఉమ్మమంటావా?"

"చూసారా? చూసారా? మేం చెప్పలేదూ?" సైనికుడొక డరిచాడు.

"సరే ముసలమ్మా, నీకేం కావాలి?" క్రాసస్ అడిగాడు.

"నా మానాన్న నన్ను బతకనిస్తే అదే పదివేలు. సత్పురుషుడొకడు ఘోరంగా ఖూనీ చేయబడుతుంటే చూద్దామని వచ్చాను. అతను చస్తుంటే నే నిక్కడ కూచొని చూస్తాను. అతనికి నేను ప్రేమను అర్పిస్తాను. నాయనా! నువ్వెన్నటికీ చావవు అని నే నతనితో చెబుతాను. స్పార్టకస్‌కి ఎప్పుడూ చావులేదు. అతడు మృత్యుంజయుడు!"

"ఏం ముసలమ్మ, నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా?"

"ఏం నీకు తెలియడం లేదా మార్కస్ లిసినియస్ క్రాసస్? నేను స్పార్టకస్ గురించి మాట్లాడుతున్నా, నువ్వెందు కిక్కడికి వచ్చావో నాకు తెలుసు; మరెవరికీ తెలియదు."

ఆ చెత్తగొట్టు ముసలిముండని దూరంగా ఈడ్చిపారెయ్యండని కెప్టెన్ సైనికుల కాజ్ఞాపించాడు. వాళ్ళని ఆగమని క్రాసస్ కోపంగా సంజ్ఞ చేసాడు.

"ఆమెనేం చెయ్యొద్దని చెప్పలేదు? మీకున్న ధైర్యం అంతా ముసలిదాని మీదే ప్రదర్శించకండి. అంత ధైర్యమే ఉంటే మిమ్మల్ని సరిహద్దుసేనలలో చేరుస్తాంలెండి. ఒక ముసలిదానినుండి నన్ను నేను కాపాడుకోగలను."

"నువ్వు భయపడిపోతున్నావు" ఆ ముసలిది నవ్వుతూ అంది.

"నాకెందుకు భయం?"

"మేమంటే నీకు భయం లేదూ? మీకు ఎంతో భయం! అందుకే నువ్విక్కడకు వచ్చావు. అతను చస్తాడో లేదో చూడ్డానికి వచ్చావు. ఆఖరి బానిస విప్లవకర్తకూడా చచ్చాడా లేదా అని నిర్ధారణ చేసుకుందుకు వచ్చావు. కొద్ది మంది బానిసలు మిమ్మల్నెంత బాధ పెట్టేసారు? అతను చచ్చిపోయాడే. ఇంతటితో ఆగుతుందంటావా ఇది? అసలు దీని కెప్పుడైనా అంతమనేది ఉందా మార్కస్ లిసినియస్ క్రాసస్ మహాశయా?"

"నువ్వెవరు ముసలమ్మా?"

"నేనొక బానిసను" ఆమె సమాధాన మిచ్చింది, "మాలో ఒకడైన ఇతన్ని చూస్తూ నీకు తోడు లేకపోలేదు, నీవు ఏకాకివి కావని తెలియచెయ్యటానికీ, మనస్సుకు కొంత ఊరట కలిగించడానికీ నేనిక్కడకు వచ్చాను. కేపువా నిండా నావంటి బానిస లెంతో మంది ఉన్నారు. కాని వాళ్ళకు భయం. అతని కోసం ఏడవడానికే నేనిక్కడకు వచ్చాను. స్పార్టకస్ మాకు చెప్పాడు. కదలండి, కదలి స్వాతంత్ర సముపార్జన కావించండి అని. కాని మాకు భయం. మేం చాలా బలమైనవాళ్ళమే. మా సంఖ్య చాలా హెచ్చే. కాని మేం ముక్కుతూ, మూలుగుతూ పిరికితనంతో పారిపోతాం." ఆమె ముసలి కళ్ళలోంచి కన్నీరు కారింది.

"అక్కడ కూచుని నీ మానాన నువ్వు ఏడవాలంటే ఏడు" అంటూ క్రాసస్ శిలువదాకా వెళ్ళాడు. ఆ శిలువపై ప్రాణాన్ని కోల్పోతున్న మల్లుడ్ని చూస్తూ ముసలిదాని మాటలను గురించి ఆలోచిస్తున్నాడు.

# 8

ఆ మల్లుని జీవితంలో నాలుగుదశలున్నాయి. ఉద్యమం విఫలమైనదని అతను తెలుసుకున్నప్పుడు ప్రారంభమైంది నాల్గవదశ. ఇప్పుడా నిరాశాదశ అంతరిస్తోంది. అతను మరణిస్తున్నాడు.

అతను స్పార్టకస్‌ను కలుసుకునేదాకా దేన్నీ అంగీకరించలేదు. అతన్ని కలుసుకున్న మీదట జీవితం జీవించ తగ్గదే, ప్రయోజనం ఉన్నదే అనే విషయాన్ని అంగీకరించాడు. స్పార్టకస్ జీవితం ప్రయోజనమైనది. అది ఉత్కృష్టమైనది. అతనితో ఉన్న మనుషులు ఉత్కృష్ట మైనవాళ్ళు. ఇప్పుడీ శిలువపైన వేలాడుతున్నప్పుడు కూడా, మరణానికి భరణంగా తననిక్కడ మేకులేసి దిగగొట్టినప్పుడు కూడా నా ఉద్యమం ఎందుకు విఫలమైంది అని ప్రశ్నించుకున్నాడు. కాని ఆ ప్రశ్నకు సమాధానం దొరకలేదు.

క్రిక్సస్ చచ్చిపోయాడన్న దుర్వార్త వచ్చినప్పుడు తను స్పార్టకస్ పక్కనే ఉన్నాడు. క్రిక్సస్ ఒక కలనంటి పెట్టుకుని ఉన్నాడు. ఆ కల ఎప్పుడు, ఎక్కడ అంతమయిందో, ఎలా అసాధ్యమైపోయిందో స్పార్టకస్‌కు తెలుసు. రోమ్‌ని సర్వనాశనం చేయాలని క్రిక్సస్ కలలుకన్నాడు. ఆ క్షణంలోనే స్పార్టకస్ తెలుసుకున్నాడు తాము రోమ్‌ని ధ్వంసం చేయలేమనీ, రోమ్ తమనే ధ్వంసం చేస్తుందనీ. అది ప్రారంభం మాత్రమే. ఇరవై వేలమందిని నడిపించుకొని కదనరంగంలో క్రిక్సస్ ప్రవేశించినప్పుడే అది అంతమయింది. ఇప్పుడు క్రిక్ససూలేడు; అతని సైన్యమూలేదు. క్రిక్సస్ చచ్చిపోయాడు. అతని మనుషులూ చచ్చిపోయారు. నవ్వుతూ, సంతోషంతో అరుస్తూ ఉండే చెట్టంత మనిషి క్రిక్సస్ ఇకలేడు.

బానిస సైన్యం అంతా చావగా మిగిలిన ఒకే ఒక సైనికుడు ఈ వార్త మోసుకొచ్చాడు. అటువంటి వార్తలు మోసుకొచ్చేవాళ్ళు మృత్యువును, విషాదాన్ని కూడా మోసుకొస్తారు. స్పార్టకస్ డేవిడ్ వైపు తిరిగాడు.

"క్రిక్సస్ చచ్చిపోయాడనీ, సేనలన్నీ చచ్చిపోయాయనీ విన్నావా?"

"విన్నాను."

"ప్రపంచంలో అంత చావుందా? మృత్యువు అంతగా ఉందా?"

"ప్రపంచం చావుతో నిండి ఉంది. నీతో నాకు పరిచయం కలుగక పూర్వం ప్రపంచమంతటా ఉన్నదల్లా ఆ చావే."

"ఇప్పు డీ ప్రపంచమంతటా ఉన్నదీ చావే" స్పార్టకస్ అంటున్నాడు. అతను మారిపోయాడు. ఇప్పుడతను వేరు. పూర్వపు స్పార్టకస్ కాలేడింక. జీవితంతో అతనికుండే అమూల్యమైన సంబంధం ఇంకేమాత్రం అతనిలో లేదు. నరకప్రాయమైన న్యూబియా ఎడారిలోని బంగారపు గనులలో పని చేసినప్పుడూ ఆ సంబంధం ఉండేది. గోదాలో కత్తి చేతబట్టి, దిగంబరుడుగా పోరాడవలసి వచ్చినప్పుడూ ఉండేది. కాని ఇప్పుడు అతనిలో

జీవితానికీ, మృత్యువుకూ సంఘర్షణ ఏర్పడింది. మృత్యువుదే పైచేయి అయింది. అతని కళ్ళల్లో, ముఖంలో ఏమీలేదు. ఏ భావమూలేదు. ఆ భావశూన్యత లోంచి కన్నీరువచ్చి అతని ముఖంమీద కాలువలు కట్టింది. స్పార్టకస్ ఏడుస్తుండగా చూడడం డేవిడ్‌కి ఎంతటి ఘెరమైన, హృదయవిదారకమైన విషయమో! డేవిడ్‌కొక ఆలోచన వచ్చింది. స్పార్టకస్‌ను పిలచి నేను నీకు స్పార్టకస్ గురించి చెప్పనా అని అడుగుదామనిపించింది.

"నువ్వెందుకు ఏడుస్తున్నావు?" డేవిడ్ అడిగాడు. "మాకు చాలా కష్టంగా ఉంటుంది. మనం అంతా చచ్చేదాకా వాళ్ళకు నిద్ర పట్టదు."

"నువ్వెప్పుడూ ఏడవవా?" స్పార్టకస్ అడిగాడు.

"మా నాన్నను శిలువకు మేకులేసి దిగగొట్టి చంపినప్పుడు నే నేడ్చాను." స్పార్టకస్ అన్నాడు. "మనందరికోసం నే నేడుస్తున్నా. ఎందుకిలా జరిగిందా అని ఏడుస్తున్నా, మనం ఏం తప్పుచేసాం? మొదట్లో నాకు అనుమానమే ఉండేది కాదు. నా జీవితం అంతా బానిసలు సంఘటితపడి ఆయుధాలు పుచ్చుకొని శక్తి వంతులయ్యే క్షణం కోసం ధారపోసాను. అప్పుడు నాకే సందేహమూ కలుగలేదు. అలాటప్పుడు మనం ఎందుకు విఫలమయ్యాం? ఎందుకు ఓడిపోయాం? క్రిక్సస్ నువ్వెందుకు చచ్చిపోయావు?"

యూదుడన్నాడు "చచ్చినవాళ్ళు పోయారు. ఇంక ఏడవకు!"

# 9

చచ్చిపోయే ముం దా మల్లుడికి ఒక్క క్షణంపాటు అన్నీ స్పష్టంగా కనిపించాయి. కళ్ళు తెరిచాడు. ఇప్పుడతను దృష్టి నిలపగలిగాడు. కాస్సేపు అతనికి ఏమీ బాధ అనిపించలేదు. అతని చుట్టూ ఉన్నవన్నీ స్పష్టంగా చూసాడు. అదుగో అదే ఏపియన్ మార్గం. గొప్ప రోమన్ రోడ్డు, రోమ్ తాలూకు ఘనత. దాని రక్తప్రవాహం. ఉత్తరంగా ఆ మహానగరం వరకూ పోయే రాచబాట. అదుగో మరొకవైపు ఆ నగర కుడ్యం; ఆ ఏపియన్ ద్వారం. విసుగెత్తిపోయిన ఒక డజనుమంది నిర్జీవసైనికులున్నా రక్కడ. ఆ రోడ్డు కొక చివర సోమరిపోతుతనానికి అపరావతారాలు లాగున్న కొద్దిమంది రోమన్లున్నారు. జనసంచారం తక్కువగా ఉంది. ఉడిగీ, ఉడిగీ ఒక బండి చప్పుడు చేసుకుంటూ పోతోంది.

ఆ రోడ్డు పక్కన పెరిగిన గుబురైన ఆకుపచ్చని పొదలతని కంటబడ్డాయి. తల విరబోసుకున్న మహావృక్షాలు కనిపించాయి. ఉత్తరంగా కొండలగుపడ్డాయి. తప్పించుకుపోయిన బానిసలు ఆ కొండలలోనే దాక్కుంటారు. నడినెత్తిమీద నున్నాడు సూర్యుడు. కళ్ళు దించి చూసేసరికి ఒంటరిగా ఒక ఆడది శిలువకు కొద్ది గజాల దూరంలో కూచుని అతనివైపదే పనిగా చూస్తూ ఏడుస్తూ ఉన్నట్లుగా కనిపించింది.

"అదేమిటి? ఆమె నాకోసం ఏడుస్తోందా?" మల్లుడు తనలో తాననుకున్నాడు. "నువ్వెవరు ముసలమ్మా? ఇక్కడ కూచుని నా కోసం ఏడుస్తావేం?"

ప్రాణం పోతున్నట్లు అతనికీ తెలుసు. అతని మనస్సిప్పుడు స్పష్టంగా ఉంది. కొంచెం సేపటిలో తన ప్రాణం పోతుంది. అప్పుడీ గాయాల బాధ, స్మృతుల బాధ తప్పుతుంది కదా అని అతను సంతోషించాడు. ప్రతి మనిషికీ ఖచ్చితంగా వచ్చితీరే శాశ్వతపు నిద్రతప్ప అప్పుడింకేమీ ఉండదు. చావును నిరోధించడానికి అతనింకేమీ ప్రయత్నం చెయ్యడు. తను, కళ్ళు మూసుకుంటే సరి ప్రాణం త్వరగా, సులభంగా తన శరీరాన్ని వదలిపోతుందని భావించాడు.

అతనప్పుడు క్రాసస్‌ని చూసాడు. అతన్ని గుర్తుపట్టాడు. వాళ్ళిద్దరి చూపులూ కలుసుకున్నాయి. రోమన్ సేనాని శిలాప్రతిమలా నిటారుగా, నిశ్చలంగా నిలబడ్డాడు. అతన్ని కాళ్ళనుంచి ముఖంవరకూ తెల్లని టోగా కప్పుతోంది. అందమైన అతని తల రోమ్ యొక్క శక్తికీ, ఘనతకూ చిహ్నంగా ఉంది.

"అయితే నేచస్తుంటే చోద్యం చూడటానికి ఇక్కడ నిలబడ్డావన్న మాట క్రాసస్." మల్లుడనుకున్నాడు. "కడపటి మల్లుడు శిలువపై చస్తుంటే చూడ్డానికొచ్చావన్నమాట. అయితే ఒక బానిస చస్తున్నాడు. చస్తూ తన ప్రాణావసాన దశలో ఒక ధనవంతుడి ముఖం చూస్తున్నాడు."

పూర్వం ఈ క్రాసస్‌నే చూసిన ఒక సంఘటన జ్ఞప్తికి వచ్చింది మల్లుడికి. అప్పుడు స్పార్టకస్ కూడా జ్ఞాపకమొచ్చాడు. అంతా అయిపోయిందనీ, ఇంకేమీ లేదనీ వాళ్ళందరికి తెలుసు. అదే అంతిమపోరాటమని తెలుసు. స్పార్టకస్ వరీనియాతో చెప్పాడు తనుపోతున్నట్టు. అప్పుడామె గర్భవతి. ఈ రోమన్లు తమపై దాడిచేయకముందే ఆమె బిడ్డను కంటే బాగుండునని అతనాశించాడు. అప్పుడు డేవిడ్‌తో అన్నాడు.

"నేస్తం! ఇక నేనెన్నటికీ నాకు పుట్టబోయే బిడ్డను చూడలేనుకదూ? నా కళ్ళతో నా బిడ్డను చూసుకోలేక పోతున్నానుకదా అని విచారిస్తున్నాను."

స్పార్టకస్ కోసం బానిసలు తెల్లని గుర్రాన్నొకదాన్ని తెచ్చారు. అప్పుడు యుద్ధం వాళ్ళ వాకిట్లో ఉంది. ఎటువంటి గుర్రం అది! అందమైన పర్షియా గుర్రం. మల్లెపువ్వులా తెల్లగా ఉంది. అది స్పార్టకస్‌కు తగిన గుర్రం. అన్నిరకాల మానసిక వ్యధలనూ అతనిప్పుడు జయించాడు. నిజంగానే అతనెంతో సంతోషంగా, యువకుడిలా ఎంతో శక్తి ఉత్సాహాలతో ఉన్నాడు. ఈ ఆరునెలల్లోనూ అతని తల నెరసింది. ఇప్పుడు మన కా తెల్లనిజుట్టు బదులతని ముఖంలో తొణికిసలాడే యౌవనం కనిపిస్తోంది. అందంగా ఉండని అతని ముఖం ఎంతో అందంగా మారింది. ఈ మార్పు అందరూ గ్రహించారు.

"మీరీ అమోఘమైన గుర్రాన్ని నాకు కానుకగా సమర్పించినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నా." అప్పుడతను ఒరనుండి మెరుపులాటి కత్తిని తీసాడు. అప్పుడా కత్తి తళుక్కున తృటికాలంలో గుర్రం మెడ మీదనుండి హృదయకోశంలోకి దూసుకుపోయింది. ఆ కత్తి పట్టుకుని వేలాడి అతనా గుర్రాన్ని చీల్చాడు. అది మోకాళ్ళ మీద పడిపోయి గిలగిలా

కొట్టుకొని బాధతో సకిలించింది. ఇటూ అటూ దొర్లి చచ్చి పడిపోయింది. అతను వాళ్ళ కెదురుగా నిలబడ్డాడు. నెత్తురు నిండిన కత్తి అతని చేతిలో ఉంది. ఎవడికీ ఏమీ బోధపడలేదు. భయంతో, ఆశ్చర్యంతో కళ్ళు అప్పచెప్పి చూస్తున్నారు. అతనిలో ఇంకా ఏ మార్పూ రాలేదు, అలాగే ఉన్నాడు.

"ఒక గుఱ్ఱం చచ్చింది," అతనన్నాడు. "గుఱ్ఱం చచ్చినందుకు ఏడవదల్చుకున్నారా మీరు? మనం మానవజీవితం కోసం పోరాడతాం కాని జంతువులకోసం కాదు. రోమన్లు గుఱ్ఱాలను ప్రేమిస్తారు. మనుషులను ద్వేషిస్తారు. ఇప్పుడు మనం చూడాలి; ఈ యుద్ధ రంగంనుంచి ఎవరు బతికి బయటపడతారో, రోమన్లా? మనమా? మీరిచ్చిన కానుకకు కృతజ్ఞత తెలిపాను. ఆ కానుక నిజంగా చాలా బాగుంది. కాని నాకిప్పుడటువంటి కానుక అనవసరం. దానివల్ల మీరు నన్నెంతగా ప్రేమిస్తున్నారో బాగా తెలిసింది. నేను మిమ్మల్ని ఎంతగా ప్రేమిస్తున్నానో చెప్పటానికి ప్రపంచంలోని భాషలేవీ చాలవు. మన జీవితాలన్నీ ముడివడి పోయాయి. ఈ రోజు మనం ఓడిపోయినా, మానవజాతి ఎన్నటికీ మరచిపోని మహత్కార్యం సాధించిన వాళ్ళమయ్యాం. నాలుగు సంవత్సరాల బాటు రోమ్‌ను ఏకధాటిగా ప్రతిఘటించగలిగాం. అవి నాలుగుయుగాలే. రోమను సేనలు వచ్చినప్పుడెపుడూ మనం వెన్నిచ్చి పారిపోలేదు. ఈ రోజు కూడా మనం రణరంగం వదలి పారిపోం. నేనొక పంచకల్యాణి గుఱ్ఱమెక్కి పోరాడాలనికదూ మీ ఉద్దేశం? గుఱ్ఱాలు రోమన్లకే ఉండనివ్వండి. నేను నా సోదరుల సరసన నిలచి పోరాడుతా. ఈనాటి యుద్ధంలో మనం గెలిస్తే మనకు లెక్కలేనన్ని గుఱ్ఱాలు వస్తాయి. అప్పుడు మనమా గుఱ్ఱాలను యుద్ధరథాలకు కట్టి యుద్ధభూమికి ఆహుతి చెయ్యవద్దు. వాటికి నాగళ్ళు కట్టి మరింత భూమి సాగులోకి తెద్దాం. మనం ఓడిపోయామా సరే ఓడినవాళ్ళకు గుఱ్ఱాలెందుకు?"

అప్పుడతను వాళ్ళని కౌగిలించుకున్నాడు. తన పూర్వపు స్నేహితులందరినీ కలుసుకుని కౌగిలించుకుని పెదవులపై ముద్దెట్టుకున్నాడు. డేవిడ్‌ను సమీపించినప్పుడత నన్నాడు : "నేస్తం, జగజ్జెట్టీ! ఈ రోజుకూడా నువ్వు నా పక్కనే ఉంటావా?"

"ఎప్పుడూ నీ పక్కనే ఉంటా."

శిలువమీద వేలాడుతూ క్రాసస్‌కేసి చూస్తున్నప్పు డా మల్లుడు తనలో అనుకున్నాడు: 'ఒక్కమనిషి ఎంత చెయ్యగలడు?' అప్పుడతనింకేమీ విచారించలేదు. తను స్పార్టకస్ పక్కన నిలబడి అతనితోబాటు పోరాడాడు. తన కెదురుగా ఇప్పుడు నిలబడ్డ ఈ మనిషి గుఱ్ఱాన్నదలించి బానిససైన్యంలోకి చొచ్చుకుపోవడానికి ప్రయత్నించినప్పుడు తను యుద్ధం చేసాడు. స్పార్టకస్‌తోబాటు తానూ అరిచాడు.

"మా దగ్గరకురారా క్రాసస్; వచ్చి మేమిచ్చే శుభకాంక్షల నందుకో."

పెద్దవడిసెలనుండి వచ్చిన రాయి ఒకటి తనకు తగిలేవరకు తను దెబ్బలాడుతూనే ఉన్నాడు. తను బాగానే పోరాడాడు. స్పార్టకస్ చావును చూసే దౌర్భాగ్యం తనకు కలగనందుకు

సంతోషించాడు. స్పార్టకస్‌కాక తనే శిలువపై వేలాడే ఈ అవమానాన్ని పొందినందుకు కూడా ఇతను సంతోషించాడు. అతనికి ఇంకే విచారమూలేదు; బాధాలేదు; ఆందోళనాలేదు. స్పార్టకస్ ముఖంలో తాండవించిన అనిర్వచనీయానందం అతనికి జ్ఞప్తికి వచ్చింది. తనుకూడా ఇప్పుడు స్పార్టకస్ అయ్యాడు. తనకుకూడా స్పార్టకస్‌కు తెలిసిన జీవితరహస్యం తెలిసింది. క్రాసస్‌కి చెపుదామనుకున్నాడు. పెదవులు కదిపాడు. క్రాసస్ శిలువదగ్గరగా వచ్చి నిలబడ్డాడు. అక్కడ నిలబడి చావబోతున్న మల్లుడిని చూస్తున్నాడు. పెదవులు కదిలాయేకాని మల్లుని నోటివెంట మాటలు రాలేదు. అప్పుడా మల్లునితల వాలిపోయింది. పట్టు తప్పిపోయింది. ఉన్న కాస్త శక్తి అతని శరీరంనుండి బైటికి పోయింది. మిగిలిన కాస్త ప్రాణమూ పైకి పోయింది. అతను చచ్చిపోయాడు.

క్రాసస్ అలాగే నిలబడిపోయాడు. ముసలమ్మ అతనిపక్కనే వచ్చి నిలచింది. "చచ్చిపోయాడు" అందామె.

"అవును" అన్నాడు క్రాసస్.

# 10

ఆ రాత్రి క్రాసస్ ఒక్కడే భోజనం చేసాడు. అతనికోసం ఎవ్వరైనా వస్తే ఇంట్లోలేడని చెప్పారు. అతని మనస్సు సరిగాలేదు. ఆ సంగతి అతని బానిసలు గుర్తించారు. అటువంటప్పుడు బానిసలంతా ఇంట్లో చప్పుడుచెయ్యకుండా జాగ్రత్తగా నడుస్తారు. భోజనం చెయ్యకముందే ఇంచుమించొక ద్రాక్షసారా ఖర్చు చేసాడు. భోజనంతో పాటు మరొకటి ఖాళీచేసి భోజనమయ్యాక ఒకచోట కూచుని గాజు కూజాడు ఈజిప్ట్ ఖర్జూరపు సారా పని పట్టించసాగాడు. ఒంటరిగా, చిరాకుగా, ఆత్మ ద్వేషంవల్ల కలిగిన నిరాశతో అతను కూచుని తెగ తాగాడు. కాళ్ళు నిలబడవు, శరీరం స్వాధీనంలోలేదు. తూగుతూ, తూలుతూ పడకగది ప్రవేశించాడు. బానిసలొచ్చి మంచంమీద చేర్చారు.

ఏదిఎలా ఉన్నా సుఖంగా నిద్రమాత్రం పట్టింది. ఉదయం లేచేసరికి అతనిలో క్రితం రాత్రి ఉన్న ఆందోళనాలేదు, చిరాకూలేదు. మబ్బువిడిన స్వచ్ఛమైన అకాశం లాగుంది అతని మెదడు. తలనొప్పి పోయింది. రోజుకి రెండుమార్లు స్నానం చెయ్యడం అతని కలవాటు - నిద్రలేచిన వెంటనే ఒకమారు, మధ్యాహ్నం భోజనం చేసేముందొకసారీ. స్నానం ముగించాడు. పదునైన కత్తికి తన గడ్డం స్వాధీనం చేసినప్పుడతను చాలా సంతోషించేవాడు. చంటిపిల్లలలా ఏదో ఆనందాన్ని పొందేవాడు. కత్తి తెగుతుందేమోనన్న భయమూ, తెగదులే అన్న నమ్మకమూ రెండూ పెనవేసుకుని అతనిలో కనిపించేవి. తరువాత తల మర్దన చెయ్యడం లాటి తంతు జరిగేది. తన జుట్టు చూసుకున్నప్పుడల్లా అతనిలో గర్వం పొడసూపేది. కాని ఇది త్వరలో ఊడిపోతుందేమోనన్న భయం ఆ గర్వాన్ని మింగేసేది.

నీలం దుస్తులు ధరించాడు. అలవాటు ప్రకారం తెల్లని బూట్లు తొడిగాడు. కొద్దిగా ఫలహారం చేసి పల్లకీలో తన యువమిత్రు లున్నచోటికి బయలుదేరాడు. హెలీనాతో ఆ విధంగా ప్రవర్తించినందుకు కొంచెం సిగ్గుపడ్డాడు. ఆందోళన చెందాడు. అయినదేదో అయింది. తను వాళ్ళకి ఊరంతా చూపిస్తానన్నాడు. దానికీ, దీనికీ సంబంధం ఏమిటి?

హెలీనా మేనమామతో అతనికి కొద్దిగా ముఖపరిచయం లేక పోలేదు. ఈ ఇంటికి అంతకు పూర్వం రెండుమూడు పర్యాయాలు వచ్చాడ తను. అందువల్లనే ద్వారపాలకుడైన బానిసతనికి నమస్కరించి లోనికాహ్వానించి గృహస్తు తన బంధువులతో కలిసి భోజనం చేస్తున్న చోటికి నేరుగా తీసుకెళ్ళాడు. ఇతన్ని చూడగానే హెలీనా ముఖం ఎర్రబడింది. ఇతని రాక కైయస్‌కి మాత్రం సంతోషం కలుగచేసింది. అందుకే వాళ్ళు గౌరవభావాన్ని ప్రదర్శించారు. క్లాడియా మాత్రం క్రాసస్‌ని నిశితంగా చూసింది. ఆ చూపులో ఒకరకమైన ద్వేషం కనిపించింది.

"ఈ వేళ ఏం చెయ్యాలో మీరు ముందే అనుకోకపోతే," క్రాసస్ చెబుతున్నాడు: "అత్తరువులు తయారుచేసే మా కర్మాగారంలో మీకు ఆతిథ్యం ఇవ్వదలిచాను స్వీకరించండి. కేపువా వచ్చి అత్తరువుల కర్మాగారం చూడకుండా వెళ్ళడం హాస్యాస్పదం. అందులోనూ కేపువా అంటే మల్లులూ, అత్తరువులూకాక ఇంకేముంది."

"రెండు గమ్మత్తుగా కలిసాయి" క్లాడియా నవ్వింది.

"మేమేం చెయ్యాలో ఇంకా అనుకోలేదు" హెలీనా అంది.

పెద్దవాళ్ళకు కూడా ఇదే ఆహ్వానమని కైయస్ అన్నాడుకాని, వాళ్ళు రామన్నారు. ఆ వృద్ధులకు అత్తరు కర్మాగారాలు కొత్తవికావు. సెంట్లు ఎక్కువగా వాసన చూస్తే తనకు తలనొప్పికూడా వస్తుంటుందని ఆ ఇంటావిడ చెప్పింది.

కొద్దిసేపటికి వాళ్ళక్కడనుంచి బయలుదేరారు. పాతకేపువా గుండా వాళ్ళ పల్లకీలు పోతున్నాయి. అక్కడ వీధులు ఇరుకుగాను, అద్దెకొంపలు ఇంకా ఎత్తుగానూ ఉంటాయి. నిజానికి పట్టణ గృహనిర్మాణానికి విధింపబడ్డ కట్టుబాట్లే స్వల్పం. ఆ స్వల్పమైన కట్టుబాట్లుకూడా ఇక్కడ నిర్లక్ష్యం చెయ్యబడ్డాయి. చంటిపిల్లలు ఇటుకలూ; అవీ పేర్చేస్తే ఎంత అర్థంలేకుండా ఉంటుందో అలాగే ఉన్నాయి ఈ అద్దెకొంపలు. పగలయినా సరే ఆ వీధుల్లో చీకటిగానే ఉంటుంది. బురదతోనూ, ఇళ్ళల్లోంచి బైటకు పారేసిన చెత్తతోనూ నిండిన రోడ్లు. అదంతా రోడ్లమీద కుళ్ళుతూ ఉంటుంది. పోతున్నకొద్దీ ఈ చెత్తతాలూకు కుళ్ళువాసనతో, కర్మాగారంలో తయారవుతున్న సెంట్లవాసన కలిసి విచిత్రమైన ఒక కలగాపులగపు వాసన తయారౌతుంది.

మురికిగా, అర్ధనగ్నంగా కనిపించే పిల్లలు తూముల దగ్గర ఆడుకుంటున్నారు. చెత్తడబ్బాలున్నచోట చింకిబట్టల పేదస్త్రీలు పారేసిన ఆహారపదార్థాలు దొరుకుతాయేమోనని వెదుకుతున్నారు. వీధిగుమ్మాల్లో కూచుని కొందరు స్త్రీలు తమ బిడ్డలకు పాలిస్తున్నారు.

కొత్తరకం భాష వాళ్ళ పెదవులనుండి వినవస్తోంది. ఏం వండుతున్నారో కాని కిటికీలనుండి వింతవాసనలు వెలువడుతున్నాయి.

"ఎంత ఘోరమైన ప్రదేశం!" హెలీనా ఆశ్చర్యపోయింది. "నిజంగా ఈ నరకకూపంనుంచే అత్తరువులు తీస్తారేంటి?"

"అవును. ప్రపంచంలోని మరే ఇతర పట్నంలోనూ తయారుచేయనంత మేలురకం అత్తరువులు ఈ కుళ్లలోనే తయారవుతున్నాయి. ఇక్కడ సిరియన్లు, ఈజిప్షియన్లు, గ్రీకులు, యూదులు అన్ని రకాల వాళ్ళూ ఉన్నారు. బానిసలను పెట్టి మా కర్మాగారాలు నడిపిద్దామని మొదట ప్రయత్నించాం. కాని లాభంలేదు. వాళ్ళు దేవాంతకులు. పనైతే చేస్తారు కాని, చేసినపని తగలెయ్యరని హామీఏది? బానిసకి పనితాలూకు పర్యవసానం ఎలా ఉంటుందో అన్న ఆలోచనే ఉండదు. ఇంక రోమన్ కార్మికులకు పని చెయ్యాలనే కుతూహలం ఎక్కడినుంచొస్తుంది? పదిమందున్నారనుకోండి; తొమ్మండుగుర్నీ ప్రభుత్వం ఉట్టి పుణ్యాన తిండిపెట్టి మేపుతుంటే మిగిలిన ఒక్కడు మాత్రం ఎందుకు పని చేస్తాడంటారు. కావాలంటే సైన్యంలో చేరుతారు. అందువల్లనే సిరియన్లనీ, ఈజిప్షియన్లనీ, గ్రీకులనీ ఇక్కడ చేర్చాం. పోనీ, వాళ్ళయినా పనిచేస్తారా అంటే అదీలేదు. పౌరసత్వం లభించేదాకా కొంత డబ్బు సంపాదించడం, ఆ డబ్బుతో పౌరసత్వం కొనుక్కుని పనిమానెయ్యడం. ఆఖరికిదంతా ఎలా తేలుతుందో చెప్పలేం. ఉన్న పరిస్థితి చెప్పాలంటే ఫ్యాక్టరీలు మూతబడుతున్నాయి కాని తెరవటం లేదు."

వాళ్ళు కర్మాగారాన్ని సమీపించారు. ఆ అద్దె కొంపలమధ్య తక్కువ ఎత్తులో కర్రతో కట్టారు దాన్ని. నూటయాభై అడుగుల చదరంగా ఉందది. కొన్ని కొన్ని చెక్కలు పోయాయి. కొన్ని చెక్కలు చెదబట్టాయి. చాలా పొగగొట్టాలు కనిపిస్తున్నాయి. కర్మాగారంలో ఒకవైపున సరుకులు నింపడానికి వీలుగా ఎత్తయిన అరుగుకట్టారు. దాని దగ్గరగా సరుకుతో నిండిన బళ్ళెన్నో నిలబడి ఉన్నాయి. ఆ బళ్ళల్లో ఏవేవో చెట్టుబెరడులూ, పళ్ళతట్టలూ, మట్టిపాత్రలూ ఉన్నాయి.

కర్మాగారం ముందుకొచ్చాయి పల్లకీలు. పెద్దపెద్ద దారుగవాక్షాలు తెరువబడ్డాయి. మొదటిసారిగా ఈ కర్మాగారాలేమిటో తెలుసుకున్నారు క్లాడియా, హెలీనాలు. ఆ కర్మాగారం ఒక పెద్ద షెడ్డులాగుంది. పెద్దపెద్ద కర్రదూలాలు పైకప్పును మోస్తున్నాయి. కప్పుకూడా చాలా మటుకు దెబ్బతింది. దానివల్ల మరింత గాలీ, వెలుతురు లోపలప్రవేశించడానికి వీలయింది. కార్ఖానలో చాలా వేడిగా ఉంది. ఎర్రగాకాలే పెద్ద పెద్ద మూకుడు లున్నాయక్కడ. పొడుగాటి మేజాలమీద ఏవేవో మట్టిపాత్రలూ మరగబెట్టిన పదార్థాలూ ఉన్నాయి. బట్టీలనుండి పైకిపోతున్న వంపులుతిరిగిన గొట్టాలున్నాయి. ఏదో అర్థంకాని కలలాగుందంతా. ఆ ప్రదేశమంతా అత్తరువుల వాసనలతో నిండిఉంది.

ఆగంతకు లక్కడి కార్మికుల్ని కూడా చూసారు. శరీరదార్ఢ్యంలేని ఆ కార్మికులు

రాగిరంగులో తేలారు. మాసిన గడ్డాలతో పట్టుమని గోచీగుడ్డ కూడా లేకుండా వాళ్ళక్కడ బట్టీలలో పనిచేస్తున్నారు. పొయ్యిలు రాజేస్తున్నారు; మేజాలదగ్గర వేటినో తరుగుతున్నారు; పళ్ళ తొక్కలు తూస్తున్నారు; చెక్కలపై బెరళ్ళు తీస్తున్నారు; తయారయిన సెంట్లను చిన్న చిన్న వెండిగొట్టాలలో నింపి వాటిని కాలిన లక్కతో మూస్తున్నారు.

కార్ఖానా మేనేజరు అవ్‌లూస్‌ని క్రాసస్ వీళ్ళకు పరిచయం చేసాడు. అతనికి మర్యాదవాచకాలు కాని, వంశగౌరవాన్ని తెలియజేసే మరే పేరుకాని లేదు. అతను సేనానినీ, అతిథుల్నీ ఆహ్వానించాడు. అతను ఆసక్తితో, ఉత్సాహంతో వీళ్ళ నా కార్ఖానా చుట్టూ తిప్పనారంభించాడు. కార్మికులు పూర్తిగా పనిలో నిమగ్నమై ఉన్నారు. వాళ్ళ ముఖాలలో తీక్షణస్వభావం, కాఠిన్యం, నిర్లక్ష్యం కనిపించాయి. వాళ్ళు ముఖాలిటు తిప్పి ఆగంతకులవైపు చూసినప్పుడు వాళ్ళ ముఖాల్లో మార్పు స్పష్టంగా కనిపించింది. ఇక్కడ వాళ్ళు చూసిన వాటన్నిటిలోకీ ఈ కార్మికులే వింతగా కనిపించారు క్లాడియా, హెలీనా, కైయస్‌లకు. అటువంటి మనుషులుంటారని వాళ్ళకు తెలియదు. అసలు నిజంగా ఇంకెక్కడా ఉండరేమో! వాళ్ళు బానిసలు కారు; రోమన్లు కారు; రైతాంగం దివాలా తీస్తున్న ఈ రోజులలో కూడా కాస్త కాస్త భూములు దున్నుకుంటూ బతుకులు వెళ్లబుచ్చుతున్న అమాయకపు రైతులు కారు. వీళ్ళకీ తక్కిన వాళ్ళందరికీ తేడా ఉంది. ఎంతో తేడా ఉంది. ఆ తేడా చూస్తుంటేనే మతి పోతోంది.

"ఇక్కడ మేం బట్టీపద్ధతి అవలంబిస్తాం. అందుకు నిజంగా ఈజిప్షియన్ల నభినందించవలసిందే. దాన్ని వీళ్ళు చేతివృత్తిగానే ఉంచగలిగారు గాని పెద్దఎత్తున ఉత్పత్తి చెయ్యలేకపోయారు. ఈ నిర్మాణ కార్యక్రమం అంతా రోమ్ నెత్తిన పడింది" అన్నాడు క్రాసస్.

"ఔను, పూర్వం ఇలా తయారుచేసే వారు కాదా?" కైయస్ అడిగాడు.

"అప్పుడు స్వతస్సిద్ధంగా తయారయిన సువాసన ద్రవ్యాలే కాని ఈ వండిన అత్తరువులూ అవీలేవు. ప్రకృతి ప్రసాదించినదేదో అదేతప్ప ఇంత అభివృద్ధి ఏదీ! కర్పూరం, పునుగూ, జవ్వాజీ, కస్తూరీ మొదలైనవన్నీ చూస్తే తెలిసిపోతుంది. కత్తులతో చెట్లమీద నాటగా వచ్చిన జిగురుపదార్థం వంటిదే కర్పూరం. అలాగే జంతువులవల్ల లభ్యమయ్యేవి కొన్ని. అంతేకాని వాళ్ళకివి తయారుచేసే పద్ధతులు తెలియవు. ప్రాచ్యదేశాల్లో కర్పూరం చెట్లు విరివిగా నాటిస్తారని విన్నాను. చాలామటుకు సువాసన ద్రవ్యాలు వెలిగించడానికి వీలుగా ఉంటాయి. అప్పుడు ఈజిప్షియనులు బయలుదేరి ఈ బట్టీలు కనిపెట్టారు. బట్టీలు సెంట్లకేకాక సారాలకు కూడా పనికొచ్చాయి. తాగుడుకు అడ్డుతోవ తొక్కించింది ఈ బట్టీ."

కొన్ని బల్లలమీద ఏవేవో తరుగుతున్నారు. క్రాసస్ వాళ్ళందర్నీ అక్కడకు తీసుకువెళ్ళాడు. అక్కడొక కార్మికుడు నిమ్మతొక్కలు ఉల్లిపొర కాగితాలంత పలచగా

తరుగుతున్నాడు. ఒక తొక్కతీసి వెలుతురులో చూపిస్తూ క్రాసస్ అన్నాడు :

"జాగ్రత్తగా చూస్తే మీకు దీన్లో నూనె ఉన్నట్లు కనిపిస్తుంది. దీనికెంత సువాసనుందో మీకు తెలుసు. ఒక్క నిమ్మతొక్కలేకాదు నారింజ కానియ్యండి, తక్కిన చెట్ల బెరళ్ళూ అదీ కానియ్యండి, అన్నిటికీ ఇదే పద్ధతి. ఈ మాదిరిగానే తరిగి సారం పిండుతారు. నాతో కూడా వస్తే...."

ఒక పెద్ద గాడిదగ్గరకు వాళ్ళను తీసుకెళ్ళాడు. గాడిమీద పెద్దకుండలో ఈ తొక్కలు వండుతున్నారు. ఆ కుండ మీద లోహపు సిబ్బి మూతవేసి మేకులతో బిగించారు. రాగిగొట్టాలు మెలికలు తిరుగుతూ దాన్లోంచి పైకిపోతున్నాయి. ఆ గొట్టాల మీద నీటినిజల్లే ఏర్పాటు చేసారు. ఆ గొట్టం మరొక కొస వేరొక పాత్రలోకి పోతోంది.

"బట్టీ అంటే ఇదే" క్రాసస్ వివరిస్తున్నాడు. "తొక్కలైనా, చెక్కలైనా నీటిలోనే మరిగిస్తాం. నీటినుంచి నూనె వేరుపడేదాకా మరిగిస్తూనే ఉంటాం. అప్పుడా నూనె మరిగి ఆవిరై గొట్టాలగుండా పోతుంది. ఆ పోతున్న ఆవిరి ద్రవ్యంగా మారడానికి గొట్టాలమీద నీళ్ళు జల్లుతారు. దాంతో ఆ చివర ఉన్న పాత్రలో అమూల్యమైన అత్తరువు తయారవుతుంది. కుండలోంచి పైకొచ్చేసే నీరంతా వేరే జాగ్రత్త చేస్తాం. అది చల్లబడ్డాక నీటిమీద నూనెపదార్థం కొంత తేలుతుంది. ఆ నూనె కూడా అత్తరువే. అత్తరువు వెండిగొట్టాలలో పదిలపరచి తక్కిన నీటిని భోజనాలవద్ద ఉపయోగించే మంచినీటికింద అమ్ముతాం. ఆ నీటికికూడా ఎంతో కమ్మని సువాసన ఉంటుంది."

"అయితే మనం తాగేవి ఆ నీళ్ళేనా" క్లాడియా ఆశ్చర్యపోయింది.

"అంతే మరి, దాంట్లో మరికొంత మరగబెట్టిననీరు కలుపుతారు. అది తాగడం ఆరోగ్యకరమే. ఈ నీళ్ళకుకూడా అత్తరువులకూ, సెంట్లకూ మల్లేనే ఏ రుచి కావాలంటే ఆ రుచి తెస్తారు. ఆపళంగానే ఉంచితే ఆ నీళ్ల స్నానాని కుపయోగిస్తారు."

హెలీనా తనవైపు చిరునవ్వు నవ్వుతున్నట్లు చూసాడు క్రాసస్. "ఏం, నేను నిజం చెప్పడంలేదనా నీ ఉద్దేశం?"

"అబ్బే; మీ కెన్ని విషయాలు తెలుసునా అని ఆశ్చర్యపోతున్నా."

"తెలుసుకోటం నా విధి" క్రాసస్ చెపుతున్నాడు. "నేను చాలా ధనవంతుణ్ణే. నేనది చెప్పడానికి సిగ్గుపడను. కొంతమందికి సిగ్గు ఎందుకో నాకు తెలియదు. నేను ప్రతినిత్యం ధనార్జనగురించే ఆలోచిస్తుంటాననీ, అందుకోసమే పనిచేస్తుంటాననీ నన్ను చాలామంది హీనంగా చూస్తారు, అదీ నాకు తెలుసు. నాకేం విచారంలేదు. పైగా మరింత డబ్బు సంపాదించడమేమంటే నాకు మహాసరదా. మన మిత్రులు కొందరున్నారు. వాళ్ళకీ తోటలమీద డబ్బు చేసుకోవచ్చుననే భ్రమవుంది. నాకలాకాదు. నా కో యుద్ధాన్ని కట్టబెట్టారు. అదేం యుద్ధమోకాని జయించడానికొక్క మహానగరమూ లేదు. బానిసలతో యుద్ధమట. ఎర్రని ఏగాణి కాని, గోచీగుడ్డకానీ లేని వాళ్ళతో యుద్ధం. పాంపికి మాత్రం లాభసాటి యుద్ధం

ఇచ్చారు. నాకు మాత్రం ఇదే అంటగట్టారు. అందుకే కొన్ని రహస్యాదాయాలు అట్టేబెట్టుకొన్నా, ఆ విధంగా డబ్బొచ్చేవాటిలో ఈ కార్ఖానా ఒకటి. ప్రశస్తమైన అత్తరువుతో నింపిన ఆ వెండిసీసా ఒక్కొక్కటి దాని ఎత్తున్న బంగారానికి పదిరెట్లు వెల ఇచ్చినా రాదు. ఈ కార్మికులు ఇక్కడున్నదల్లా బంగారంగా మార్చేస్తారు. ఆఖరుకి వీళ్ళు కూడా బంగారమైపోతారు. వాళ్ళ తిండి గొడవా, కొంప గొడవా మన కక్కరలేదు."

"కానీ" కైయస్ అనుమానించాడు. "వీళ్ళు కూడా ఆ స్పార్టకస్‌గాడిలా చెయ్యగలరేమో...."

"ఏమిటీ కార్మికులు తిరగబడ్డమా?" క్రాసస్ నవ్వుతూ, తలాడిస్తూ వ్యతిరేకత తెలిపాడు. "అసంభవం. ఎన్నటికీ కార్మికులు తిరగబడరు, వాళ్ళేం బానిసలనుకున్నావేంటి: స్వేచ్ఛాజీవులు తెలుసా? వాళ్ళిష్టం వచ్చినప్పుడిక్కడికి రానూవచ్చు; కష్టంగా ఉంటే పోనూవచ్చు. అదీకాక వాళ్ళకి తిరుగుబాటు లేవదియ్యవలసిన అవసరమేమిటి?" షెడ్డంతా ఒక్కమారు కలయజూసాడు క్రాసస్, ఎవడి ముఖంలోనైనా భవిష్యద్విప్లవ సూచనలు కనిపిస్తాయేమోనని. "అబ్బే, నిజం చెప్పాలంటే బానిస యుద్ధం జరుగుతున్నప్పుడు కూడా మా కార్ఖానాలు పనిచేస్తూనే ఉన్నాయి. వీళ్ళకీ ఆ బానిస వెధవలకూ సంబంధమేలేదు; పోలికాలేదు."

అయినా ఆ చోటు వదలివెళ్ళాక కూడా కైయస్ మనస్సులో కలవరపాటు లేకుండా పోలేదు. వాళ్ళపనివాళ్లు చేసుకుంటూ నిశ్శబ్దంగా ఉండే ఈ వింత గడ్డాల మనుషులు అతనికి భయాన్నీ, సందేహాన్నీ కలిగించారు. ఎందుకో అతనికి తెలియరాలేదు.

# ఏడవ భాగం

క్రైయస్, క్రాసస్, ఆ ఇద్దరు వనితలూ ఏపియన్ మార్గాన దక్షిణంగా కేపువాకు ప్రయాణం సాగించకముందే సిసిరో, గ్రాఛూస్ లిరువురూ ఉత్తరాభిముఖులై రోమ్‌కు బయలుదేరారు. తాపీగా ఒకరి పల్లకీపక్క మరొకరి పల్లకీ పోనిస్తూ ప్రయాణం సాగిస్తున్నారు. నగరంలో పేరుప్రఖ్యాతులు గడించుకొని ఒక రాజకీయశక్తిగా పరిణమించిన గ్రాఛూస్‌పై అనుగ్రహాన్ని కటాక్షిస్తూ తెచ్చి పెట్టుకున్న గౌరవాన్ని ప్రకటించాడు సిసిరో.

గ్రాఛూస్ ఎంతోమందిని కలుసుకున్నాడు. అంతమందిలోనూ అతనంటే ఇష్టంలేని వాళ్ళు బహుకొద్ది. అతనికి కూడా ఎవరియందూ అనవసరమైన కోపంలేదు. కాని ఈ సిసిరో మాత్రం అపరిమితంగా అసహ్యించుకోతగ్గవాడు. దయాదాక్షిణ్యాలు వీసమెత్తులేకపోయినా కుయుక్తులతో కూడిన తెలివితేటలుగల యువకుల తరానికి, తరహాకు చెందినవాడు సిసిరో. గ్రాఛూస్ కూడా నిర్దయుడుగా ఉండకపోలేదు; కాని ఆ నిర్దయలోనే కొంచం కరుణ, క్రియలో శూన్యమయినా భావంలోనైనా సానుభూతి, కొద్ది జాలీ ఉండేవి. కాని ఈ యువకులలో ఇతరుల దుస్థితికి విచారమూ జనించదు; సానుభూతీ పొడసూపదు. సిసిరో బాగా చదువు కున్నవాడు. ఉన్నత కుటుంబాలతో బాగా పరిచయం కలవాడు. కనుకనే సంఘంలో ఇతనంటే కొంత ఈర్ష్య కూడా కలుగుతుంది.

"నిద్రపోతున్నారా?" సిసిరో మెల్లిగా ప్రశ్నించాడు. పల్లకీ ఊపువల్ల జోల కొట్టినట్లు ఉండి నిద్రపోతున్నాడేమో అనుకున్నాడు సిసిరో.

"అబ్బే ఏదో ఆలోచిస్తున్నా."

"ముఖ్యమైన దేశవ్యవహారాల గురించా?" ప్రశ్నించాడు సిసిరో.

"అబ్బే, ఏమంత ముఖ్యవిషయం కాదు. నిజం చెప్పాల్సివస్తే ఒక పూర్వపు గాథ గురించి. పూర్వపుకథ లన్నిటిలాగానే చాదస్తంగా కూడా ఉంటుంది."

"అదేమిటో నాకు చెప్తారా?"

"తప్పకుండా నీకిది విసుగు పుట్టిస్తుంది." అదొక నీతిని బోధించే కథ.

"ఆ కథేమిటి మరి?"

గ్రాఛూస్ నవ్వాడు. "ఒక్కగానొక్క కొడుకునే కన్న ఒక తల్లిగురించి ఈ కథ. పొడుగ్గా, అందమైన అంగసౌష్టవం కలిగి సౌందర్యవంతుడైన పుత్రుడు. తల్లి పిల్లల్నెలా ప్రేమించాలో అలాగే ఆమె అతడిని ప్రేమించేది."

"తన వాంఛలకు నన్నొక ఆటంకంగా తలచేది మా అమ్మ."

"ఈ తల్లి తన కొడుకును ప్రేమించింది. అతనిలో యవ్వనం పొడసూపింది.

అప్పుడతను ప్రేమకలాపాల్లో దిగాడు. ఎంత దుర్మార్గురాలో అంత అందంగా ఉండే ఒక స్త్రీని ప్రేమించాడు. ఇతని నామె ఎప్పుడూ కన్నెత్తి చూడలేదు. ఒక్కమాటు కూడా అతన్ని చూసి చిరునవ్వు నవ్వలేదు. ఆమె కళ్ళెప్పుడూ అతనివైపు తిరిగి తళుక్కుమనలేదు. ఆమెతల ఇతనివైపెప్పుడూ ఊగలేదు."

"నాకూ ఒకమాటటువంటిదే తటస్థపడింది" సిసిరో అన్నాడు.

"అతను ఆమెకోసం విరహతాపం చెందాడు. అదృష్టవశాత్తూ ఆమెను కలుసుకున్నప్పుడుతాను ఆమెకొరకై కట్టించబోయే రాజప్రాసాదాల గురించీ ఆమెకోసం తెచ్చి ఇవ్వబోయే సకలైశ్వర్యాల గురించీ తెగచెప్పేసాడు. ఆమెకు ఇవన్నీ అయోమయమైన కట్టుకథలలా కనిపించి వాటిపై తనకేమీ ఆసక్తిలేనట్లు వ్యక్తంచేసింది. వాటన్నిటికీ బదులొక చిన్నకానుక సమర్పించమంది. అది అతనికి లభ్యంకావడం ఏమీ కష్టమైన పనికాదు."

"ఉట్టి కానుకేనా?" సిసిరో అడిగేడు.

గ్రాఛూస్‌కి కథ చెప్పడం అంటే సరదా. ఆ ప్రశ్న విని తలపంకించాడు. "ఔను, ఉట్టి కానుకే. ఆ యువకుడిని అతని మాతృహృదయాన్ని తెచ్చి ఇమ్మన్నదామె. అతను తెచ్చాడు. బాకుతో తన తల్లి గుండెకాయను తానే కోసి తీసుకొచ్చాడు. తను చేసినదానికి తానే భయావేశపూరితుడై అందమైన, దుర్మార్గమైన ఆ ప్రేయసి కోసం ఒక అరణ్యంలోపడి పరుగు పరుగున పోయాడు. పరిగెడుతున్న అతని కాలికొక చెట్టు వేరు తగిలింది. పడిపోయాడు.అప్పుడతని చేతిలోని మాతృహృదయం దూరంగా పడిపోయింది. ఒక అందాలరాసి ప్రేమను కొనగల ఆ గుండెకాయను తిరిగి తీసుకొనేందకతను వంగినపుడు ఆ గుండెకాయ అతనితో 'కొడుకా! కొడుకా! పడ్డప్పుడు నీ కాలికేం దెబ్బ తగలలేదుకద' అన్నదట మెల్లగా." పల్లికీలో వెనక్కానుకొని చేతి వేళ్ళ కొనలను కలుపుతూ ఆలోచనసాగించాడు గ్రాఛూస్.

"అయితే?" సిసిరో అడిగాడు.

"అంతే, ఏముంది? ఏమీ అర్థంలేని నీతికథ అని ముందేచెప్పాగా?"

"పేర్లను జ్ఞాపక ముంచుకోగల ప్రతిభ నీలో ఉందని విన్నాను. నీకో లక్షమంది పేర్లు కంఠస్థంగా వచ్చునంటారు నిజమేనా?" అన్నాడు సిసిరో.

"అదొక భ్రమ. ఏదో కొద్దిమంది పేర్లు నే నెరుగుదును. లక్షమందేం కాదు."

"హానిబాల్ అతని సైన్యంలో ఉన్న ప్రతి సైనికుడినీ పేరు పేరునా పిలిచే వాడని విన్నాను."

"అవును మరి, స్పార్టకస్‌కుకూడా అటువంటి జ్ఞాపకశక్తినే ప్రసాదిద్దాం మనం. మనకన్న ఏదో ఒకప్పుడు బలవంతులుగా ఉన్నారు కాబట్టే ఇతరులు మనపై విజయం సాధించగలిగారన్న విషయం మనం చస్తే ఒప్పుకోంగా. చరిత్రలో రాయబడ్డ చిన్న, పెద్ద

అబద్ధాలంటే ఎందుకు నీకంత ఆసక్తి?''

"అవన్నీ అబద్ధాలేనా?''

"చాలామటుకు'' ఇప్పుడు గ్రాఛూస్ పిడుగులు పడుతున్నట్లు మాట్లాడుతున్నాడు. "చరిత్ర అంటే మోసం, నమ్మశక్యంగాని కల్పిత గాధలు. అందుకే రాజకీయా లంటే ఏమిటి అని ప్రశ్నించా.''

"నువ్వొక రాజకీయవేత్తవు కాబట్టి చెప్పుచూద్దాం. రాజకీయవేత్త అంటే ఎవరో?'' సిసిరో నవ్వాడుకూడా.

"ఒక పచ్చి దగాకోరు'' సూక్ష్మంలో సమాధానాన్ని ఇమిడ్చాడు గ్రాఛూస్.

"పోనీలే మనసువిప్పి మాట్లాడనైనా మాట్లాడావు.'' "నాలో ఉండే ఒకేఒక్క అమూల్యమైన లక్షణం అదే. రాజకీయవేత్తలోని ఆ లక్షణాన్నే నిజాయితీ అని భ్రమిస్తారు అమాయకప్రజలు. మనమొక రిపబ్లిక్కులో ఉన్నాం. అంటే ఎంతో మందికి ఏమీలేదనీ, ఏ కొద్దిమందికో అవసరమైనదానికన్న అన్నీ కొల్లలుగా ఉన్నాయనీ దానర్థం. అంతేకాదు, బాగా కలవాళ్ళు తమ కలిమిని సంరక్షించుకోవాలి. మన నాహ్వానించిన ఆంటోనియస్ కైయస్‌వంటి భూస్వాముల ఆస్తిపాస్తుల్ని రక్షించేందుకు ఈ ఏమీలేనివాళ్ళు ప్రాణాలకు తెగించడానికైనా సిద్ధంగా ఉండాలి. మనకు బానిసలున్నారు. ఈ బానిసలకు మనమంటే అయిష్టం. అందువల్లనే బానిసల బారినుండి మనని బానిసలు రక్షించలేరు. బానిసలకు మనమంటే ఇష్టం ఉంటుందనే భ్రాంతిలో మాత్రం మనం ఛస్తే పడకూడదు. బానిసలను కొనుక్కుని వాళ్ళచేత చాకిరీ చేయించుకుంటూ అదేసమయంలో వాళ్ళవల్ల ఏ ప్రమాదమూ జరగకుండా చూసుకోవాలంటే బానిసలను కొనుక్కోలేని వాళ్ళను కొందర్ని మనం నియమించుకోవాలి. మృత్యువు పిలిచినాసరే హాజరవగలగాలి వాళ్ళు. వాళ్ళే మనలనూ, మన ఆస్తిపాస్తులనూ సంరక్షించాలి. అటువంటి రెండులక్షలమంది కవచాలతో కాళ్ళరిగేలా కవాతుచేసుకుంటూపోయి రక్తపు టేరులలో ఈదులాడ గలగాలి. ఆ విధంగా వాళ్ళు ఇతర దేశాలతో యుద్ధం చేస్తేనే మనం ఇక్కడ సురక్షితంగా, సకల సౌకర్యాలతోనూ సౌఖ్యంగా వ్యక్తిగత సంపదలనూ, భాగ్య భోగ్యాలనూ వృద్ధిచేసుకుంటూ బతకగలం. నిజానికి స్పార్టకస్‌తో పోరాడ్డానికి పోయిన సైనికులకు రక్షించుకోతగ్గదీ, కాపాడుకోతగ్గదీ ఏమీలేదు. అయినా సరే ఆ బానిసలతోనే యుద్ధంచేసి వేలాదిగా సమసిపోయారు. బానిసలతో పోరాడి చచ్చిన రైతులు భూస్వామ్యవ్యవస్థ ఫలితంగా తమతమ భూములనుండి తరమబడ్డారు. కనుకనే గత్యంతరంలేక సైన్యంలో చేరారు. బానిసలు పనిచేసే తోటలపద్ధతి వల్ల ఆ రైతులు దివాలాతీసి కటికదరిద్రులయారు. పోనీ నువ్వే ఆలోచించు సిసిరో! బానిసలు నెగ్గితే రోమన్ సైనికుడికి పోయేదేమిటి? పోయేదేదో పూర్వం పోనేపోయింది. పైగా ఆ బానిసలవల్ల వీళ్ళకెంతో లాభంకూడా ఉంది. ఎందు కంటావేమో ఆ బానిసలలో మన రోమన్ రైతులవంటి పనివాళ్ళు చాలినంతమంది లేరు. అందరికీ సరిపోయేభూమి ఉంది. మన సైనికుడు కలగనే అతని చెక్క పొలమూ, చిన్నఇల్లూ

వాళ్ళు నిజంగా ఇస్తారు కూడా. అయినాసరే అతను బానిసలను నమ్మడు. అంతటితో ఆగడు. వాళ్ళతో యుద్ధంచేస్తాడుకూడా. అలా తనకు తెలియకుండా తనకలలను తానే భగ్నంచేసుకుంటాడు. కొవ్వెక్కిన మనిషొకడు దిండ్లమర్చిన పల్లకీలో పడుకొని ప్రయాణం చెయ్యడానికని అతనావిధంగా పోరాడతాడు. నేనన్న దానిలో నిజంఉందని ఒప్పుకోవా?''

"నువ్వన్న మాటలే కనుక సామాన్యు డెవడైనా అనిఉంటే ఈ పాటికి అతన్ని శిలువేసి ఉండేవాళ్ళం.''

"సిసిరో! సిసిరో!'' గ్రాఛూస్ నవ్వాడు. "అదొక బెదిరింపా? లావుగా కొవ్వెక్కిన నా వృద్ధశరీరం శిలువ నలంకరించ తగదులే. నిజాన్ని చూడ్డానికి నీకెందుకంత భయం? కావాలంటే ఇతరులకు ఈ అబద్ధమేచెప్పి ఒప్పిద్దాం కాని, మనం సృష్టించిన అబద్ధాలను మనమే నమ్మాలా ఏం?''

"నువ్వన్నట్లే కానీ. ఒక మనిషి వేరొకడిలా ఉంటాడా? మనుషులంతా ఒకటే అనే ధ్వని నువ్వు చెప్పినదానిలో ఉంది. ఆ నల్లగా కనబడేవన్నీ కాకులే అంటావేమిటి? అయితే ఇదేమిటీ పంచమ స్వరం వినిపిస్తోంది? కాకినోట పంచమ స్వరం వింటామా? అది కోకిల. అదీ కాకిలాగే ఉంటుంది దూరంనుంచి చూస్తే. ఉప్పూ, కప్పురం పైకి ఒకేలాగున్నా రుచులలో తేడా ఉంది. అలాగే పురుషులలో పుణ్యపురుషులు అంటే ఉత్కృష్టమైన వాళ్ళు ఉన్నారు. భగవంతుడు వాళ్ళ నా విధంగా సృష్టించాడా లేక పరిస్థితుల ప్రభావం వాళ్ళ నా విధంగా తయారుచేసిందా అన్న విషయం అప్రస్తుతం. వాళ్ళే పరిపాలించే యోగ్యతకలవాళ్ళు. వాళ్ళని గొర్రెల్లా అనుసరించడమే మిగిలినవాళ్ళ పని. వాస్తవం కనుక నీ చిత్రణ ప్రకారమే ఉండిఉంటే ఒక్క రోజులో ఇదంతా కూలిపోవును.''

"సిసిరో! నేనో వెర్రివెధవ ననుకుంటున్నావా? ఎంతో ప్రమాదకరమైన, ఎంతో దీర్ఘమైన జీవితాన్ని అనుభవించా. ఇంకా ఉన్నత స్థితిలోనే ఉన్నాను. రాజకీయవేత్త అంటే ఎవరు అని నువ్వడిగావు. రోమ్ అనే మతిలేని ఇంటికి అతను సిమెంటులాటివాడు. రోమన్ పౌరుల దగ్గరకెళ్ళి మేం ఉత్కృష్టులం, పురుషులలో పుణ్యపురుషులం, మీరు మమ్మ అనుసరించాల్సిన గొర్రెలు అంటే వాళ్ళకు రుచించదు. పైగా అరికాలిమంట తలకెక్కుతుంది. అదీకాక వాళ్ళు గొర్రెలూ కారు, మనం సర్వోత్కృష్టులమూ కాదు, అది నీకు కొద్దిరోజుల్లోనే తెలుస్తుంది. రెండోది రోమన్ పౌరుడితో కులీనుడికి ఏమీ సంబంధం ఉండదు. అందుకే భూస్వామికే ఈ గొడవ వదిలేస్తే నువ్వన్నట్లే ఇదంతా ఒక్కరోజులోనే కూలిపోక తప్పదు. అందుకే అతను నాలాటి వాళ్ళవద్దకు వస్తాడు. నిర్హేతుకమైన దానినుండి హేతువును సృష్టిస్తాం మేం. ధనవంతులకోసం చావడమే మహత్కార్య నిర్వహణగా మేం ప్రజలకు నచ్చచెప్తాం. తాంత్రికులం మేం. భ్రమల వల పన్నుతాం. అది అవివేకులకు, సామాన్యులకు చూస్తే అర్థంకాదు. మీరే శక్తి అని మేం ప్రజలతో అంటాం. మీలో ప్రతివాడి ఓటూ రోమ్ తాలూకు బలం; దాని ప్రతిభ. ప్రపంచంలో మీరొక్కరే నిజమయిన స్వేచ్ఛాజీవులు. మీ వ్యక్తిగత

స్వాతంత్ర్యంకన్నా అమూల్యమైనది లేదు. మీ నాగరికతకన్నా విలువైనదేదీలేదు. అది విని వాళ్ళు మా అభ్యర్థులకు వోట్లు కురిపిస్తారు. మేం ఓడిపోతే విచారిస్తారు. మేం విజయం పొందితే తామే విజయం పొందినట్లు సంతోషిస్తారు. మీరు బానిసలు కారని వాళ్ళతో చెబుతాం. మీరు స్వతంత్రజీవులు. మీ ఓటే రాజ్యాంగాన్ని నడిపిస్తుంది. వాళ్ళు బానిసలు కానందుకు గర్విస్తారు. ఔన్నత్యం పొందినట్లు భావిస్తారు. జీవితంలో ఎంత లోతుగా దిగజారి పోయినాసరే, తూము గట్లపై పడుకున్నాసరే, రోజస్తమానూ పొర్లాడి ప్రజలు దయదాల్చి ఇచ్చే బిచ్చపు మెతుకులు తింటూ భ్రూణ హత్యచేసే దౌర్భాగ్యానికి దిగజారినా సరే, పుట్టింది మొదలు చచ్చేవరకూ ఏ ఒక్కరోజూ చెయ్యడానికి పనిలేకపోయినాసరే బానిసలం కాదుకదా అనే ఉపశమనం వాళ్ళకుండేలా చేస్తాం. స్వతహాగా వాళ్ళుకూడా ఛండాలంగా ఉన్నాసరే బానిసలను చూచినప్పుడు మాత్రం తమకేదో గొప్ప హోదా, విశిష్టత, నాగరికత ఉన్నట్లు అహంభావం చెందితీరుతారు. మేం కదా యావత్ప్రపంచమూ చూసి అసూయచెందే రోమన్ పౌరులం అని సంతోషిస్తారు. ఇది నా విచిత్రమయిన కళ. సిసిరో! ఇదే రాజకీయం. రాజకీయాలను మాత్రం చిన్న చూపు చూడకు సుమీ!"

## 2

ఆ సంభాషణ సిసిరో, గ్రాఛూస్‌లను మరింత ఎడంగా తీసుకుపోయింది. గ్రాఛూస్‌కి సిసిరో అంటే మరింత అయిష్టం ప్రబలింది. రోమ్‌కు కొద్ది దూరంలోవున్న మొదటి పెద్ద శిలువ వాళ్ళకగుపించింది. ఆ శిలువకింద కొద్ది దూరంలో కునికిపాట్లు పడుతున్న ఒక స్థూలకాయుడ్ని చూపించి సిసిరో "ఆ మనిషి వాటం చూస్తే ఒక రాజకీయవేత్తలాగున్నాడే" అన్నాడు.

"నిజమే. అతను నా పాతస్నేహితుడు." గ్రాఛూస్ పల్లకీల నాపవలసిందిగా సంజ్ఞచేశాడు. అతిప్రయత్నం మీద తన శరీరాన్ని పల్లకీనుంచి బైటకీడ్వగలిగాడు. కూచుని కూచుని ఉన్న తన కాళ్ళు నొప్పులు తీరుతాయికదా అని సిసిరో అక్కడే అటూఇటూ పచారుచేస్తున్నాడు. సాయంత్రమవుతోంది. నల్లనిమేఘాలు అకాశాన్ని కప్పినై. సిసిరో వాటికేసి చూపించాడు.

"నీకు వెళ్ళాలని ఉంటే ప్రయాణం కానీ" గ్రాఛూస్ అన్నాడు. సిసిరో అంటే అతనికి మోజులేదు సరికదా మహా అయిష్టం. చిరాకు పొలిమేరలో ఉన్నా డతను.

"నే నాగుతా" అని చెప్పి సిసిరో పల్లకీపక్క నిలబడి శిలువ కింద కూర్చుని ఉన్న వ్యక్తివైపు నడుస్తున్న గ్రాఛూస్‌ను పరిశీలిస్తున్నాధు.

"ఈ రాత్రే" గ్రాఛూస్ అనడం విన్నాడు సిసిరో.

శిలువకింద మనిషి తల ఊపాడు.

గ్రాఛూస్ అరిచాడు; "నేనేం ఇవ్వదలుచుకున్నానో చెప్పనే చెప్పాను. నే చెప్పినట్లు

చేస్తావా చెయ్యి. చెయ్యవూ నే బతికున్నంతకాలం నీ ముఖం చూడను, నీతోమాట్లాడను."

గ్రాఛూస్ తన పల్లకీ ఎక్కాడు. వాళ్లిద్దరికీ జరిగిన సంభాషణ గురించి సిసిరో ప్రశ్నించలేదు. పట్నంలోకి పోయాక వాళ్ళు విడిపోయారు. గ్రాఛూస్ ఇంటికి చేరుకునేసరికి సంధ్యచీకటి అలముకుంటోంది. దీపం పెట్టుకొని స్నానం చెయ్యాల్సొచ్చింది. ఒక అతిథికోసం నిరీక్షిస్తున్నాను కాబట్టి భోజనానికి కొంచెం ఆలస్యం ఉంటుందని తన బానిసకు చెప్పాడు. ఆలోచిస్తూ పడకగది చీకట్లలోకి గుడ్డిగా చూస్తున్నాడు.

సంతోషంతో, ఇష్టంగా ఏ స్త్రీ తన పొందు వాంఛించింది? ఒక స్త్రీ ఎటువంటిది అన్న ప్రశ్నతో ఇంతవరకూ అతనికి సంబంధం లేదు. కాని తమాషా ఏమిటంటే ఇన్నాళ్ళకు ఇప్పటికి మనిషి అనిపించుకోగల ఆడది ఒకర్తె కనిపించింది. ఉన్న కష్టం అల్లా ఆమెను వెతికి పట్టుకోవడమే.

ఒక దాసీ తలుపుతట్టింది. సంగతేమిటని గ్రాఛూస్ ప్రశ్నించగా భోజనానికి పిలిచిన అతిథి వచ్చినట్లు చెప్పింది.

"అయితే ఒక్క క్షణంలో వస్తున్నా. అతనికేం కావాలో అన్నీ చూడండి. చినిగిన బట్టలతో అతను చూడటానికి అసహ్యంగా కనబడవచ్చు. ఐనాసరే అతన్ని చులకనగా చూసారంటే చావగొట్టేస్తా. చేతులూ కాళ్ళూ కడుక్కుందుకు వేడి నీళ్ళివ్వండతనికి. మంచి పళ్ళని టోగా కూడా ఇవ్వండి. అతని పేరు ఫ్లేవియస్ మార్కస్. పేరు పెట్టి పిలిచి మర్యాదగా చూడండి."

మొదటి శిలువవద్ద పడిగాపులు పడుతూ కూచునిఉండే ఈ స్థూలకాయుడు శుభ్రంగా తయారయి సోఫాలో కూచున్నాడు. అతన్ని చూడగానే బానిసలు తను చెప్పింది చేసినట్లు తెలిసిపోయింది. గ్రాఛూస్ ఆ గదిలో ప్రవేశిస్తుండగా గడ్డం పాముకుంటూ కూచున్న ఫ్లేవియస్ "వీటన్నిటికీ తోడు ఈ గెడ్డం కూడా గీయిస్తే" అంటుండగా -

"నాకు చాలా ఆకలిగా ఉంది. ముందు భోజనం చేయడమే మంచిది. ఈ రాత్రి కిక్కడుండు ఫ్లేవియస్. ఉదయాన్నే మంగలి వస్తాడు. వాడిచేత పనిచేయించుకుని హాయిగా స్నానంచేసి, శుభ్రంగా భోజనం చేసి విశ్రాంతి తీసుకుంటే బాగుంటుంది. మంచిబట్టలూ, జోళ్ళూ ఇస్తాలే; మనిద్దరిసైజూ ఒకటే: నా బట్టలు నీకు సరిపోవచ్చు."

వాళ్ళిద్దరూ ఒడ్డూపొడుగూ ఒకేలాగ ఉంటారు. చూసినవాళ్ళు ఇద్దరూ అన్నదమ్ములేమో అనుకుంటారు.

"వాడిచ్చిన పని వదిలి, నా దగ్గరనుండి తృణమో, పణమో పొందినందుకు సెక్టస్‌గాడు కేకలేస్తాడని మాత్రం భయపడకు" అన్నాడు గ్రాఛూస్.

"నీకేం; చెప్తావు కబుర్లు" ఫ్లేవియస్‌లో అసంతృప్తితో కలిసిన మూలుగు ధ్వనించింది. "నీకు రోజులు బాగుపడ్డాయిలే గ్రాఛూస్. సంపద, సౌకర్యం, మర్యాద, గౌరవం, అధికారం, నీకేం? జీవితం పాలమీద మీగడలా ఉంది నీమటుకు. కుళ్ళుతున్న బానిస శవాన్ని దగ్గర

పెట్టుకొని పడిగాపులు కాస్తూ వచ్చే పోయేవాళ్ళు దమ్మిడీ, ఏగానీ ఇస్తారుకదా అని లేనిపోని కాకమ్మకథలన్నీ అల్లి అబద్ధాలాడుతూ కూచోడం ఏమంత గర్వించదగ్గ ఘనకార్యమనీ? అడుక్కుతినడం ఇంతకన్న కొంచెం అసహ్యకరమైనదే కావచ్చు. కాటికి కాళ్ళు చాచుకు కూచున్న నాకు ఏదో కాస్త సహాయంచేసాడు సెక్టస్. ఇప్పుడు మళ్ళీ అతనిదగ్గరకు వెళ్ళాననుకో. మళ్ళీ ఏ ముఖం పెట్టుకుని నాగ్గరకు వచ్చావు? ఫో! ఫో! నీ రక్షకుడు, హితుడు, ఆ గ్రాఛూస్ దగ్గరకే పో అంటాడంటావా కాదా? నువ్వంటే అతనికి కిట్టదు. నీతో కలిస్తే నేనన్నా కిట్టదు."

"వీడి కిట్టడంతో ఎవడికి లెఖ్ఖేయ్" గ్రాఛూస్ అన్నాడు, "నే చెప్పిందిచెయ్యి. ఈ ఊళ్ళోనే నీ కోమంచి గుమస్తా ఉద్యోగం ఇప్పిస్తా, నాలుగురాళ్ళు వెనకేసుకోవచ్చు. ఒకళ్ళను దేహి అని అడగనఖ్ఖర్లేకుండా ఏ గొడవా లేకుండా బతకొచ్చు. అమ్మా, బాబూ అనుకుంటూ ఆ సెక్టస్‌గాడిసేవ చెయ్యనఖ్ఖర్లేదు."

"నావల్ల ఉపయోగం ఉందన్నప్పుడు, తగలేసినంతమంది స్నేహితలుండే వారు నాకు. అప్పుడంతా మనవాళ్ళే. అందుకేలే చివరికి సందులలో పందిలా బతకాల్సిన గతిపట్టింది."

"నువ్వు నాకిప్పుడుపయోగిస్తావు" అతన్ని మధ్యలో ఆపి గ్రాఛూస్ చెప్పుకుపోయాడు. "ఈ మూలగడం ఆపి తినడం ప్రారంభించు. దాన్ని తగలెయ్యి, రాక రాక అదృష్టంవస్తే నీ కెందుకా భయం?"

తిండీ, ద్రాక్షరసమూ ఫ్లేవియస్‌ను మెత్తబరిచాయి. పంచభక్ష్య పరమాన్నాలతో సుష్టుగా భుజించిన ఫ్లేవియస్ చల్లని, తీయని ద్రాక్షసారా సేవించి సోఫాకు జేర్లపడి కాళ్ళు చాచుకుని సుఖంగా కూచున్నాడు. అతని పెదవులపై చిరు నవ్వు గోచరిస్తుంది. అతని పెద్దబొజ్జ నెమ్మదిగా, తాపీగా పైకిలేస్తూ, పడుతూ ఉంది.

"గ్రాఛూస్! ఈ మధ్యన ఎప్పుడూ ఇటువంటి భోజనం చెయ్యలేదంటే నమ్ము. మంచి తిండికనక ఉంటే వేరేమందు అక్కర్లేదు. అదే సరైనమందు. తస్సాదియ్యా ఎటువంటి తిండోయ్! ప్రతిరోజూ ఇలా తింటున్నావన్నమాట. భలేవాడివే. నా కేముందిలే, నేనో ముసలిపందిని. ఇంతకూ ఇదంతా అనుభవించడానికి నువ్వర్హుడివేలే. అసలు తెలియక అడుగుతా; కోపగించుకుందుకు నాకున్న హక్కులేమిటి? నువ్వేదిచెప్తే అది చెయ్యడానికి సిద్ధంగాఉన్నా. ఇంకా నాకు కొద్దిమందితో పరిచయం ఉంది. కొద్దిమంది రౌడీలు, దొంగముండా కొడుకులు, కొంతమంది వ్యభిచారిణులు, కులస్త్రీలు నన్నెరుగుదురు. ఐనా నీ అంతట నువ్వు మరొకడి సహాయం అపేక్షించనక్కర్లేకుండా ఏపని చేసుకోలేవని నన్ను పిలిపించావు? నాకు చేద్దామనే ఉందనుకో."

"మరికొంచెం ద్రాక్షరసం కానీ చెప్తా" అంటూ ద్రాక్షరసం నింపిన గ్లాసు అతనికిచ్చి గ్రాఛూస్ చెప్పాడు: "ఫ్లేవియస్! నీలో కొన్ని మంచిలక్షణాలు ఉన్నాయని నా అభిప్రాయం. రోమ్‌లో ఉన్న ప్రతివాడినీ ఎరిగి, మనుషుల ఆత్మలతో శరీరాలతో, బాధలతో వర్తకం

చెయ్యగల నిపుణులు లేరనా నిన్ను పిలిచింది. గొడవ చేసేవాడు నాకెందుకు? అనుకున్నది గొడవలేకుండా సజావుగా జరిగిపోవాలి."

"నేనేం గొడవ చెయ్యనే" ఫ్లేవియస్ అన్నాడు.

"నాకు తెలుసు నువ్వు గొడవ చెయ్యవని. అందుకే నిన్ను పిలిచాను. నాకోసం ఒక ఆడదాన్ని నువ్వు చూసిపెట్టాలి. డబ్బుకు వెనకతీసేరకం కాదునేను. ఎంతైనా సరే. ఆమెనుమాత్రం తీసుకురావాలి. దీనికి బోలెడుఖర్చు ఉందని నాకుతెలుసు."

"అదెటువంటి ఆడది చెప్మా? వీళ్ళని తగలెయ్య తంబలు, తంబలుగా ఉన్నారీ ముండలు బజారులో అమ్మకానికి. ఈ బానిసయుద్ధం అంతమయే సరికి వీళ్ళకి లెక్కేలేదు. నీ కెటువంటిది కావాలంటే అటువంటిదాన్నే తీసుకొస్తా."

"ఎటువంటిదీ కాదు," గ్రాఛూస్ నెమ్మదిగా అన్నాడు. "నా క్కావాల్సింది ఒకర్తే ఉంది."

"బానిసేనా?"

"అవును."

"ఎవరది?"

"ఆమె పేరు వరీనియా. స్పార్టకస్ భార్య."

"ఆఁ" ఫ్లేవియస్, గ్రాఛూస్‌ని వెదుకుతున్నవాడిలా చూసాడు. ఒక గుక్క ద్రాక్షసారా తాగాడు. "ఆమె ఎక్కడుందంటావు?" అతన్నడిగాడు.

"నాకు తెలియదు."

"ఆమె తెలుసా?"

"తెలుసు, తెలియదు. ఆమెను నేనై ఎప్పుడూ చూడలేదు."

"ఆఁ !"

"ఏదో చేసిపెడతావు కదా అని నీకు డబ్బిద్దామనుకున్నాను. నాకేం కావాలో నీకు తెలుసు."

"ఒక ఆడది కావాలి నీకు. ఆమె ఎక్కడుందో తెలియదు. ఎప్పుడూ నువ్వు చూడనూలేదు. పోనీ ఎలాగుంటుందో తెలుసా?"

"తెలుసు. పొడుగ్గా ఉంటుంది. మంచి అంగసౌష్టవం కలదే కాని, సళాకులా వుంటుంది. ఎత్తయిన రొమ్ము. జర్మను జాతిది. జర్మనువాళ్ళకుండేలాగే ఒట్టి గడ్డిలాటి జుట్టు. నీలపుకళ్ళు, చిన్న చెవులు, ఎత్తయిన నుదురు. చిన్నదికాని నిడుపైన ముక్కు, లోతుగా ఉండి దీర్ఘంగా చూసేకళ్ళు. కింది పెదవి కొంచెం పెద్దదేమో అనిపిస్తుంది. వచ్చీరాని లాటినుభాష మాట్లాడుతుంది. చాలామటుకు రానట్లే నటిస్తుంది. థ్రేషియన్లు మాట్లాడినట్లుగా మాట్లాడుతుంది గ్రీకుభాష. ఆమెకు రెండు మూడు నెలల క్రితమే ఒక కొడుకు పుట్టాడు. వాడీపాటికి చచ్చే ఉంటాడు."

"ఆమె వయస్సెంత?"

"నాకు సరిగా తెలియదనుకో. 23, 27 మధ్య ఉండొచ్చు."

"అది కూడా చచ్చిందేమో."

"అదికూడా నువ్వు తెలుసుకోవాలి. చచ్చి ఉంటే చచ్చినట్లుగా రుజువు చెయ్యగలగాలి. కాని చచ్చిపోయిందనుకోను. ఆత్మహత్య చేసుకునే రకంకాదు. అటువంటిదాన్ని సులభంగా చంపెయ్యరు."

"ఆత్మహత్య చేసుకోదని నీకెలా తెలుసు?"

"నాకు తెలుసు అంతే. అదెలా, ఇదెలా అంటే చెప్పలేను కాని నాకు తెలుసు."

"స్పార్టకస్ ఓడింపబడిన తరువాత పదివేలమంది స్త్రీలనూ, పిల్లలనూ బందీలుగా తీసుకురాలేదూ?"

"ఇరవై రెండువేలమందున్నారు వాళ్ళు; కాని అందులో పన్నెండు వేల మందిని సైనికులు కొట్టేసారు. దీనివల్లే సైన్యాలకపవాదు వచ్చింది. దాన్ని కప్పిపుచ్చుకోడానికి యుద్ధసమయంలో దోపిడీవల్ల వచ్చిన తన భాగాన్ని ప్రభుత్వ ఖజానాలకు ఇచ్చేశాడు క్రాసస్. ఇదేమంత ఘనకార్యం కాదులే. ఆ దోపిడీలో అతనికి వచ్చిన భాగమే అతిస్వల్పం. కాక బానిసయుద్ధంలో దోపిడీచేస్తే లభించేదేముందిలే. పైగా ఈ మహానుభావుడు తానై ఒక్క బానిసనైనా తీసుకోలేదు. బజార్లో చవగ్గా దొరికేటప్పుడు కక్కుర్తిపడి పేరుపోగొట్టు కోవడం ఎందుకు?"

"ఆ ఆడాళ్ళలో వరీనియా ఉందా?"

"ఉండొచ్చు; ఉండకపోవచ్చు. ఆమె వాళ్ళ నాయకుడి భార్య. అందుకే బానిస లామెను కాపాడ్డానికి ప్రత్యేకశ్రద్ధ తీసుకున్నారేమో."

"ఏమోకాని, ఏదో సమానత్వం అంటూ ఏడిసినవాళ్ళు ఒకళ్ళ విషయంలో ఒకలాగ, మరొకళ్ల విషయంలో మరొకలాగ జాగ్రత్త తీసుకుంటారా?"

గ్రాఛూస్ తనగ్లాసులోని ద్రాక్షసారా పూర్తిచేసి ఒక వేలితో అతని కేసి చూపిస్తూ అడిగాడు: "నీ కీపని చెయ్యాలని ఉందాలేదా? ఇదేమీ మాటలతో అయ్యేపని కాదు. దీనికోసం కష్టపడాలి తెలుసా ఫ్లేవియస్."

"అదంతా నాకు తెలుసు. ఎంతకాలంలో ఇది జరగాలంటావు?"

"మూడు వారాలు."

"ఆఁ, అదీ, అబ్బే" ఫ్లేవియస్ నిస్సహాయుడిలా చేతులుచాచాడు. "అంత కొద్దికాలంలో ఇటువంటిపని సాధ్యపడుతుందా? కేపువాకి, సిసిలీకి, సిరాకూస్‌కు ఒక చోటికేమిటి ఆఖరుకు స్పెయిన్‌కు, ఆఫ్రికాకుకూడా మనుషులను పంపి గాలించాలి తెలుసా. నా కష్టంకూడా ఆలోచించాలి. కాని ఇంత తక్కువకాలం నిర్ణయిస్తే ఎలా?"

"ఎంత ఆలోచించాలో అంతా నేనాలోచించా. ఎలాగైతే అలా కానీ. ఆ సెక్టస్‌గాడి

దగ్గరకే పోయి వాడుపెట్టే ముష్టిమెతుకులు తిని బతుకు."

"చంపేసావు గ్రాఛూస్. అంత కోపమేమిటయ్యా నీకు? ఎంతమందినో కొనాల్సి వస్తుందనుకో. నువ్వు చెప్పిన వర్ణనకు ముమ్మూర్తులా సరిపోయే జర్మన్ స్త్రీలెంతో మంది ఉన్నారు."

"చాలామందే ఉన్నారని నాకు తెలుసు. కాని నాకు కావలసింది నా వర్ణనకు సరిపోయిన జర్మన్ స్త్రీ కాదు; నే చెప్పినట్లుండే వరీనియాయే కావాలి."

"ఆమె నాకు కనపడిందే అనుకో. అయితే ఎంత ధర ఇచ్చి కొనమంటావు?"

"అవతలివాడు ఎంతధర అడిగితే అంత. ఎంతయినా సరే, నేనేమీ అనను."

"సరే గ్రాఛూస్ ఖరారు, ఆ సారా మరో గ్లాసుడు పోయించు."

# 3

అనుకున్న మూడు వారాల గడువూ పూర్తికాకుండానే పని విజయవంతంగా ముగిసిందని చెప్పడానికని ఫ్లేవియస్ తిరిగి వచ్చాడు. చేతులోపడ్డ నాణెం హృదయాన్నే మార్చగలదు అని ప్రతీతి. పూర్వంలా కాక ఫ్లేవియస్ మంచి దుస్తులు ధరించి నీటుగా, గోటుగా తయారయాడు. కష్టమైన కార్యాన్ని నేనుకదా అతి సులభంగా సాధించగలిగిన మొనగాడిని అన్న అహంభావం అతనిలో పూర్తిగా ఉంది. గ్రాఛూస్‌తో కూచుని ద్రాక్షసారా సేవిస్తూ తనకు తెలిసిన సమాచారమంతా తమాషాగా, మజాగా చెప్పుకుపోతున్నాడు. దీన్ని సహించడం గ్రాఛూస్‌కు మహా కష్టమనిపించింది.

"బానిస యుద్ధంలో కొల్లగొట్టిన వస్తువులు పంచుకున్న సైనికోద్యోగుల వద్ద సమాచారం సేకరించడానికి మొదట పూనుకున్నాను. వరీనియాయే కనుక మంచి అంగసౌష్టవం ఉండి అందంగా ఉన్నదే అయితే ఆమె ఏ పెద్ద ఉద్యోగి దగ్గరో ఉంటుందని నా అనుమానం. సంగతేమిటయా అని అడిగితే నాలుగింట మూడుపాళ్లు నోళ్ళు మెదపరు. పోనీ ఆ మాట్లాడినవాళ్ళయినా ఆకుకి అందకుండా పోకకు పొందకుండా ఎందుకూ ఉపయోగంలేని కబుర్లు చెప్తారు. ఎలాగయినా అదృష్టం మనవైపుంది. కొందరికి జ్ఞాపకం ఉంది. బానిసలు ఓడిపోయారన్న వార్త చేరేసరికి వరీనియా నొప్పులు పడుతోంది. అప్పుడే నువ్వు చెప్పిన పిల్లాడు పుట్టాడు. ఆ పిల్లాడిని క్షణంవదలక అంటిపెట్టుకు కూచునేదని జ్ఞాపకమున్నవాళ్లు చెప్పారు. ఆమె వరీనియా అనీ, స్పార్టకస్ భార్య అనీ వాళ్ళకి తెలియదు. ఆ బానిసల పట్నం మీదికి క్రాసస్ ఒక అశ్వదళాన్ని పంపించాడు. బానిసలోడిపోయిన వెంటనే ఆ దళం వెనక సైనికులుకూడా వెళ్ళారు. బానిస స్త్రీలుకాని, అక్కడున్న పదమూడు పద్నాలుగేళ్ల వాళ్ళుకాని ఎవరూ మనవాళ్ళని ప్రతిఘటించలేదు."

"అప్పుడు మన సైనికులు కోపంతో మండిపోయారు. కాబట్టే మొదట్లో ఎంతోమంది బానిసలను అనవసరంగా, మతి లేకుండా చంపేసారు. వరీనియా కప్పుడే పురుడొచ్చింది.

బానిస బిడ్డడు బంగారమంత విలువైనవాడా ఏం? ఒక సైనికుడా పిల్లాడిని ఒక కాలు పట్టుకుని గుడారం రాటకేసి కొట్టి చంపుదామని పైకెత్తే సరికి క్రాసస్ అడ్డుపడి ఆ సైనికుడిని ఒంటి మీద తెలివి లేకుండా చావకొట్టాడట. క్రాసస్ అలా చేసాడని చెబితే ఎవడైనా సందేహిస్తా డంటావా?"

"ఎవడైనా క్రాసస్ గురించి సందేహిస్తాడా లేదా అన్న సంగతి నా కనవసరం. నీకు వరీనియా కనిపించిందా? ఆమె నాకు లభించే అవకాశం ఉందా? ఆమెను కొన్నావా లేదా?"

"కొనలేకపోయాను."

"ఏం?" గ్రాఛూస్ పెద్దగా గర్జించాడు. ఊహించుకోలేనంత కోపంతో లేచి నిలబడ్డాడు. "ఏం? అది చచ్చిందా, బతికే ఉందా?"

"ఆమె చావలేదు."

"దాన్నెందుకు కొనలేదూ?"

"తగ్గు మహాశయా! తగ్గు!" ఫ్లేవియస్ కూడా గట్టిగా అరవడం ప్రారంభించాడు. "నువ్వు నన్నోపని చెయ్యమన్నావు. అది నే చేసుకొచ్చా. గ్రాఛూస్ ఆమెను అమ్మడానికి ఎవరూ సిద్ధంగా లేరు. కాబట్టే కొనలేకపోయా అంతే."

"ధరెంత?"

"ధరాలేదు, గిరాలేదు. ఆమె క్రాసస్ దగ్గరుంది. వాడింట్లోనే ఉంది. దాన్నెవరూ అమ్మదలుచుకోలేదు. క్రాసస్ కేపువాలో ఉన్నాడు. నే నతని ఏజంట్లతో వ్యవహారం కదిపాను. వరీనియా గురించి సంభాషణ వచ్చేసరికి వాళ్ళ మూతులు బిగుసుకు పోయేవి. ధర ఇంతని కాని, ఇంత ఉండొచ్చునని కాని, అమ్ముతారని కాని ఏమీ చెప్పరు వాళ్ళు. వాళ్లచేతులు తడిపాను. దానికీ వాళ్ళు లొంగలేదు. దీన్ని తప్ప ఆ ఇంటిలోని మరే బానిస ముండనయినా సరే ఇవ్వగల ఏర్పాట్లు చేస్తామన్నారు. ఈ వరీనియా గురించి ఆశ వదులుకోమంటారు వాళ్ళు."

"అల్లాటప్పుడు వరీనియా అదే అనిగాని, ఆమె క్రాసస్ ఇంట్లోనే ఉందని కాని రూఢిగా ఎలా తెలిసింది?"

"క్రాసస్ బట్టలూ అవీ సర్దే బానిస్ వొకదాన్నడిగాను. సమాచారం సంపాదించగలిగాను కాని వరీనియాను సంపాదించలేక పోయాను."

"క్రాసస్ ఆమె నెందుకు కొన్నాడో తెలుసుకోలేక పోయావా? వాడి కెందుకో అది?"

ఫ్లేవియస్‌కి కొద్దిగా నవ్వొచ్చింది. "తెలుసుకోకేం. క్రాసస్ ఆమెను ప్రేమించాడు !"

"ఏమిటి?"

"నిజమే. మహాసేనాని ప్రేమలోపడ్డాడు."

అప్పుడు గ్రాఛూస్ నెమ్మదిగా, బరువుగా, ఖచ్చితంగా అన్నాడు. "ఫ్లేవియస్! ఈ విషయం పైకి పొక్కినట్లు నాకు తెలిసినా మనిద్దరంకాక మూడోవాడెవడైనా ఈ మాట చెప్పుకొంటున్నట్లు నా చెవినపడ్డదా చూసుకో ఏం చేస్తానో నిన్ను; శిలువకు వేలాడ దీయిస్తా."

# 4

మర్నాటి మధ్యాహ్నం పట్నంలోని స్నానశాలకు బయలుదేరాడు గ్రాఛూస్. ఆ రోజులలో స్నానశాలకు పోవడం, ప్రత్యేకం ఏదో ఒక రాజకీయ ప్రయోజనం సాధించడాని కన్నమాట. దానికి ఫలితం కూడా లేకపోయేదికాదు. నానాటికి ఈ స్నానశాలలే రాజకీయ, సాంఘిక ప్రాముఖ్యత నందుకుంటున్నాయి. మేజిస్ట్రేటులు, సెనేటర్లు ఇక్కడే తయారయేవారు. లక్షలాదిధనం చేతులుమారేది. అదే వ్యాపారసంస్థ. అదే రాజకీయ చర్చల వేదిక. కొన్నాళ్ళ కొకమారయినా అక్కడికి పోవడమనేది ఒక ఆచారమైపోయింది. గ్రాఛూస్ ఆ ఆచారాన్ని తరచు పాటించేవాడు. ఆ స్నానశాలలో ఒకటీమధ్యనే నవీన పద్ధతులలో కట్టబడింది. మరో రెండు పూర్వం కట్టినవే అయినా బాగానే ఉన్నాయని అతని అభిప్రాయం. స్నానశాలలలోనికి పోవడానికయ్యే ఖర్చు సామాన్యునికి అందుబాటులో ఉండదు. ఈ హోదా అన్నది సంఘాన్ని తరగతులుగా చీల్చుతుంది.

మెలికలు తిరిగి, ఇక వీటికి అంతులేదా అని తోచే మురికి రోమన్ రోడ్ల వెంబడి నడిచిపోవడం అంటే గ్రాఛూస్‌కి సరదా. రోమ్, తనరోమ్, తను ప్రేమించే తన మాతృమూర్తి రోమ్. అతని భాషలో వ్యక్తం చేయాలంటే రోమ్ ఒక కులట. ఆ కులట గర్భంలోంచి ఇతనొచ్చాడు. రోమ్ మురికి రోడ్లమీద పడి దొర్లమని ఇతన్నామె ప్రసవించింది. కులటయినా, మరెవరైనా ఆమె అతని మాతృమూర్తి. అందుకే అతనామెను ప్రేమిస్తున్నాడు. ఆమెకూడా ఇతన్ని ప్రేమిస్తూనే ఉంది.

"మనవీధులలో మన కళ్ళముందు ప్రత్యక్షంగా జరిగేదానిలో ఒక వెయ్యోవంతైనా ఆ నాటకరంగం మీద చూపించగలరూ?" మేధావియైన స్నేహితుడిని ఒకసారి అడిగాడు గ్రాఛూస్.

అలా రోడ్ల మీద తిరుగుతూ స్నానశాలవైపు పోతున్నాడు. జాగ్రత్తగా ఆలోచించి ముందే పథకం వేసాడు. ఆరోజే, అదే సమయానికి క్రాసస్ కూడా అక్కడికి వస్తాడని ఎక్కడుంది? ఇతను ముందు ప్రవేశించిన వాటిని ముస్తాబుగదులంటారు. అక్కడ బట్టలేసుకోవడం, తలదువ్వుకోవడం, ఒకటేమిటి? ఉన్నత కులజుల అలంకరణ కార్య క్రమమంతా కొనసాగుతుంది. ఇతను వెళ్ళేసరికి క్రాసస్ కూడా అక్కడే ఉన్నాడు. రివటలాంటి తన పొడుగాటి శరీరాన్ని చూసుకుందుకొక నిలువుటద్దాని కెదురుగా నిలబడ్డాడు. చుట్టూ ఉన్న ఎన్నో అద్దాల్లో అతని నగ్నశరీరం ప్రతిబింబిస్తోంది.

మధ్యమధ్య క్రాసస్ నొకకంట కనిపెడుతూ ఒక బల్లమీదకు తన శరీరాన్ని చేర్చాడు గ్రాఛూస్. ఒక బానిస తనబూట్లు విప్పుతున్నాడు. గ్రాఛూస్ దుస్తులు బానిసలు విప్పుతున్నప్పుడు క్రాసస్ అక్కడ నిలబడలేక పోయాడు. తనూ దిగంబరుడే కాని ఈ గ్రాఛూస్ దిగంబరత్వంముందు తన దిగంబరత్వాన్ని నిలపడానికి అతనికసహ్యం వేసింది.

కూచుని విశ్రాంతి తీసుకునేందు కుపయోగపడే వెచ్చగా ఉండే గదులలోకి వాళ్ళిద్దరూ వెళ్ళారు. కూచుందుకూ, పడుకునేందుకూ బల్లలూ, చాపలూ అవి ఉన్నాయక్కడ. కాని సాధారణంగా అంతా స్నానాలకుండీల దగ్గరనుండి ఇక్కడిదాకా పచార్లు చేస్తుండడమేకాని ఎవరూ పడుకోరు. పాలరాతి చప్టాలతో, చిత్రవర్ణాలతో, శిల్ప ప్రతిభావిలసిత విగ్రహ సముదాయంతో, కళ్ళుకింపుగా, విశాలంగా ఉన్న ఈ వసారానుండి చిన్న చన్నీటి చెరువు దగ్గరకైనా పోవచ్చు; నులివెచ్చని నీటితో నింపిన చెరువువద్దకైనా పోవచ్చు. తిరిగి వీటన్నిటినుంచీ కసరత్తు శాలలకు పోవడానికీ, మర్దనగదుల కెళ్లడానికీ మార్గాలున్నాయి. తోటలలోని విహారస్థలాలలో తిరగొచ్చు. స్నానశాలలో ఒక భాగమైన గ్రంథాలయంలోకి పోవచ్చు. ఈ స్నానశాలల్లోని సౌకర్యాలన్నీ పొందాలనుకుంటే గంటల తరబడి ఏ పనీ లేకుండా ఖాళీగా ఉండే వాళ్ళుకుకాని వీలవదు. గ్రాఛూస్ చన్నీటి చెరువులో మునిగి, ఆవిరిగదిలో ఓ అరగంట మర్దన చేయించుకుందుకు పోయేవాడు. అంతటితో అతనికి సంతృప్తి కలిగేది.

ఇప్పుడు మాత్రం తన అలవాటు క్రాసస్ పద్ధతులకనుగుణంగా మార్చుకున్నాడు.

"వంతెనలేస్తున్నార్రోయ్." ఎప్పుడూ కలుసుకోని ఇద్దరు రాజకీయవేత్తలుకాని, ఉన్నత వర్గానికి చెందిన వ్యక్తులు కాని కలిసినప్పుడు ప్రజలనుకునే మాటలివి. దీన్లోంచి రాబోయే చిత్రమేమిటా అని క్రాసస్ చూస్తున్నాడు. 'అతని ఉద్దేశం ఏమైతేకానీ, బయటపడకమానదు' అనుకున్నా డతనిలో అతను.

"క్రాసస్ నాకు తెలియకడుగుతా; మనం స్నేహితులుగా ఉండటానికి అభ్యంతర మేముంది? మనిద్దరికి ఒకరి స్నేహం మరొకరి కుండడంవల్ల ఎంతో ఉపయోగం కదా?" అన్నాడు గ్రాఛూస్.

"నేనూ అలాగే అనుకుంటూ ఉంటాను. నా స్నేహం నీకెందుకింత విలువైనదిగా కనపడింది?"

"నీ దగ్గర ఉన్న ఒక బానిసను నేను కొనదలిచా" గ్రాఛూస్ గొణిగాడు. అమ్మయ్య ఎలాగో ఒకలాగు ఊడిపడింది అసలు సంగతి.

"నా వంటమనిషి కావాలా? తీసుకో. లేకపోతే పల్లకీబోయిలు కావాల్నా? ఆడది కాదుకద కొంపతీసి. మీ ఇంట్లో స్త్రీలు తప్ప ఇంకెవరూ లేరని విన్నాలే."

"దుంపతెగ. నీకు తెలుసయ్యా నాకేం కావాలో" గ్రాఛూస్ ఈ మాటలు హెచ్చుస్థాయిలో అన్నాడు; "నాకు వరీనియా కావాలి."

"ఎవరూ?"

"వరీనియా. ఎందుకులే ఈ ముసుగులో గుద్దులాట?"

"ఈ గుద్దులాట తమరు ప్రారంభించిందే, అయినా తమకీ సంగతులన్నీ ఎవరు చేరేస్తున్నారు."

గ్రాఘూస్ క్రాసస్‌ని పరిశీలనగా చూశాడు. "చూడు క్రాసస్, డొంకతిరుగుడు నా కిష్టంలేదు. బేరమూవద్దు, బెట్టూ వద్దు. సూటిగా చెప్పేస్తున్నా. ఒక బానిసకోసం ఇంతకు మున్నెన్నడూ రోమ్‌లో ఎవ్వడూ చెల్లించనంత ధర నే నిస్తా పదిలక్షల సెస్టెర్‌సస్, పది లక్షల బంగారు నాణాలు ఖంగున చెల్లిస్తా. వరీనియాని మాత్రం నాకియ్యి."

క్రాసస్ చేతులు ముడుచుకున్నాడు. "ధరైతే బాగానే ఉందనుకో. కానీ నీకు నేను విక్రయించగలిగినదేదీ లేదు."

"బాగా ఆలోచించి చెప్పాను సుమీ ఆ ధర చూసుకో."

"నేను బాగా ఆలోచించే నీకు సమాధానం చెప్పాను."

"అయితే రెట్టింపు చేస్తున్నా" గ్రాఘూస్ గుర్రుపెడుతున్నాడు, "ఇరవై లక్షలు."

"చిరాకెత్తిస్తున్నావు" అని క్రాసస్ గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు.

## 5

"వరీనియా! లే అమ్మా, బట్టలేసుకో. బాబుగారింటికొచ్చే వేళయింది. ఆయనతోబాటు నువ్విప్పుడు భోజనం చెయ్యాలి. వరీనియా! మమ్మల్ని చంపుకు తింటావేం తల్లీ?"

"నాకు మిమ్మల్ని చంపుకొని తినాలనిలేదే."

"లేదేమో. కాని నువ్వు మమ్మల్ని చంపేస్తున్నావ్. నేనూ ఒక బానిసనే అంటావ్ కానీ నీకోసం నలుగురు బానిసలు పడిగాపులు పడుతూ కూచోవాలిలాగుంది. నువ్వూ మాలాటి బానిసవే. ఎంతో దౌర్భాగ్యం అనుభవించానని చెబుతావు. బానిసగా ఉండడమంటే ఏమిటో నీకు కొత్తకాదుగద."

"ఇక నన్ను చంపకండి. నేను మీకు ఎప్పుడైనా దూరంగా ఉన్నానా?"

"ఆయనకి కావాలన్నప్పుడు మాలో ఎవర్నో ఒకర్ని తీసుకుపోయేవాడు. అంతలో నువ్వు తయారయ్యావు. వరీనియా! ఇప్పుడాయనకు నువ్వంటేనే ప్రేమ. అందుకేలే, నువ్వు మమ్మల్ని తినేది కూడా!"

ఆమె వాళ్ళతో అన్నది: "ఇప్పుడు నేను పిల్లాడికి పాలిస్తున్నా. పాలివ్వడం అయిపోనివ్వండి. అప్పుడు బట్టలు వేసుకుంటా, మీరే బట్టలు వేసుకోమంటే అవి." బిడ్డకి పాలిస్తూ మృదువుగా, మెల్లిగా, హాయిగా జోలపాడింది. పాలు తాగడం అయింది. తల్లి ఒడిలో నిద్ర పోయాడు. కళ్ళు మూసుకున్నాడు బిడ్డడు. కడుపు నిండిన పిల్లల ముఖాలలో ఎంత సంతుష్టి, మాటలలో చెప్పలేని ఎంత నిర్విచారం తొణికిసలాడుతాయో! శిశువుని ఉయ్యాలలో పడుకోబెట్టి వంగి కొడుకును చూస్తూ నా బిడ్డ ఎంత అందమైనవాడో అనుకుంది.

బిడ్డను వదిలి తనకోసం నిరీక్షిస్తున్న బానిసలవద్దకామె వెళ్ళింది. ఆమె నలంకరించడం కోసం ప్రత్యేకంగా నలుగురు బానిసలు. ఇదంతా భోజనకాలంలో బాబుగారు చూసి సంతోషించడానికే.

లేత పచ్చ రంగుగల పట్టు శాలువ ఆమె కప్పుకొన్నది. ఆమె శరీరాన్నీ, బట్టలనూ ఈ శాలువ కప్పేసింది. దగద్ధాగేయమానంగా అలంకరింపబడి భోజనానికి ఆమె వచ్చినపుడల్లా క్రాసస్ అనేవాడు.

"ప్రేయసీ వరీనియా! నీ చక్కని శరీరాన్ని అలా కప్పేసుకుంటావెందుకు? ఆ శాలువ తొలగించరాదా? దానికిందనున్న బట్టలవెల పదివేల సెస్టర్‌సెస్ తెలుసా? ఇంకేమీ చెయ్యలేకపోయినా దాన్ని చూసేనా సంతోషించనీ." రోజులాగే ఆమె ఈనాడు కూడా శాలువ తొలగించిందతని కోసం.

క్రాసస్ అన్నాడు : "నువ్వు నన్నెంతో గాభరా పెట్టేస్తున్నావ్. దెయ్యంలాంటి సిస్ ఆల్‌పైన్ గాల్‌లో ఒక రాత్రి బేటియాటస్ గడపవలసిన భాగ్యం దౌర్భాగ్యమే అనుకో నాకు లభించింది. అతను నీ గురించి వర్ణించాడు. నువ్వో బ్రహ్మరాక్షసివని చెప్పాడు. ఎవడికి లొంగని పెంకె ఘటాల కుండవలసిన లక్షణాలన్నీ నీలో మూర్తీభవించాయని వర్ణించాడు. తీరాచూస్తే నువ్వు ఎంతో వినయంగా చెప్పినదల్లా చేసిపారేస్తున్నావు. ఆ లక్షణాలేం కనబడవు."

"ఈ రాత్రి ఎంత చక్కగా కనిపిస్తున్నావు నువ్వు! మంచి దుస్తులు ధరించి, ఎంతో చక్కగా అలంకరించుకొని వరీనియా ఇలా ఎన్నాళ్ళని? నిన్ను నేనెంతో మర్యాదగా చూస్తున్నానా? లేదా? విచారందోవ విచారానిది. కాని దీనితో ఆ ఉప్పుగనులను పోల్చిచూడు. నీ కొడుకు నమ్మితే మూడువందలొస్తుంది. నీ కొడుకును అమ్మి నిన్నుప్పుగనులకు పంపితే బాగుంటుందంటావా? ఇలా మాట్లాడ్డం నాకే అసహ్యంగా ఉంది" అన్నాడు క్రాసస్.

"నీకెలా తోస్తే అల్లా మాట్లాడొచ్చు. నేను మీ అధీనంలో ఉన్నా."

"నిన్ను నా ఆస్తిగా మార్చుకుందామని కాదు నాకున్నది. నిజం చెప్పాలంటే నేనే నీ అధీనంలో ఉన్నా. ఒక పురుషుడు తను ప్రేమించిన ఒక స్త్రీని పొందినట్లుగా నిన్ను పొందుదామని ఉంది నాకు."

"నేను నిన్నాపలేనే - ఈ ఇంటిలోని ఏ బానిసా నిన్ను ఆపలేనట్లే నేను కూడా నిన్నాపలేను."

"వరీనియా! నిన్ను బలాత్కారం చెయ్యడం నా ఉద్దేశం కానేకాదు. మామూలుగా బానిసలతో ప్రవర్తించినట్టే నీ సందర్భంలో కూడా ప్రవర్తిద్దామని నాకు లేనేలేదు. నువ్వే నన్ను ప్రేమించినట్లయితే నా ప్రవర్తననే మార్చుకోగలను. నాలో కొత్తదనం, ఒకమార్పు, ఔన్నత్యం కలుగుతాయి. ప్రపంచమంతటికీ ధనవంతుడ నంటారు నన్ను; కాకపోవచ్చు. కాని నువ్వే నన్ను ప్రేమిస్తే మనిద్దరమూ కలిసి ఈ యావత్ ప్రపంచాన్నీ జయించగలం,

పాలించగలం."

"ప్రపంచపరిపాలన నా కనవసరం" వరీనియా చెప్పింది. ఆమెగొంతు నిర్జీవంగా, భావరహితంగా ఉంది. అతనితో ఎప్పుడు మాట్లాడినా ఆమె అలాగే ఉంటుంది.

"నీ ప్రేమకు పాత్రుణ్ణి కాగలిగితే నేను మరో మనిషిగా నూతనత్వం పొందలేననా నీ అభిప్రాయం!"

"నాకు తెలియదు."

"ఈ వేళ గమ్మత్తొకటి జరిగింది. స్నానశాల దగ్గర గ్రాఛూస్ లోపలికొచ్చాడు. నువ్వు కావాలిట వాడికి. అమ్మితే ఎంత డబ్బు కావాలంటే అంతా ఇచ్చేస్తాడట."

"పోనీ నన్నమ్మెయ్యలేక పోయావా?" వరీనియా ప్రశ్నించింది.

"వాడికా? ఆ కొవ్వెక్కిన పందిని నువ్వోమారు చూడాల్సింది. వాడూ, వాడి రూపం. ఒకవేళ నీకు అదికూడా లెఖ్ఖలేదా?"

"ఏదీ లెఖ్ఖలేదు."

"నన్ను నువ్వెందుకంతగా అసహ్యించుకొంటావు?"

"నిన్ను ప్రేమించాలి లాగుందేం క్రాసస్?"

"ఔను. స్పార్టకస్ తన జీవితకాలమంతటిలోనూ ఎంత గింజుకున్నా ఇవ్వలేని సౌఖ్యం నేనిప్పుడు నీకిస్తున్నాను. కాబట్టి నన్ను నువ్వు ప్రేమించి తీరాలి."

"ఏమీ ఇవ్వలేదు నువ్వు."

"ఏం? ఏదివ్వలేదు? ఆ స్పార్టకస్ ఏమైనా భగవంతుడా?"

"అతను భగవంతుడేం కాదు" వరీనియా సమాధాన మిచ్చింది. "అత నో మామూలుమనిషి, నిష్కల్మషమైన మనిషి. అతనో బానిస. బానిసంటే ఎవరో నీకు తెలుసా?"

"ఏ పల్లెటూళ్లోనో, పొలంలో పనిచేసే బానిసకు నిన్నప్పగిస్తే అతన్ని ప్రేమించి అతనితో బతకగలవా?"

"నేను స్పార్టకస్‌నే ప్రేమించగలిగాను. ఇంకెవరినీ ప్రేమించలేదు; ఇకముందు ప్రేమించలేను. ఐనాసరే పొలంలో పనిచేసే బానిసతో బతకగలను. కొంతమట్టుకైనా అతను స్పార్టకస్‌లాగుంటాడు. స్పార్టకస్ నాకన్నా కూడా చాలా సామాన్యంగా ఉండేవాడు. నీతో పోలిస్తే అతనొక చంటిపిల్లాడే, స్వచ్ఛమైనవాడు."

"స్వచ్ఛమైనవాడంటే నీ ఉద్దేశం" ఇంకా కోపాన్నణచుకుంటూనే అడిగాడు క్రాసస్. "నీ దగ్గరనుంచి ఇలాటి చెత్త చాలా వచ్చింది. స్పార్టకస్ మానవ సమాజానికే శత్రువు. కసాయి ప్రవృత్తిగల హంతకుడు. రోమ్ సృష్టించిన ప్రతి మంచిపనికీ, అందమైనదానికీ విరోధి. ప్రపంచానికే శాంతిబిక్ష పెట్టింది రోమ్. మానవ నాగరికతను వృద్ధిచేసింది. ఈ చెత్తగొట్టు బానిసకు తెలిసిందేమిటి? నాశనం చెయ్యడం, తగలపెట్టడం తప్ప వీడికున్న జ్ఞానం ఏమిటి?

ఈ బానిసలకు నాగరికతను గురించి అణుమాత్రమైనా తెలియకపోవడంవల్ల ఎన్నెన్ని భవనాలు తగలబడి బూడిదపాలు అయ్యాయో తెలుసా? ఎన్నివేలమంది చచ్చారో తెలుసా? రోమ్‌తో యుద్ధం వెలగబెట్టిన ఆ నాలుగేళ్ళలోనూ ఈ బానిసలు సాధించ గలిగిందేమిటి?"

ఆమె మౌనంగా తల వాల్చుకొని నేలను చూస్తూ అలానే కూర్చుండిపోయింది.

"ఏం? సమాధానం చెప్పవే?"

"నీకేం చెప్పాలో, ఎలా చెప్పాలో నాకు తెలియడం లేదు. నీ ప్రశ్నలే నా కర్థం కావు."

"స్పార్టకస్ ఏదో స్వచ్ఛమైనవాడన్నావు. ఏమిటా స్వచ్ఛం? నేనేం అంతకన్న స్వచ్ఛంగాలేనా?"

"నీ గురించి నాకు తెలియదు" వరీనియా అంది. "స్పార్టకస్ ఒక్కడి గురించే తెలుసు నాకు."

"సరేకాని అతను స్వచ్ఛమైనవాడెలా గయ్యాడు?"

"తెలియదు. నాలో నేనే అతనెలా స్వచ్ఛమైన వాడయాడనుకుంటూ ఉంటాను. బహుశా అతనో బానిస కావడంవల్లనేమో. అంతగా బాధల ననుభవించడం వల్ల కావచ్చు. బానిస ఎలా బాధపడతాడో నీకేం తెలుసు?"

"మరి స్వచ్ఛం అంటావేమిటి?"

"నా కతను స్వచ్ఛమైనవాడే. ఒక్క చెడ్డపనీ చెయ్యలేదతను."

"అయితే తిరుగుబాట్లు లేవదీసి, సంక్షోభం వ్యాపింపజేసి, ప్రపంచానికి నిప్పంటించడం కూడా మంచిపనే అంటావా?"

"మేమేం ప్రపంచానికి నిప్పంటించలేదే! మాక్కావలసిందల్లా మా స్వాతంత్ర్యం. మాక్కావలసిందల్లా మేం శాంతియుతంగా జీవించగలగడమే. మీరు మాట్లాడుకునే మాటలు నాకేం తెలియవు. మా ఇద్దరికీ కావలసింది స్వేచ్ఛ."

"మరి మీరు బానిసలు."

"అయినంతమాత్రాన కొందరు బానిసలుగానూ, మరికొందరు స్వతంత్రులుగానూ ఎందుకుండాలి?"

వాదనలో ఆమెను లొంగదీసుకునేందుకు క్రాసస్ మరింత మృదువుగా ఉపక్ర మించాడు. "వరీనియా! ప్రస్తుతం నువ్వు రోమ్‌లో ఉన్నావు. నా పల్లకీలో కూచోబెట్టి నిన్ను ఈ ఊరంతా తిప్పాను. అంతులేని, పరిమితులులేని రోమన్ శక్తిని నువ్వు స్వయంగా చూసావు. రోమను రోడ్లు ప్రపంచం అంతటా సాచుకొని ఉన్నాయి. రోమన్ సైనికదళాల నాగరికత పొలిమేరలలో నిలబడి అజ్ఞానతిమిరాల దుష్టశక్తుల బారినుండి ప్రపంచాన్ని రక్షిస్తాయి. సర్వోత్కృష్టమైన రోమన్ సెనెట్ యొక్క అధికారదండాన్ని చూసి ప్రపంచం

గడగడలాడుతుంది. ఎక్కడ నీళ్ళు కనిపిస్తే అక్కడ రోమన్ నావికాదళాలు గస్తీ తిరుగుతుంటాయి. మా దళాలను కొన్నింటిని బానిసలు నిర్మూలం చెయ్యగా చూసావు. కాని రోమ్‌లో ఆ జాడలు కాస్తయినా కనిపించాయా? పురాతన సామ్రాజ్యాలేవీ సరిపోల్చదగని రోమన్ మహాసామ్రాజ్యాన్ని, కొద్దిమంది ఏమీ చేతకాని బానిసలు లేవదీసిన అర్థరహితమైన విప్లవాలవల్ల నిర్మూలించగలరన్న సంగతి నువ్వసలు కలలోనయినా ఊహించుకోగలవా? రోమ్ శాశ్వతమైనది, అనంతమైనది. ఆపాటి నీ కర్థంకాదూ? మానవుడూహించగల జీవిత పద్ధతులలో రోమన్ పద్ధతి సర్వోత్కృష్టమైనది. ఆ పద్ధతే చిరకాలంగా ఉండిపోతుంది. ఇదే నువ్వర్థం చేసుకోవాలని నా కోరిక. ఆ స్పార్టకస్ గురించి ఇంక నువ్వేడవకు. చరిత్ర స్పార్టకస్‌కు ఇవ్వవలసిన స్థానం ఇచ్చింది. అతనికి తగినట్లు బుద్ధి చెప్పింది. నీ బతుకు నువ్వు బతుకింక, అంతే."

"నేను స్పార్టకస్ గురించి ఏడవను. స్పార్టకస్ గురించి అసలెవ్వరూ ఏడవరు. ఎవరూ స్పార్టకస్‌ను మరచిపోరు కూడా."

"ఆహ్! వరీనియా! ఎంత మూర్ఖంగా ఉన్నావు నువ్వు! అప్పుడే స్పార్టకస్ ఒక దెయ్యం అయిపోయాడు. రేపా దెయ్యమూ మిగలదు. ఇంక పదేళ్లయ్యాక ఈ స్పార్టకస్ ఎవడో ఏమిటో ఎవరికీ జ్ఞాపకముండదు. ఎందుకు జ్ఞాపకముండాలి? ఏమంత ఘనకార్యం చేసాడని అతని పేరు జ్ఞాపకముంచుకోవాలి ప్రజలు? బానిస యుద్ధాల కో చరిత్రంటూ ఉండేడిసిందా? అదీకాక స్పార్టకస్ ఒక నిర్మాణాత్మక శక్తి కాదు. అతనొక వినాశనకారి. ప్రపంచం నిర్మాతలనే జ్ఞాపక ముంచుకొంటుంది తెలుసా?"

"ఆశను నిర్మించాడతను."

"వరీనియా! చిన్నపిల్లలా మాట్లాడతావేం? ఆశను అతను నిర్మించాడా? ఎవరి కోసం ఆ ఆశ? ఆ ఆశలేవీ ఈ వేళ? ఆ ఆశ లంతరించిపోయాయి. అడుగంటి పోయాయి. నుసైపోయాయి. బలవంతుడు బలహీనుడిని పరిపాలించడంకన్న ఈ ప్రపంచంలో మరేమీలేదని నీకు తెలియదా? వరీనియా! నిన్ను నేను ప్రేమిస్తున్నా. నువ్వు బానిసవుకదా, నా ఇష్టం వచ్చినట్లు చెయ్యొచ్చుననే ధీమాతో కాదు. బానిసవని తెలిసి కూడా ప్రేమిస్తున్నా."

"అయితే.........."

"అతన్ని అర్థం చేసుకోవాలని ఉంది నాకు. అతనితో పోరాడాలి. బతికుండగా అతనితో నేను పోరాడాను. చచ్చాకకూడా అతనితో నేను పోరాడాలి."

"స్పార్టకస్ గురించి చెప్పడం కష్టం. నువ్వతనో కసాయివాడనీ, హంతకుడనీ అంటావు. కాని నిజానికి అందరికన్నా అతనే మంచివాడు. గొప్పవాడు."

"అయితే చెప్పు. అతనెలా గొప్పవాడో, ఎందుకంత మంచివాడో చెప్పు. నువ్వల్లా అనుకుందు కతనేం చేసాడో అర్థం చేసుకుందామని ఉంది నాకు."

'నేనే భాషలో నీకు బోధ పరచగలనో నాకే తెలియడం లేదు. బానిసలలో ఆడాళ్ళూ, మొగాళ్లూ మీలాగుండరు. బానిసలలో మొగాడూ, ఆడదీ సమానులు. మేమంతా ఒక్కలాగా పనిచేస్తాం. దెబ్బలు తినడంలో కూడా ఆడదీ, మొగాడూ అనే తేడా ఉండదు. ఒక్కలాగే చస్తాం. అందర్నీ ఊరూ పేరూ లేని వల్లకాట్లోనే పూడుస్తారు. మొదట్లో మొగాళ్ళతో బాటే మేముకూడా ఈటెలు కత్తులు పుచ్చుకొని యుద్ధంచేసాం. స్పార్టకస్ నా సహచరుడు. మేమిద్దరమూ ఒకటే. మేమిద్దరమూ ఎప్పుడూ సమానులమే. బతికుండగా అతను మరొక ఆడదాని ముఖం చూడలేదు. మొదటిసారి అతను నన్ను కౌగిలించుకున్నప్పుడు నాకు భయమేసింది. నే నసలు చెప్పలేకపోతున్నాను. ఏదో ఒక గమత్తయిన భావం నాలో ప్రవేశించింది. ఇక నే నెన్నటికీ చావను, నా ప్రేమ శాశ్వతమైనది. ఇంక నన్నేదీ బాధించలేదు. నేను అతనిలాగానే అయాను. అతను కూడా నాలాగయాడు. మా ఇద్దరిమధ్యా రహస్యాలు లేవు. అతను నన్నెంతో ప్రేమించాడు. అతని గురించి నీకేం చెప్పగలను నేను? మీరందరూ అతనొక మహారాక్షసుడన్నారు. కాని అతను రాక్షసుడేం కాడు. అతనో మామూలు మనిషి. ప్రేమతో నిండిన సహృదయుడతను. మృదువైన, సరళమైన స్వభావం కలవాడు. తన సహచరుల నతడు హృదయపూర్వకంగా ప్రేమించేవాడు. వాళ్ళొకరి నొకరు కలుసు కున్నప్పుడల్లా ఆప్యాయంగా కౌగిలించుకుని ముద్దెట్టుకునేవారు. స్పార్టకస్ ఎప్పుడేది చెప్పినా నా కది అర్థమయేది. బానిసలు వాళ్ళల్లో వాళ్లు కొట్టుకొని జగడమాడి నపుడు వాళ్ళందరినీ స్పార్టకస్ పిలుస్తాడు. వాళ్ళంతా ఒకేమాటు ఏదేదో మాట్లాడేస్తారు. అప్పుడు మాట్లాడతాడు స్పార్టకస్. అతని మాటలు వాళ్ళు శ్రద్ధగా వింటారు. వాళ్ళు చెడ్డపని చేసినా ఇకవ ముందు పొరపాట్లు రానివ్వకూడదనీ, మంచి పనులే చెయ్యాలనీ దృఢమైన సంకల్పం కలిగించేవాడు. అది వాళ్ళల్లో బలీయంగా ఉండేది. వాళ్ళందరూ ఏదో ఒక మహత్తరమైన దానిలో భాగస్వాములుగా ఉండేవారు. వాళ్ళంతా ఒకరిలో మరొకరు ఇమిడి ఉన్నట్లు విడదీయలేని భాగమైనట్లు అవినాభావ సంబంధంతో బతికేవారు. మొదట్లో వాళ్ళు కొల్లగొట్టినవాటి నుండి కొన్నింటిని దొంగిలించేవారు. అవినీతి, దొంగతనం, మోసం, దౌర్భాగ్యం నిండిన సంఘంలో పుట్టి పెరిగినవారే కాబట్టి, ఆ దుష్ప్రభావం వాళ్ళమీద పనిచేస్తోందనీ, త్వరలో ఆ లోపాలు సవరించుకోవడం సులభం అనీ చెప్పేవాడతను. అందరికీ చెందిన సమిష్టి గోదాములకు తాళాలుండేవి కా వసలు. తలుపులు కూడా తెరిచే ఉంచేవారు. వాటిలో సరుకు ఎవరూ దొంగలించనేలేదు. వాళ్ళ కవసరమైనవన్నీ వాళ్ళ కీయబడు తున్నాయన్న సంగతి గ్రహించాక దొంగిలించిన సరుకులు ఎలా ఖర్చుపెట్టాలో కూడా వాళ్ళకు తెలియనప్పుడు దొంగతనం పూర్తిగా మానేశారు. పేదరికంతో, ఆకలితో బాధపడవలసి వస్తుందేమోనన్న భయం వాళ్లల్లో నశించింది. స్పార్టకస్ నాకు చెప్పేవాడు, భయంవల్లనే మనుషులు చెడుపనులు చేస్తారని. మనుషుల అవసరాల దృష్ట్యా వాళ్ళకున్న ఆస్తి నంతటినీ, వస్తుసముదాయమంతా సమానంగా పంచుకోవడం వల్ల, సోదరత్వంవల్ల, మనుషుల మనసులు మారి వాళ్ళిలా అందంగా,

ఆనందంగా మంచిగా తయారవుతారో నాకు ప్రత్యక్షంగా చూపించాడు స్పార్టకస్. నే చూశానది. అటువంటి జీవితంలోని ఆనందాన్ని అనుభవించాన్నేను. నా స్పార్టకస్ ఎప్పుడూ అలాగే ఉండేవాడు. అందుకే వాళ్ళందరికీ అతను నాయకుడయ్యాడు. అందుకే వాళ్ళంతా అతను చెప్పినట్లు వినేవారు. వాళ్ళు కసాయివాళ్ళూ కారు, హంతకులూ కారు. మానవులుగా బతకనేర్చిన, బతికిన సాధారణ మానవులు వాళ్ళు. అందుకే నువ్వు నన్ను బాధించలేవంటాను. అందుకే నేను నిన్ను ప్రేమించలేను."

## 6

తిరిగి ఫ్లేవియస్‌ని పిలిచాడు గ్రాఛూస్. ఇద్దరికీ వృద్ధాప్యం రావడంతోబాటు గమ్యస్థానంకూడా ఒకటే అయింది. స్థూలకాయాలు రెండూ ఒకేలాగున్నాయి.

"ఏమిటి సంగతి?" ఫ్లేవియస్ అడిగాడు. "అది వరీనియాయే. నిర్ధారణైపోయింది. స్పార్టకస్ పెళ్ళాం. ఇంకేం కావాలి నీకు?"

"నాకు వరీనియా కావాలి. ఆమెను కొనడానికి ప్రయత్నించాను. ఆమెనిస్తే పది లక్షలిస్తానన్నాను. క్రాసస్ ఒప్పుకోలా. దాంతో రెట్టింపు డబ్బిస్తానన్నాను. నన్ను తిట్టి నా ముఖం ముందే నవ్వాడు."

"ఇరవై లక్షలే!" అంత డబ్బు గురించి ఒక్కమా టాలోచించినంతమాత్రానికే ఫ్లేవియస్ శరీరం కంపించిపోయింది. "అంత డబ్బిస్తే ఈ ప్రపంచాన్నే కొని పారెయ్యొచ్చు. అంత డబ్బు తీరాచేసి ఒక ఆడదానికోసం తగలేస్తావన్న మాట. తెలియకడుగుతా, అసలు నీకది ఎందుకు? నువ్వు నన్నొక పని చెయ్యమన్నావు. ఎందుకో చెప్పకపోతే నే నిక్కడనించి పోతా. ఆమె నీ కెందుకు కావాలీ అన్నది నే తెలుసుకుతీరాలి."

"ఆమెను నేను ప్రేమిస్తున్నా" అన్నాడు.

"ఏమిటీ!"

గ్రాఛూస్ తల ఊగింది. అతనిలో పూర్వపు దర్జా ఏమయిపోయిందో, అతని కళ్ళు ఎర్రబడ్డాయి. కంట్లో నీళ్ళు తిరిగినై.

"ఇరవై లక్షలు ముందూ వెనకా లేకుండా, తగలేసేటంతగా ఒక బానిస గుంటను ప్రేమించేస్తున్నా నంటావు. ఏమిటో నా కేం అర్థం కావడం లేదు" అన్నాడు ఫ్లేవియస్.

రాజకీయవేత్త గొణిగాడు. "నీ కర్థంకాదులే. ఎలా గౌతుంది. నేను నీకో ముసలాడిలా, కొవ్వెక్కిన, అచ్చోసిన ఆంబోతులా కనబడవచ్చు. నేనెన్నడూ మానవత్వం ఉన్న ఆడదాన్ని చూడలేదు. మన రోమన్ స్త్రీలలో ఎంతమందిలో మానవ లక్షణాలున్నాయో చెప్పు. వాళ్ళంటేనే నాకు భయం. వాళ్ళంటే నాకు పరమసహ్యం. మనమే వాళ్ళని అలా తయారుచేసి ఉండొచ్చు. ఆమెముందు మోకరిల్లి నన్నొక క్షణకాలం లక్ష్యపెట్టమని నే నర్థిస్తా. క్రాసస్ఆమె భర్తను నాశనం చేసాడు. అతన్నామె అసహ్యించుకోకుండా ఎలా ఉండగలదు?"

"ఆడవాళ్ళుండగలరు" ఫ్లేవియస్ అభిప్రాయపడ్డాడు.

"ఆమె నాక్కావాలి. డబ్బెంతయినా సరే... తెలుసా?"

"దీని ఫలితం ఎలా ఉంటుందో కాస్త ఊహించావూ?" ఫ్లేవియస్ జాగ్రత్తగా అన్నాడు. "నా గురించికాదు. దాన్ని కాని తీసుకొచ్చి పారేశానంటే నువ్విచ్చే డబ్బుతో కాలు మీద కాలేసుకొని జమీందారులా కలం గడిపెయ్యగలను. కాని నీ గురించే అనుమానం. నువ్వు గ్రాఛూస్‌వి, ఒక సెనేటరువి. రోమ్‌లో నువ్వొక బలమైన రాజకీయశక్తివి. నువ్వు ఎక్కడికీ పారిపోలేవు. దానితో నువ్వేం చెయ్యదలచుకున్నావు?"

"వాటన్నిటితోనూ నాకు సంబంధంలేదు."

"లేదూ? క్రాసస్ వస్తువుని ఎవరూ తీసుకురాలేరు. క్రాసస్‌తో నువ్వు పోట్లాడగలవా. వాడు నిన్ను సర్వనాశనం చేస్తాడు. నిన్ను నిర్మూలం చేసేస్తాడు."

"ఏదో ఒకలా నా గొడవ నే పడతా" గ్రాఛూస్ అనేసాడు.

"దాన్ని వాడింటి నుండి తప్పించి తీసుకురావడానికి అంతా ఖర్చుపెట్టామే అనుకో. తీరా తీసుకొచ్చాక అది నీ ముఖం మీద ఉమ్మెయ్యదన్న నమ్మకం ఏది? స్పార్టకస్‌ని క్రాసస్సే నాశనం చేసాడనుకో. కాని అతని పనికి వినియోగించేందుకు కపటనాటకమాడిన వాడివి నువ్వేగా. ఆ పనంతా ఎవరు చేసారంటావ్?"

"నేనే" గ్రాఛూస్ ఒప్పుకున్నాడు.

"దానికి నువ్వేం ఇవ్వగలవు? ఏ బానిసకయినా ఒక్కటే కావాలి. అదివ్వడానికి నువ్వు సిద్ధంగా వున్నావా?"

"ఆమె స్వాతంత్రం గురించేనా?" గ్రాఛూస్ నెమ్మదిగా అడిగాడు.

"నీతో బాటే ఉండే స్వాతంత్రం కాదు. నువ్వుకూడా లేకుండా అందరినీ, ఈ రోమ్‌ని వదలి వెళ్ళగల స్వాతంత్రమన్నమాట. అంటే క్రాసస్‌గాడికి కనపడకుండా పోగల స్వేచ్ఛ అన్నమాట."

"ఆమెకు స్వేచ్ఛనిస్తే నాకొక రాత్రినిస్తుందంటావూ?"

"ఒకరాత్రి ఇవ్వడమేమిటి మహాత్మా?"

"అంటే ఒకరాత్రి ప్రేమ. కాదు, కాదు. ప్రేమకాదు, గౌరవం, మర్యాద, లాలన. కాదు, కాదు, అదీకాదు. కృతజ్ఞత, అంటే ఒకనాటి రాత్రి కృతజ్ఞత చూపాలి అంతేచాలు."

"ఎంత వెర్రిబాగులాడివోయ్ నువ్వు!"

గ్రాఛూస్ చెప్పాడు : "అయితే అవనూవచ్చు కాకపోనూవచ్చు. అన్నమాట తు.చ. తప్పకుండా అమలుపరచే రకం అని ఆమెను నమ్మించగలగాలి. మాటమీదే బతుక్కొస్తున్నాను నేను. ఆ సంగతి రోమ్ అంతకీ తెలుసు అని ఆమెను నమ్మించగలవా నువ్వు?"

ఫ్లేవియస్ తల పంకించాడు. "ఆమెను తీసుకొచ్చిన తరువాత రోమ్‌నుంచి దూరంగా తీసుకొనిపోడానికి అన్ని ఏర్పాట్లు నువ్వే చెయ్యాలి సుమీ."

"అంతా బాగానే ఉంది కాని ఆమెను క్రాసస్ ఇంట్లోంచి తీసుకురావడం ఎలా?"

"అదో పెద్దసమస్య కానేకాదు. వారానికీ మూడురోజులు క్రాసస్ పల్లెప్రాంతాలకు పోతాడుగా. అప్పుడు కొంచెం భగవంతుడిచ్చిన బుర్రనుపయోగించి కొద్దిడబ్బు ఖర్చుచేస్తేసరి పని జరిగిపోతుంది."

"ఇదంతా ఆమెకు రావాలని ఇష్టం ఉంటేనేగా."

" ఆమాత్రం తెలియదనే?" ఫ్లేవియస్ తనకూ తెలివి లేకపోలేదన్నట్లు చెప్పాడు.

"ఆమెతో కూడా ఒక పిల్లాడుంటాడనుకుంటా. ఆపిల్లాడికి కూడా సదుపాయాలు జరగాలి."

"అవును."

"ఆ ఇరవై లక్షలూ ముందే ఇచ్చెయ్యమంటావా? ఏం?"

"ముందే చెల్లించడం మంచిదనుకుంటా" ఫ్లేవియస్ అన్నాడు. తన మిత్రుని పట్ల అతను కొంచెం జాలిగా ఉన్నాడు.

# 7

ఆ మర్నాడు క్రాసస్ పల్లెలకు పోయాడు. చీకటిపడుతోంది. అనుకున్న ప్రకారం వరీనియాను తీసుకొచ్చాడు ఫ్లేవియస్. అప్పుడు భోజనం చేస్తున్నాడు గ్రాఛూస్. ఒక బానిసవెళ్ళి అతనికి చెప్పింది. బైట ఫ్లేవియస్, ఒక స్త్రీ నిలబడి ఉన్నారని, ఆ స్త్రీ చేతిలో ఒక పిల్లాడున్నాడనీ.

"అవును - అవును నాకు తెలుసు. ఆ పిల్లాడికోసం ఒకచోటు కూడా ఏర్పాటు చేశా. వెళ్ళి వాళ్ళను లోపలికి తీసుకురా." ఇంతలోనే అతనన్నాడు: "ఒద్దొద్దు. నువ్వుండు. నేనే తీసుకొస్తా." వీధి గుమ్మందాకా అతను పరుగెట్టాడనే చెప్పాలి. వాళ్ళిద్దరినీ అతనే తీసుకొచ్చాడు. అతనిలో వినయం ఉట్టిపడుతోంది. ఎంతో మంచిగా ఉన్నాడు. గౌరవనీయులైన అతిధుల్నెలా ఆహ్వానించాలో అలా ఆహ్వానించాడు.

ఆ స్త్రీ ఒక పొడుగాటి వస్త్రాన్ని కప్పుకుంది. మేలిముసుగు ముఖాన్ని కూడా కప్పుతోంది. క్రీనీడగా మేలి ముసుగుచే కప్పబడ్డ ఆమె ముఖం ఎలా ఉందో అతనికి తెలియలేదు. ఇంకొక్క క్షణంలో ఆమెను పూర్తిగా చూడొచ్చు. వాళ్ళని లోపలికి తీసుకొచ్చాక ఆ పిల్లాడి కోసం ప్రత్యేకించిన గదిలోకి పంపవచ్చు అని చెప్పాడు. ఆమె చేతులలో ఉయ్యాలలో పడుకున్నట్లు పడుకున్నాడా పసికందు. పిల్లాడి గురించి ఆమెకు అనుమానం కలిగించే విధంగా మాట్లాడతానేమోనన్న భయం అతనికి కలిగింది. ఏం మాట్లాడితే భయపడుతుందో అని అతని భయం.

"పిల్లల కొక గదే తయారుచేయించా. బుల్లి ఉయ్యాలొకటుంది. నీకేం కావాలంటే అది ఉంది. ఎంతో సదుపాయంగా, సురక్షితంగా ఉండగలడా గదిలో. అతని కేమీ జరగదక్కడ."

"అవన్నీ ఎందుకు" వరీనియా అంది. మొదటిసారిగా గ్రాఛూస్ ఆమె మాట్లాడగా విన్నాడు. మెత్తగా, మృదువుగా ఉందామె గొంతు. ఎంతో లోతునుండి మాట్లాడుతూన్నట్లు అమూల్యమైదిగా ఉందా కంఠస్వరం. ఇప్పుడామె మేలిముసుగు తొలిగించింది. అతనామె ముఖాన్ని చూసాడు. నిడుపాటి ఆమెశిరోజాలు ముడివేసి ఉన్నాయి. ఆమె ముఖానికి కృత్రిమమైన రంగులేవీలేవు. అందుకే ఆమె ముఖం ఎంతో అందంగా, సహజంగా, తీర్చిదిద్దినట్లు కనిపించిందాతనికి.

"తక్కిన ఏర్పాట్లన్నీ చెయ్యాలి గ్రాఛూస్. తెల్లారే లోపున తిరిగొస్తా. అప్పటికి మాత్రం నువ్వు సిద్ధంగా ఉండాలి" అన్నాడు ఫ్లేవియస్.

"ఓ సిద్ధంగానే ఉంటా" గ్రాఛూస్ తలూచాడు.

ఫ్లేవియస్ సెలవు తీసుకున్నాడు. పిల్లాడికోసం ప్రత్యేకించిన గదిలోకి ఆమెను తీసుకెళ్ళాడు. అక్కడొక బానిస కూచుని ఉంది. ఆ బానిసను చూపిస్తూ గ్రాఛూస్ చెప్పుకుపోతున్నాడు.

"రాత్రంతా ఆమె ఇక్కడే కూచుంటుంది. దృష్టి మరల్చకుండా తెల్లవార్లూ పిల్లాడిని చూస్తు కూచుంటుంది. నీ పిల్లాడికేమైనా అవుతుందేమో నన్నబెంగ నీకఖ్ఖర్లేదు. పిల్లాడేడిస్తే తక్షణం నిన్ను పిలుస్తుందది."

"పిల్లాడు పడుకొంటాడు లెండి" వరీనియా చెప్పింది. "మీరు చాలా దయగా ఉన్నారు. వాడికేం ఫరవాలేదు."

"నీకాకలిగా ఉందా? ఏమైనా తిన్నావా?"

"నేనేం తినలేదు. అలా అని ఆకలీలేదు" వరీనియా అంది. పిల్లాడ్ని పడుకో బెట్టింది. "ఏమీ తినాలనిలేదు; ఎవరికంటా పడకూడదు. ఎవ్వరైనా చూస్తారేమోనని భయంతో గాభారాగా వచ్చేసాం. కలలో ఉన్నానా అనిపిస్తోంది. మొదట్లో అతన్ని నమ్మడానికి అనుమానం వేసింది. ఎవరో ఏమిటో, కాని తరవాత నమ్మకం కుదిరింది. ఈ కల కరిగిపోతుందేమోనని నా భయం."

"పోనీ నే భోజనం చేస్తా. నువ్వు కూడా వచ్చి కూచో, నీకూ ఏమైనా తినాలని పించవచ్చు."

"అలాగే కూచుంటా."

వాళ్ళు భోజనాల గదిలోకెళ్ళారు. అతని కెదురుగా వరీనియా కూచుంది. గ్రాఛూస్ ఎప్పటిలా చేర్లబడి కూచోలేదు. బిర్రబిగుసుకుని, వరీనియామీద నిల్పినకళ్లు కదపకుండా అలాచూస్తూ ఉండిపోయాడు. ఏమి గాభరాలేక, అనుమానాల ఆలోచనలులేక, భయాలు సందేహాలు లేక తనజీవితంలో తనకెన్నడూ అనుభవంలోలేని మహదానందాన్ని తాను పొందినట్లు భావించాడు గ్రాఛూస్. అది సంతృప్తి. తన గడచిన జీవిత కాలమంతటిలోనూ ఈ సంతృప్తి తానెన్నడూ పొందలేదు. ఈ ప్రపంచంలో తనకు బాధకలిగించే విరుద్ధాలన్నీ

మటుమాయమయినట్లు భావించాడు. తన ఇంట్లో తాను ప్రేమించిన రోమ్‌లో ఇన్నాళ్ళకుకదా సుఖాన్ని చూడగలిగాను అనుకున్నాడు. ఆమెపట్ల అతనిలో ప్రేమ వెల్లువలై జనించి ఝరీవేగంతో ఆమెవైపు పోతున్నట్లు భావించాడు. తన జీవితంలో తానెన్నడూ ఎరుగనిదీ ప్రేమ. ఇప్పుడతనికా ప్రేమ ఆశ్చర్యకరంగా జనించింది. స్పార్టకస్ భార్య, వరీనియాపై కలిగింది ప్రేమ! ఏమిటో ఆశ్చర్యంగా ఉందతనికి. దానికి కారణమేమై ఉంటుందా అన్న మానసికతత్వ విచారణలో పడలేదతను. అంత ప్రేమా తనలో ఉన్నదన్న సంగతి అతనెరుగును. ఇంక ఎందుకు అకారణ కారణాన్వేషణం?

"వరీనియా! నిన్ను నే నర్థంచేసుకోవాలి. ఇదంతా ఒక కలేమోనని నువ్వెందుకు భయపడుతున్నావో తెలుసుకోవాలి. నువ్వు ఒప్పుకుంటే ఆ క్రాసస్ నిన్ను పెళ్ళాడేవాడు. వాడి అధికారమూ, శక్తీ, పలుకుబడీ నమ్మశక్యం కాదంటే నమ్ము. ఈజిప్టు నవాబుకున్న అధికారంకన్నా క్రాసస్‌కే ఎక్కువుంది. ఈజిప్టురాణి కన్నా నువ్వు గొప్పగా ఉండొచ్చు. నీకిది సరదాగా ఉండదా!"

"స్పార్టకస్‌ని చంపినవాడితోనా?"

"ఆ. కాని ఆలోచించు. అతను తానై వ్యక్తిగతంగా చంపలేదు స్పార్టకస్‌ని. అతనికి స్పార్టకస్ ఎవరో తెలియదు. అతనంటే వ్యక్తిగత ద్వేషమూ లేదు. నేనూ ఆ పాపంలో సమభాగినే. కాని స్పార్టకస్ చచ్చిపోయాడు.నువ్వు బతికున్నావు. క్రాసస్ ఇవ్వగలిగినది నీకొద్దా?"

"నాకొద్దది" వరీనియా అంది.

"నీక్కావలసిందేమిటి వరీనియా?"

"స్వతంత్రం కావాలి నాకు" ఆమె చెప్పింది. "ఇంకెప్పుడూ ఈ రోమ్‌ను చూడనవసరంలేని పద్ధతిలో ఇక్కడినుంచి పోవాలని ఉందినాకు. రోమ్ పీడ నాకు విరగడైతే అదే చాలు. నా కొడుకు స్వతంత్రుడుగా పెరగాలని ఉంది నాకు."

"స్వతంత్రం అంటే అంత ఇదెందుకు?" ఆమె స్వతంత్రేచ్ఛను చూసి గ్రాఛూస్ యాధార్థంగానే గాభరాపడ్డాడు. "ఎందుకీ స్వతంత్రం? ఆకలితో అలమటించడానికా స్వతంత్రం. ఒకడిచేతిలో దారుణంగా చావడానికా ఈ స్వతంత్రం. ఇల్లూ వాకిలీ లేకుండా పోడానికా ఇది? రైతు కూలీగా పొలంలో రెక్కలు ముక్కలు చేసుకుచావడానికా ఈ స్వాతంత్ర్యం? దేనికీ?"

"నేనేం చెప్పలేను. క్రాసస్‌కికూడా చెబుదామనే ప్రయత్నించా. కాని అతని కెలా చెప్పాలో, ఏ భాషలో చెప్పాలో తెలియలేదు. నీక్కూడా ఏం చెప్పాలో తెలియడంలేదు" అంది వరీనియా.

"నువ్వు రోమ్ నసహ్యించుకుంటావు వరీనియా! నేను రోమ్‌నే ప్రేమిస్తాను. రోమ్ నా ప్రాణం, నా జీవితం, నా మాతృమూర్తి, నా సర్వస్వం. రోమ్ ఒక కులటే కావచ్చు. కాని

రోమ్ వదిలి నేనొక్కక్షణం బతకలేను. అదీ నాకు తెలుసు. నా శరీరం అంతా ఆ రోమ్ ఆవహించి ఉంది. కాని నువ్వు దాన్నసహ్యించుకుంటావు. స్పార్టకస్ కూడా రోమ్ నసహ్యించుకునేవాడా?"

"అతను రోమ్‌ను వ్యతిరేకించేవాడు, రోమ్ అతన్ని వ్యతిరేకించింది. నీకు తెలుసుగా?"

"రోమ్‌ను నిర్మూలించి దాని స్థానంలో అతనేం నిర్మించదలచుకున్నాడు?"

"బానిసలూ, యజమానులూ అనే తేడా లేకుండా, ప్రజలంతా కలిసి మెలసి శాంతియుతంగా, సోదరత్వంతో మనగల ప్రపంచాన్ని కోరాడు స్పార్టకస్. రోమ్‌లోని మంచినంతటినీ తీసుకుని మనం చుట్టూ ప్రహరీగోడలు లేని మహానగరాలు నిర్మిద్దామని చెప్పేవాడు. అప్పుడు ప్రజలంతా శాంతి సౌహార్ద్ర సమతాభావాలతో బతుకుతారు. అప్పుడీ ప్రపంచంలో యుద్ధాలనేవే ఉండవు. దౌర్భాగ్యం ఉండదు. కష్టాలు కాపురం చేయవు."

గ్రాఛూస్ చాలాసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాడు. వరీనియా అతన్ని నిర్భయంగా, ఏమిటీ వింత అన్నట్లు చూసింది. మేరు పర్వతమంత ఉన్న ఈ వ్యక్తిని ఆమె నమ్మదలిచింది. తానెందరినో రోమన్లను చూసింది. కాని ఇతనిలో వాళ్ళందరి లక్షణాలు లోపించాయా అనుకొంది. ఇతనెంతో తేడాగా కనపడ్డాడు. ఇతనిలో నిజాయితీకేమీ కొదువలేదు. కాని అదికూడా విచిత్రంగానే ఉందనిపిస్తుంది. స్పార్టకస్‌ను కొంతవరకైనా జ్ఞప్తికి తెచ్చుకుందు కుపయోగపడే ఏదో గుణవిశేషమొకటి అతనిలో కనిపించింది. అది ఫలానా అని ఆమె తెలుసుకోలేక పోయింది.

తిరిగి మాట్లాడ్డాని కుపక్రమించక ముందు చాలా మౌనంగా ఆలోచిస్తూ కూచున్నాడు గ్రాఛూస్. ఆమె చెప్పి క్షణంకూడా కానట్లూ, వరీనియా అన్నదానికి వెనువెంటనే సమాధానమిస్తున్న వాడిలా అందుకొని ఆమె చెప్పిన దానిమీద వ్యాఖ్యానించాడు.

"అయితే అదన్నమాట స్పార్టకస్ స్వప్నం. కొరడాలూ, కొరడా దెబ్బలూ లేని, మహాభవనాలు, మట్టిపాకలూ అనే తేడలేని మరో ప్రపంచాన్నతడు సృష్టించపూనుకొన్నా డన్నమాట. నీ కొడుక్కేం పేరు పెట్టావు వరీనియా?"

"స్పార్టకస్, మరింకే పేరు పెట్టగలను."

"స్పార్టకస్ అనా. ఓ బాగుంది, దివ్యంగా ఉంది. ఆ పిల్లాడు పొడుగ్గా బలంగా, ఆత్మవిశ్వాసంతో పెరిగి పెద్దవాడవుతాడు, అప్పుడు నువ్వతనికి తండ్రి గురించి చెబుతావు కదూ?" గ్రాఛూస్ అమాయకంగా ప్రశ్నించాడు.

"ఆ చెబుతా."

"ఎలా చెబుతావు? ఎలా బోధించగలవు? నీ కొడుకు పెరిగే ప్రపంచంలో స్పార్టకస్ లాటివాడు మరొకడుండడే? అలాంటప్పుడు అతని తండ్రి ఎంత సౌమ్యంగా, స్వచ్ఛంగా ఉండేవాడో నువ్వెలా చెప్పగలవు?"

"స్పార్టకస్ సౌమ్యంగా, స్వచ్ఛంగా ఉండేవాడని నీ కెలా తెలుసు?"

"దాన్ని తెలుసుకోవడ మన్నది అంత కష్టమా?" గ్రాఛూస్ ఆశ్చర్యపోయాడు.

"కొంద రా విషయాన్ని తెలుసుకోవడం చాలా కష్టం. నా కొడుక్కి నేనేం చెబుతానో తెలుసా! బహుశా నీ కర్థమవుతుందనుకుంటా. వాడికి నే నో స్వల్పమైన విషయం చెబుతా. తన జీవితకాలమంతా అతను దుర్మార్గాన్ని వ్యతిరేకించాడు. ప్రతిఘటించాడు. రాజీలేని మార్గంలో దుర్మార్గంతో ప్రతి నిత్యమూ పోరాడాడు. అదే నే చెబుతా."

"అయితే అతను స్వచ్ఛమైనవాడెలా అయ్యాడు?"

"నే నేమంత తెలివైనదాన్ని కాదు. కానీ అలాగుంటేనే స్వచ్ఛమైనవాడు కాగలడని నా ఉద్దేశం" వరీనియా చెప్పింది.

"ఐతే ఇది మంచీ, ఇది చెడూ; ఇది సన్మార్గం, ఇది దుర్మార్గం అని స్పార్టకస్ కెలా తెలిసేది?" గ్రాఛూస్ ప్రశ్న.

"అతనిలాటివాళ్ళకేది మేలు చేస్తుందో అది మంచిది. ఏది హాని చేస్తుందో అది చెడ్డది."

"ఓహో" గ్రాఛూస్ తల ఊపుతూ అన్నాడు. "స్పార్టకస్ కన్న కలలు కనడానికీ, అతని ఆలోచనాపద్ధతి కలగడానికీ నాకు వయస్సు మళ్ళింది. లేకపోతేనా, నా కీయబద్ధ జీవితకాలంలో, నే నేంచేసానో వాటన్నింటి గూర్చీ విపరీతంగా కలలు కనేసేవాడినే. ఒక్క జీవితం ఎంత చిన్నదిగా, ఎంత నిరర్థకంగా, ఎంత నిష్ప్రయోజనంగా ఉందో అది. అదొక క్షణంలా, మెరపు మెరసినట్లుగా ఉంటోంది. ఇక దీంట్లో మతీ, శ్రుతీ ఏమున్నట్లగుపించదు. మనిషి పుట్టాడు. గిట్టాడు. పెద్దలావాటి శరీరాన్ని పెట్టుకుని నే నిక్కడ కూచున్నాను. ఔనుకాని స్పార్టకస్ చాలా అందంగా ఉండేవాడేమిటి?"

అతని ఇంట్లో ప్రవేశించాక మొదటిసారి ఆమె చిరునవ్వు నవ్వింది. చిరు నవ్వల్లా బిగ్గరగా నవ్వడం ప్రారంభించింది. అలా నవ్వగా కళ్ళవెంబడి నీళ్ళొచ్చాయి. బల్ల మీద ముఖం పెట్టుకుని ఏడవడం మొదలెట్టింది.

"వరీనియా! నే నేమైనా అన్నానా?"

"ఏమీలేదు" ఆమె లేచి కూచుని రుమాలుతో ముఖం తుడుచుకుంది. "నువ్వన్న దానికేం కాదు. స్పార్టకస్‌ను నే నలా ప్రేమించాను. అతనేం మీ రోమన్లవంటివాడు కాడు. నా జాతిలోని మొగాళ్ళలాటివాడు కాడు. అతనొక థ్రేషియన్. విశాలమైన ముఖం; బల్లపరుపుగా కనబడే ముక్కూ. అతన్నొకమాటు మేస్త్రీ కొట్టాడు. అందుకే అతని ముక్కు పగిలింది. కొందరనేవారు ఆ ముక్కువల్లనే అతని ముఖం గొర్రె ముఖంలా కనిపించేదని. కాని నా మట్టు కతనెలా ఉండాలో అలా ఉన్నాడు. అంతే."

వాళ్లిద్దరిమధ్యా అఖాతా లంతరించిపోయాయి. వొంగి, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నడు గ్రాఛూస్. అతని జీవితంలో అతనెప్పుడూ ఏ స్త్రీకీ అంత చేరువగా, ఏ స్త్రీయందూ

అంత నమ్మకంతో లేడు. "వరీనియా!" అతనన్నాడు. "నాలో నేనేమనుకున్నానో నీకు తెలుసా? ప్రేమతో నిండిన ఒక్కరాత్రి ననుభవిద్దామని ముందనుకున్నాను. మళ్లీ నా అంతట నేనే కాదనుకున్నా. ఒక్కరాత్రి నీ గౌరవ మర్యాదలు పొందితే చాలనుకున్నా. చివరకు నాక్కావలసిందల్లా నువ్వొక్క రాత్రి కృతజ్ఞతతో నాతో గడపటం. కాని నిజానికి నువ్వంతకన్న హెచ్చే ఇస్తున్నావుగా."

"అవును" వరీనియా మనస్సు విప్పి మాట్లాడింది. అప్పుడతను పూర్తిగా తెలుసుకున్నాడు. ఆమెలో మాయా మర్మమూలేదని, మనసులో ఉన్నదేదో సూటిగా నిర్భయంగా చెప్పడమే కాని మరొకటామెకు చేతకాదని. ఆమెచేతి నాప్యాయంగా ముద్దెట్టుకున్నాడు, ఆ చేతి నామె తనవైపు లాగేసుకోలేదు.

"నాక్కావలసిందదే. ఉదయం వరకూ, ఇలాగే నాతో మాట్లాడుతూ కావాలంటే కొద్దిగా ద్రాక్షసారా తాగుతూ, ఆకలిగా ఉంటే ఏదైనా కాస్త తింటూ, ఇలాగే కూచుంటావా నాతో? నీకు చెప్పాల్సిందెంతో ఉంది నాకు. తెల్లారేదాకా ఇలానే కూచుంటావా, అప్పుడు ఫ్లేవియస్ రథాలు తీసుకొస్తాడు. నువ్వు ఎప్పటికీ రోమ్ వదలి వెళ్ళిపోవచ్చు. అలా చేస్తావా వరీనియా?"

"నాకూ చెయ్యాలనే ఉంది" అన్నదామె.

"నేను నీకు కృతజ్ఞత చూపించే ప్రయత్నం చెయ్యను. అసలా కృతజ్ఞత నీకెలా తెలియజెయ్యాలో నాకు తెలియదు."

"కృతజ్ఞత చూపించడానికి ఇందులో ఏముంది?" వరీనియా అంది. "నేను తిరిగి సంతోషం పొందగలననుకోలేదు. కాని నువ్వు నన్ను చాలా సంతోషపెడుతున్నావు. స్పార్టకస్ పోయాక ఇక నాకు నవ్వు రాదనుకున్నాను. ఇంక బతుకొక ఎడారికాక మరేమిటి అనుకున్నా? అన్నిటికన్న ముఖ్యమైనది జీవితమే అని అతను చెప్పేవాడు. అప్పటికీ ఇప్పటికీ అదే నాకు బోధపడలేదు. ఇప్పుడు నాకు నవ్వుదామనిపించింది. ఎందుకో తెలియదు కాని నవ్వుదామనే ఉంది."

## 8

నిత్యకృత్యాలకు దూరంగా, మనుషులింకా నిద్రావస్థలో నున్నప్పుడు, జీవితపు పోటుపాట్లింకా ప్రారంభంకాక పూర్వం, సూర్యోదయమింకా రెండు గంటలకి అవుతుందనగా ఫ్లేవియస్ తిరిగొచ్చాడు. పనిమనిషి ఏమీ మాట్లాడకుండా అతన్ని గ్రాఛూస్, వరీనియాలున్న గదిలోకి తీసుకెళ్ళింది. అలసటవల్ల గ్రాఛూస్ ఒక కుర్చీలో కాళ్ళు చాపుకుని కూచున్నాడు. అతని పాలిపోయిన ముఖంలో సంతోషం లేకపోలేదు. వరీనియా మంచంమీద కూచుని పిల్లాడికి పాలిస్తోంది. ఫ్లేవియస్‌ను చూసి గ్రాఛూస్ పెదవిపై వేలు పెట్టుకుని మాటాడవద్దని సంజ్ఞ చేసాడు. మౌనంగా నిలబడ్డాడు ఫ్లేవియస్. దీపకాంతిలో కూచుని బిడ్డకుపాలిస్తున్న

వరీనియా ఎప్పటిదో పూర్వకాలంనాటి రోమ్‌ను జ్ఞప్తికి తెస్తుందెందుకనో!

పాలివ్వడం పూర్తయాక బిడ్డను దుప్పటితో కప్పింది. గ్రాఘూస్ ఆమె కెదురుగా నిలబడ్డాడు. ఆమె చాలాసేపు అతనివైపు చూసింది.

"రథంమీద పోతేనే మంచిదనిపించింది నాకు" ఫ్లేవియస్ వాళ్ళతో అన్నాడు. "ఎంత త్వరగా ఎంతదూరం పోగలిగామా అన్నదే చూసుకోవాలి మనం. ఒక రథంలో పరుపులూ, దుప్పట్లూ, శాలువలు ఉన్నాయి! మనం వెంటనే పోవాలి. ఇప్పటికే ఎంతో ఆలస్యమయింది. 'ఆలస్యాదమృతమ్ విషం' అన్నారు పెద్దలు."

ఇతని మాటలు వాళ్ళు విన్నట్టులేదు. స్పార్టకస్ భార్య వరీనియా, లావుపాటి రాజకీయవేత్త గ్రాఘూస్ వీరాద్దరూ ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటూ అలాగే నిలుచుండిపోయారు. పనిమనిషి వైపు తిరిగి వరీనియా అంది :

"ఒక్కక్షణం పిల్లాడిని తీసుకుంటావూ?"

పనిమనిషి పిల్లాడినెత్తుకుంది; వరీనియా గ్రాఘూస్‌వద్దకు వెళ్ళింది. అతనామె వైపు వంగాడు. ఆమె అతన్ని ముద్దెట్టుకుంది. లాలించింది.

వరీనియా అంటోంది: "నువ్వు నా విషయంలో ఎంతో మంచిగా ఉన్నందుకు నీకు నా కృతజ్ఞత. నువ్వు నాతో కనుక రాగలిగితే నేను నిన్ను బాగా చూడటానికి ప్రయత్నిస్తా."

"చాలు వరీనియా! ఆ మాటే చాలు."

"వస్తావా గ్రాఘూస్?"

"నేను నిన్ను బాగా ప్రేమిస్తాను. కాని నేను రోమ్‌వదలి వెళ్లలేని నిస్సహాయుడిని. రోమ్ నా తల్లి. నా తల్లి ఒక కులటే. కాని నిన్ను మినహాయించితే నేను ప్రేమించగలిగినది ఆమెనొక్కర్తెనే. పైగా నేనొక ముసలాడ్ని. ఏమోయ్ ఫ్లేవియస్! నేనే కనుక ప్రయాణం తలబెడితే నా శరీరంపట్టే రథం దొరుకుతుందంటావా? ఒకవేళ పట్టినా గుర్రాలు మొయ్యగలవా నన్ను? వెళ్ళిరా అమ్మ వరీనియా."

"ఇప్పటికే బోలెడాలస్యమైందని ముందే చెప్పా" ఫ్లేవియస్ చిరాకుగా అన్నాడు. "అప్పుడే ఈ గొడవ ఎంతలేదన్నా చాలా మందికి తెలిసుండవచ్చు. పెదవి దాటితే పృథ్వివి దాటుతుంది!"

"ఆమెను జాగ్రత్తగా చూడు" గ్రాఘూస్ చెప్పాడు. "ఫ్లేవియస్! ఇప్పుడు నువ్వొక ధనవంతుడివి. ఇంక నీకు రాజోపచారాలకు వేటికీ లోటుండదు. నాకీ ఒక్కపనీ చేసిపెట్టు. ఆమెనూ, ఆ పిల్లాడ్నీ జాగ్రత్తగా దించిరా. వీళ్ళని ఉత్తరంగా ఆ ఆల్ప్స్ పర్వతాలవరకూ తీసుకుపో. అక్కడి లోయలలో నివసించే గాల్ రైతులు కల్లాకపటమూ లేని అమాయకులు. కష్టపడి పనిచేసి ఒకళ్ళగొడవక్కర్లేకుండావాళ్ళ మానాన వాళ్లు బతికే సాధారణ రైతులు. వాళ్లతో ఈమె కాలం గడపగలదు. ఆల్ప్స్ పర్వతాల చేరువకు పోయేదాకా వాళ్లను వదలకు,

త్వరపడుమరి. గుర్రాల్ని బాదెయ్యి. కావాలంటే చంపెయ్యి, కొత్తవి కొనుక్కోవచ్చు. ఎక్కడా ఆగకండి, ఏం? ఫ్లేవియస్, చేస్తావా ఇది?"

"నీతో అన్నమాట నే నెప్పుడేనా తప్పానా?"

"లేదులే. వెళ్ళిరామరి."

వాళ్ళను సాగనంపేందుకు గుమ్మందాకా వెళ్ళాడు గ్రాఛూస్. వరీనియా పిల్లాడి నెత్తుకుంది. అతను గుమ్మంలో నిలబడ్డాడు. ఉదయకాంతి తెలుపెక్కుతోంది. వాళ్ళు రథాలలో కూచున్నారు. గుర్రాలు చురుగ్గా ఉన్నాయి.

"వెళ్ళిరా వరీనియా!" అతనామెతో అన్నాడు.

అతనివైపామె రుమాలూపింది. జనసంచారంలేని ఆ సన్నని రోడ్డుమీద గుర్రపు డెక్కల ధ్వని, రథచక్రాల ధ్వనీ చుట్టుపక్కవాళ్లకు నిద్రాభంగం చేశాయి. వాళ్ల ప్రయాణం సాగిపోతోంది.

గ్రాఛూస్ తన ఆఫీసుగదిలోకి వెళ్ళాడు. ఒక పెద్ద కుర్చీలో కూలబడ్డాడు. బాగా అలసటగా ఉంది. కళ్ళు మూసుకున్నాడు. కాని నిద్రపట్టలేదు. సంతృప్తి ఇంకా అలానే ఉండిపోయింది. కళ్ళుమూసుకుని ఆలోచన లిటూ అటూ పోనిచ్చాడు. ఎన్నెన్నో జరిగిపోయాయి. వాటిగురించి తలపోసాడు. తన తండ్రి ఒక బీదవాడు. జోళ్ళు కుట్టుకుని పొట్ట పోషించుకునేవాడు. ఆ రోజులింక రావు. ఆ రోజుల్లో రోమన్లంతా కష్టపడి పనిచేసేవారు. వీధులలో తను రాజకీయాలభ్యసించాడు. రౌడీమూకల కొట్లాటలూ, ఓట్ల నమ్మడం, కొనడం, జనసమూహాలను ఎలావడితే అలా తిప్పుకొని ఉపయోగించుకోగలగడం ఇవన్నీ జ్ఞాపకమొచ్చాయి. ఆ రోజుల్లోకూడా ఇంత జరుగుతున్నా, స్వతంత్రబుద్ధికల నిజాయితీ ఉన్న రాజకీయవేత్తలు కొందరు లేకపోలేదు. రైతులను భూములనుండి వెళ్ళగొట్టి, చౌకగా లభించే బానిసలచే వ్యాపారపంటలు పండించి లాభాలార్జించడమే పరమావధిగా పెట్టుకొన్నవారి నా రాజకీయవేత్తలు వ్యతిరేకించేవారు. అసలా పద్ధతికే స్వస్తిచెప్పి పటిష్టమైన, ఒడుదుడుకులులేని ఆర్థిక విధానంకోసం పోరాడేవారు. శిష్టసభలలోనూ, న్యాయస్థానాలలోనూ, బహిరంగంగా కూడా వాళ్ళు ధైర్యంగా తమ వ్యతిరేకతను చాటేవారు. ప్రజలకు విజ్ఞప్తి చేసేవారు. ఒక్కొక్కప్పుడు ఉద్రేకపూరితులై గర్జించేవారు. అన్యాయాన్నీ దౌర్జన్యాన్నీ ప్రతిఘటించేవారు. గ్రాఛూస్ వాళ్ళనర్థం చేసుకోగలిగాడు. చేసుకున్నాడు. వాళ్ళ మాటలలోని న్యాయాన్నీ వాళ్ళ ఉద్యమంలోని నిజాయితీనీకూడా అర్థం చేసుకున్నాడు. అతని గొప్పతనం అదే. కాని ఎవరెంతచేసినా వాళ్ళ పోరాటం రక్తపుటేరులలో ముంచబడుతుందనీ, పూర్తిగా విఫలమౌతుందని కూడా అతనికి తెలుసు.

చరిత్ర ఒక గడియారంలాటిది. దాన్నెవరూ వెనక్కు తిప్పలేరు. ఆ గడియారం ఎప్పుడూ ముందుకే పోతూఉంటుంది. ప్రజల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు భంగంవాటిల్లుతున్నదని, ప్రజల న్యాయమైనహక్కులు భుక్తమౌతున్నాయని గ్రహించి పోరాడినవాళ్ళను నాశనం

చెయ్యవలసిందని చెప్పి తనముఠాల నతడు పంపాడు. న్యాయబుద్ధికల, నిజాయితీకల, సిద్ధాంతాలుకల రాజకీయవేత్తల నతడు చంపించాడు.

ఇప్పుడు దాన్ని గురించే ఆలోచించాడు, కాని విచారించలేదు. ఎందుకిలా జరిగిందా అని ఆలోచించసాగాడు. ఆదిమానవుడు సర్వస్వతంత్రుడు. కొండలలో గుహలో నివసించిన ఆదిమానవులు స్వేచ్ఛనే అనుభవించారు. కాని నానాటికి సాంఘిక రాజకీయార్థిక వ్యవస్థలు క్లిష్టతరమైపోయి పూర్వం అనుభవించిన స్వేచ్ఛలను మానవుడు కోల్పోయాడు. ఈ విధంగా స్వేచ్ఛలు హరింపబడకూడదని ఆ రాజకీయవేత్తలు మానవుని పూర్వ స్వాతంత్ర్యం కోసం పోరాడేవారు. అయితే ఈ పూర్వ స్వాతంత్ర్యమనేది ఒకటుందా అసలు? ఆదిమ మానవుడు స్వేచ్ఛాజీవా? ఇప్పుడే తన ఇల్లు వదలి ఒకర్తె వెళ్ళింది. ఆమెలో స్వతంత్రేచ్ఛ నిప్పులా రాజుకుంది. దావానలమై వ్యాపించింది. అందుకే తనకొడుక్కి స్పార్టకస్ అని నామకరణం చేసింది. ఆ కొడుకు తన కొడుక్కి కూడా స్పార్టకస్ అన్నపేరే పెట్టొచ్చు. అసలెప్పుడయినా బానిసలకు బానిసత్వంవల్ల సంతృప్తి కలుగుతుందీ? అతనికేమీ సమాధానం దొరకలేదు. అందుకు విచారించలేదు కూడా. సంపూర్ణమైన బతుకు బతికేసాడతను. అందుచేత ఆ బెంగకూడా లేదు. చరిత్ర ప్రపంచాన్నొక బ్రహ్మాండమైన ఊపూపిపారేసింది. ఆ ఊపులో అతనొక క్షణం మాత్రమే, రెప్పపాటు కాలం మాత్రమే. అదే అతనికి ఊరట కలిగించింది. తను ప్రేమించిన రోమ్ సహనశక్తి కలది. ఎప్పటికీ అది సహించగలదే. భయమనేది లేకుండా, వ్యత్యాసాలు లేకుండా ప్రజలు జీవించగల పరిస్థితులు కల్పించడంకోసం స్పార్టకస్ అనేవాడే కనుక తిరిగి వచ్చి రోమ్ నగర గోడలు పగలగొట్టడమే సంభవిస్తే రోమ్‌యొక్క చెడు ఎలా ఉన్నా దాన్ని మనసారా ప్రేమించిన గ్రాఛూస్‌వంటి వాళ్ళెందరో ఉండేవారని అతనికి తెలిసితీరుతుంది.

ఇప్పుడతను స్పార్టకస్ కన్నకలను గురించి ఆలోచించాడు. అది నిజమేనా? సజీవమైనదేనా? నిలబడగలదేనా? దుర్మార్గాన్ని వ్యతిరేకించి పోరాడిన వ్యక్తులు స్వచ్ఛంగా, స్వార్థరహితంగా ఉంటారని వరీనియా చెప్పింది నిజమేనా? అటువంటి వాళ్ళను తానెప్పుడూ చూడలేదు. స్పార్టకస్‌ను అతనెప్పుడూ చూడలేదు. కాని వరీనియాకి తెలుసు. ఇప్పుడు స్పార్టకస్ లేడు. వరీనియాకూడా లేదు. అదొక కల. ఆ కలలో అతను వరీనియాయొక్క విజ్ఞానపు సరిహద్దులను మాత్రమే స్పృశించగలిగాడు. కాని అతని కటువంటి అనుభవం ఇదివరకు లేదు, ఇక ఉండబోదు.

అతని పనిమనిషి వచ్చింది. ఆమెవైపేదో కొత్తగా చూశాడు. "ముసలమ్మా ఏం కావాలి?" అతనామెను నెమ్మదిగా అడిగాడు.

"స్నానానికి రావచ్చు బాబూ."

"నేనీవేళ స్నానం చెయ్యనే" అతనామెతో చెప్పాడు. అది విని ఆమె గాబరాపడడం, విస్మయం పొందడం చూసి ఆశ్చర్యపోయాడు."చూడు ముసలమ్మా ఈ వేళంతా

మారిపోయింది" చెప్పుకుపోయాడు; "ఆ బల్లమీద వరసగా సంచులున్నాయి. దాస్యత్వ విమోచనా పత్రాలున్నాయి. నా బానిసలందరికోసమూ పెట్టానవి. ప్రతి సంచిలోనూ ఇరవై వేల సిస్టెర్ సస్ లున్నాయి. నువ్వొకటి తీసుకో. మన బానిసలందరికీ తలొకటీ ఇవ్వు. అప్పుడు మీరంతా ఇక్కడినించి పొండి. మరొకమాట మాటాడకుండా వెంటనే చెప్పినదేదో చెయ్యి ముసలమ్మా."

"నాకేం అర్థంకాలేదు బాబూ."

"కాలేదా? మీకు స్వేచ్ఛ లభించింది. ఈ డబ్బుకూడా వచ్చింది. నామాట వినకపోతే మిమ్మల్నెప్పుడైనా నేను వదిలేశానా?"

"ఔను బాబూ మరి మీ కెవరు వండిపెడతారు? మీ గురించి ఎవరు శ్రద్ధ చేస్తారు?" ముసలిది అమాయకంగా అడిగింది.

"చచ్చు ప్రశ్నలేం వెయ్యకు, నే చెప్పినట్లు చెయ్యి."

వాళ్ళు వెళ్ళేసరికో యుగం పట్టినట్లనిపించింది గ్రాఛూస్‌కు. బానిసలు పోయాక ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. కొత్తగా, వింతగా నిశ్శబ్దంగా ఉంది. సూర్యుడుదయిస్తున్నాడు. వీధుల్లో జనసంచారమూ, బళ్ళ చప్పుడూ వినిపిస్తున్నాయి. కాని గ్రాఛూస్ ఇంట నిశ్శబ్దం తాండవించింది.

తిరిగి తన ఆఫీసుగదిలో కెళ్ళాడు. బీరువాతలుపులు తీసి దాన్లోంచి చిన్న స్పానిష్ కత్తి నొకదాన్ని తీసాడు. దాని పిడీ, ఒరా చాలా అందంగా తయారుచెయ్యబడ్డాయి. ఆ కత్తి తనకొక పవిత్రకార్య సందర్భంలో బహూకరించబడింది. ఒరలోంచి కత్తి పైకితీసాడు. మొన చూసాడు. చాలా వాడిగా ఉంది. కుర్చీలో కూచుని ఒక చేతితో బొజ్జ నిమురుకుంటూ ఆలోచిస్తున్నాడు. తనను తానే చంపుకోవడమా అనుకొని నవ్వుకున్నాడు. అదేమంత గౌరవమైన పని? గౌరవం మాటటుంచి పరమ ఛండాలమైన పని. ఈ కత్తితో తనను తాను పొడుచుకోగల సాహసం తనకుందా అని అనుమానించాడు. తనకాబలం ఉందీ? అదేం ధైర్యానికి సంబంధించిన విషయం కాదని, అప్పుడతననుకున్నాడు. ఒకప్పుడతను చావంటే వెరిచేవాడు. చిన్నప్పుడే దేవుడి గురించి చెప్పే కథల నసహ్యించుకుని వేళాకోళం చేసేవాడు. పునర్జన్మ సిద్ధాంతాన్ని కొట్టిపారేసాడు.

ఇలా ఆలోచిస్తూ ఆ కుర్చీలో నిద్రపోయేవాడే కాని వీధితలుపు విరిగి చెక్కలయేటంత గట్టిగా బాదుతున్నారెవరో. దాంతో అతనికా నిద్రమత్తు వదిలింది. తలుపు చప్పుడు విన్నాడు.

"ఎంతగీరరా నీకు క్రాసస్! మనిషి కుండాల్సినంత కోపం ఉందే నీకు. యుద్ధంలో నువ్వుపట్టుకున్న దాన్నీ ముసలాడు తస్కరించి నిన్ను తనచుట్టూ తిప్పించుకున్నాడనేనా! కాని నువ్వామె నసలు ప్రేమించావూ! స్పార్టకస్‌ను మేకులేసి శిలువకు దిగగొడదామనుకున్నావు కాని అతను దొరకలేదు, చచ్చిపోయాడు. ఇప్పుడేమో ఆ వరీనియాను పాదాక్రాంతం చేసుకుందామనీ, నీ కాళ్ళ దగ్గర పడి పొర్లేలా చేసుకుందామనీ అనుకున్నావు. అదీ కుదరలేదు.

ఓరి క్రాసస్! మూర్ఖపు వెధవా! ఎలాటి తప్పుడు ముండాకొడుకువిరా నువ్వు! అయినా నీలాటివాళ్ళవే రోజులు. దాంట్లో అనుమానంలేదు."

కత్తికోసం చూసుకున్నాడు. కత్తిమొన గుండెలకెదురుగా పెట్టి అన్ని పట్టుకుని మోకాళ్ళమీద నిలబడి ముందుకు వాలాడు. కత్తి శరీరంలో దిగబడింది. నొప్పివల్ల బాధవల్ల గట్టిగా అరిచాడు. ఇంకా ముందుకిపడ్డాడు. కత్తి శరీరంలోకి బాగా దూసుకుపోయింది.

తలుపు విరగ్గొట్టి క్రాసస్ లోపలికి ప్రవేశించేసరికి గ్రాఛూస్ ఆ విధంగా కనిపించాడు. అతన్ని వెల్లకిలా పడుకోబెట్టడానికి సేనాని తన బలమంతా ఉపయోగించాల్సి వచ్చింది. రాజకీయవేత్త ముఖం పండ్లికిలించుకొని వికృతంగా కనిపించింది.

ఆగ్రహంతో అసహ్యంతో క్రాసస్ ఇంటిముఖం పట్టాడు. ఈ గ్రాఛూస్ నసహ్యించుకున్నంతగా తాను మున్నెన్నడూ ఎవరినీ, దేనినీ అసహ్యించుకోలేదు. ఏం లాభం గ్రాఛూస్ చావనేచచ్చాడు. వాడినింక తను చెయ్యగలిగిందేమీలేదు.

# ఎనిమిదవ భాగం

గ్రాచూస్‌తో చేసుకున్న ఒడంబడిక ఫ్లేవియస్ సక్రమంగా అమలుపరిచాడు. గ్రాఛూస్ సంతకంతోఉన్న నిరాక్షేపణీయమైన అధికారపూర్వక అనుజ్ఞాపత్రాలు పుచ్చుకొని బయలుదేరారు. వాయువేగ మనోవేగంతో పోతున్నాయి రథాలు. మొదట ఉత్తరాభి ముఖంగా సాగిన ప్రయాణం ఆ తరువాత తూర్పుదిక్కుగా సాగిపోయింది. ప్రయాణపు తొలిరోజంతా వరీనియా నిద్రపోయింది. పసిబిడ్డని హృదయానికి హత్తుకుని పడుకుంది. కేసియా రాజమార్గం ప్రయాణానికెంతైనా బాగుంటుంది. ఎత్తుపల్లాలు లేనందున ఎంత వేగంగా పోయినా బళ్ళకు కుదుపుండదు. మొదటిరోజు మధ్యాహ్నంవరకూ కనికరంలేకుండా గుర్రాల నదిలించారు. చావబాదేశారు. మధ్యాహ్నానికి గుర్రాల్ని మార్చి అక్కడినుంచి కొంచెం నెమ్మదిగా, సావకాశంగా పోనిచ్చారు వాటిని. చీకటి పడేసరికి వాళ్ళప్పుడే రోమ్ వదలి నూరుమైళ్ళకు పైగా ప్రయాణం చేశారు. చీకటిలో గుర్రాల్ని మరొకమారు మార్చారు. వెన్నెల వచ్చింది. చల్లని వెన్నెలలో ప్రయాణం సాగుతూనేవుంది. మైలు తరువాత మైలు వాళ్ళు దాటుతూనే ఉన్నారు.

ఎన్నోమార్లు కాపలా సైనికులు వాళ్ళ నటకాయించారు. సోదాచేశారు. కాని శిష్ట సభాముద్రతో సెనేటర్ గ్రాఛూస్ సంతకం చేసిన అనుజ్ఞాపత్రాలే వాళ్ళ డబాయింపు నరికట్టేవి. రథం కొద్దిగా ఇటూ అటూ ఊగుతోంది వేగంవల్ల. ఆ రాత్రి వరీనియా చాలాసేపు, రథంలో నిలబడింది. పిల్లాడు ముఖమల్లు దిండ్లమధ్య దుప్పటిమీద హాయిగా నిద్రపోతున్నాడు. అందమైన రోమన్ వంతెనలకింద ప్రవహించే నదీ ఘోష ఆమెకు వినిపించేది. ప్రపంచమంతా సుషుప్తావస్థలో ఉంది. వాళ్ళు మాత్రం పోతున్నారు.

తెల్లారుతుందనగా చంద్రుడస్తమించాడు. వాళ్ళు రోడ్డు వదలి పక్కనే ఉన్న పచ్చిక బయలులోకి పోయారు. గుర్రాలను విప్పివాటికి నీరు పట్టారు. కొద్దిగా ఎంగిలిపడ్డాక వాళ్ళు కూడా కంబళ్ళు పరుచుకుని నిద్రపోయారు. వరీనియాకు నిద్రపట్టడం కష్టమైంది. అలిసిన రథచోదకులకు మాత్రం నడుం వాల్చారో లేదో నిద్ర పట్టేసింది. కాస్త కునుకు పట్టిందో లేదో ఫ్లేవియస్ వచ్చి లేపేసా డేమిటా అనిపంచిందామెకు. గుర్రాలను పూన్చుతున్నంతసేపూ ఆమె పిల్లాడికి పాలిస్తూ కూచుంది. వాళ్ళ బడలికి ఇంకా తీరకపోవడంవల్ల ఆ చోదకులు వణుకుతూ పనిచేసారు. ప్రాతఃకాలపు మసకవెలుతురులో ప్రయాణం తిరిగి సాగింది. కొంతసేపటికి వాళ్ళకొక ప్రహరీగోడలు కల పట్టణం కనిపించింది. దాన్ని కూడా వాళ్ళు దాటిపోయారు. ఉదయమంతా గుర్రాలను దయాదాక్షిణ్యాలు లేకుండా బాదారు. దాంతో ప్రయాణం శరవేగాన్ని మించింది. ఈ ఎడతెరపిలేని ప్రయాణం వరీనియాకు కష్టమే అనిపించింది. చాలా మార్లు వాంతి చేసుకుంది. తిన్నదంతా కక్కేసి పిల్లాడికి పాలుండవేమోననే భయం ఆమెను బాధించింది. కాని సాయంత్రం అయేసరికి ఫ్లేవియస్ ఆమెకు వెన్నా,

పాలూ పట్టుకొచ్చి ఇచ్చాడు. అవైతే కడుపులో నిలిచాయి. ఆకాశం మబ్బుపట్టి ఉన్నందున ఆ రాత్రికి ప్రయాణం నిలిపివేశారు.

తిరిగి ఉదయం కాకమునుపే ప్రయాణం సాగిపోయింది. వీళ్ళు పోతున్న రోడ్డును ఖండించుకుంటూ మరొకరోడ్డు అడ్డంగా ఎక్కడికో పోతోంది. వీళ్ళక్కడి కొచ్చేసరికి మధ్యాహ్నమయింది. ఇప్పుడు వాళ్ళు వాయువ్యంగా ప్రయాణం చేస్తున్నారు. సూర్యాస్తమయ కాలం. ఆ సాయంసంధ్యలో హిమావృతమైన ఆల్ప్స్ పర్వతాగ్రాల శోభను మొదటిసారిగా చూసింది వరీనియా. తెల్లనివెన్నెల ఆనాటి ప్రయాణానికి సౌలభ్యం చేకూర్చింది. గుఱ్ఱాలను చావగొట్టనఖ్ఖర్లేకుండానే ప్రయాణం సాగిస్తున్నారు. ఆఖరుసారి గుఱ్ఱాలను మార్చడానికని ఆగారు వాళ్ళు. తెల్లవారుతోందనగా వాళ్ళా ప్రధాన రాజమార్గం వదలి మట్టిరోడ్డుకు మళ్ళారు. ఆ రోడ్డు తూర్పు దిక్కుగా పోతోంది. పోయి పోయి అదొక చక్కని లోయలోకి ప్రవేశించింది. సూర్యోదయమయింది. ఉదయభానుని అరుణకాంతిలో ఆ లోయలోకి మరింత మనో హరంగా, శోభాయమానంగా కనిపించింది వరీనియాకు. లోయకు సరిగ్గా మధ్యభాగంలో ఒక సెలయేరు ప్రవహిస్తోంది. ఇరువైపులా ఎత్తైన పర్వతాలున్నాయి.

రోడ్డు బాగుండక పోవడంవల్ల ప్రయాణవేగం దెబ్బతింది. మట్టిరోడ్డుమీద కుదుపు ఎక్కువైంది. పిల్లాడిని గట్టిగా పట్టుకుని వరీనియా దిండ్ల మీద కూర్చుంది. ఒక క్రవంతెన మీదుగా ఆ బాట కొండపైకి పోతోంది. ఇదివరకే ఆ రోడ్డుమీద బళ్ళు వెళ్ళిన గాళ్ళు పడివున్నాయి. ఈ రథాలు నెమ్మదిగా అతి కష్టంమీద మెలికలు తిరిగిన రోడ్డు వెంబడి పోతున్నాయి. అంతా ఎగుడే అవటం మూలాన గుఱ్ఱాలకు చాలా ప్రయాసగా ఉంది. పొలాలలో వంగి పని చేసుకుంటున్న గాల్ రైతులు పనులాపి తలెత్తి అందమైన రథాలను చూసేవారు. ఆ బలిష్టమైన గుఱ్ఱాలు వాళ్ళ దృష్టిని మరీ ఆకర్షించేవి. ఊళ్ళున్న దగ్గర రోడ్డు పొడుగునా చింపిరితలలతో పిల్ల లీ అసాధారణ దృశ్యాన్ని చూసి అమాయకమైన ఆశ్చర్యాన్ని వెలిబుచ్చేవారు.

మధ్యాహ్నం గడిచింది. ఇక పైని రోడ్డు సాగడం లేదు. ప్రయాణం సాగడం కూడా కష్టమే. అప్పటికి వాళ్ళు కొండలమీదకొచ్చారు. అక్కడి కా లోయ స్పష్టంగా, దగ్గరగా కనిపిస్తోంది. విశాలమైన ఈ లోయలో అక్కడక్కడొక చిన్న ఊరు కనిపిస్తోంది. అక్కడక్కడ గుడిసెలు కనిపిస్తాయి. చిన్న చిన్న అడవులు కనిపిస్తాయి. ఎన్నో సెలయేళ్ళక్కడ వింత స్వరాలాలపిస్తున్నాయి. ఎక్కడో దూరంగా ఔనో కాదో తెలియకుండా ఒక పట్టణం కనిపిస్తున్నట్లు తోస్తోంది. ఆ పట్టణం వాళ్ళకు పశ్చిమంగా ఉంది. వాళ్ళా కొండ దిగుతున్నారు. ఉత్తరాభిముఖంగా ఆల్ప్స్ పర్వత ప్రాంతాలవైపు పోతున్నారు. అక్కడకు పర్వతాలు చాలా దూరంగానే ఉన్నాయి.

కొండెక్కడం ఎంత కష్టమో దిగడం కూడా అంతే కష్టం. ఎప్పటికప్పుడు కాళ్ళు వెనక్కు తన్నిపెట్టి నడుస్తేనే కాని గుఱ్ఱాలు పోలేవు. దానికి తోడా రోడ్డు ఎన్నో వంపులు

తిరిగి, మెలికలు తిరిగి ప్రయాణానికి అనువుగాలేదు. కింద నున్న లోయను వాళ్ళు సమీపించేసరికే చీకట్లు కమ్ముకున్నాయి. చంద్రోదయమయేదాకా ప్రయాణం వాయిదా వేసారు. వెన్నెట్లో వాళ్లొక ఘడియ ప్రయాణం చేసి విశ్రమించారు. ఉదయాన్నే ప్రయాణం సాగించారు. ఇక్కడ రోడ్లేవీ బాగుండలేదు. అన్నీ మట్టిరోడ్లే. పోయి పోయి ఆల్ప్స్ పర్వత ప్రాంతంలో ఆగారు.

ఇక్కడే ఫ్లేవియస్ వరీనియావద్ద సెలవు పుచ్చుకున్నాడు. ఒక రోడ్డు మీద ఆమెను దించాడు. అక్కడికి దగ్గరలో ఏమీ కనబడడంలేదు. పొలాలూ, తోటలూ తప్ప మరింకేవీ కనుచూపుమేరలో లేవు.

"వెళ్ళొస్తా వరీనియా" అన్నాడతను. "గ్రాఘుస్‌కి చేసిన వాగ్దానం నిర్వర్తించాననే నా నమ్మకం. అందువల్ల ఏదో కొంత సొమ్ము చేసుకోగలిగాననుకుంటా. ఇక జన్మలో మనిద్దరంకూడా ఆ రోమ్‌లో అడుగుపెట్టం. ఇక మీద ఆ ఊరు మనకు పనికిరాదు. నువ్వు, నీ చంటిపిల్లాడు కూడా సంతోషంగా, హాయిగా బతకాలని కోరుతున్నా. ఈ రోడ్డమ్మటే ఒక మైలుదూరం పోయావంటే నీకో గ్రామం తగులుతుంది. నడిచివెళ్లడమే మంచిది. ఈ గుర్రాలూ, రథాలూ అట్టహాసమంతా చూస్తే వాళ్లు గాభరాపడిపోతారు. ఈ సంచిలో ఓ వెయ్యి సెస్టెరసస్ ఉన్నాయి. వీటిని తీసుకో. ఒక కొంప కొనుక్కునేందుకూ, ఏడాదికి సరిపోయే తిండిగింజలు కొనుక్కునేందుకూ ఈ సొమ్ము చాలు. ఇక్కడి రైతులు అమాయకులు, మంచివాళ్ళు. ఈ కొండలుదాటి నీ స్వదేశానికి పోవాలని ఉంటే ఆ రైతులే నీకు కావలసిన సహాయం చెయ్యగలరు. నన్నడిగితే నువ్వా కొండలన్నీ దాటివెళ్ళడం, తీరా వెళ్లాక నీ వాళ్ళంతా ఎక్కడున్నారో తెలియక పోవడం, నానాఅవస్థలూ పడడం మంచిది కాదంటా. మీ జాతివాళ్ళు ఒక్కచోట ఉండరు. ఏడాదికొకచోటికి చొప్పున దేశదిమ్మరులై తిరుగుతారు. వాళ్ళని కనుక్కోడంకూడా కష్టమే. ఇక్కడే ఎక్కడో కాలక్షేపం చెయ్యడమే మంచిది. ఏమంటావ్ వరీనియా? ఇక్కడి కేగా తీసుకురమ్మని నువ్వన్నది?"

"ఇక్కడికేలే ఫ్లేవియస్. నీకు నేను కృతజ్ఞురాల్ని" అందామె.

అప్పుడా రథాలు వెనక్కు తిరిగి వచ్చిన తోవనేపోయాయి. వరీనియా పిల్లాడి నెత్తుకుని అక్కడ నిలబడింది. రథాలు పోతుంటే వెనకాల ధూళి రేగుతోంది. మేఘాలు కమ్మినట్లెగురుతోంది. ఒక కొండపక్కనే రోడ్డు మళ్ళింది. రథాలుకూడా అటు తిరిగాయి. అవింక కంటికి కనిపించడంలేదు. అవి రేపిన ధూళి ఇంకా గాలిలో ఎగురుతూనే ఉంది. అవి కనబడకుండా పోయేవరకు వరీనియా వాటిని చూస్తూనే ఉంది.

అప్పుడా రోడ్డువారే ఒకచోటామె కూర్చుని పిల్లాడికి పాలిచ్చింది. తరువాత ఆ రోడ్డు మీద నడచి ఫ్లేవియస్ చెప్పిన పల్లెవైపు వెళ్ళింది. అది వేసవి. ఆనాటి ఉదయం చల్లగా, మనోహరంగా ఉంది. బ్రహ్మాండమైన వినీలాకాశంలో ఒకమూల సూర్యుడుదయిస్తున్నాడు. సూర్యుని రాకను పక్షుల సంగీతం ఆహ్వానిస్తోంది. మేల్కాంచిన తుమ్మెదలు ప్రతీ పుష్పంమీద

వాలుతున్నాయి. మధుపానం కావిస్తున్నాయి. వాటి విజయానికి అవి సంతోషిస్తూ అక్కడి వాతావరణాన్ని తమ ఝుంకార గానంతో నింపాయి.

వరీనియా సంతోషించింది. స్పార్టకస్‌తో ఉన్న సమయాల్లోకూడా ఆమె సంతోషించింది. కాని ఇప్పటి ఈ సంతోషం ఆనాటి సంతోషంతో తులతూగేది మాత్రం కాదు. అతను తనకొక అమూల్యమైన జీవిత రహస్యాన్ని తెలియచేశాడు. మానవుని ఉనికిని ఎలా ఫలప్రదం చేసుకోవాలో అతనే నేర్పాడు. అందుకే అతను తన సఖుడు. అంతే కాదు గురువు. తనింకా బతికే ఉంది. తనొక్కర్తేకాదు, తన భవిష్యత్తును సుఖప్రదం చెయ్యగల తన ముద్దుబిడ్డ కూడా ఉన్నాడు. ఇద్దరూ ఇప్పుడు స్వతంత్రులే. అందుకే ఆమెలో ఒకమాదిరి సంతృప్తి జనించింది. అందుకే ఆమెలో ఆశ పొడసూపింది. ఆకాంక్ష మొలకెత్తింది.

## 2

వరీనియా జీవిత శేషం ఈ విధంగా గడిచింది. ఏ ఆడదైనా ఒంటరిగా బతకలేదు. ఆమె నివాస మేర్పరుచుకున్న ఆ గ్రామంలో గాల్ ప్రజలు బతుకుతున్నారు. అందరూ రైతులు. అందులో ఒక రైతు భార్య పాపం ప్రసవకాలంలో చచ్చిపోయింది. వరీనియా కతను తల దాచుకుందుకు చోటిచ్చాడు. బహుశః ఆ రైతుల కామె తప్పించుకుని పారివచ్చిన బానిసని తెలిసుండొచ్చు. ఆమె ఆరోగ్యంగానే ఉంది. ఆమెలోని నిరాడంబరత్వాన్నీ, ఆమె ఆరోగ్యాన్నీ ప్రజలు మెచ్చుకున్నారు. అందుకే ఆమెను వాళ్ళు ఆదరించారు.

ఆమె ఇంటి యజమానికూడా అందరిలాగా బతుకుతున్న ఒక అమాయకపు రైతు. అతనికి చాలామంది సాధారణ రైతులలాగనే రాయడం, చదవడం ఏమీ రావు. అతను స్పార్టకస్ కాడు. కాని స్పార్టకస్‌కీ అతనికీ చాలా దగ్గర పోలికలు లేకపోలేదు. వాళ్ళు మాట్లాడుకునే భాష ఆమెకు సులభంగా వచ్చేసింది. లాటిన్‌భాషే వాళ్ళ వాడుకభాష. కాని దాన్లో గాల్ భాషలోని పదాలు విరివిగా దొర్లుతుంటాయి. తనజాతి ఆచార వ్యవహారాలకూ, ఈ జాతి వాటికీ ఏమంత తేడా లేదు. భూమి దున్నటం, పంట పండించటం వాళ్ళ ప్రధాన వృత్తి. తన జాతి ప్రజలూ అంతే. ఆ పండినపంటలో కొంత భాగం మత పీఠాలకూ, భగవంతునికీ, మరి కొంత భాగం రోమన్ మహాసామ్రాజ్యానికి చెందిన పన్నులవాళ్ళకీ; మిగిలిందేదో తమకీ లభించేది. వాళ్ళు బతికినన్నాళ్ళు బతికి చచ్చేవారు. సంతోషంతో నాట్యం చేసేవారు. జానపదగీతాలాలపించేవారు. ఎక్కువగా విచారంతో దుఃఖించేవారు. పెళ్ళాడేవారు. అతి సామాన్య మానవుని జీవిత పరిభ్రమణా లెలా గుండేవో అలాగే వాళ్ళ జీవితాలు కూడా దొర్లి పోయేవి.

వరీనియాకు పిల్లలు పుట్టారు. ఏటా కాన్పులు; ఏడుగురు పిల్లలు పుట్టారు. వాళ్ళతోబాటే బాలుడైన స్పార్టకస్ కూడా పెరిగాడు. పొడుగ్గా బలిష్టంగా ఉంటాడతను. అతని ఏడో ఏట తల్లి అతని తండ్రి గురించి చెప్పింది. తండ్రి ఏం చేసాడో కూడా చెప్పింది. కొడుక్కంత బాగా అర్థం అవుతుందనుకోలేదామె. అందుకే కొడుకు తను చెప్పినదంతా

పూర్తిగా అర్థం చేసుకున్నందుకు ఆశ్చర్యపడింది. ఈ ఊళ్ళో ఎవరూ అంతకు పూర్వం ఈ స్పార్టకస్ పేరే వినలేదు. ప్రపంచాన్ని ఊపి పారేసే సంఘటన లెన్నో జరిగాయి. కాని ఈ ఊళ్ళో మాత్రం వాటి ప్రభావం శూన్యం. బహుశా అవి ఈ గ్రామం పొలిమేరలనుండే తిరిగిపోయేవేమో? తన పిల్లలందరు పెరిగి పెద్దవాళ్ళయేముందు వరీనియా ఈ కథనే చెప్పింది. ఎన్నో మార్లు చెప్పేది. ఒక సామాన్యమానువుడు, అంతకన్న అధమం ఒక బానిస, దౌర్జన్యానికీ, బానిసత్వానికి వ్యతిరేకంగా ఎంత వీరోచితంగా పోరాడాడో, బలసంపన్నమైన రోమ్ నేవిధంగా నాలుగేళ్ళపాటు మంచినీళ్లు తాగకుండా గడగడలాడించి పారేసాడో, అతని పేరంటేనే హడలి చచ్చేస్థితి తీసుకురాగలిగాడో ఆమె కళ్లకు కట్టినట్లు చెప్పేది. అనంతమైన న్యూబియా ఎడారిలో ఒంటరిగా పడిఏడ్చే దౌర్భాగ్యపు దీనులగురించీ, స్పార్టకస్ ఆ గనులలో ఎంత అవస్థపడ్డదీ ఆమె చెప్పింది. రోమన్ గోదాలలో ఇసుకలో నగ్నంగా నిలబడి కత్తి చేతపట్టి సోదరప్రాణితో ఏవిధంగా అతను పోరాడవలసి వచ్చేదో చెప్పింది. అతనిలోని సహృదయత గురించీ, శాంత సౌమ్యస్వభావం గురించీ, కూడా చెప్పేది. ఆ కథలు చెప్పేటప్పుడామె తను నిసిస్తున్న.ఆ గ్రామం లోని సాధారణ రైతులతో అతన్ని పోల్చి చెప్పేది. స్పార్టకస్ అనుచరులను గురించి, చెప్పేటప్పుడు గ్రామంలోని ఎవరినో ఉదాహరణగా తీసుకునేది. దాంతో వాళ్ళకతని బాధలు, గాథలు హృదయానికి హత్తుకునేలా బోధపడేవి. ఈ కథలు చెపుతున్నంతసేపూ ఆమె భర్త ఆశ్చర్యంతో వినేవాడు. ఆమెకింత జీవితానుభావం ఉన్నందుకు ఈర్ష్య చెందేవాడు.

వరీనియా తన జీవితశేషం కాలుమీద కాలేసుకుని గడపలేదు. సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకూ నడుంవంచి పనిచేసేది. కలుపుతియ్యడం, కోతల కెళ్ళడం, ఇళ్ళూడ్చడం, నూలువడకడం, బట్టలు నేసుకోడం అన్నీ చేసేది. చక్కని శరీరచ్ఛాయ మాయమై ఆమె చర్మం ఎండకి నల్లబడింది. ఆమె ఎప్పుడూ తన అందాన్ని కాపాడుకుందుకు ప్రయత్నించలేదు కూడా. గతాన్ని గురించి ఆలోచించినప్పుడల్లా ఆమెలో సంతృప్తి జనించేది. జీవితం తన కిచ్చిన అమూల్యానుభవాని కామె కృతజ్ఞత చూపేది. స్పార్టకస్ పోయినందుకామె విచారించలేదు. స్పార్టకస్‌తో ఆమె జీవితం ఒక మధుర స్వప్నమై, మధురస్మృతియై నిలచింది.

తన పెద్దకొడుకు ఇరవైయోఏట ఆమెకు జ్వరమొచ్చింది. మూడురోజులయాక చచ్చిపోయింది. ఆమె సుఖంగా ప్రాణం వదిలేసింది. చచ్చేముందు తీసుకోవడంకాని, బాధపడటం కాని ఏమీ లేకుండా హాయిగా ప్రాణం వదిలింది. ఆమె భర్తా, పిల్లలూ విచారించారు; భూమిలో పాతిపెట్టారు!

ఆమె చచ్చిపోయాక ఈ గ్రామంలో మార్పులు రాసాగాయి. పన్నులు పెరగటం ప్రారంభించాయి. ఇంకా పెరగటానికొక అంతమనేది లేకపోయింది. ఎండలు తీక్షణంగా కాసాయి. వర్షాలు లేవు. భరించలేని వేసవి వచ్చింది. దాని వెన్నంటి రోమన్ సైనికులొచ్చారు. పన్నులు చెల్లించలేని కుటుంబాలన్నింటినీ చేర్చారు. ప్రతీవాళ్ళకీ మెడకొక గొలుసు తగిలించారు. స్వగ్రామంనుంచి పంపించేశారు. రోమన్ బానిస వర్తకులకు వీళ్ళు లాభాలు చేకూర్చాలి.

పన్నులు చెల్లించలేనివాళ్ళంతా ఈ పద్ధతికి లొంగలేదు. యువకుడైన స్పార్టకస్ అతని తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ మరికొందరూ కలిసి వాళ్ళ గ్రామానికి ఉత్తరంగా ఉన్న అడవులలోనికి పారిపోయారు. ఆ అడవులు ఆల్ప్స్ పర్వతాల వరకేకాక పర్వతాల లోనికికూడా వ్యాపించిఉన్నాయి. వాళ్ళక్కడ ఆకులూ, అలములూ తిని బతికేవారు. అప్పుడప్పుడు జంతువులను వేటాడేవారు. ఏనాసరే ఎవరైనా తమ పూర్వపు భూములమీద భవనాలు నిర్మిస్తే నిర్మాణం అంతా పూర్తయేవరకూ ఆగి, ఆ భవనాలను తగలబెట్టి వాటిలోని సామగ్రి కొల్లగొట్టి తెచ్చేవారు.

అప్పుడా అడువులలోకి సైనికులుకూడా ప్రవేశించారు. ఆ సైనికులతో పోరాడేందుకు రైతులుకూడా ఈ పలాయితులకు తోడ్పడేవారు. పారి వచ్చిన బానిసలందరూ వీళ్ళతో కలిసేవారు. ఆ విధంగా సర్వకాల సర్వావస్థలయందూ అణగార్తులు పీడికులపై సాగించే యుద్ధం జరుగుతూనే ఉండేది. ఒక్కొక్కప్పుడు వాళ్ళు సైనికుల చేతిలో ఓడిపోయేవారు. మరొకప్పుడు వీళ్ళే పర్వతాలు దిగి మైదానాల్లో ప్రవేశించి రోమన్ భవనాలు తగలబెట్టేవారు. లూటీ చేసేవారు.

ఈ విధంగా బతికి, స్పార్టకస్ కొడుకు స్పార్టకస్ చచ్చిపోయాడు. తన తండ్రివలెనే స్వాతంత్ర్య సమరంలో, పోరాటంలో చచ్చిపోయాడు. అతను కొడుకులకు చెప్పిన కథలలో నిజం పాలు తక్కువ ఉండేది; స్పష్టంగాకూడా ఉండేవికావా కథలు. కథలు, గాథలయ్యాయి. ఆ గాథలే వాళ్ళకు చిహ్నాలయ్యాయి. పీడితులు పీడికులపై సాగించే యుద్ధం కొనసాగుతూనే ఉంది. అదొక అఖండజ్యోతి. ఒక్కొక్కప్పుడా జ్యోతి విశ్వమంతా నిండి వెలుగొందేది. అనంత విశ్వమంతా జ్యోతిర్మయ మయేది. ఒక్కొక్కప్పుడదే జ్యోతి కరదీపికలా చిన్నదిగా వెలిగేది. కాని ఆ జ్యోతి ఎల్లప్పుడు వెలుగుతూనే ఉండేది. అదేవిధంగా స్పార్టకస్ పేరుకూడా రూపుమాసి పోలేదు. ఆ పేరు వంశపారంపర్యంగా తండ్రులు కొడుకులకూ కొడుకులు తమ పుత్రులకూ పెట్టారా లేదా అన్నది ప్రశ్నే కాదు. అది సంఘంయొక్క సమిష్టి ప్రయోజనాల దృష్ట్యా సాగించబడ్డ పోరాటంద్వారా ఒక తరంవారు మరొక తరంవారికి ప్రసాదించిన వారసత్వం, హక్కు.

ఒకరోజొస్తుంది. ఆనాడు రోమ్ సర్వనాశనం కావించబడుతుంది. ఒక్క బానిసలే కాదు; బానిసలు, రైతులు, కూలీలు, బర్బరులు అందరూ ఒక్కటవుతారు.

సంఘంలో చాలామంది ఎల్లప్పుడూ తమ శ్రమశక్తిని ధారపోసి సృష్టించిన సంపదనంతనూ ఏ కొద్దిమందో భుక్తంచేసుకుని మానవజాతిని దోపిడీచేసినంత కాలమూ, ఈ స్పార్టకస్ పేరు జ్ఞాపకముంటూనే ఉంటుంది; ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది. భయంవల్లనో, శక్తిహీనతవల్లనో ఒక్కొక్కప్పుడా పేరు గుసగుసలలోనే ఉండిపోవచ్చు. కాని అదే పేరు మరొకప్పుడు రణన్నినాదమై దిక్కులు పిక్కటిల్లేటట్లు, విశ్వమంతా కంపించేటట్లు ప్రతిధ్వనించవచ్చు.



# వెనుకమాట

హొవర్డ్ ఫాస్ట్ స్పార్టకస్ ప్రచురించిన నాలుగేళ్ళకే తెలుగులోకి అనువదింపబడి, ప్రచురింపబడటం తెలుగు పాఠకుల అదృష్టంగా చెప్పుకోవాలి. దీనిని ఆకెళ్ళ కృష్ణమూర్తి గారు అనువదించగా విశాలాంధ్ర వారు 1955లో ప్రచురించారు. స్పార్టకస్ ఇంగ్లీషులో వందలాది ముద్రణలకు నోచుకుని, అన్ని ప్రధాన బాషలలోకి అనువదింపబడి లక్షలాది పాఠకులను ప్రభావితం చేసింది. ఇంతటి ఆదరణ పొందిన పుస్తకాన్ని హెచ్.బి.టి. 1982లో (అంటే తొలి ప్రచురణ జరిగిన 17 సంవత్సరాలకు) రెండవ ముద్రణగా (రా.వి. శాస్త్రి ముందు మాటతో) ప్రచురించింది. ఆకెళ్ళ కృష్ణమూర్తి గారు స్పార్టకస్‌ని సమర్థంగా అనువదించారు. అయితే ఆధునిక కాలాన్నీ, పాఠకుల్నీ దృష్టిలో ఉంచుకుని పునరుక్తుల్ని, సుదీర్ఘ వివరణలను తొలిగించి నిడివి తగ్గిన 'స్పార్టకస్' ని ఇప్పుడు మీ కందిస్తోంది హెచ్.బి.టి. ఈ ప్రయత్నాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

ఆకెళ్ళ కృష్ణమూర్తి గారు జనవరి 8, 1930లో పశ్చిమగోదావరి జిల్లా అట్లపాడులో జన్మించారు. విశాఖపట్నం హిందుస్తాన్ షిప్‌యార్డులో ఉద్యోగం చేస్తూ అక్కడ కార్మిక సంఘానికి నాయకత్వం వహించారు. అవిభక్త కమ్యూనిస్టు పార్టీలో ముఖ్య కార్యకర్తలా పనిచేశారు. అనేక పత్రికల్లో అతని గేయాలు, వ్యాసాలు ప్రచురితమయ్యాయి. విశాఖ రచయితల సంఘంలో 1953లో చేరారు. రా.వి.శాస్త్రి తో 1955లో ఏర్పడిన పరిచయం జీవితకాలం స్నేహంగా మారింది. 'అల్పజీవి' నవల తరువాత రా.వి.శాస్త్రి రచనల్లో వచ్చిన మార్పునకు మార్క్సిస్టు అయిన ఆకెళ్ళ స్నేహం ఒక కారణంగా చెప్పుకోవచ్చు. రా.వి.శాస్త్రి మరణించిన కొద్ది కాలానికే అంటే 1993 డిసెంబరు 13న ఆకెళ్ళ కృష్ణమూర్తి కన్ను మూసారు.

"ఇతిహాసపు చీకటి కోణం
అట్టడుగున పడి
కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగని సత్యం"

- శ్రీశ్రీ

స్పార్టకస్

హొవర్డ్ ఫాస్ట్



**హొవర్డ్ ఫాస్ట్** 1914లో జన్మించారు. ఇప్పుడు ఆయనకు 86 ఏళ్ళు. ప్రస్తుతం అమెరికాలో కన్నెక్టికట్‌లో నివశిస్తున్నారు. 67 ఏళ్ళకు పైగా సాహిత్య జీవితం నెరుపుతున్నారు. 75కు పైగా నవలలు, అనేక చిన్న కథలు రాశారు. ఇ.వి. కన్నింగ్‌హోమ్ అన్న కలం పేరుతో మిస్టరీ నవలలు కూడా రాసారు.

ఫాస్ట్ అత్యంత తీవ్ర పేదరికంలో పుట్టి పెరిగాడు. పదేళ్ళ వయసప్పుడు పని మొదలు పెట్టాడు. దినపత్రికలు వేయడం, సిగరెట్లు తయారీ, కసాయి దుకాణం శుభ్రం చేయటం, దుస్తుల ఫ్యాక్టరీలో పని, ఓడల రవాణాలో గుమాస్తాగా ఎన్నో పనులు చేశాడు. రకరకాల పనులు చేస్తూనే హైస్కూల్ పూర్తి చేశాడు.

జాక్ లండన్ రాసిన 'ఉక్కుపాదం'తో తనకు తొలిసారిగా సోషలిజంతో పరిచయ మయ్యిందని ఫాస్ట్ స్వయంగా చెప్పుకున్నాడు. అతడు 1944-57 మధ్య అమెరికా కమ్యూనిస్టు పార్టీ సభ్యుడిగా ఉన్నాడు. వామపక్షీయులను సంవత్సరాలపాటు వేధించిన మాక్‌కార్తిజం నుంచి ఎలాగో బతికి బట్టకట్టాడు. అతని జీవితం మొత్తం ఫోనుల టాపింగ్, అమెరికా గూఢచారి పోలీసు (ఎఫ్.బి.ఐ.) నిఘాలతో గడిచిపోయింది. అతని పుస్తకాలను ప్రచురించు కోనివ్వలేదు. అమెరికా సమాజానికి వ్యతిరేకంగా పనిచేస్తున్న వాళ్ళ పేర్లు ఇవ్వ నిరాకరించి నందుకు అతడికి జైలు శిక్ష కూడా పడింది.

అతడు రాసిన ఇతర నవలలలో 'The Passion of Sacco & Vanzetti', 'Freedom Road' అన్నవి బాగా ప్రఖ్యాతి పొందాయి. 1950లో జైలులో ఉన్నప్పుడు స్పార్టకస్ నవల రాయాలన్న భావం మొదటిసారి అతనికి కలిగిందని చెప్పాడు. 'అట్టడుగు వర్గాల బాధామయ, నిరాశపూరిత జీవితం' అతడికి అంతకు ముందుకంటే జైలులో బాగా అవగతం కాసాగింది. మాక్ కార్తిజం అణచివేత కారణంగా ఏ ప్రచురణకర్త కూడా స్పార్టకస్‌ని ప్రచురించే సాహసం చేయలేకపోయారు. 1951లో హొవర్డ్ ఫాస్ట్ స్వయంగా స్పార్టకస్‌ని ప్రచురించాడు. ఆ తరువాత అది ఒక్క ఇంగ్లీషులోనే వందకుపైగా ముద్రణలు పొంది లక్షల ప్రతులు అమ్ముడు పోయాయి. స్పార్టకస్ ప్రపంచంలోని దాదాపుగా అన్ని ప్రధాన భాషలలోకి అనువదింపబడి ప్రచురింప బడింది.



హైదరాబాద్ బుక్ ట్రస్ట్

